# విజ్ఞప్తి

---

కవిసార్వభౌముడుగాను, ఉత్తమలాక్షణికుడుగాను, కీర్తిగాంచిన కూచిమంచి తిమ్మకవి వ్రాసిన లక్షణగ్రంథము ఈ సర్వలక్షణసారసంగ్రహము. విలక్షణమైన యీపుస్తకముప్రతులు ఈనాడు దొరుకుటలేదు. అలభ్యములైన గ్రంథాలలోని విశేషించి ఎఱ్ఱాప్రెగడ రామాయణములోని, పద్యాలను ఉదాహరించుటయేగాక ముఖ్యమైన వ్యాకరణాంశములను కొన్నింటిని ఈగ్రంథము వివరించుచున్నది. లక్షణగ్రంథాలలో దీనికి విశిష్టమైన స్థాన మున్నది.

1914 సంవత్సరములో మొట్టమొదటిసారి యీగ్రంథము ఏలూరు మంజువాణీ ముద్రాక్షరశాలలో శ్రీ నందిరాజు చలపతిరావుచే ముద్రితమైనది. ఆ ముద్రితప్రతులుకూడ యిప్పుడు దొరుకుటలేదు. భాష,వ్యాకరణము ఛందస్సుల దృష్ట్యా విలువైన యీ గ్రంథము సుపరిష్కృతము గావించి నిపుల మైన పీఠికను సమకూర్చి యీవ్రాతప్రతిని సిద్ధము చేసిన వారు శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులుగారు. వీరు ఛందోవ్యాకరణములలో విశేషపరిశోధన గావించిన విద్వాంసులు. ఈసందర్భములో వీరు అనేక తాళపత్రాలను, కాగితపుప్రతులను పరిశీలించి పాఠములను పోల్చి నిర్ణయించినారు. ఈగ్రంథమును ప్రచురించు అవకాశము అకాడమీకి కలిగించిన శ్రీ సంపత్కుమారాచార్యులుగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు. ఆంధ్రపండితలోకానికి ఈ గ్రంథము ఆదరణపాత్రము కాగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
**18-11-1971**

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి.

# నివేదనము

---

తెలుగు ఛందో వికాసము రచించునాడే, నా పరిశీలనలో ఈ 'సర్వలక్షణ సారసంగ్రహమునకు పరిష్కృతప్రతిని సిద్ధము చేయవలెనన్న భావన కలిగినది. కాని, కార్యరూపము ధరించలేదు. మిత్రులు శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావుగారి ప్రోత్సాహము ఆ భావనను అమలు చేయించినది. ప్రత్యంతర పాఠసంపాదనలో, మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములోని పండితులు శ్రీ తీర్థం శ్రీధరమూర్తిగారు, నా కోరిన మేరకు, అక్కడి తాళపత్రప్రతుల పాఠమును సమకూర్చి ఎంతో సహకరించినారు. ఈ ఇరువురికి మొదట కృతజ్ఞత తెల్పు కొందును.

పరిష్కృతప్రతిని సిద్ధము చేసి, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారికి అర్పించి ప్రచురణకయి కోరితిని. నా అభ్యర్థనమేరకు అకాడమీ కార్యదర్శి, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు కార్యవర్గ సమ్మతితో అకాడమీ పక్షమున దీనిని ప్రచురించుటకు నిర్ణయించినారు. గ్రంథవైశిష్ట్యమును, నాపరిశ్రమను గుర్తించి ఆదరించిన అకాడమీ కార్యవర్గమునకు, సహృదయులు శ్రీ రామానుజ రావుగారికి సర్వదా కృతజ్ఞుడను.

నా కృషిఫలనములో ఎడనెడ సహకరించిన డా. బి. రామరాజుగారికి, బ్రహ్మశ్రీ నోరి నరసింహశాస్త్రిగారికి, అన్నిటిలో ఆదినుండి తోడునీడ అయిన కోవెల సుప్రసన్నాచార్యులకు నా ధన్యవాదములు. గ్రంథమును ముచ్చటగా సిద్ధము చేసిన ముద్రాపకులకు నా అభినందనలు.

లక్షణ శాస్త్రమునకు దారిచూపిన మా తండ్రిగారు శ్రీమాన్ కోవెల రంగాచార్యులుగారిని, ఆదారిలో నడిపించిన గురువర్యులు బ్రహ్మశ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మగారిని ఈ సందర్భమున భక్తితో స్మరింతును.

జగిత్యాల
7-7-70

సంపత్కుమారాచార్య.

# విషయసూచిక


**సమీక్షణము :** — పుట

| | |
|---|---|
| తిమ్మనపరిచితిరేఖ. | 1 |
| పూర్వప్రతులు: ప్రస్తుతప్రతి. | 3 |
| లక్షణగ్రంథములు: రచనారీతులు. | 6 |
| సర్వలక్షణ సారసంగ్రహమా ? | 7 |
| లక్షణ సారసంగ్రహమా ? | |
| మరల నిదేల లక్షణ గ్రంథము ? | 10 |
| తెనుగు ఎన్ని తెరగులు ? | 12 |
| తిమ్మన: అన్యలాక్షణిక ప్రస్తావన. | 20 |
| "మల్లెయు లంజెయు గద్దెయు..." | 20 |
| చెనె : చనియె. | 25 |
| తాయెద ఉయ్యెల పయ్యెద. | 29 |
| "కమ్మని—' పద్యమున '—కుమ్మొనసి— | 33 |
| బిందుపూర్వకబమలు: ద్విత్వ'మ' | 43 |
| ప్రాసములు: సవరణ, వివరణ. | 48 |
| యతుల రీతి | 52 |
| శకటరేఫ విలాసము. | 59 |
| అర—నెర సున్నలు | 75 |
| తిమ్మన—అప్పకవి. | 79 |
| ఉపసంహృతి. | 80 |

**లక్షణ సారసంగ్రహము**

| | |
|---|---|
| ప్రథమాశ్వాసము. | 1 |
| 1. చతుర్విధాంధ్రప్రకరణము | 3 |
| (1) తత్సమములు | 3 |
| (2) తద్భవములు | 7 |
| (3) అచ్చతెనుఁగు | 15 |
| (4) గ్రామ్యము | 15 |
| 2. వర్ణ ప్రకరణము | 20 |
| (1) కళాద్రుతప్రకృతికములు | 22 |
| 3. సంధి ప్రకరణము | 23 |

4. విభక్తి ప్రకరణము 67

ద్వితీయాశ్వాసము 87

1. సమాస ప్రకరణము 87

2. క్రియావిశేషణ ప్రకరణము 93

3. ప్రాస ప్రకరణము 97

4. యతి ప్రకరణము 106

(1) స్వరవడి 106

(2) వర్గవడి 107

(3) అఖండ వడి 108

(4) ప్లుతవడి 111

(5) సరసవడి 112

(6) ప్రాదివళ్లు 112

(7) బిందువళ్లు 114

(8) సంయుక్తవళ్లు 115

(9) ఎక్కటివళ్లు 116

(10) పోలికవడి 117

(11) వృద్ధివళ్లు 117

(12) వికల్పయతి 118

(13) అభేదవళ్లు 119

(14) ప్రభునామయతి 122

(15) విభాగవడి 123

(16) అనునాసికవళ్లు 124

(17) కాకుస్స్వరవడి 125

(18) నిత్యవడి 126

(19) రికారవడి 127

(20) చక్కటి వడులు 128

(21) ససమాస వర్ణ సమాస యతులు 130

(22) నిత్యసమాసయతులు 132

5 శబ్ద ప్రకరణము 143

తృతీయాశ్వాసము 173

(1) రేఫ ప్రకరణము 173

(2) శకట రేఫ ప్రకరణము 181

అనుబంధములు ..

శివదీక్షాపరు డన్నంతలో వైష్ణవమునందు వైషమ్యము కలవా డనరాదు. అభేద మాతనికి లేదు. వైష్ణవమహిమాన్విత కృతిరచనయు చేసి విష్ణువున కంకితమును చేసిన సమభావుడు. ఆయన గ్రంథములద్వారా తెలియవచ్చు తత్కృతు లివి :

1. రాజశేఖర విలాసము
2. రుక్మిణీ పరిణయము (క్రీ.శ. 1715)
3. సింహశైల మాహాత్మ్యము
4. నీలాసుందరీ పరిణయము (అచ్చతెనుగు)
5. అచ్చతెనుగు రామాయణము
6. సారంగధర చరిత్ర
7. సాగరసంగ మాహాత్మ్యము
8. లక్షణసారసంగ్రహము (క్రీ.శ. 1740)
9. రసికజనమనోభిరామము (క్రీ.శ. 1750)
10. సర్పపుర మాహాత్మ్యము
11. శివలీలా విలాసము (క్రీ.శ. 1756)
12. సుజనమనఃకుముదచంద్రిక.

ఇవిగాక రచించిన శతకము లుండవచ్చును. వాటిలో కుక్కుటేశ్వర శతకము మాత్రము తెలియవచ్చును. ఈ కృతుల వస్తువు దృష్ట్యా తిమ్మన ఎంతటి మత సమభావుడో తెలిసికొనవచ్చును.

తిమ్మన కుక్కుటేశ్వర వర ప్రసాద లబ్ధ కవితా సామ్రాజ్య ధురంధరుడు. సకల సంస్కృతాంధ్ర లక్షణ కళా కౌశలాభిరాముడు. నానావిధ వంగ త్రిలింగ ద్రవిడ దేశభాషా విశేషభూషితాశేష కవితా విలాసుడు. బహువిధకావ్యనిర్మాణ బంధుర ప్రతిభుడు. ఈ ప్రతిభ అంతయు తెలుగుకృతులరచనయందే పర్యవసించినది. పయి బిరుదము లన్నియు నట్లుండగా రావు నీలాద్రి మాధవరాయ నృపతి దత్త 'కవిసార్వభౌమ' బిరుదవిభ్రాజితుడు. అనగా, శ్రీనాధుని యంతటి రచనా వైవిధ్యము గలవాడని, పాండితీమండితు డని తాత్పర్యము. మిగిలినయంశము లెట్లున్నను శ్రీనాధునికన్న ప్రత్యేకత సూచించునట్లుగా 'అభినవ వాగనుశాసనుడు'.

తిమ్మన కీ బిరుదమును సార్థకము చేసినది ఆయన రచించిన లక్షణ గ్రంథము. దానికి వ్యవహార నామము 'సర్వ లక్షణ సార సంగ్రహము'—ప్రస్తుత గ్రంథము.

**పూర్వప్రతులు : ప్రస్తుతప్రతి**

ఈ గ్రంథమును క్రీ.శ. 1914లో శ్రీ నందిరాజు చలపతిరావుగారు ఏలూరులోని తమ మంజువాణీ ముద్రాక్షరశాలయందు ముద్రించినారు. నాకు తెలిసినంతవరకు అదియే ప్రథమ ముద్రణ. మరియు, నాటికి నేటికి మరల ముద్రితమయినట్లు కన్పించదు. విషయ గౌరవమును బట్టి, వైలక్షణ్యమును బట్టి మరల మరల ముద్రితమయి అధిక వ్యాప్తికి రావలసిన లక్షణగ్రంథ మిది.

> 'ఇంతకుమున్ను బయలు వెడలిన లక్షణగ్రంథములకన్న
> నిందు వ్యాకరణ విశేషము అధికము. . . . ఇతడు లక్షణ
> సంస్కారప్రియుడు డని తోచుచున్నది.'

అన్నారు శ్రీ దువ్వూరి వేంకట రమణ శాస్త్రిగారు. (విజ్ఞాన సర్వస్వము. 'తెలుగు సంస్కృతి' 2. భా. 4. సం. 'వ్యాకరణములు.' పు. 1144) ఇది ఇంత విశిష్టముగా చెప్పకొనదగిన దయినను—పూర్వముద్రితప్రతి—అనగా ఏలూరులో ముద్రితమయిన ప్రతి—కేవల మచ్చుతప్పలు కుప్పలుతిప్పలుగా నుండుటయే గాక పలుచోట్ల పాఠములే కుదురని స్థితిలో నున్నది. ఆ కారణముగా పరిష్కారమును కోరుచుండినది.

శ్రీ నందిరాజువారి ముద్రితప్రతి కాధారమయిన మాతృక ఏదో తెలియదు. ప్రస్తుతము ఈ గ్రంథమునకు మదరాసులోని ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు రెండుతాళపత్రప్రతులు ఉన్నవి. వాటి సంఖ్యలు. ఆర్. 1994, ఆర్. 2037. రెండును మిక్కిలి శిథిలప్రతులే. మొదటిది సమగ్రప్రతి కాగా, రెండవది అసమగ్రము. మొదటి ప్రతిలో లేఖకునివ్రా లిట్లున్నది :—

> "రక్తాక్షి నామ సంవత్సర కార్తీక బహుళ ౧౦ గురువారం
> తారీఖు ప్రభృతి తత్సంవత్సర పుష్య శుద్ధ ౧౨ ఆదివారం
> సాయంత్రమునకు (వంకా)యలపాటి చిట్టెన్న కొమారుడు

వెంకట నారాయణప్ప సకలలక్షణసారసంగ్రహము వ్రాయడ
మయినది. సాంబశివ పర్మబహ్మణే నమః శ్రీ శ్రీ శ్రీ."

రెండవ దానియం దిట్లున్నది:-

"శోభ కృతు సంవత్సర భాద్రపద బహుళ ४ జయవారం
పరికి వంకాయలపాటి తిరుపతిరాజు ఈ పుస్తకము వ్రాసెను".

తిమ్మన సర్వలక్షణసారసంగ్రహ రచన పూర్తి చేసినది రౌద్రి భాద్రపద శుక్ల పంచమి. శా. శ. 1662. ఈ శక సంవత్సరము క్రీ.శ. 1740 కి సరి పోవును. అప్పటినుండి ఇప్పటివరకు రక్తాక్షి నాల్గుమారులు, శోభకృతుగూడ నాల్గుమారులు తిరిగినది. నాల్గవమారుల్ప్రతు లివి కావని వాటిస్వరూ పమే చెప్పుచున్నది. మొదటి రక్తాక్షి (క్రీ. శ. 1743). మూడవ శోభకృతు (1903) కు చెందినవికూడ కాకపోవచ్చును. కాగా మొదటి ప్రతి క్రీ.శ. 1803, లేదా 1863 కు చెందినదిగాని, రెండవ ప్రతి క్రీ.శ. 1783, లేదా 1843 కు చెందినదిగాని కావలయును. మొత్తముమీద గ్రంథరచనము తరువాత దాదాపు వంద, వందపాతిక సంవత్సరాలలోపు వీప్రతులు కావచ్చు నని ఉజ్జాయింపుగా చెప్పవచ్చును.

మొదటిప్రతి సమగ్రమే అయినను, అందులో చివరి ఆశ్వాసమునందు చివరి దాదాపు వంద పద్యములు చదువ వీలు కలిగించనంత శిథిలమగుటచే, ఆ భాగమును మాత్రము రెండవప్రతి ఆదుకొన్నది. అందువలన రెండవప్రతిని గూడ చెప్పుకొనవలసి వచ్చినది. రెండింటను సరిగా నున్న భాగములలో పాఠముల లేడా కన్పించదు. ఒకటి మరియొకదాని ప్రతికయేమో యనిపించును.

గ్రంథమునకు పరిష్కృతప్రతిని సిద్ధము చేయుటలో మొదటి తాళపత్ర ప్రతియే ప్రధానాధార మయినది. పూర్వముద్రిత (ఏలూరు) ప్రతిలో లేని కొన్ని పద్యములు, వచనములు తాళపత్రప్రతియం దున్నవి. కొన్నిచోట్ల పాఠములు భిన్నముగా నున్నవి. అందువలన పూ.ము.ప్రతిపాఠములు అధోజ్ఞాపికలో సూచింప బడినవి. తా. ప. ప్రతి పాఠములు ప్రధానములుగా గ్రహింపబడినవి. ప్రధానపాఠములందును కొన్ని కొన్ని సందర్భములలో సవరణలు చేయబడి

ఈ చివరి పద్ధతి మొదటి రెంటికన్న లక్షణకర్త కధిక(శమాపాదక మనవచ్చును. మరొకటి. కవి (ప్రయోగ మెదుట కన్పించినప్పుడు మాత్రమే ఈ పద్ధతిలో సామాన్యముగా లక్షణ మవతరించును. అందువలన ఉజ్జాయింపు రూపములకు గాని, అనిష్టరూపములకుగాని ఈ పద్ధతిలో అవకాశము దాదాపు లేదనియే చెప్పవచ్చును. మరియు, జిజ్ఞాసువులకు బహుకావ్యములతో పరిచితి ఈ పద్ధతిలో కలుగుట కున్న అవకాశము గూడ ఆకర్షక మయినది. అప్పకవీయము వంటివి ఈ పద్ధతికి చెందిన లక్షణ(గంథములు. లక్షణ(గంథరచనా(కమ పరిణామ మును పరిశీలించినచో పైమూడు పద్ధతులును ఒకటి తరువాత నొకటిగా వచ్చి (క్రమాభివృద్ధి నందినట్లు స్పష్టమగును. తిమ్మన చివరిపద్ధతి అభివృద్ధికి వచ్చిన కాలమువాడు. అందువలన ఆతని లక్షణ (గంథము 'సర్వ లక్షణ సార సం(గహము' ఈ పద్ధతికి చెందినది.

**సర్వ లక్షణ సార సం(గహమా ?**

**లక్షణ సార సం(గహమా ?**

తిమ్మన రచించిన లక్షణ(గంథమునకు 'సర్వ లక్షణ సార సం(గహము' అన్న వాడుక (ప్రస్తుత మున్నది. కాని ఈ పేరులో కొంచె మధిక పాఠ మున్నట్లుగా కన్పించును. ఎందుకనగా—

'జగ దుపకారార్థము (క్రొ
త్తగ లక్షణ లక్ష్యములు వితర్కించి బుధుల్
పొగడఁగఁ గృతి సేసెద, నెర
వగు 'లక్షణ సార సం(గహా' హ్వయ మొనరన్'.

అని తిమ్మన తన లక్షణ(గంథావతారికలో (వాసినాడు. దీనినిబట్టి (గంథము పేరు 'లక్షణ సార సం(గహము' అనక తప్పదు గదా! పూర్వముద్రిత(ప్రతి యందు ఈపద్య మిట్లే ఉన్నది. కాని, ఆశ్వాసాంతగద్యలయందు మాత్రము "తిమ్మకవి (ప్రణీతంబైన ' సర్వ లక్షణ సార సం(గహం ' బను కృతియందు " అని యున్నది. పూర్వముద్రిత(ప్రతియందలి ఈ వైరుధ్యము తాళప(త (ప్రతియందు లేదు. అందులో ఆశ్వాసాంతగద్యయందు 'లక్షణ సార సం(గహ'

మనియే ఉన్నది తప్ప, 'సర్వ' పద సంయోజనము లేదు. పై ఉదాహృత పద్యమును బట్టి తాళపత్రప్రతిలోని పాఠమే సరియైన దనుటకు విప్రతిపత్తి ఉండ నవసరము లేదు.

అయితే, ఇక్కడ మరొకవిషయము గమనించ వలసి ఉన్నది. తాళపత్ర ప్రతిని వ్రాసికొన్న "(వంకా)యలపాటి చిట్టెన్న కుమారుడు వెంకట నారాయణప్ప' అవతారికాపద్యమందును, ఆశ్వాసాంతగద్యలయందును కేవలముగా 'లక్షణ సార సంగ్రహ' మనియే వ్రాసికొన్నను, తా నా ప్రతిని వ్రాయుట కారంభించిన, పూర్తి చేసిన 'తారీఖులు' వ్రాయుచు '....సకల లక్షణ సార సంగ్రహము వ్రాయడ మయినది....' అని వ్రాసికొన్నాడు. ఈ వ్రాతలో 'సకల' అధికపాఠ మయినది. ఇదిట్లుండగా, తిమ్మన తన 'రసికజనమనోభిరామ' కావ్య పీఠికలో, అప్పటివరకు తాను రచించిన కావ్యముల పేర్లను ప్రస్తావించుచు—

'...సకల లక్షణ సార సంగ్రహంబు నొనర్చి...'

అని తన లక్షణగ్రంథమును పేర్కొన్నాడు. దీనినిబట్టి ఈగ్రంథమునకు సకల'—'సర్వ' అను అధికపదముల తోడను, అవి లేకుండ గూడ కవియే అంగీకరించినట్లు స్పష్టమగును.

ఈవిషయ మిట్లుండగా, పదునారవ శతాబ్దమునకు చెందిన 'చిత్రకవి పెద్దన' రచించిన 'లక్షణ సార సంగ్రహ' మన్న గ్రంథము మరియొకటి ఉన్నది. ఇది ప్రధానముగా ఛందోగ్రంథము. ఇందులో నాటకలక్షణము చెప్పబడినను, ఛందోవిషయిక విస్తృతిని బట్టి పెద్దనయే దీనిని ఛందోగ్రంథముగా చెప్పుకొనినాడు[1]. వ్యాకరణాంశము లిందులో లేనేలేవు. మరి తిమ్మన గ్రంథము ప్రధానముగా వ్యాకరణాంశములు గలది. ఇందులో యతిప్రాసములకు

1. "... సుకవీశ్వర భూషణంబును గుకవి దూషణంబునుం జేసి' లక్షణ సార సంగ్రహంబు' నుపక్రమించిన వాఁడనై.....' ల. సా. సం. 1–5
"క. నీపేర నంకితంబుగ
దీపితమతి ఛంద మొకటి తెనుఁగున నగడు సం
క్షేపమునఁ జేతు ............" ల. సా. సం. 1–11

సంబంధించి కొంత లేకపోలేదు కాని, దానికి ఛందోదృష్టితో అధిక ప్రాధాన్యము లేదు. వ్యాకరణమునకు సంబంధించి అనేక కవిప్రయోగములకు యతి ప్రాసములు నిర్ధారక స్థానములు కాబట్టి, ఆ దృష్టితోడనే వాటి కింద కొంత ప్రవేశము కలిగినది. అంతేగాని యతిప్రాసలీలావిలాసముగా కాదు. వాటిని వివరించిన రీతియు ఈ అంశమునే బలపర్చును. అప్పకవీయము మొదట వ్యాకరణ గ్రంథముగా, చింతామణి వ్యాఖ్యగా ప్రారంభ మయినను, అందు తత్పూర్వ గ్రంథములందుకన్న ఛందోవిషయపరిణాహవిస్తృతి యుండి, వ్యాకరణము దాని చాటున నొదిగిన ట్లుండుటచే అప్పకవీయమునకు ఛందోగ్రంథముగానే ప్రశస్తి మిగిలినది. కాని తిమ్మనగ్రంథమున కట్లు గాదు. ఇందలివిషయమును బట్టి వ్యాకరణగ్రంథముగనే పెరిగినది. ఈ విధముగా పెద్దన గ్రంథమునకును తన గ్రంథమునకును ప్రతిపాద్యవిషయప్రాధాన్యమునందలి విభేదమును బట్టి, తన గ్రంథమును 'లక్షణ సార సంగ్రహ' మని పేర్కొనుటకు తిమ్మన మొదట సందేహించియుండక పోవచ్చును. ఒకే పేరుతో నిద్దరు రచించిన గ్రంథములు లేక పోలేదు. అనంతుడు, వెల్లంకి తాతంభట్టు గ్రంథములు రెంటికిని 'ఛందోదర్పణ' మనియే పేరు. తాతంభట్టు గ్రంథ మిటీవల వ్యాప్తికి రాలేదు. పూర్వు లీ రెంటిని 'అనంతుని ఛందము, ఛందో దర్పణము' అని స్పష్టతకు పేర్కొనెడివారు.[1] అయితే ఈరెండును ఛందస్సుకు సంబంధించిన వగుటచే ఈ విధమైన వ్యవహారము కలిగినది. మరి పెద్దన తిమ్మన గ్రంథముల విషయము భిన్నమయినది అయినను వ్యవహారమునందు ఒకేపేరు రెండు గ్రంథముల కుండుట కొంత గజిబిజియే. అందువలననే కావచ్చు, తిమ్మన తన గ్రంథమును 'సకల లక్షణ సార సంగ్రహ' మనియు పేర్కొని ఈపేరుకు వ్యాప్తి తెచ్చి యుండును. తాళపత్ర ప్రతి వ్రాయసగాని వ్రాత ఈ వ్యాప్తి కొక చిహ్నము. మరి అర్థసామ్యమును బట్టి 'సకల' పదముతోబాటు 'సర్వ' పదమును గూడ చేర్చుట తిమ్మన కభిప్రేతమా? ఆలోచించినచో, కాదనియే చెప్పవలసివచ్చును. ఎందుకనగా, పెద్దన 'లక్షణ సార సంగ్రహము'నకు గూడ 'సర్వ లక్షణ సార సంగ్రహ'మన్న వ్యవహారమున్నది. అప్పకవి తనకు ప్రాచీనములయిన సంస్కృతాంధ్ర లక్షణ గ్రంథముల పట్టిక నిచ్చుచు, ఆంధ్రలక్షణగ్రంథములలో 'సర్వ లక్షణ సార సంగ్రహంబు'ను పేర్కొన్నాడు.[2] ఇది తిమ్మనగ్రంథ మనుటకు వీలులేదు. తిమ్మన

1. "... అనంతామాత్య ఛందంబును, ఛందోదర్పణంబును..." అప్పక. 1–5
2. అప్పక. 1–5

అప్పకవికి తరువాతివాడు. అప్పకవిని, అహోబలుని గూడ తన గ్రంథమున పేర్కొన్నాడు. అందువలన అప్పకవి పేర్కొన్న ఆ పేరిటి గ్రంథము చిత్రకవి పెద్దనదే కావలెను. కానతె నేమి? అగును. పెద్దన తన గ్రంథమున ఎక్కటి యతిని గూర్చి చెప్పిన పద్యమును అప్పకవి 'సర్వలక్షణ సార సంగ్రహంబు నందు.—' అని ఉదాహరించినాడు.[1] దీనినిబట్టి తన గ్రంథమునకు 'సర్వ లక్షణ సార సంగ్రహ' మన్న పేరు తిమ్మన కవిమతము కాదనియే చెప్పవలసి యుండును.

ఇదిట్లుండగా, అప్పకవికి సమకాలికుడో, కొంచెము ముందువాడో అనదగిన రత్నాకరము గోపాలకవి సంకలనము చేసిన 'సకల లక్షణ సార సంగ్రహము' అని మరియొక గ్రంథ మున్నది.[2] దీనిని బట్టి తిమ్మన గ్రంథమునకు వ్యవహారములో నున్న మూడుపేర్లకు దీటుగా తత్సార్వమే మూడు గ్రంథములు వెలసి యున్నట్లు స్పష్టమగును. అయితే, సంకలన గ్రంథమునకు ప్రశస్తి రాలేదు. పెద్దన గ్రంథము— అప్పకవి ఆ విధనుగా పేర్కొన్నను —వట్టి 'లక్షణ సార సంగ్రహము' గానే నిలబడినది. కాగా 'సర్వ లక్షణ సార సంగ్రహమ'న్న ప్రసిద్ధి తిమ్మన గ్రంథమునకే కలిగినది. నిజమునకు 'సర్వ' ('సకల') పదము సార్థకము కాకున్నను, పెద్దన గ్రంథమునుండి వేర్పరచు దృష్ట్యా తిమ్మన గ్రంథమునకు వచ్చిన ఈ ప్రసిద్ధినామ్రతము త్రోసివేయరానిది. అందువలన ఈపేరే ప్రస్తుత గ్రంథశీర్షిక యయినది.

### మరల నిదేల లక్షణ గ్రంథము ?

తనకు పూర్వము పలు వ్యాకరణ గ్రంథములు రచింపబడి యుండగా, తాను మరల క్రొత్తగా నొక గ్రంథమును రచించు టెందుకు? ఏ ప్రయోజనమున కీ రచన ప్రారంభింప బడినది? ఈ రచించుటలో ప్రధానోద్దేశ మేమి? ఈ విధ మైన ప్రశ్నలు ఎవరో అడుగ నక్కరలేదు. తిమ్మన తనకు తానే ఈ విధముగా ప్రశ్నించుకొన్నాడు. సమాధానము చెప్పుకొన్నాడు—

1. అప్పక. 2–241.
2. చూ. శ్రీ రావూరి దొరస్వామి శర్మగారి 'తెలుగు భాషలో ఛందో రీతులు.' పు 396 మరియు గణపవరపు వేంకటకవి గ్రంథమునకును 'సర్వ లక్షణ సార సంగ్రహ' మన్న పేరున్నది.

'తెలుఁగునకు మున్ను లక్షణంబులు మహాక
వీశ్వరులు పెక్కు రచియించి యుడి, రిఁకేల
కూర్చవలె? —నన్న, ప్రౌఢిమకొఱకు నాక
తెలిసిన తెరంగు నొకకొంత తేటపఱుతు'

గ్రంథావతారికలో తిమ్మన వేసికొన్న ప్రశ్నయు, సమాధానమును పయిపద్య మయినది. ఈ సమాధానమునుబట్టి ఈ గ్రంథరచనలో తిమ్మన ఉద్దేశ్యము, గ్రంథ ప్రయోజనము స్పష్టము. ప్రతి చిన్న చిన్న యంశమును గూడ చెప్పికొనుచు బోవు గ్రంథ మిది కాదు. ప్రౌఢిమను సంపాదించుటకు మాత్రమే ఉపయోగించు రీతిలో ఈ వ్యాకరణ గ్రంథము రచింప బడినది. అందుకే దీనియందు ప్రాథమికములయిన పలువిషయములు, నిర్వచనములు చెప్పబడలేదు. కొన్ని చోట్ల దిక్ ప్రదర్శనముగా కొన్నిఅంశములు చెప్పబడినవి. ప్రాథమికముగా కొంత వ్యాకరణ పరిచితి కలిగిన తరువాతనే దీనివలన ప్రయోజనము. ఆదృష్టితోనే విషయ ప్రతిపాదన మున్నది. గ్రంథరచనాప్రణాళికను గమనించినచో దాదాపుగా వ్యాకరణమునకు సంబందించిన విషయము లన్నియు ఉన్నట్లే కన్పించును. ఆ ప్రణాళిక ఇది:—

ప్రథమాశ్వాసము.—

1. చతుర్విధాంధ్ర ప్రకరణము
2. సంజ్ఞా ప్రకరణము
3. సంధి ప్రకరణము
4. విభక్తి ప్రకరణము

ద్వితీయాశ్వాసము.—

1. సమాస ప్రకరణము
2. క్రియా విశేష ప్రకరణము
3. ప్రాస ప్రకరణము
4. యతి ప్రకరణము
5. శబ్ద ప్రకరణము.

తృతీయాశ్వాసము.—

1. రేఫ ప్రకరణము
2. శకట రేఫ ప్రకరణము

భాషా విభజనము, దాని స్వరూప నిరూపణము మొదలుకొని రేఫ అకార నిర్ణయము వరకు దాదాపుగా అన్ని అంశములను చెప్పినట్లే పయి ప్రణాళిక వలన స్పష్ట మగును. అయితే ప్రతి ప్రకరణమునందును సామాన్యవిషయములకు గాక, తాను విశేషము అని భావించినవాటికే ప్రాధాన్యము కలిగినది. ఉదాహరణమునకు శబ్ద ప్రకరణమునందు రూపనిష్పాదనయత్నము లేదు. కాగా కొన్ని శబ్దముల రూప వైవిధ్య విశేషప్రదర్శనమే ఉన్నది. ఇంతేకాదు, ద్వితీయాశ్వాసమందలి రెండవ ప్రకరణము పేరే 'క్రియా విశేష ప్రకరణము'. ఇట్లే అన్ని ప్రకరణములను గమనించ వచ్చును. తిమ్మన చెప్పిన విశేషాంశములు, మాత్రాంశములు చర్చా పూర్వకముగా కొన్ని ఈ క్రింద వివరింప బడుచున్నవి.

### తెనుగు ఎన్ని తెరగులు ?

ఆంధ్ర భాషా స్వరూపమును గూర్చిన మొదటిప్రకరణమునందు 'ఆంధ్రంబు చందమున్ వివరింతు' ననుచు తిమ్మన—

'ధాత్రిపైఁ దత్సమంబును దద్భవంబు
అచ్చతెనుఁగును దేశ్య గ్రామ్యంబు లనఁగ
దెల్లముగ నైదు తెరఁగులు తెనుఁగు బాస....'

అని తెలుగుభాషను ఐదువిధములుగా విభజించినాడు. తెలుగుభాష నైదు విధములుగా విభజించుటకు కేతన మూలపురుషుడు. కేతన చెప్పిన క్రమమునే 1 తిమ్మన ఇక్కడ అనుసరించినాడు. ఈ అయిదింటిలో తత్సమ, తద్భవ, గ్రామ్య విభాగముల విషయమున పేచీ లేదు. అవి స్పష్టము లనియే చెప్ప

1. తత్సమంబునాఁగః దద్భవంబన నచ్చ
తెనుఁగు నాఁగ మఱియు దేశ్య మనఁగ
గ్రామ్యభాష నాఁగః గల దైదు తెఱఁగులు...' ఆం.భా.భూ. 19.

వలయును. కాని అచ్చతెనుగు, దేశ్య మను విభాగములు స్పష్టముగా లేవు. ఈ రెంటిని గూర్చి లక్షణప్రాయముగా

"....ఎల్లవారికిఁ
దెలిసెడి యావలుకు అచ్చతెనుఁ గనఁబరఁగున్'
"తెర (తెల) నాడిన దేశ్యంపుఁ దెనుఁగు లయ్యో'

అని కేతన చెప్పినాడు. అంతేకాదు, ఈ రెండువిధములకు చెందినవిగా కొన్ని పదములను పట్టికగా చూపినాడు. విన్నకోట పెద్దన గూడ తెలుగు నైదుగనే విభజించినాడు కాని, అచ్చతెనుగు, దేశ్యము అనుటకు బదులు 'సకలాంధ్ర దేశభవము, దేశ్యోద్భవము' అని పేర్కొన్నాడు.[1] చెప్పిన క్రమము ననుసరించి మొదటిది దేశ్యమునకు, రెండవది అచ్చతెనుగునకు పేర్లుగా స్ఫురించును. విభజన సందర్భమున పై విధముగా పేర్కొన్నను, పదముల పట్టిక నిచ్చునప్పుడు మాత్రము 'దేశ్యము, అచ్చతెనుఁగు' అన్న పదములనే ప్రయోగించినాడు. ఈ రెంటికి పెద్దన లక్షణ మిది.—

'శ్రేయములై, బహుదేశా
నేయములై చక్కఁదనము నెఱదనములు నై
యా యా నెలవులఁ జెవులకుఁ
దీయము లగు పలుకు లెల్ల దేశ్యము లయ్యెన్'
'ఈ మూఁడుతెఱంగులలో
నేమిటకున్ దొరలకున్న నెల్ల జనులకున్
లో మిగులఁ దేట పడియెడు
నా మాఁటల యచ్చతెనుఁగు లన నెగడొందున్'.కా.చూ.9.16,18

రెండవ పద్యములో 'ఈ మూఁడు తెఱంగు' లనగా, తత్సమ, తద్భవ, దేశ్యము లని తాత్పర్యము. అచ్చతెనుగు విషయమున కేతన పెద్దనల లక్షణములలో సామ్యము స్పష్టము.

1. 'భువిలోఁ దత్సమము ద
ద్భవమును సకలాంధ్రదేశభవమును దేశ్యో
ద్భవమును గ్రామ్యమునాఁ బం
చవిధములై తెనుఁగుల బలుకుజాతము పరఁగున్' కా. చూ. 9-11

అప్పకవి చింతామణి ననుసరించి భాషను నాల్గువిధములుగనే విభజించియు[1] దేశ్యమును మరల రెండుగా విభజించినాడు. ఒకటి: శుద్ధాంధ్రము, రెండు: అన్యదేశజాంధ్రము. వాటికి—

'ఆంధ్రదేశ పురస్థాయు లైన సకల
జనములకును మఱుంగు దేశంబు లేక
తేటతెల్లముగాఁ బల్కు మాట లెల్ల
నవని శుద్ధాంధ్రదేశ్యంబు లనఁగఁబడును'.
'కేశవ యాంధ్రులు నానా
దేశంబుల యందు నిలిచి తెలుఁగులె తత్త
ద్దేశోక్తు లంటఁ బలికిన
నా శబ్దము లన్యదేశ జాంధ్రము లయ్యెన్

అప్పక. 1–106, 107

అని లక్షణము చెప్పినాడు. అప్పకవి విభజనము కేతనాదులదానికన్న భిన్నముగా కన్పించును కాని కేతన 'అచ్చతెనుఁగు లక్షణముతో అప్పకవి 'శుద్ధాంధ్రదేశ్య' లక్షణము సరిపోవుచున్నది. మరియు ఈ రెండు విభాగములకు చెందినవిగా అప్పకవి ప్రదర్శించిన పదపట్టికలనుబట్టి పద్యములను సమన్వయించుకొన్నచో, శుద్ధాంధ్రదేశ్యము లన్నవి అచ్చతెనుగులుగా స్పష్టపడును. కాగా అన్యదేశజాంధ్రము లన్నవి దేశ్యము లగుచున్నవి.

గణపవరపు వేంకట కవియు తన ఆంధ్ర కౌముదిలో కేతనవలెనే అచ్చతెనుగు, దేశ్య మన్న రెండుతెగలను పేర్కొన్నాడు. అయితే దేశ్యముల కీయన లక్షణ మేమియును చెప్పలేదు, కాగా అచ్చతెనుగును గూర్చి—

'తత్సమ దేశ్య తద్భవములఁ గలయని
తేటనుడుగు లచ్చతెనుఁ గనఁదగు'

అని విన్నకోట పెద్దనవలెనే చెప్పినాడు.

1. " తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా, చేయంర చతుర్విధా భవతి..." —ఆం. శ. చిం.
" దైత్యదమన! తత్సమ మనఁ దద్భవ మన
దేశ్యమన గ్రామ్యభాషనాఁ దెనుఁగు నాల్గు
విధములు................" అప్పక. 1–101

అయితే, వీరందరును ఈ రెండు తెగలకు చెందినవిగా ఉదాహరించిన పదము లన్నియు ఒకే విధముగా లేవు. ఉదాహరణమునకు కేతన 'వేసవి' నచ్చతెను గనగా, అప్పకవి అన్యదేశజాంధ్రముగా గణించినాడు. మరియు దేశ్యములలో గ్రద్దలు, ముద్దియ (కేతన) అక్కజము, అచ్చెరువు (వి.పెద్దన) అక్కు (గ. వేంకటకవి) గొనయము (అప్పకవి) వంటి తద్భవపదములుగూడ చేరినవి. ఈవిధముగా వెదకుచు పోయినచో అచ్చతెనుగు, దేశ్యము అన్న విభజనమునకు స్పష్టమయిన విభాజకసూత్రము కన్పించదు. 'ఎల్లవారికి తెలియుట' 'తేల నాడుట' (కేతన) వంటి లక్షణములు నిజమునకు పరస్పర భిన్నములు కావు. అందరును ఉజ్జాయింపు లక్షణమునే చెప్పినారు తప్ప, ఈ రెంటి నడుమ స్పష్టమైన భేదమును చూపలేదు.

అయితే, ఉభయవిభాగములకు చెందినవిగా పేర్కొనబడ్డ పదములను విడివిడిగా పరిశీలించినచో ఒకపద్ధతి స్ఫురించును. అప్పకవి సూచించిన ధోరణిలో సర్వజనులు నిత్యవ్యవహారమునం దుపయోగించు పదములు అచ్చతెనుగులు. తల—నెల—గుడి—మడి—పప్పు—ఉప్పు—నూనె—నేయి మొదలయినవి ఈవిభాగములో చేరినవి. ఇవి నిత్యవ్యవహారమున తప్పనివి.'ఎల్ల వారికి తెలియు'నవి. ఇక, వీటివలె సర్వజనులకు నిత్యవ్యవహారములలో లేనివి, విద్యావంతులు, పండితులు, సాహిత్యకులు మాత్రమే ఉపయోగించునవి, అచ్చతెనుగు సమస్తపదరూపములు మొదలయినవి దేశ్యములు. అందుకే 'నెల' అచ్చతెనుగు కాగా 'క్రొన్నెల' దేశ్య మయినది. 'వెన్నెల' పదస్వభావ దృష్ట్యా దేశ్యము కావలసినను, ఎల్లవారి నిత్యవ్యవహారము దృష్ట్యా అచ్చతెను గయినది. "అచ్చతెనుగు విభాగంలో సర్వసాధారణ వ్యవహార రూపాలను, దేశ్య విభాగంలో వ్యవహార చ్యుతమై సాహిత్యమాత్రగతమైన తెమ్మెర, ఎలనాగ వంటి వాటిని (కేతన) ఉదాహరించటం గమనార్హమైన సంగతి'గా శ్రీ తిరుమల రామచంద్ర గారు చెప్పినారు.[1] నిజమే. ఉభయవిభాగములలో ఉదాహరించిన పదములను జాగ్రత్తగా పరిశీలించినచో నీపద్ధతి యున్నట్లు భాసించును. కాని, ఇందులోగూడ దాటివేతలకు తక్కువేమి లేదు. మన్ను—వెన్ను—చిగురు—నలుపు—దిమ్మ వంటివి స్వాభావికముగా అచ్చతెనుగులు కావలసి యుండగా, దేశ్యము అయినవి.

1. కర్ణాటక భాషాభూషణం : కేతన అనుసరణ, సాహితీ సుగతుని స్వగతం. (వ్యాస సంపుటి) పు. 55.

కేతనగూడ ఈ దాటివేతలను తప్పకొనలేదు. కాలమునుబట్టి, ప్రాంతమును బట్టి నిత్యవ్యవహార—అవ్యవహారతలలో వచ్చు భేదము తరువాతివారిలో మరింత దాటివేతలకు హేతువయినది. దీనితో ఈ విభజనమున నున్న దృష్టికిని ఉపయోగమునకును పొంతన కుదురలేదు. మరియు కచ్చితమైన నియమము నేర్పరచుకొనక, సాంప్రదాయికముగా చెప్పికొనుచు పోవుటలో ఈ విభజనము చాలావర కస్తవ్యస్త మయినది.

అయితే, ఈ నిత్యవ్యవహార—అవ్యవహారతల విషయ మెట్లున్నను, రెండు విభాగములకు చెందిన పదము లన్నియును దేశీయములే, దేశ్యములే. అందువలన విభాజకలక్షణముయొక్క అనియతత్వమును, అనిశ్చితత్వమును దృష్టియం దుంచికొనియే తిమ్మన—

'సూరిజనుల్ లోకవ్యవ
హారం బగు బాస దేశ్యమం డదియె హితం
బారఁగ నచ్చతెనుం గని
యారూఢిగఁ గొంద ఱందు రగజాధీశా!

అని చెప్పినాడు. ఈ చెప్పటలో అచ్చతెనుగు, దేశ్యము వేరు వేరన్న అభిప్రాయమునకు బదులుగా, ఒకదాని కొకటి పర్యాయపదములుగా మారినవి. ఇందులో మరొక అంశము. 'లోకవ్యవహారం బగుబాస దేశ్య' మనగా, నిత్యవ్యవహార మందలి భాష దేశ్య మని, 'అదియె హితం బారఁగ—' అనగా సాహిత్యకము కాగా అచ్చతెను గని చెప్పినట్లయినది. సాహిత్య మన్నపదమునకు ప్రసిద్ధముగా నున్న హిత మును కలిగించునది, హితముతో కూడినది యన్న అర్థములను దృష్టియం దుంచుకొనినచో, 'హితం బారఁగ' యనుటలోని ప్రత్యేకత స్ఫురించును. మరియు 'ఆరూఢిగ' అనుటలో అచ్చతెను గన్నది రూఢమయిన పద మన్నదిగూడ స్ఫురించును.

అయితే, ఇక్కడ పేర్లు తల్లక్రిందు లయినవి. కేతనాదుల దృష్ట్యా లోకవ్యవహారములోని భాష అచ్చతెనుగు, సాహిత్యక మయినది దేశ్యము. కాని తిమ్మన దీనిపేరు దానికి, దానిది దీనికి తగిలించినట్లు కన్పించును. దీనికిని కారణము లేక పోలేదు. కేతననాటికే తత్సమేతర మయిన ఈ భాష అచ్చతెను గన్న రూఢి పొందినది.

తగిలించినట్లు కన్పించును. దీనికిని కారణము లేకపోలేదు. కేతననాటికే తత్సమేతర మయిన ఈ భాష అచ్చతెను గన్న రూఢి పొందినది.

'తత్సమంబు దక్క తక్కిన నాలుగు
నచ్చతెనుఁగు లందు రఖిలజనులు..' ఆం. భా. భూ. 27.

అని కేతనయే చెప్పినాడు. 'అఖిలజనులి'ట్లు అనుటబట్టియే ప్రాచీనకావ్యములలోని కొన్ని అక్కడక్కడి పద్యములు, 'యయాతి చరిత్ర'వంటి కావ్యములు అచ్చతెనుగు లయినవి. కేతన ఇట్లు చెప్పుటబట్టి అచ్చతెనుగులు ఆతని దృష్ట్యా రెండు. ఐదుగా విభజించిన భాషలోని 'ఎల్లవారికిఁ దెలిసెడి యాపలుకులు' అన్న ఒక విభాగము మొదటిది. తద్భవ–అచ్చతెనుగు–దేశ్యగ్రామ్యములు నాలిగింటి సమాహార రూపము రెండవది. ఇట్లు రెండువిధములుగా చెప్పుట కొంత గజిబిజియే. ఒక ప్రత్యేక విభాగమునకును, నాల్గువిభాగముల సమాహారమునకును ఒకే పేరు పెట్టుటలో కేతన ఆశించిన ప్రయోజనము దుర్గ్రాహ్యము. నిజమునకీ నాల్గింటి సమాహారమునందే 'అచ్చతెనుగు'నకు అఖిలజనరూఢి. ఆ రూఢ మయిన అచ్చతెనుగును కేతన నాల్గుగా విభజించినాడు. అప్పుడు ఆ నాల్గింటిల నొకదానికి ఈ రూఢమయిన పేరు పెట్టుటకన్న మరొకపేరు పెట్టినచో బాగుండెడిది. అట్లు కాకపోవుటచే నీ రెండు గజిబిజి యైనవి. మరియు, అచ్చతెనుగు–దేశ్య మన్న రెండువిభాగములకు విభాజకలక్షణములు సరిగా లేకపోవుటయు, దాటివేత లుండుటయు కారణముగా ఈ రెండిటిని కలిపి దేశ్య మనుటలో లోపము లేదు. ఈ స్థితిలో అప్పకవి అవలంబించిన పద్ధతి కొంత బాగున్నట్లు కన్పించును. అతడు దేశ్యమును రెండుగా విభజించినాడు గదా! ఇట్లు కాకపోవుటచే కేతన 'అచ్చతెనుగు' ఇరుకున బడినట్లయినది అందుకని ఇదంతయు పరిశీలించియే తిమ్మన, దేశ్యమునకు అచ్చతెనుగును నామాంతరముగా చెప్పెనా డనవలయును. తత్సమేతరము లయిన నాల్గింటిని అచ్చతెనుగులుగా ఒప్పికొన్న కేతనదృష్ట్యా, దేశ్యమున కచ్చతెనుగు నామాంతర మగుటలో విప్రతిపత్తి యుండ నవసరమే లేదు. అయితే, కేతన చెప్పి అచ్చతెనుగులు రెంటిలో ఈ నామాంతర మయిన అచ్చతెను గేది యన్నది ఒకప్రశ్న. విచారించినచో రెండవది యనియే చెప్పవలసియుండును. తిమ్మన స్వయముగా

అచ్చతెనుగు కావ్యములను రచించినవాడు. తత్సమేతర మయినదే ఆ కావ్యములందు 'అఖిలజనుల' రూఢినిబట్టి అచ్చతెనుగుగా ఉపయుక్తమయినది. అందువలన రెండవదియే ఇక్కడ నామాంతర మయినది. కేతన చెప్పిన మొదటి అచ్చతెనుగును 'దేశ్యము'ననే అంతర్భవించినట్లు తిమ్మన భావించినాడు. దేశ్యమున మరొకభేదము చెప్పకపోవుటచే నిట్లు చెప్పవలసి వచ్చుచున్నది.

మరి మొదటిదానిని దేశ్యమున నంతర్భవింపజేసి ఒక భేదమును తగ్గించిన తిమ్మన, తద్భవములుగూడ ఈ అచ్చతెనుగులో కలియగా, తద్భవ విభాగమునుగూడ తగ్గించవలయును గదా! కాని తిమ్మన అట్లు చేయలేదు. నిజమునకు భాషను రెండుగనే విభజింపవచ్చును. ఒకటి తత్సమము. రెండు దేశ్యము. ఈదేశ్యమునకే అచ్చతెను గనిపేరు. దేశ్యములో తద్భవము, గ్రామ్యము అంతర్భవించును. అయినను వీటిని విడిగా విభజించుట జరిగినది. ఈ విధముగా దేశ్యమునుండి ఈ రెంటిని విడదీసి చూపుటకు కారణ మున్నది. తద్భవములు ప్రస్తుతరూపమున దేశ్యములే అయినను, వాటి పూర్వరూపములు కావు. మిగిలిన దేశ్యపదములకు వీటి కున్న ఈ భేదమునుబట్టి భాషాదృష్ట్యా వేరుగా విభజింపబడవలసినదే. ఇక, గ్రామ్య మన్నది లక్షణవిరుద్ధములు అనాగరకములుగా భావింపబడు పదముల గుంపు. 'ఒరులఁ దెగడు' చోట తప్ప ఇది కావ్యోపయోగి కాదు. ఈకావ్యాను పయోగ్యతనుబట్టి దీనిని విడిగా చూపించ వలసిన అవసరము కలిగినది. అందువలన తిమ్మన విడిగా వీటిని చెప్పినాడు. ఇక ఈ రెండువిధము లయిన పదములు పోగా మిగిలిన దేశ్యపదములను మరల విభజించుటకు, పై విభజనమున కున్నంతటి అవసరము కన్పించదు. నిత్యవ్యవహారములోని వని, కానివి—సాహిత్యిక మయినవి అని విభజించుటలో పెద్ద ప్రయోజనము కన్పించదు. సాహిత్యములో రెండు విధములకు ప్రయోగ మున్నది. 'నెల' ను వద్దని 'క్రొన్నెల' ను మాత్రమే కావలె నని సాహిత్య మనునా? అందువలన సాహిత్యమున కీవిభజనము వలన ప్రయోజనము లేదు. సామాన్యవ్యవహారమున కీవిభజన మవసరమే లేదు. ఉన్నచో వ్యవహరింపబడును. లేనిచో లేదు. అందువలన ఈ విభజనమునకు లేని అవసరము తద్భవమునకు (గ్రామ్యమునకు గూడ) ఉన్నది. మరియు కేతన దేశ్యమున కిచ్చిన పదపట్టికలో కొన్ని తద్భవము లున్నవి. దీనివల్ల తద్భవములు శద్యేము లగునుగాని, దేశ్యములు తద్భవములు గావన్న సూచనయు స్ఫురించును.

తిమ్మన ఈ అంశము లన్నిటిని దృష్టియందుంచుకొనియే దేశ్యమునకే అచ్చతెనుగును నామాంతరముగా, అదియు 'హితంబారఁగ' మాత్రమే చెప్పినాడు. దీనివలన కేతన, అప్పకవుల వలె అచ్చతెనుగు (తత్సమేతరభాష) ను గూర్చి విడిగా చెప్పవలసిన అవసరము లేకపోయినది. ఈ విధముగా తిమ్మన, తత్సమ—తద్భవ—దేశ్య (అచ్చతెనుగు)—గ్రామ్యము లని నాల్గు తెలుగులనే సమ్మతించిన ట్లాయినది.

అయితే, 'తెల్లముగ నైదు తెలుఁగులు తెనుఁగు బాస' అని గ్రంథమున ఉన్నది. ఇట్లుండుట తిమ్మన సమ్మతికి విరుద్ధము. అందువలన ఈ 'తెలుఁగులను పేర్కొను పద్యము—

'ధాత్రిపై దత్సమంబును దద్భవంబు
ననఁగ దేశ్యంబు మఱియు గ్రామ్యంబు నాఁగ
దెల్లముగ నాల్గు తెలుఁగులు తెలుఁగుబాస'

అని ఉన్నచో తిమ్మన సమ్మతి కెక్కును. కాని, పూ. ము. ప్రతియందును, తా. ప. ప్రతియందును 'ఐదుతెలుఁగుల' పాఠమే ఉన్నది. మరియు పూ. ము. ప్రతియందు 'అచ్చతెనుఁగును దేశ్యగ్రామ్యంబు నాఁగ' అని యుండగా, తా. ప. ప్రతియందు 'అచ్చతెనుగును గ్రామ్యదేశ్యములు నాఁగ' అని యున్నది. క్రమము ననుసరించినచో చివరకు 'గ్రామ్య' ముండవలయును. కాని తా. ప. ప్రతిలో 'దేశ్య' మున్నది. ఈ వ్యతిక్రమము పూ. ము. ప్రతిలో లేదు. కాని 'దేశ్యగ్రామ్యంబు నాఁగ' అని యుండుటచే దేశ్యము, గ్రామ్యము వేరు వేరు విభాగము లన యర్థ మీపాఠమున కలుగదు. 'దేశ్యగ్రామ్యంబు లనఁగ' అని యున్నచో ఆ అర్థము కలుగును. కాని మిగిలిన వాటిని విడివిడిగా చెప్పి ఈ రెండిటిని సమసింపచేయుటకు కారణ మగుపించదు. కావున ఉభయప్రతులందున ప్రధానపాఠము మారిన దనియే చెప్పవలయును. తిమ్మన దేశ్యమును గూర్చి చెప్పుచోట నామాంతరముగా 'అచ్చతెనుగు' పద ముండుటయు పంచధా విభాగము ప్రహతముగా నుండుటచే ఈ అచ్చతెనుగును నామాంతరముగా గుర్తించక, ఇక్కడ ఉండి 'తెరఁగుల' పద్యములో నుండకపోవుట సరిగా దను తలంపుతో దీని నక్కడ చేర్చి ఈ 'సుపాఠము' 'ఏ స్థాయియందు దయినను కల్పించబడి, యుండవచ్చును. తిమ్మన వివరింపునుబట్టి మాత్రము ప్రస్తుతము ఉపలబ్ధమగుపాఠము ప్రక్షిప్త మనక తప్పదు.

## తిమ్మన: అన్యలాక్షణిక ప్రస్తావన

తిమ్మన తనకన్న ప్రాచీనము లయిన లక్షణగ్రంథములను పరిశీలించి, కొన్ని సందర్భములలో సరిగా లేవనిపించిన అంశములను తన గ్రంథమున నిరాకరించినాడు. అంతమాత్రమున తిమ్మన కాయా లక్షణగ్రంథప్రణేతలయం దాదరము లేదని చెప్ప వీలులేదు. కొన్ని సందర్భములలో పూర్వలాక్షణికమతములను ప్రమాణీకరించినాడు. తిమ్మన వారిని ప్రామాణికులుగా స్వీకరించుట చేతనే, కొన్నిచోట్ల నిరాకరించుటయు, మరికొన్నిచోట్ల ప్రమాణీకరించుటయు జరిగినది. తిమ్మన అధికముగా కేతన, ముద్దరాజు రామన్నల మతములను ప్రస్తావించినాడు— నన్నయ, తాతంభట్టు, దిట్టకవి వేంకటాచార్యుడు, అప్పకవి, అహోబలుడు మొదలగువారుగూడ ప్రస్తావింపబడినారు. తిమ్మన ప్రాచీన లాక్షణికుల మతములను నిరాకరించిన కొన్ని సందర్భములు, అట్లు చేయుటలో తిమ్మన దృష్టి గమనింపదగినని.

### "మల్లెయు లంజెయు గడ్డెయు...."

భాష 'తెరంగుల'లో 'గ్రామ్యము' చివరిది.'—వర్ణంబు లెక్కువ తక్కువలుగ, నియమ మెడలించి పల్కునదియు తలంప, గ్రామ్య మగుచుండు.' ఈదృష్ట్యా 'గ్రామ్యపదము లయినను సుశబ్దంబు లగుట కుదాహరణము మహాకవిప్రయోగము' ఇది తిమ్మనదృష్టి. దీని ననుసరించియే ఆడ(అకడ) ఈడ(ఈకడ) వంటివాటికి కవిప్రయోగములను ప్రదర్శించినాడు. ఈ సందర్భముననే—

'మల్లెయు లంజెయు గడ్డెయు
నొల్లెయు నను పగిది పలుకు లొప్ప వటంచుం
బొల్లెను మానయు కేతన
తెల్లంబుగ నవియుఁ గలవు, త్రిపురారాతీ'

అని కేతన నిరాకరించిన మల్లె మొదలగు వాటిని ప్రమాణీకరించి తిమ్మన కవిప్రయోగములను చూపినాడు. కేతన వీనిని నిరాకరించుటవలన ఇవి 'లక్షణవిరుద్ధము' లయి గ్రామ్యత్వాశంక పొందుచున్నవి. కాని కవులు విరివిగా

ప్రయోగించిన పదములు గ్రామ్యము అనరాదుగదా! వాటికి సులక్షణత కల్పించుట లాక్షణికధర్మము. ఆ ధర్మమును పురస్కరించుకొని 'మల్లియ' మొదలగువాటితోబాటు 'మల్లె' మొదలగు వాటినిగూడ తిమ్మన సురూపములుగా ప్రమాణీకరించినాడు.

అయితే, కేతన 'మల్లె' మొదలగు ఎదంత రూపములను నిరాకరించియుండలే దనియు నొక వాద మున్నది. ఈ సందర్భమందలి కేతనపద్య మిది.

'మల్లెయు లంజెయు గద్దెయు
నొల్లెయు నను పగిది పలుకు లొప్పవు గృతులన్
మల్లియ లంజియ గద్దియ
మొల్లియ యని పలికిరేని యొప్పం గృతులన్'.

ఆం. భా. భూ. 177.

ఇందు రెండవపాదములోని 'ఒప్పవు' అను వ్యతిరేకార్థక క్రియాపదము 'మల్లె' మొదలగువాటిని నిరాకరించుచున్నది. అట్లే నాల్గవపాదములోని 'పలికిరేని' అన్నది 'మల్లియ' మొదలగు రూపములను ప్రమాణీకరించుచున్నది. ఈ విధముగనే పూర్వలాక్షణికులు కేతనపద్యము నర్థము చేసికొన్నారు, మరియు ఆ విధముగనే ప్రస్తావించినారు. కాని శ్రీ వడ్లమూడి గోపాల కృష్ణయ్యగారు పైన చూపిన కేతన పద్యపాఠము సరియైనది కాదని, కేతనాభిప్రేతము కాదని, రెండుచోట్ల సవరణలు చూపినారు.' 1*

ఆ సవరణల ననుసరించి, 'ఒప్పవు గృతులన్' అన్నది 'ఒప్పవుం గృతులన్' (ఒప్ప + అవున్ + కృతులన్) అని ఉండవలయును. ఈ సవరణతో 'ఒప్పవు' వ్యతిరేకార్థమును గాక, ఒప్పకోలును (ఒప్ప + అవున్) చెప్పను. ఇట్లే, నాల్గవపాదమున 'పలికిరేని యొప్పన్' అనుటకు బదులుగా 'పలికిరేని నొప్పన్' (పలికిరేనిన్ + ఒప్పన్) అని ఉండవలెను 'ఏనిన్' అను దానిని సముచ్చయార్థకముగా చెప్పకొన వలయును. ఈ సవరింపులతో కేతన మల్లె, మల్లియ వంటి ఎదంత ఇయాంత రూపములనుగూడ

1.* ఆంధ్రభాషాభూషణము 'పీఠిక. పు. 110 (వివరణ కర్త : శ్రీదేవినేని సూరయ్య)

ఒప్పుకొన్నట్లగుచున్నది. వ్రాయసగాండ్ర పొరపాటువలన 'ఒప్పవు' తరువాత నుండవలసిన అరసున్న తొలగుటయు, 'ఏనినొప్పవన్' అన్నది 'ఏనియొప్పవన్' గా మారినదనియు, ఈ మారిన పాఠములను చూచియే అహోబలుడు, తిమ్మన తప్పగా కేతన పద్యము నర్థము చేసికొన్నారని శ్రీ వజ్ఝలమూడివారి అభిప్రాయము. మరి ఈ సవరింపుల కాధార మేమిటి? చెరొకటిగా వా రాధారములు చూపినారు మొదటి దిది—

'తీవెల మ్రాకుల పేరులు
పూవులకుం బేళ్లు, మొగలిపూవులు దక్కన్
గ్రోవులు మల్లెలు జాజులు
దా విరవాదు లని చెప్పఁదగుఁ బెక్కులుగన్'

ఆం.భా.భూ. 188.

అను పద్యములో 'తీవె, మల్లె' అను ఎదంతరూపములను కేతన ప్రయోగించినాడు. ఇట్లు ప్రయోగించియు తానే ఎదంతరూపముల నెట్లు కాదనును? కాగా 'ఒప్పవు' వ్యతిరేకార్థకరూపము కేతనపాఠము కాదు, 'ఒప్పవున్' అన్నదే కవిపాఠ మని చెప్పట కిది ఆధారము.

అయితే, ఈ ఉదాహృత పద్యమునందు మాత్రము 'తీవె, మల్లె' అను ఎదంతరూపములే ఉన్న ననుటకు ఆధారము తెలియదు. ఇదిట్లుండగా 'తీవె, మల్లె' ఈ రెండును ఒకవిధమయినవి కావు. 'తీవె'యొక్క మారినరూపము 'తీవియ' కాగా 'మల్లియ' యొక్క మారినరూపము 'మల్లె'. ఈ రెండింటి పూర్వరూపములు సమానములు కావు. 'తీవె'ను తద్భవముగా సూర్యరాయాంధ్ర నిఘంటువు చెప్పచు, దీని పరిణామక్రమము నిట్లు చూపినది. 'దీర్ఘా—దీహా— దీఘా=తీఁగ.' 1 గకారము వకారముగా మారు తెలుగు సంప్రదాయము ననుసరించి 'తీవ' అయినది. ఈ 'తీఁగ'(తీవ) అన్నది 'తీఁగె' (తీవె) అని మారిన తరువాత ఎదంతములగువాటి ఇయాంతత్వముయొక్క పోలికనుబట్టి తీఁగియ (తీవియ) అని మారుట జరిగినది. ఈ విధముగా దీని మొదటి రూపము

---

1. ఈ పరిణామ క్రమమునుబట్టి 'తీఁగ' లో (అర) సున్న ఉండుటకు వీలులేదు, కాని ప్రకృతులలో నిట్టివీలులేకున్నను, వికృతులలో సున్నచేరుట పలుచోట నున్నది. ఉదా:- కేతకి=గేదంగి. చంపకము=సంపంగి మొ'॥

'తీఁగ'(తీవ)అగును గాని 'తీగియ' కాదు. అందువలన తీవె (తీఁగె)ను ప్రయోగించి నంత మాత్రమున ఇయాంతముల కెదంతరూపముల నొప్పికొన్నట్లు కాదు. ఈ విధముగా పై పద్యమున 'తీవె' అని యున్నను, అది 'మల్లె' నొప్పు కొనుటకు సహకరించదు. 1 ఇక 'మల్లె' యన్న ప్రయోగమును గూర్చి చెప్పవలసివచ్చునచో, శ్రీ వజ్ఝలవారు సూచించినట్లుగా 'మల్లెలు' అనిగాక 'మొల్లలు' అనియే చెప్పవలసియుండును. 2 ఈ రెండుపదములదగ్గరితనముచే, వ్రాయసగాండ్ర వ్రాతలలో నీ మార్పు కలుగుటలో విచిత్ర మేమియు లేదు.

ఇక 'పలికిరేని నొప్పున్' అను దానిలో 'ఏనిన్' సముచ్చయార్థక మగుటకు సమర్థనగా

'దూయుట దాగుట దొంగయు
దాయుట యని చెప్పిరేనిఁ దనరుం గృతులన్
డూయుట డాగుట డొంగయు
డాయుట యని చెప్పినను బెడంగగుఁ గృతులన్'

ఆం. భా. భూ. 179

అనుపద్యము చూపబడినది. ఈ పద్యమున రెండవపాదమందు 'చెప్పిరేనిన్' అనియు, నాల్గవపాదమున 'చెప్పినను'అని ఉండుటచే అర్థము క్లిష్ట మగుచున్నది. దూయుట, డూయుట అనుదకార డకారాది రూపములలో నేది మొదటిదో, ఏది మారినదో, ఇట్లు చెప్పుటవలన స్పష్టము గాదు. అట్లు స్పష్టమగుటకు రెండవపాదమున 'ఏని' అనిమాత్రమే ఉండవలెను. అప్పుడు దకారాదులు ప్రధానరూపము లనియు వికల్పరూపము లయిన డకారాదిరూపములను 'చెప్పినను' తప్పు గాదనియు స్పష్టముగును. కాగా ఉభయవిధరూపముల నొప్పికొన్నట్లగును. నిజమునకు అంతే. అందువలన ఈ పద్యమునగూడ 'ఏనిన్' అని గాక 'ఏని' అని ఉన్న దనుటయే సమంజసము. కావున 'మల్లెయు—' పద్యమందలి 'ఏని'ని 'ఏనిన్'గా

1. అప్పకవి 'తీగియలు తీవియలు' ఉదాహరించినా డనగా (2–112) నాటికి చాలా కాలము పూర్వమే 'తీఁగె'అన్నది 'తీగియ'గా మారినదని చెప్పవలసియుండును.

2. ఆం. భా. భూ. పీఠిక. పు. 117.

చెప్పుట కీపద్యము సహకరించదు. మరియ 'మల్లెయు—' పద్యమున 'ఏనిన్' అనిమే ఉన్నదనుకొన్నను, మల్లె మొదలగు ఎందంతములే ప్రధానరూపము లనియు మల్లియ మొదలగు ఇయాంతరూపములే వికల్పరూపము లనియు చెప్పినట్లగును. కాని నిజమునుకు ఇయాంతము ప్రధానరూపము, ఎదంతము వికల్పరూపముగదా! ఈ విధముగా విచారించినచో, అహోబలుడు, తిమ్మనలు ప్రస్తావించిన పాఠముతే కవిపాఠములని చెప్పవలసియుండును. 'తీవెల' (ఆం. భా. భూ. 188) పద్యమును ఆహోబల తిమ్మనలు చూడలే దనుటకు పీలులేదు. చూచియు పై 'మల్లెయు—' పద్యపాఠము నట్లు ప్రస్తావించి రనగా, 'ఒప్పవు' 'ఏని' అన్న ప్రాచీనపాఠమే సరియయిన దని నిశ్చయింపవచ్చును.

ఇక్కడ మరొక అంశము గమనించవలసి యున్నది. నన్నయాథర్వణుల ఆంధ్రశబ్దచింతామ ణ్యథర్వణకారికలయందు 'మల్లె' మొదలగు ఎదంతరూపముల నొప్పికొని సాధించినారు. అగుచో, కేతన వాటిని నిరాకరించు టేమి? నిజమునకు చింతామణ్యథర్వణకారికలు నన్నయాథర్వణులరచన లని ఒప్పికొన్నవారికి తప్ప, ఒప్పనివారి కీ ప్రశ్నయే లేదు. ఒప్పుకొన్నను ఇది యొక పెద్ద ప్రశ్న కానక్కరలేదు. నన్నయాథర్వణు లారూపములను సాధించినారు కనుకనే వారినా డా రూపము లున్నవని స్పష్టమగును.

'ఏదంతతాచ నావ్నా మన్యతరస్యా మియాంతానామ్' అని చింతామణి ఎదంతత్వమును వికల్పముగా చెప్పగా

'ఇయాంతా స్సాధవ శ్శబ్దాః
క్వచి దేదంతతాపి వా'

అని అథర్వణుడు ఆ వికల్పతయొక్క క్వాచిత్కతను చెప్పినాడు. దీనివలన ఇట్టి రూపములు క్వాచిత్కముగానే వారు భావించినారని స్పష్టము. ఈ క్వాచిత్కతగూడా కేతన కభ్యుపేతమయి యుండదు. అందువలన వాటిని నిరాకరించినాడు. కేతన ఈ రూపములను నిరాకరించుటయే, నా డట్టి రూపములం క్వాచిత్కముగనైనను ఉన్నవని స్పష్టమగును. మరియు, లక్షణకర్త లందరును అన్నివిషయములలో ఏకమతస్థులు కానక్కరలేదు. అభిప్రాయము భేదింపవచ్చును.

ఈభేదింపు నన్నయాథర్వణులలోనే కనిపించున్నదిగాదా! కావున నన్నయాథర్వణులం సాధించిన రూపములను కేతన సాధించకపోవుట ఒక మతభేదముగా మాత్రమే పరిగణించవలసి యుండును.

ఈ విధముగా, తిమ్మన గ్రహించిన పాఠమే సరియయిన దనియు, కేతన తరువాత ఇట్టి ఎదంతరూపప్రయోగవిస్తృతి ననుసరించి ప్రయోగదృష్టితో తిమ్మన ఈ రూపములను ప్రమాణీకరించినా డనియు స్పష్టమగును.

చనె : చనియె.

ఈ వరుసలోనే కేతన చెప్పిన మరియొక యంశమును గూడ తిమ్మన ఈవిధముగా నిరాకరించినాడు.

'చనియెం గొనియె ననుటకుం జనెం గనెం
గొనె నటంచుం జెప్పం గూడ దనుచుం
బలికె నూత్నదండి, పరికింప నవియును
గలవు కృతుల, శిశిరకరవతంస'

ఇట్లు చెప్పి, కేతన వినాకరించిన * చనెన్, కనెన్, కొనెన్, అను వాటిని ప్రమాణీకరించి కవిప్రయోగములను చూపినాడు. అయితే ఆ ప్రయోగములన్నియు కేతన కిటీవలివి. 'కనెన్' అనుదానికి తిమ్మన ఒక ప్రయోగమును నన్నయ గారి ప్రయోగముగా చూపినాడు. అది ఇది—

'వనకన్యక యంట, నేనంట
వనమున గాంధర్వమున వివాహం బట, నం
దనుం గనెనంట, మఱచితినంట
వినంగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్'

* 'వినెంగనెంగొనె ననుపగిదిన్
జను పలుకులు నుండు నడంగు సంబంధంబుల్
వినియెం గనియెం గొనియె ననంగ
ననువై వర్తిల్లుగాన, నభినవదండీ'. ఆం. భా. భూ. 182

ఈపద్యము భారతమున కన్పించదు. ఉన్నచో దుష్యంతోపాఖ్యానమున ఉండవలెను కాని అక్కడ ఈపద్యమున కవకాశము కన్పించదు. వావిళ్ళవారి ప్రతిలో నాల్గవఆశ్వాసము (ఆదిపర్వము) నూరవపద్యమువద్ద అధోజ్ఞాపికలో ఈపద్యమున చూపి, 'ఈ పద్య మాదిపర్వమున నున్న దని అప్పకవి వ్రాసినాడు. ఐనచో నిచ్చోట నుండఁబోలు' అని వ్రాయబడినది. అప్పకవీయమందును ప్రథమాశ్వాసపు 130వ పద్యమువద్ద అధోజ్ఞాపికలో 'ఈ పద్యము పినవీరభద్రుని శృంగారశాకుంతలమునందుఁ * గనఁబడును గాని ఆదిపర్వమునందుఁ గనఁబడదు' అని (వావిళ్లప్రతి) వ్రాయబడినది. శృంగారశాకుంతలమున ఈ పద్యమున కమరిక యున్నదిగాని భారతమున లేదు. అందువలన ఇది అప్పకవినాటికి భారతమున ప్రక్షేపింపబడిన దని చెప్పవలసియున్నది.

కేతనతోబాటు అప్పకవికూడా కనెన్ వంటి రూపములను నిరాకరించి, లక్షణవిరుద్ధముగాన గ్రామ్య మన్నాడు. లక్షణవిరుద్ధ మనగా ఏ లాక్షణికుడును వీటిని సాధించియుండలే దని ఆతని ఆశయము. చింతామణి కప్పకవి వ్యాఖ్య వ్రాయుచున్నాడుగదా! చింతామణి ఈ రూపములను సాధించుటలేదు కాన లక్షణవిరుద్ధమే మరి. ఇట్లు గ్రామ్య మనిమాత్ర మూరకుండక, '—కనియె నవలసిన భూతార్థక్రియాపదైక వచనంబునందు వర్ణలోపము చేసి 'కనెనట యని గ్రామ్యపదముగా వాగనుశాసనులు ప్రయోగించినారు' (1–129) అని 'వనకన్యకయఁట' అన్న పద్య ముదాహరించినాడు. నిజమున కీపద్యము నన్నయగారిది కాకున్నను, అవునని ఒప్పికొన్న అప్పకవి 'వాగనుశాసనుల ప్రయోగింపగా అది గ్రామ్య మనుటకు ఎట్లు సాహసించినాడో మరి. అప్పకవి చేసిన పలుసాహసములలో నిది యొకటి మాత్రమే ననుకొనవలెను. నిజమునకు చింతామణి సాధింపకున్నను, కేవలము వాగనుశాసనుల ప్రయోగముచేతనే అట్టిపదముల ప్రమాణీకరింపవలసియుండగా, అప్పకవి ఇట్లనుట గురువుకు పంగనామములను దిద్దుటయె. ఈ అప్పకవిని చూచియే తిమ్మన ఈ (ప్రక్షిప్త) పద్యమును ఉదాహరించినా డనవచ్చును. భారతములోని దని చెప్పబడు ఇట్టిప్రయోగము గల పద్యము ఇది తప్ప మరొకటి లేదు. అందుకనియే అందరును దీనివెంట పడినారు. మరియు నన్నయాదుల కర్వాచీనకవులు ఇట్టివాటిని విరివిగా ప్రయోగించినారు. అందువలన వీటిని ప్రయోగదృష్టితో

* శృం. శాకుంతలము. 4–114

ప్రమాణీకరించవలసి యున్నది. అప్పకవివలె త్రోసివేయ వీలులేదు. అందువలన 'అవియుగలవు' అని తిమ్మన వీటిని ప్రమాణీకరించినాడు.

అప్పకవి యొక్క ఈ సాహసమును అహోబలపండితుడు నిరసించి —'మహాకవి ప్రయోగసిద్ధేః ప్రయోగనిదానత్వకథనేన మహాకవి ప్రయోగ రూఢంచేత్ గ్రామ్యమపి ప్రయోగార్హ మి త్యాచార్య తాత్పర్య మితి బాలసరస్వ త్యోక్తం, ఇదమేవ తాత్పర్య మభివర్ణ్య అప్పకవినాపి వినెన్ కనెన్ చనెన్ ఇత్యాది శబ్దానాం గ్రామ్య త్వేఽపి మహాకవిప్రయోగ రూఢత్వా త్సాధు మిత్యుక్తమ్. తన్న. చనె విత్యాదిశబ్దానాం శాస్త్రరూఢత్వేన 'అద్యఃక్రియా' స్వితి సూత్ర ఉక్తత్వాత్. 'నందను గనెనంట మఱచితిన్' ఇత్యాది ప్రయోగా దాచార్యస్యా ప్యేతాదృశ ప్రయోగోఽభీష్ట ఏవ' అని వ్రాసినాడు. 'అద్యః క్రియాసు' సూత్రవ్యాఖ్యలో 'కను'మొదలగునవి క్రియలు గావున 'ఏదంతతా చ నామ్నా మన్యతరస్యా మియాంతానామ్'. అన్న చింతామణి సూత్రములో 'నామ్నాం' అని ఉండుటచే ఆసూత్రము 'కనెన్' రూపసాధనయం దేసందర్భమునను ఉపకరించదు కావున అథర్వణకారిక లాధారముగా సాధించినాడు. ఆ రూపసాధనరీతి ఇట్లున్నది:

'కను' అనిఉండగా 'య స్యాద్దేశ్యక్రియాంత్యేతు భూతఏకత్వ వాచకః' అనుదానిచే 'య'కారము, (కను + య), 'ఇత్ స్యాత్ భూతబహుత్వేఽపి' అనుదానిచే 'ఇ'కారము (కని + య), 'డుద్యాదివర్ణే భూతార్థే చాపి తస్యైదభవేత్సదా' అనుదానిచే 'ఎ' కారము విధింపబడగా కనియె(న్) అని రూప మేర్పడును. అనగా, కనియ+ఎన్—కనియెన్ అని ఏర్పడిన దన్నమాట. కాగా ఇందులో 'ఇయ' (కనియ) ఉన్నది. ఇప్పుడు 'ఇయాంతా స్సాధవ శ్శబ్దాః క్వచి దేదంతతాడి వా' అన్నకారికతో—ఇందులో చింతామణి సూత్రమం దున్నట్లు 'నామ్నాం' అని కాక 'శబ్దాః' అని ఉండుటవలన —ఇయకు 'ఎ'త్వము చెప్పబడినది. అయితే ఇక్కడ 'ఇయ' చివర కాక, మధ్య నున్నది. అయినను కారికయందలి 'క్వచిత్ శబ్దబలముతో మధ్యమందలి 'ఇయ'కును 'ఎ'త్వము వచ్చినదనవలెను. ఈ విధముగా కనియ+ఎన్=కనె+ఎన్ అని ఏర్పడినది. ఈ స్థితిలో 'అచోఽచి క్వచి ల్లోపో బహుళం స్యా త్ప్రయోగతః' అని ఎకారలోపము రాగా 'కనెన్' అనురూపము సిద్ధించినది. (ముద్రితప్రతియందు 'అచోచి—'ఇతి ఇకార

లోపః' అని ఉన్నది. కాని 'ఏకారలోపః' అని ఉండవలయును. 'ఇట్లు సవరింపనిచో నచటి గ్రంథము సమన్వితమె కానేరదు' అని ఈలోపమును తెలిపినది శ్రీవజ్ఝలవారు. (ఆం. వ్యా. సం. ప. 2సం. పు. 1506) 'కనెన్' వంటివాటి సాధన కహోబలుడు, అథర్వణు నాధారించుకొని, నాటిని 'నియమవంతము'లుగా చేసి గ్రామ్యతాదోషమును పరిహరించినాడు'. 1 ఈ అహోబలు ననుసరించియే కేతనాప్పకవులను కాదని కనెన్ మొదలగు నాటిని తిమ్మన ప్రమాణీకరించినాడు.

1 అహోబలుడు 'చనియెన్, కనియెన్' మొదలగు రూపాలను ఉచ్చారణకనుగుణంగా వ్యవహారవశాన కలిగిన అలవాటునుబట్టి, ఇతరకవిపండితులవలెనే 'చనియన్ కనియన్' మొదలయిన రూపాలుగా వ్రాసుకొని, అవి ఇయాంతాలుగా కబడుతున్నవి కాబట్టి, అవి వాస్తవానికి 'ఇయె' అంతమందు గల క్రియ లనేవిషయం మరిచిపోయి 'ఏదంతతాచ—' ఇత్యా దిసూత్రం ఇక్కడ ఎందుకు ప్రవర్తించదా అని శంకతీసుకొని అసూత్రం నామాలకు మాత్రమే వర్తిస్తుంది కాబట్టి, ఇవి నామాలు కాక క్రియలవడం చేత వీటికి వర్తించ దని చెప్పినాడు. ఈసందర్భంలోనే అహోబలుడు అథర్వణకారి కల ననుసరించి కనెన్,వినెన్ అనేరూపాలను సాధిస్తూ, 'ఇయాంతాస్సాధవశ్శబ్దాః క్వచిదేదంతతాపివా' ఇతి వా ఎత్వం' (అహో. 135పు.) అని వ్రాసినాడు. ఈ అథర్వణకారిక 'కన్నియ' మున్నగు శబ్దాలకే వర్తిస్తుంది కాని, కనియె ఇత్యాదులకు వర్తించనేరదు. అహోబలుడు ఇయాంతాలకు వర్తించే ఈకారికను కనియె ఇత్యాదులకు వర్తింపచేయటానికి కారణం ఆరూపాలను 'కనియన్' అని 'య' కారం గల రూపాలుగా వ్రాసుకొనటమే' (చూ. ధ్వని—లిపి-పరిణామం'పు. 29-30) అన్నారు శ్రీ వడ్లమూడివారు.

కాని అహోబలుడు 'కనెన్' మొదలగువాటిని సాధించినరీతి చూచినచో ఈవిధముగా అనిపించదు. 'కనియన్' అని 'య'కారము గల రూపముగా వ్రాసికొన్నచో దాని దృష్ట్యా 'కనెన్' సాధింపవలసివచ్చినచో 'ఇయాంతాస్సాధవశ్శబ్దాః' అన్న ఒక్కకారిక చాలును. కాని అహోబలుడు 'కనియెన్,కనెన్' రెంటిని అథర్వణకారికలద్వారా సాధించినాడు. స్థూలముగా ఈకారిక చింతామణి సూత్రమువలె ఇయాంతములకు చెందినదే అయినను, చింతామణి సూత్రమందలి 'చ'కారబలముచేత నామముల మధ్యగూడ 'ఎత్వము' సాధింప బడినట్లే కారిక లోని క్వచిత్పదబలముతో శబ్దమధ్యమందలి 'ఇయ' కును ఎత్వము సాధింపబడినదని

తాయెద ఉయ్యేల పయ్యెద.

'కనియెన్'వంటి రూపముతోబాటు 'కనెన్'వంటి రూపములను ప్రమాణీకరించిన దృష్టితోడనే ఉయ్యేల—ఉయ్యాల వంటి రూపములను ప్రమాణీకరించుటయందును తిమ్మన ముద్దరాజు రామన మతమును వికల్పించినాడు. ఈసందర్భమున—

'తాయెదయు నుయ్యేలయు పయ్యెదయు ననంగ
కలుగ దత్వంబు మధ్యయకారమునకు
ననుచు మును ముద్దరాజు రామన వచించె
గాని యత్వంబు గృతులందుఁ గలదు శర్వ'

అని తిమ్మన చెప్పినట్లు గ్రంథమున పద్యమున్నది. ఈ పద్యమునుబట్టి 'తాయెద యొదలగు పదములలోని యకారము ఎత్వసహితమే (యె) కాని అత్వసహితము (య)గాదని రామన చెప్పినట్లును, అత్వసహిత యకారముల రూపములుగూడ ఉన్నవని తిమ్మన చెప్పినట్లును స్పష్ట మగుచున్నది.

---

Cont:-

చెప్పవలసియుండును. కారికలో'క్వచిత్','వా'అని రెండున్నవి. 'వా'వికల్పతను చెప్పగా, క్వచిత్ శబ్దమధ్యమునుగూడ సూచించు నని అహోబలునిఆశయము. సూత్రమునకును, కారికకును 'నామ' శబ్ద' అనిఉండుటకన్న నిజమునకు భేదమేమియును లేదు. కాగా అక్కడ 'చ'కారము చేసినపని ఇక్కడ 'క్వచిత్' చేయును. 'చనియెన్' అని కారికలద్వారా సాధించుటలో శబ్దమధ్యమందు (చనియ + ఎన్) ఇయ ఉండనేఁన్నది, అందుకనియే, అహోబలుడు ఈ కారిక నిక్కడ ప్రవర్తింపచేసినాఁడని భావించవలసి ఉండును. అహోబలుడు 'చనియన్' 'కనియన్' అని 'య' కారముతో ఆరూపములను 'అలవాటునుబట్టి' వ్రాసికొన్నచో వ్రాసికొని యుండవచ్చును, లేకపోవచ్చును. కాని 'కనెన్' రూపసాధనలో మాత్రము అవిభక్తమైన ప్రాతఃలిపై అధారపడి ఉండలేదనిమాత్రము చెప్పవలసియున్నది.

ఈ సందర్భమునందే అప్పకవికూడ ముద్దరాజు రామనను ఉదాహరించి అతని మతమును నిరాకరించినాడు. అయితే అతడు నిరాకరించినదానికి, తిమ్మన నిరాకరించినదానికి పోలికయే లేదు. విషయము తల్లక్రిందు లయినది. రామనదిగా అప్పకవి ఉదాహరించిన పద్య మిట్లున్నది—

'తాయెతయు నుయ్యేలయుఁ బయ్యెదయును దక్క
గలుగ దెత్వంబు మధ్యయకారమునకుఁ
దుదను గ్రియఁదక్క నెత్వంబు గదియ, దాది
నత్వ ముండదు తెనుఁగున, నబ్జనాభ!'

ఈ పద్యమును విమర్శించుచు అప్పకవి

'ధరణి నుయ్యేల పయ్యెద తాయెతులను
గల యకారములకు వక్రములు, నిజంబ.
ముద్దరాజు రామన వాని మూఁటినీఁ బద
మధ్యయా లని చెప్పె, నమ్మాట మిథ్య!'

అప్పక. 2-184.

అని వ్రాసినాడు. అప్పకవి రామనదిగా ఉదాహరించిన పద్య మట్లుండగా ఆతడు విమర్శించిన రీతినిబట్టి, రామన తనపద్యములో 'తాయత' మొదలగు పదములన 'అత్వ'సహిత యకారములు కలవాటినిగా చెప్పినట్లు స్పష్టమగును. అందుకనియే అప్పకవి 'వక్రములు, నిజంబ' అని నొక్కిచెప్పి, అత్వయుత యకారము గల రూపాలను నిరసించి, ఎత్వసహిత యకారము గల రూపములను ప్రమాణీకరించుటకు వీలయినది. ఈ అప్పకవి చెప్పినదానికి తిమ్మన చెప్పినది భిన్నముగా ఉన్నది. అత్వసహిత యకారము గల రూపములను రామన చెప్పినా డని అప్పకవి చెప్పగా, ఎత్వసహిత యకారము గల రూపములను రామన చెప్పినా డని తిమ్మన చెప్పుచున్నాడు. ఈ ఇద్దరి మధ్య రామన నలిగిపోయినాడు. అస లత డేరూపముల నౌనన్నాడో వీరిద్దరిమధ్య తెలియకుండ పోయినది. అప్పకవి తిమ్మనకు పూర్వుడు

అత్వసహిత యకారము గల రూపములు లేవన్న అప్పకవినిగూడ రామనతోబాటు కాదనవలసియుండగా, తిమ్మన అప్పకవిని ప్రస్తావించనే లేదు. అందువలన అసలు, రామనపాఠ మేమో మొదట గుర్తించినచో ఈ చిక్కు విడిపోవును.

ఈ సందర్భమున శ్రీ వడ్లమూడివారు '—ఒకవిధంగా ఆలోచిస్తుంటే అప్పకవికి

తే.గీ. తాయతయు నయ్యలయు పయ్యదయుఁ దక్కఁ
గలుగ దత్వంబు మధ్య యకారమునకుఁ
దుదలఁ గ్రియఁ దక్క నెత్వంబు గదియ, దాది
నత్వ ముండదు తెనుఁగున నబ్జనాభ'

అనే పద్యం లభించిందేమో?' అన్నారు.1* అప్పకవి విమర్శించిన రీతినిబట్టి రామనపద్యము, ఈనాటి ముద్రితాప్పకవీయమునం దున్నట్లు కాక, శ్రీ వడ్లమూడివారు సూచించినట్లే ఉండవలసి యుండును. లేనిచో ముద్రితప్రతుల పాఠమును బట్టి అప్పకవి విమర్శకు తావే ఉండదు. రామనపాఠమును అప్పకవిని బట్టే నిరూపించుకొనవలసి యుండును గాని తిమ్మననుబట్టి కాదు.

అయితే, అప్పకవి దృష్ట్యా నిర్ధారించిన పాఠము సరియైనదగుచో, తిమ్మన చెప్పినది సమన్వితము కాదు. అత్వసహితయకారము గల రూపములను రామన చెప్పలేదనియే గదా, తిమ్మన అట్టి రూపములను ప్రమాణీకరించినాడు. కావున అప్పకవికి తిమ్మనకు దొరికిన రామనపద్యములు భిన్నముగా నున్నవనవలసి వచ్చును. కాని, అప్పకవీయమును బాగుగ పరిశీలించిన తిమ్మన తనకు లభించిన రామనపద్యమునకును, అప్పకవీయమందలి పద్యమున కున్న భేదమును గుర్తించకపోడు. భేద మున్నచో నిట్లు చెప్పడు. అత్వసహితములతోబాటు ఎత్వసహితములును ఉన్నవని చెప్పి యుండువాడు. కాని అట్లు కాకుండుటచే అప్పకవీయగత పద్యమే తిమ్మనకును లభించిన దని చెప్పవలసియుండును. కాగా తిమ్మన పద్యమే కొన్నిమార్పులకు లోనయి యీనాటి ఉపలబ్ధరూపమును పొందియుండును. నిజమున కప్పకవి ననుసరించి తిమ్మనపద్య మిట్లుండవలెను—.

1.* 'ధ్వని—లిపి—పరిణామం' పు. 33

‘తిమ్మని’...పద్యమున...‘తమ్మొనసే’

ద్రుతసంధి విషయముతో తిమ్మన ఆసక్తి కరమయిన ఒక అంశమును చెప్పినాడు. ఆయన ఈసంధిని రెండు పద్యములలో చెప్పినాడు. మొదటిదానితో ‘నాంతపదముల’ (ద్రుతప్రకృతికముల) పై నున్న కచటతపలు (పరుషములు) గజడదబలు (సరళములుగా) మారును. వాటికి (ఆగజడదబలకు) ‘పిఱింది నాల్’ (ద్రుతములు) సున్న లగును. దీనివలన ‘నిన్నుఁ బిలిచె’ వంటి రూపములు సిద్ధించును. దీనితో ద్రుతమునకు పరుషములు పరమగునప్పుడు జరుగు క్రియ పూర్తియయినది. దీనితరువాత రెండవపద్య మి ట్లున్నది—

‘తెల్లమిగ గజడదబ మ లు
పొల్లు నకారంబుతోడఁ బొదలిన యెడలం
బొల్లులె నిల్చు, నొకొకచోఁ
జెల్లును నెఱసున్న లగుచు, శ్రీగౌరీశా’

గ—జ—డ—ద—బ—లు (ఇవిసహజసరళములు) పరమయినప్పుడు పొల్లు నకార ము ల్లే యుండును. ‘ఒకచో’ ఆ పొల్లునకారము నిండుసున్నగా కూడ మారును. ఇక్కడ గమనించవలసిన అంశము సరళములతో స్థిరమయినమకారమును కలిపి చెప్పుట. నిజమునకు స్థిరవర్ణములు (పరుషసరళేతరహల్లులు) పరమయినప్పుడు పొల్లులకారస్థితి ఏమిటో గూడ చెప్పవలసియుండగా అదిజరుగలేదు. సరిగదా, స్థిరము లెన్నో ఉండగా, ఒక్క ‘మ’కారమునుమాత్రము గ్రహించి సహజసరళములు పరమైనప్పు డెట్లో, మకారము పరమైనప్పు డట్లే ద్రుతముండుట మారుట చెప్పబడినది. మకారేతరస్థిరముల ప్రస్తావన లేదు. మరియు స్థిరములు పరము కాగా ద్రుతలోపముగూడ జరుగును. ఆవిషయ ప్రస్తావనయు లేదు. ఈసందర్భమున చింతామణి ఇట్లు చెప్పుచున్నది.

అయితే, నన్నయగారు 'కమ్మని...' పద్యమునందు 'లతాంతములకున్ + మొనసి' అన్నప్పు డాసంధిరూపము నెట్లుప్రయోగించియుందు రన్నదియు ఒక వివాదాంశము.

'లుగ్వా...'ఇత్యాది చింతామణి సూత్రములనుబట్టి '—కుమొనసి', 'కున్మొనసి' 'కుంమొనసి' అని మూడువిధము అయిన రూపము లేర్పడును. పద్యలక్షణమునుబట్టి 'కు' గురువు కావలసి ఉన్నందున '—కుమొనసి' అను ద్రుతలోప రూపము ప్రయోగించు ప్రసక్తియే లేదు. ఇక, మిగిలిన రెండింటిలో ఏరూపమును ప్రయోగించినను అ (లయగ్రాహి) పద్యములో చెల్లించవలసిన ప్రాసయతి నియమము చెడిపోవును. పాదాదియందు 'కమ్మని' అని ప్రాసాక్షరముగా ద్విత్వమకార మున్నది. అందువలన '—కున్మొనసి' అని సంశ్లేషరూపమునుగాని '—కుంమొనసి' అని బిందుపూర్వ రూపమునుగాని ప్రయోగించినను ప్రాసనియమము చెడును. '—కుమ్మొనసి' అని ద్విత్వమకారరూప మున్ననే కుదురును. కాని ఈ ద్విత్వమకారరూపమును చింతామణి సాధింపదు. కాగా, '—కుంమొనసి అనురూపమే (బిందుపూర్వకము) ప్రయోగింపబడిన దనవలెను.1 మరి ప్రాసనియమము చెడునుగదా! ఈ క్లిష్టస్థితికి అప్పకవి 'అనునాసికప్రాస' భేదము నొకదానిని కల్పించి పరిష్కారము చూపినాడు. బిందుపూర్వక, ద్విత్వ నమలు తవ ప్రాస చెల్లుట 'అనునాసికప్రాసము.'2 'కమ్మని' లోని ద్విత్వ మకారమునకు

---

1. '—కుంమొనసి' తోబాటు '—కున్మొనసి' అని ప్రయోగింపబడవచ్చు, ననుటకును వీలున్నది. కాని తా. ప. ప్రతులలో బిందుపూర్వకమకారమే ఉండుటచే, ఆరూపమే ప్రయుక్తముగా భావింపబడుచున్నది. మరియు బిందుపూర్వక, ద్విత్వమకారముల ఉచ్చారణలో ధ్వనిసామ్య మధికము. నకార మకారములకు ముందున్న —ఉన్నచో—పూర్వబిందువు నకార మకారములవలెనే ధ్వనించును. ఈకారణమును పురస్కరించుకొనియే అప్పకవి బిందుపూర్వక ద్విత్వ నమలకు (ంన —న్న, ంమ, మ్మ) ప్రాస నొప్పికొని యుండును. కాగా '...కుంమొనసి' యేప్రయుక్త మని చెప్పబడుచున్నది. '—కున్మొనసి' అని ఉన్నదన్నచో అప్పకవి ప్రాసభేదమున కాస్కారము లేదు.

2. తనకుఁ దామును ద్విత్వంబులై తనరు నవియుఁ
బూర్వబిందులు పదాల బొనరు నవియుఁ
గలసి యనునాసికప్రాసము లనుపేర
న మ లవరు కావ్యములయందుఁ దమకుఁ దాము'

—అప్పక. 3–340.

'—కుంమొనసి'లోని బిందుపూర్వకమకారము ప్రాసచెల్లును. ఈ చెల్లుటను ప్రమాణీకరించుటయే ఈ ప్రాసభేద ప్రయోజనముగా చెప్పబడుచున్నది. అయితే, అప్పకవి మకారముతోబాటు నకారమునుగూడ చేర్చినాడు. మకారమునకు నన్నయగారి ఈ ప్రయోగము, దీని ననుసరించి మరొకటి రెండు ప్రయోగములై నున్నవి గాని లకారమున కామాత్రమును లేదు. కాని, సంస్కృతవ్యాకరణరీత్యా ఏర్పడు 'ధాతంనాభి, ధాతన్నాభి' వంటి రెండు రూపములలో ప్రయోక్త ఒకవేళ పూర్వబిందు రూపమును ప్రయోగింప దలచినచో, దానికి తెలుగులో బిందుపూర్వక నకార ముండదు. కాబట్టి, ద్విత్వ నకారరూపములను 'మిన్నేరు' వంటివాటిని ప్రాసకు చెల్లించవచ్చు నని అప్పకవి అభిప్రాయము. అంతేగాని, 'మింనేరు' అని బిందుపూర్వక నకారముతో వ్రాసి 'ధాతన్నాభి' అన్న దిత్వనకారరూపముతో ప్రాస చెల్లింపవలె ననికాదు. 'ధాతంనాభి' వంటి బిందు పూర్వక నకారరూపము లుండుటకు వీలున్నదిగాన అప్పకవి నకారమునుగూడ మకారముతో చేర్చినాడు. అయినను, బిందు పూర్వక నకారరూపములకు కవిప్రయోగములు లేకపోవుటచే, కేవలము మకారమునకుముందే నన్నయగారిప్రయోగము, దానివంటి ఒకటిరెండు కన్పించుటచే. తిమ్మన మకారమునుమాత్రమే గ్రహించి నకారమును విడిచినాడు.

అయితే, నిజమునకు విచారించినచో, నన్నయగారి భారతమున పూర బిందుపూర్వక స్థిరవర్ణ ప్రయోగ మెచ్చటను కన్పించదు. కేవలము ఈ లతాంతములకుంమొనసి' మరియు 'అమ్మునీశు—' (ఆరణ్య. 3–113) అను పద్యమున 'చే, సెంమహా—'అనుచోట్ల మాత్రమే బిందు పూర్వకమకార మున్నట్లు చెప్పబడుచున్నది. మరి, మరెక్కడను లేని ప్రయోగము ఇక్కడమాత్ర ముండి ఉండునా అన్నదియు విచారించవలసియే ఉన్నది.

ఈ సందర్భమున నొక ప్రతిపాదన మున్నది. పూర్వకాలమున 'కమ్మని, ఫలమ్ము, నెమ్మి' వంటి ద్విత్వమకారముగల పదములను ద్విత్వమకారముతోగాక, పూర్ణ బిందుపూర్వక మకారములతో,అనగా—'కంమని, ఫలంము, నెంమి' ఇత్యాదిగా— వ్రాయుచుండెడివారు. అది ఆనాటి లేఖన సంప్రదాయ మని ఆ ప్రతిపాదన దాని ననుసరించి —'వాస్తవానికి నన్నయ 'కమ్మని' అని వ్రాయడానికి బదులు

'కంమని' అని వ్రాసుకొని, 'లతాంతములకున్ మొనసి' అన్నప్పు డున్న ప్రయతావికి స్థిరమైన మకారం పరమవుతుంటే పూర్ణబిందువు చేసి, 'లతాంతములకుంమొనసి' అనే పూర్ణానుస్వార రూపాన్ని తయారు చేసుకొని 'కంమని' లోని బిందు పూర్వక మకారానికి 'లతాంతములకుంమొనసి' లోని బిందుపూర్వకమకారానికి ప్రాసయతి సరిపెట్టుకున్నాడు.' అదేవిధంగా, ఆ పాదంలో 'మధుపమ్ముల, ననదమ్ముల' అని వ్రాయడానికి 'మధుపంముల, ననదంముల' అని వ్రాసుకొని ఆ పాదంతో ఉన్న మిగిలిన ప్రాసయతుల్ని సరిపెట్టుకున్నాడు. మొదటిపాదంలో 'కంమని' అని 'ంమ' అనేదాన్ని (బిందుపూర్వక మకారాన్ని) ప్రాసగా పెట్టుకున్నాడు కాబట్టి తక్కిన మూడు పాదాల్లోనూ 'చూతమ్ముల, వాచాలమ్ముల, భారమ్ముల' అని వ్రాసుకొనడానికిమారు, 'చూతంముల, వాచాలంముల, భారంముల' అని బిందుపూర్వక మకారములుగా వ్రాసుకొని ప్రాస సరిపెట్టుకున్నాడనే చెప్పాలి. దీన్నిబట్టి తక్కిన మూడుపాదాల్లో ఉన్న ఆ యా యతి స్థానాల్లోకూడా బిందు పూర్వకమైన మకారాన్ని వ్యవహరించే ప్రాసయతిని సరిపెట్టుకున్నా డని చెప్పక తప్పదు'. 1 అన్నారు శ్రీ వడ్లమూడివారు.

ఇదంతయు ప్రధానముగా పూర్వకాలపు వ్రాతపద్ధతిపై ఆధారపడియున్నది. ఈ వ్రాతపద్ధతి నన్నయగారి నాడు కూడా ఉండియుండునా అన్నది ఆలోచింపవలసిన అంశము. లభ్యమగుచున్న తాళపత్ర ప్రతులు చాలా అర్వాచీనములయినవి. ఏతా. ప. ప్రతివయస్సు ఎంతబాగా లెక్కించినను మూడు నాల్గు వందలేండ్లకు మించదు. కావున వీటినిబట్టి నన్నయగారినాటి వ్రాతసంప్రదాయము నూహించ, నిర్ధారించ బూనుట గాలిలో ఈదుటయే అయితే ప్రాచీనకాలపు శాసనము లీనాడును లభించుచు న్నవి. నన్నయగారినాటి శిలాశాసములను పరిశీలించినచో వ్రాతసంప్రదాయము నాటిది తెలియవచ్చును. నన్నయగారినాటి, నాటికి కొంత అటు ఇటు శాసనములందు బిందుపూర్వక మకారము కన్పించదు. ఉదాహరణకు, ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి 'శాసనపద్యమంజరి' ప్రథమభాగము (1930 ప్రచురణ)నుండి కొన్ని ఈ క్రింద చూపబడుచున్నవి.

1. 'ధ్వని—లిపి—పరిణామం' పు. 170–171

| | | శాసనోకాలము. | పు. |
|---|---|---|---|
| 1. దమ్మపురంబున దమ్మవులు—' | శక | 770 | 1 |
| 2. కొమ్మాసాని | ,, | 1030 | 8 |
| 3. ఆతమ్మ——తమ్మభీమణ్ణు— | ,, | 1054 | 16 |
| 4. కమ్మమెలు | ,, | 1064 | 24 |
| 5. కుమ్మ | ,, | 1068 | 29 |
| 6. అతని తమ్మణ్ణన్వయ | శక. | 1072 | 11 |
| 7. కమ్మనాంటి లోని | ,, | 1073 | 43 |
| 8. బ్రమ్మ దేవండు ——బ్రమ్మన | ,, | 1080 | 40 |
| 9. ఫలమ్మ | ,, | 1146 | 72 |
| 10. నెమ్మిం బ్రదీపము | ,, | 1131 | 71 |

డాదాపు మూడు వందలసంవత్సరములలో వ్రాయబడిన వేరు వేరు శాసనములనుండి ఉదాహరణములు పైన చూపబడినవి. వీటిలో మాముడితోనేతప్ప, పూర్ణబిందు పూర్వక మకార మెక్కడను లేదు. 1 పూర్ణబిందు పూర్వకముగా మకారమును (నకారమునుగూడ) వ్రాయుపద్ధతి నన్నయగారి నాటికి చాలా ఇటీవలిది. ఈ

1. మకారము మాత్రమేకాదు, బిందుపూర్వక నకారముగూడ కన్పించదు. శాసనమంజరిలోనే చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1. భూపాలుణ్ణన్నరపతి | శక | 1076 | పు. 47 |
| 2. శుభటకంటీరున్నుదారుం | ,, | 1087 | 63 |
| 3. సన్నుతుం డిలను | ,, | 1090 | 64 |
| 4. సోమన వెన్ననలు | ,, | 1122 | 68 |
| 5. బిరుదు నంజన్న—చెన్నగు | ,, | 1140 | 75 |

6. ప్రభోన్నాభీ పంకరుహాత్ (రాజరాజనరేంద్రునిశాసనము) చూ. విజ్ఞాన సర్వస్వము. సం. 4. 'లిపిపరిణామము') ఈవిధముగా చాలా కలవు.

అర్వాచీనమయిన వ్రాతపద్ధతిని నన్నయగారి కంటగట్టుటలో ఔచిత్యము కన్పించదు. 'కమ్మనాంటి'లో ద్విత్వ మకార ముండగా, 'కమ్మని'లో బిందుపూర్వక మకార ముండునన వీలులేదు గదా! ఇట్లే ప్రథమావిభక్తి ముకారము(ఫలమ్ము) కూడ ద్విత్వమకారముతోనే యున్నది. అందువలన 'కంమని, మధువంము' అని బిందుపూర్వక మకారమును వ్రాసికొని నన్నయగారు ప్రాసయతిని సరిపెట్టుకొన్నా రనుట కాస్కారము కనబడదు. 'కమ్మని' మామూడితోనే వ్రాసికొని, 'మధువమ్ము' గూడా అట్లే వ్రాసికొని నన్నయగారు ప్రాసయతిని చెల్లించినా రని చెప్పక తప్పదు.

ఈ వ్రాతవిషయ మిట్లు స్పష్టము కాగా, ప్రథమా 'ము'కారమును బిందుపూర్వకముగా ఏ వ్యాకరణముగూడ సాధించుటలేదు. 'కమ్మని' పద్యములోని పదునారు యతిప్రాసస్థానములలో 'కమ్మని, కుమ్మెనసి' అనువాటి నట్లుంచగా, మిగిలిన పదునాల్గు స్థానములయందును ప్రథమా'ము'కార మున్నది. ఈ 'ము'కారవిధి సందర్భముగా చింతామణి ఇట్లు చెప్పుచున్నది.

1. స్యా దమహతాం సోశ్చ ము.
2. తదుపరి పున ర్మబూ ప్రాచామ్.

మొదటి సూత్రమువల్ల 'ఫలము' వంటి రూపములు సిద్ధించును. కాగా రెండవ సూత్రము మొదటిది విధించిన ముకారముపై పర్యాయక్రమముగా మరల 'ము—బు' లను విధించుచున్నది. దీనివల్ల ఫలము + ము, ఫలము + బు అని ఉండును. ఈస్థితిలో అహోబలుడు 'భౌపరే మస్య చందు స్స్యాత్, మౌ పరే మేళనం భవేత్' 1 అను అథర్వణ కారికద్వారా ఫలమ్ము, ఫలంబు అనురూపముల సాధించినాడు. 2

బాలసరస్వతి ఈసందర్భమున మరొకపద్ధతి ననుసరించినాడు. ఫలము + ము, ఫలము + బు అనిఉండగా 'ఉపఽదేజనునాసికఇత్' అను పాణిని సూత్రముతో

1. మేళన, బిందువిధాన సామర్థ్యమువలననే మొదటి ముకారములోని ఉకారము లోపించిన దని చెప్పకొనవలెను.

2. అహోబలపండితీయము. అజంతపరి. 36 సూ.వ్యాఖ్య.

మొదటి ముకారమందలి ఉకారమునకు లోపము చెప్పినాడు. దీనితో ఫలమ్ + ము, ఫలమ్ + బు అని ఏర్పడును. ఈ రెంటిలో మొదటిది సహజముగనే మేళనము పొంది ఫలమ్ము అని అగును, కాని 'మొదలి మకారమునకు సున్నయు వికల్పముగా నగును' అన్నాడు. ఈ వాక్యమువల్ల ఫలమ్ము ఫలంము అని ద్విత్వ, బిందుపూర్వక మకారరూపములు రెండు నేర్పడుచున్నవి. ఇక 'బు'పరమైనస్థితిలో 'మోఽనుస్వారః' అను పాణినీయ పూర్ణబిందువు చెప్పి 'ఫలంబు' సాధించినాడు. ఫలంబు సాధనలోని ప్రామాణ్యము 'ఫలంము'(బిందుపూర్వక మకారము) సాధనలో లేదు. అక్కడ కేవలము బాలసరస్వతి వ్రాసిన 'మొదలి.. ...'అన్న వాక్యమే ప్రమాణము. దీనినిబట్టి, ప్రమాణరహితముగ 'ఫలంము' సాధించుటచే, ఆతని నాటికి ఆవిధమైన వ్రాతపద్ధతి అమలులోనికి వచ్చిన దని మాత్రమే తెలియును. ద్విత్వ, బిందు పూర్వక ముకారరూపములు రెండును బాలసరస్వతికి ఒప్పిదములు.

మరి, ప్రాచీను డయిన కేతన ఈసందర్భములో—
'ఇల ముకారమునకు ద్విత్వమేని బిందు
పూర్వక ముకారమేనియుఁ బొసగియుండు
ఖగ మన, ఖగ మ్మనంగ, ఖగం బనంగ
ఝష మన, ఝష మ్మనంగ, ఝషం బనంగ' 1 ఆం.భా.భూ.37

---

1. ఈపద్యమునకు రెండు పాఠాంతరములు కన్పించుచున్నవి.

(1). డుములు తలమోచి పదముల
నలరుం దత్పూర్వవర్ణ మందున నుత్వం
బిలలో నా యుత్వముపై
దెలియఁగ సరబిందు వొందుఁ దెలుఁగులయందున్'

(2). ఒకపరి ముట్టిన నడచియు
ప్రకటంబుగ బుట్టివచ్చుఁ బైకొని పిఱుఁదన్
సుకరపుబిందువు వచ్చును
సకలం బన, సకల మనఁగ, సకల మ్మనఁగన్'

అని ద్విత్వ మకారమునే విధించినాడు.[1] దీనిని బట్టి ఫలమ్ము, ఫలంబు అను రూపములు మాత్రమే కేతనాభిప్రేతములు. నన్నయాథర్వణులకుగూడ ఇవే అభిమతము లని ముందే స్పష్టమయినది. మరియు నాటిశాసనములద్వారా ఈ రూపములే నిశ్చితము లగుచున్నవి. కాగా 'కమ్మని..'పద్యమునందు ...కున్నమొనసి అన్నదొకటి అట్లుండగా, మిగిలిన అన్నిస్థలములందలి ముకారము ద్విత్వసహితమే తప్ప బిందుపూర్వకముకా దని చెప్పక తప్పదు.

ఇక, ఇట్లిన్నిచోట్ల ద్విత్వమకార ముండగా '....కున్ మొనసి'గూడ ద్విత్వమకారముతోనే ఉండుట సహజము. మరి '....కుమ్మొనసి' రూపసాధన ఎట్లు? కొంద రిట్లు చెప్పుదురు. 'బిందుం ప్రవదంతి.... 'అను చింతామణి సూత్రముద్వారా '...కుంమొనసి' కాగా, 'కేచి ద్వదంత్యభేదత్వ, మను స్వార మకారయోః' అను అథర్వణకారికచే అభేదము చెప్పగా, ....'కుమ్+మొనసి ...కుమ్మొనసి' అనురూప మేర్పడును.[2] అయితే కేవల మభేదమును చెప్పినంత మాత్రమున బిందువు మకారముగా మారదనియు, కేవలము 'మ్మ...ంమ'లకు ప్రాసను సాధించు టేగాని '...కుమ్మొనసి' లో ద్విత్వము సాధించుట కిది చాల దనియు అనవచ్చును.[3] కాని అభేదము చెప్పుటలో, ఆ స్థలములో అభేదము చెప్పబడిన మొదటిదానిలో ప్రాసతప్పుట అట్లుండగా, ముకారమునకు ముం దర్ధబిందువు విధింపబడుటచే నిది ప్రక్షిప్త మనియే చెప్పవలెను. ఇక ము(ము) నొకప్పుడడచి బు(బు) వచ్చునని, అప్పుడే 'సుకరపు బిందువు' దానికి పిఱుఁద వచ్చునని రెండవ పద్యము చెప్పుచున్నది. కాని లక్ష్య మిందుకు భిన్నము. అందువలన ఇదియు సరియగు పాఠము గాదు.

1. విన్నకోటపెద్దన ముకారమునే విధించినాడు (కా.చూ.9–25) కాని ద్విత్వముకార, బిందుపూర్వక బుకారములను ప్రస్తావించలేదు. ఉదాహరణలలో 'మ్ము'ఉన్నది. అది'ంబు' కూడా కావచ్చు. 'ంము' అగు ననుట కాధారము మాత్రము లేదు.

2. అహోబల.సంధి 19సూత్రవ్యాఖ్య.

3. 'ధ్వని–లిపి–పరిణామం'పు.173.

రెండింటిలో (ం,మ)ఏదియయినను ఉండవచ్చుననియు ఉద్దేశ్యము.1 'ళడయో రభేదః' అనుటచే 'అగ్నిమీళ, అగ్నిమీడే' అని, 'లడయో రభేదః' అనుటచే 'జలనిధి, జడనిధి' అనియు, రెండువిధములరూపములు సాధ్యములగుచున్నవి. అట్లే ఇక్కడగూడ '...కుమ్మొనసి, కుంమొనసి' అనురెండును అనుస్వారమకారముల కభేదము చెప్పుటవలన సిద్ధించుటలో విప్రతిపత్తియుండ నక్కరలేదు. ఉ

అయితే చింతామణి '...కుంమొనసి'నే సాధించుచున్నట్లుండుటచేతను, అధర్వణకారికలద్వారా సాధించుటలో కొంతక్లిష్టత భాసించుటవలనను, అప్పకవి అనునాసికప్రాసము చెప్పుటవలనను, తిమ్మన చింతామణిని, అప్పకవిని అనుసరించి మకారమునకు ముందు ద్రుతమునకు పూర్ణబిందువును ప్రమాణీకరించినాడు

1. 'కుమ్మొనసి' అనేదే అసలు పాఠంగా ఎంచితే, పూర్వం అచ్చు పరమవుతుంటే అనుస్వారానికి మకారాదేశం చెప్పినట్లే మకారం పరమవుతున్నా అనుస్వారానికి మకారం వస్తుందని చెప్పనే చెప్పేవాడు. 'లతాంతములకుంమొనసి' అనేదే అసలు పాఠంగా గ్రహించాడు గాబట్టి అనుస్వార మకారాల కభిన్నత్వం చెప్పకుని (ప్రాసయతిని) సరిపుచ్చుకున్నాడు.' (ధ్వని–లిపి–పరిణామం.పు.173. అధోజ్ఞాపిక.) కాని ఇట్లనుట సరిగా అనిపించదు. ప్రాసను సరిపుచ్చుటకే చెప్పినచో అప్పకవి అనునాసికప్రాసలోవలె స్పష్టముగానే చెప్పెడివాడు. యతిప్రాసలలో నాయా వరముల స్థితిని గూర్చి ఇతరత్ర ....'కశ్చి ద్వదతి సాంగత్యం యతా వేవానయో స్తథా. అనదచ్చాత్ర సాంగత్యం ప్రాసేష్వపిచ కశ్చన' (అధర్వణ.సంజ్ఞ. 20) అని స్పష్టముగా అధర్వణుడు చెప్పనే చెప్పినాడుగదా! ఇక్కడ అట్లుగాక, అభేదమును చెప్పుటవలన, అభేదము చెప్పుట మత్వము చెప్పుటయే యగుననుకొనుటయే కారణము. అచ్చు పరమైనపుడు అనుస్వారమునకు మత్వ మాదేశ మగుటవలన, అచ్చుకు ముందు అనుస్వార ముండదని నిశ్చయము. కాగా ఇక్కడ అభేదమును చెప్పుటచే రెండును ఉండుననియే అధర్వణాభిప్రాయ మనవలెను. ('శబ్దానా మంత్యభాగేషు యో ఉనుస్వారః ప్రదృశ్యతే, తస్యా పరతో మస్స్యాత్').

2 '...కుమ్మొనసి' వంటిదే నన్నయగారి మరొకప్రయోగము '..చేసెన్ + మహా నదులన్'(అరణ్య.3–112.). ఇదియు 'కుమ్మొనసి' వలె 'చేసెమ్మహా' అని

'బిందుం...' సూత్రములోని 'క్వచిత్' ఆధారముగా 'ఒకొకచో'మాత్రమే నెఱసున్న లగు నని చెప్పినాడు. ఈ 'ఒకొకచో' కేవలము '...కుంమొనసి' నుద్దేశించియే యనవలెను. సూత్రమున 'క్వచిత్' సరళస్థిరము లన్నింటివిషయమునను వైరళ్యసంపాదకము కాగా, ఈ 'ఒకొకచో' కేవలము స్థిరములలో మకారమువరకే పరిమితమై, అందును వైరళ్యమునను సూచించుచున్నది. ఉభయత్ర నున్నవైరళ్యములలో నీభేద మున్నది. దీనివలనను అప్పకవి చెప్పిన 'అనునాసికప్రాస'లోని నకారమును విడుచుటవలనను తిమ్మన ప్రయోగదృష్టి స్పష్టమగును.

**బిందుపూర్వక 'బ-మ'లు : 'ద్విత్వ'ము:**

ఈ వరుసలోనే గమనించవలసినది బిందుపూర్వక బమలప్రాసమైత్రి. దీనిని తిమ్మన చెప్పినట్లుగా ప్రాసప్రకరణమున నీక్రిందివిధముగా పద్య మున్నది.—

'బమలు బిందుపూర్వకముగఁ బ్రాసంబుల
నిలుపఁ జెల్లు, ళళల కిల నభేద
మొదవుచుండుఁ గృతుల నుడురాజకోటీర
దురితదూర పీఠపురవిహార'

తిమ్మన ఈప్రాసమును చెప్పినాడన్న విషయ మిట్లుండగా ఈ విధమైనప్రాసభేదమున 'ప్రాసమైత్రి'పేర మొదట చెప్పినవా డనంతుడు. అతని ననుసరించి చిత్రకవి పెద్దనయు చెప్పినాడు. ఈ భేదమునకు వారి స్వీయోదాహరణము లివి.——

సాధింపబడును. ఈపద్యమం దన్యపాదములలో ప్రాసస్థానములం దున్న 'మే,ఘమ్ము ప్రమో,దమ్ము' అన్నవి ప్రవఘామకారములు. వీటినిగూర్చి వెనుక వివరింపబడినది. ఇక మొదటిపాదములోని 'అమ్మునీశు...' (అ+మునీశు) అన్నది త్రికసంధిరూపము. ఈసంధిని నన్నయాదిగా తిమ్మనవర కందరును చెప్పినారు కావున దీనిని 'అంమునీశు' అని బిందుపూర్వకముగా వ్రాయు ప్రసక్తియే లేదు శాసనములందుగూడ 'గంటడిమ్మహిని (శక.1062)(శా.ప.మం.పు.21) ఇత్యాదిగా త్రికసంధి మాఱ్ముడితోనే పలుచోట్ల కన్పించుచున్నది, కాని బిందువుతో కన్పించుట లేదు. నన్నయగారి ఈపద్యమునుగూడ తిమ్మన 'కమ్మని'పద్యముతోబాటుగా ఉదాహరించినాడు. మరియు అక్కడ ప్రౌఢకవి మల్లన పద్యముగూడ ఉదాహరింపబడినది. మల్లన ప్రయోగమునుగూడ నన్నయగారి ప్రయోగమువలెనే సాధించుకొనవలసియుండును.

'...లో, కంబులెల్ల నుండు నెంమితోడ...' అన.ఛం.1–41.

'...జ, గంబులోఁ గృతులను గ్రంమునననఁగ...' అ.సా.సం.1–45

కాని అప్పకవి దీనికి భిన్నముగా అదేపేరుతో ద్విత్వమకారమునకు బిందుపూర్వక బకారమునకు 'ప్రాసమైత్రి' చెప్పినాడు. అతనిపద్య మిది.

'గట్టి బిందువుమీఁది బకారమునకు
జమిలిమా ప్రాసమైత్రినాఁ జనుచునుండుఁ
గమ్మతావులు వెదజల్లు నంబుజములు
శంబరారాతి చేతి వాలమ్ము లనఁగ'. అప్పక.3–343.

'నెంమి, క్రంము' ఇత్యాదులందు బిందుపూర్వకమకారము వ్రాయునొకానొక వ్రాతరీతి ననుసరించి అనంతుడు, చి.పెద్దన ఈ ప్రాసభేదమును చెప్పియుందురు[1] కాని అట్టి వ్రాతరీతి సరికాదని అప్పకవి, వారు చెప్పినదాని నిట్లు సవరించి చెప్పినా డనిపించును.

అయితే, అనంతునికి ఈ ప్రాసభేదమును చెప్పటలో కేవలము లేఖనరీతియే ఆధారమా? కవిప్రయోగము దీనికి నిరూపకముగా నేదయిన నున్నదా? అనంతుడు చి. పెద్దన లక్ష్యములుగా తమరచించిన పద్యములవే చూపు పంప్రదాయము వారు కావున, వారికడ కవిప్రయోగములకై వెదకి లాభము లేదు. తిమ్మన గ్రంథములో నన్నయగారి, పిల్లలమర్రి పినవీరభద్రుని పద్యములు లక్ష్యములుగా కన్పించుచున్నవి. పినవీరభద్రుని పద్య మట్లుండగా నన్నయగారి పద్య మిది—

'ఇంముగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశుబిం
బంమున నద్భుతం బయిన భారతవాగమృతంబు కర్ణరం
ధ్రంమను నంజలిం దవిలి ద్రావుదు రట్టి మునీంద్రలోక వం
ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్'

ఆది.1–77.

1. అనంత, చిత్రకవిపెద్దనల ముద్రిత గ్రంథములలో 'నెమ్మి' 'క్రమ్మ' అన్నవి మాముడితో నున్నవి. అట్లుండుట వారు చెప్పిన లక్షణమునకు విరుద్ధము. అప్పకవినిబట్టి, లక్షణమును గుర్తించకయే వీటిని మార్చుట జరిగినదేమో?

ఇందు నాల్గవపాదమందు వద్యుంబరమున్ (వంద్యున్+ పరమున్) అన్న ద్రుతసంధి రూపము కాదనరానిది. కాగా బిందుపూర్వక బకారము సిద్ధము. రెండు మూడు పాదములలో ప్రాసస్థానమున ప్రథమా ముకారము లున్నని. అవి బిందుపూర్వక 'ము'కారములు కారాదు. ఎందుకు కారాదో 'కమ్మని' పద్యసందర్భమున చెప్పబడినది. అందువల్ల అదిబిందుపూర్వకబుకారములుగానో (బింబంబు) లేదా, ద్విత్వ ముకారములుగానో (బింబమ్ము) ఉండవలెను. నాల్గవపాదమున బిందు పూర్వక బకార మెట్లును ఉన్నది గాన,ఇవియు బిందు పూర్వక బుకారము లనియే చెప్పవచ్చును ఇక, మొదటిపాదమున నున్న 'ఇంముగ'(?) ను గూర్చి విచారించవలసి యున్నది బిందు పూర్వక మకారమును వ్రాయుపద్ధతి నన్నయగారినాడు లేదని ఇదివరకే స్పష్టము చేయబడినది. ఆ సందర్భములో చూపబడిన శాసనోదాహరణములో 'నెమ్మింబ్ర దీపము' అన్నది ఇచ్చట ప్రధానముగా గమనించదగినది. అనంతుడు 'నెంమి' బిందు పూర్వక మకారముగా చెప్పినాడు. కాని శాసనము మాముడిని చూపుచున్నది. కావున ఈ పద్యమందలి 'ఇమ్ముగ' మాముడితోనే ఉన్నదనవలెను. ఈస్థితిలో మిగిలిన పాదములందు బిందుపూర్వకబకారము, మొదటిపాదమున ద్విత్వమకారమున్న చో అప్పకవి చెప్పిన 'ప్రాసమైత్రి' కిది లక్ష్యమగును కాని బిందు పూర్వకబమప్రాసకు మాత్రము కాదు. మరి అప్పకవి దీని నుదా హరించినట్లు కన్పించదు. దీనినిబట్టి ఈపద్యమున 'ఇమ్ముగ'కు రూపాంత రమైన 'ఇంబుగ'అన్నది ప్రయోగించబడి యుండె ననవలసి యున్నది. అందుకే అప్పకవి దీని నుదాహరించి యుండడు. నిజమునకు బిందుపూర్వక బమలక్ష ఉచ్చారణలో ధ్వనిసామ్యము లేదు. ప్రాసలో ఇది ప్రధానము. ధ్వని సామ్యము లేని ప్రాసమును నన్నయగా రెక్కడను ఉపయోగించియుండలేదు. అసలు నన్నయగారి భారతమున ప్రాసభేదములే తక్కువ. ఉన్నవాటిలో ధ్వనిసామ్యము పుష్కలముగా నున్నది. అందువలన ఈ పద్యమున 'ఇమ్ముగ' 'ఇంబుగ' అనియే ప్రయోగింప బడినది. ఇంబు–ఇమ్ము ఏకార్థకములే. రెండును నన్నయగారి కిష్టములే. అయితే ఈ రెండు రూపములకు వేర్వేరు ప్రయోగములు నన్నయగారిభారతమున కన్పించవు కాని ఇట్టిదే అగు మరొక పదము–పంబు ఉన్నది. దీనిరూపాంతరము 'పమ్ము' ఈ రెంటిని నన్నయగారు ప్రయోగించినారు.

'జంబూషండవినిర్మా
ణం బాదిగ హృదయరోచనము లగు నేన్న
ర్వంబులను భీష్మ పర్వము
పంబి వినం బొలుచు షష్ఠ పర్వం బగుచున్. ఆది.1–44.

'అమ్మని యల్గిచూచుడును నాక్షణమాత్రన గోత్రధారుణీ
ధమ్మలు వయ్యు నయ్యుసుముదక్కఁగ నంబుధు లింకు మూఁడుల్లో
కమ్ములు దిర్దిరం దిరుగు గాడ్పు చలింపఁగ నోడు, నుగ్రతం
బమ్మినయట్టి కోపపరుపాలికి భామలు వోవ నోడరే'! ఆది.4.3.8

వీటిలో క్రమముగా 'పంబి' 'పమ్మిన' రూపములు ప్రయుక్తములు. ఈ విధముగా ఇంబు, ఇమ్ము రెండును నన్నయాభిప్రేతములేనని ప్రస్తుతలక్ష్య పద్యమున ప్రాస దృష్ట్యా ఇంబుగ ప్రయుక్త మనుటలో విప్రతిపత్తి యుండ నక్కరలేదు. ఈస్థితిలో తిమ్మన గ్రంథమందలి బిందు పూర్వక బమప్రాసో కిది ఉదాహృతిగా నుండుటకు వీలులేదు. తిమ్మన బిందుపూర్వక మకారస్థితి నొప్పుకొన్నచో పై పద్యము 'ఇంముగ,...బిం,బంమనకవ..., ఇత్యాదిగా ఉండవలెను. అప్పుడు కుదురును. కాని,తిమ్మన బిందు పూర్వకమకారస్థితిని (ద్రుతసంధిలో తప్ప) ఒప్పుకొన్నా డనుట కాస్కారము లేదు. మరియు ఒప్పుకొన్నా డన్నచో మరియొక చిక్కున్నది. ఈపద్యము వెనువెంటనే పినవీరభద్రుని పద్య ముదాహరింపబడిన దిట్లున్నది.

'అమ్మఖవాజి పాండుతనయాధ్వరవాహ మెదిర్చి మోము మో
వం బసివెట్టి హేషిత రవంబున వక్షముఁ బూర్వపత్ఖురా
గ్రంబున ద్రేయ తేసి యది కందమువట్టి విదుల్చిఁబో నమి
త్రం బయి కేలికిం గడఁగి దంతములన్ గళ మప్పళింపఁగన్'. 7–145

ఈ పద్యమునందు 'అంమఖ' అని బిందు పూర్వక మకారము ప్రయుక్తమైనచో బిందు పూర్వక బమప్రాస కిది ఉదాహార్యమగును. కాని ఆ'అమ్మఖ' అన్నది త్రికసంధి రూపము. (ఆ+మఖ). త్రికసంధి నందరు చెప్పినారు కాని బిందుప్రసక్తి ఎక్కడను లేదు. తిమ్మనయు

'ఇల నా యీా యే లగు పద
ములపైఁ బెరవ్రాలు గదియ మొదలివి సాగుల్
లలిఁ గ్రుంగుఁ, గ్రుంగునెడ వల
పలి వ్రాలకు జడ్డ లొదవుఁ బర్వతనిలయా.'

రేఫోష్మములు పరమైనపుడు సంధి జరుగదనియు చెప్పినాడు. ఇక్కడ ఆ ఈ ఏ లు హ్రస్వము లగుటయు, (రేఫోష్మేతరములగు) మీది హల్లులు జడ్డలగుటయు మాత్రమే చెప్పబడినదిగాని, మీది హల్లు మకారమైనచో నెఱసున్న వచ్చునని చెప్పలేదు. ఇంత కచ్చితముగా త్రికసంధిని చెప్పిన తిమ్మన 'అమ్మఖ'లో ద్విత్వమకారము గాక బిందు పూర్వక మకార మున్నట్లు గ్రహించినా డనుటకు వీలులేదు. అందువలన 'అమ్మఖ' మాముడితోనే గ్రహించినా డనవలెను. దీనినిబట్టి తిమ్మన బిందుపూర్యక మకారమును (ద్రుతసంధీతరముగ) ఒప్పుకొనలేదనియే చెప్పవలెను. కాగా ద్విత్వమకారముతో నున్న పయి పినవీరభద్రుని పద్యము అప్పకవి ప్రాసమైత్రికి లక్ష్య మగును గాని, బిందు పూర్యక బమప్రాసకు లక్ష్యము కాదు. కాగా తిమ్మన ఈ బిందుపూర్వక బమప్రాసను చెప్పుటగాని, దానికి లక్ష్యములుగా పై పద్యముల నుదాహరించుటగాని సమంజసము గాదు.

ఈ విధముగా విచారించినచో గ్రంథమున కన్పించురీతిగా 'బమలు...' అన్న పద్య ముండుటకు వీలులేదు. మరియు ఆపద్యమున ఈప్రాసభేదమును చెప్పిన రీతియు సరిగా నున్నట్లు కన్పించదు. 'బమలు బిందు పూర్వకముగ బ్రాసంబుల, నిలుపఁ జెల్లు' అన్నచోట . బిందు పూర్వక బమలకు ప్రాసమైత్రి చెప్పినట్లుగా స్పష్టపడదు. 'బిందు పూర్వకమై తమలోనఁ బొందు బమలు' అని అనంతుడు చెప్పినాడు. ఇక్కడి 'తమలోన' అన్న భావము తిమ్మన పద్యమున కన్పించదు. అది లేకున్నచో ఆరెంటికి ప్రాసమైత్రి చెప్పినట్లుకాదు. బిందుపూర్వక 'బ' మరియు 'మ' ప్రాసలలలో నిలుపవచ్చును. బిందుపూర్యకమైన అన్నిఅక్షరములను నిలుపవచ్చును. అట్లే ఇవియు. కాగా ప్రాసమైత్రిని చెప్పినట్లు కాలేదు. నిజమునకు తిమ్మన, అప్పకవి చెప్పిన ప్రాసభేదమును చెప్పవలసియుండెను. తిమ్మన ప్రాసప్రకరణమున చెప్పిన ప్రాసభేదము లన్నియు పేరు లేకుండ అప్పకవి చెప్పినవే చెప్పినాడు. కాకపోయినచో, కొంచెము సవరించినాడు, స్పష్టము చేసినాడు. కాగా, ఈ సందర్భముననూ అప్పకవినే అనుసరించవలసి యుండగా,అనంతునిదాక పోవుటకు కారణము లేదు. విచారించినచో తిమ్మన, అప్పకవి చెప్పిన అనునాసిక, ప్రాసమైత్రి ప్రాసములను రెంటిని కలిపి చెప్పదలచుకొన్నాడేమో ననిపించును.'—కుంమొనసి'లో బిందువును సాధించిన తిమ్మన 'అనునాసిక' ప్రాసమును చెప్పక వదులుటకు వీలులేదు. అందువలన ఈ రెంటిని కలిపిచెప్పుటలో 'ద్విత్వమకారమున'కు అన్నమాట ఒక్కటి తిమ్మన ప్రస్తుతపద్యమున

ఈయతి ప్రాసనత్వములు నిర్ణాయకములుగా భావించబడినవి. గణవృత్తాదుల విషయమున భిన్నాభిప్రాయములకు తావులేదు. కాగా వీటి విషయమున నున్నది. ఈ భిన్నత శబ్దస్వరూప నిర్ణయమును గూడ ప్రభావితము చేయును. అందువల్ల తిమ్మన వాటెని తన గ్రంథమున ప్రస్తావించినాడు. ప్రాసలలోను, యతులలోను సూక్ష్మ భేదములను పురస్కరించుకొని పూర్వులకన్న ఎక్కువ భేదములను చెప్పినవాడు అప్పకవి. వాటి నన్నిటిని పరిశీలించి తిమ్మన కొన్నిటిని మాత్రమే ప్రస్తావించినాడు. తిమ్మన ప్రస్తావించిన ప్రాసభేదములను లెక్కించినచో ఎనిమిదిమాత్రమే. వీటికిని తిమ్మన పేర్లు చెప్పలేదు. అప్పకవి చెప్పిన ప్రాసభేదములలో ఇవి దాదాపు సగము తిమ్మన ప్రస్తావించిన ప్రాసములు, అప్పకవి ననుసరించి వాటిపేర్లు ఇవి.

| | | |
|---|---|---|
| 1. | న—ణ ప్రాసము | ఉభయప్రాసము |
| 2. | ఋప్రాసము | ఋప్రాసము |
| 3. | వ్రటసుడిప్రాసము | ............ . .. . |
| 4. | ఌప్రాసము | సంయుతాసంయుతప్రాసము |
| 5. | అనునాసికసంధి(కిచెందిన)ప్రాసము | వికల్పప్రాసము |
| 6. | బిందుపూర్వకబమ(?)ప్రాసము | ప్రాసమైత్రిప్రాసము |
| 7. | లళప్రాసము | అభేదప్రాసము |
| 8. | ఖండాఖండబిందుప్రాసము | ఖండాఖండప్రాసము |

వీటిలో అన్నియు అప్పకవి ననుసరించియే చెప్పబడినను కొన్ని సవరింపులు కొన్ని వివరణలు ఉన్నవి. ఋప్రాసమును చెప్పి 'వ్రటసుడి యుబ్బురముగ ప్రాసముగా హల్లుఁగదిసి' అని తిమ్మన అన్నాడు. ఋత్వసహితహల్లు తద్విరహితమైన హల్లుకు ప్రాస చెల్లునని భావము. ఇట్లు చెప్పుట అనవసరము. ఋకార మచ్చే కావున మిగిలిన అచ్చులతో హల్లులు కలిసినప్పుడువలెనే ఋత్వసహితస్థితియు. ప్రాసమందు అచ్చుకు ప్రాధాన్యము లేదు. కాని ఋప్రాసలో 'ఋ—ర'లకు ప్రాసమైత్రి చెప్పుటచే, ఋత్వసహితమును మాత్రమే రేఫసహితమునకే చెల్లింపవలయునేమో యని సందేహింప నవకాశమున్నది. అందుకు ఋప్రాసము చెప్పిన వెంటనే తిమ్మన ఈఅంశమును చెప్పినా డనవచ్చును.

రేఫయుతప్రాసమును చెప్పుచు అప్పకవి—
'ఈ కార, పలుకునకు మొద
లై క్రాలుచుఁ దేలి ప్రాసమగుఁ దన తనకే
శ్రీకొమ్ముడి సౌందర్యము
వ్రాక్రువ్వం దరమె యురగవరునకు నైనన్' అప్పక.3–325.

అన్నాడు. ఇందు 'తనతనకే' అనుటవలన రేఫయుక్తమగు సంస్కృతపదాది వరమునకు, అట్లే తెలుగుపదాదివర్ణమును ప్రాస చెల్లింపఁగూడ దను భావము కలుగును. కాని ఇట్లు చెప్పుట సరికా దని ప్రయోగదృష్ట్యా తిమ్మన

'ఆంధ్ర గీర్వాణముల నొక యక్షరమున
కంటె వచ్చిన క్రారల కరయ మైత్రి
చెల్లుఁ బ్రాసంబులను గూర్పఁ దెల్లమిగను....'

అని స్పష్టము చేసినాడు. దీనికి 'ఏ ప్రొద్దు శూద్రవుని విగ, తప్రాణుం జేసి తీవు..' అను తిక్కనగారి ప్రయోగమును చూపినాడు.

రేఫయుతాయుతమునకు, లకారయుతాయుతమునకు ప్రాస చెల్లుట 'సంయుతా సంయుతప్రాస'గా అప్పకవి చెప్పినాడు. రేఫయుతాయుత విషయమున అప్పకవితో తిమ్మన ఏకీభవించినాడు. కాగా లకారశ్లిష్టమునకు అప్పకవి చూపిన ఉదాహృతి సరికాదు. ఆ ఉదాహృతి—

'లోకత్రాణరతిం దదాదిమ మహా లోకప్రవేశోత్క భా
షా క్లిష్ట ప్రథమ ద్వితీయ పద ,

అను రాఘువపాండవీయ పద్యము. ఇందులో 'భాషాక్లిష్ట' లోని కకారము లకారశ్లిష్టమని అప్పకవి భ్రాంతి పడినాడు. నిజమున కది 'ఌ'కారము(అచ్చు)తో గూడినహల్లు. దీనిని స్పష్టీకరించుటకు తిమ్మన, వ్రటనుడినిగూర్చి చెప్పినట్లే, ఐకారముతో గూడిన, కూడని హల్లులకు ప్రాస చెల్లించవచ్చు నని చెప్పి, అప్పకవి ఉదాహరించిన పద్యమునే తానును దీనికి లక్ష్యముగా ఉదాహరించినాడు. దీనితో అప్పకవిని సవరించిన ట్లయినది.

ళళల కభేద మున్నది, ళడల కభేద మున్నది. ఈదృష్ట్యా 'ల—డ'లకు ప్రాస చెల్లించవచ్చు నని అప్పకవి అభేదప్రాసములో చెప్పినాడు. ల—ళ లకు ధ్వనిసామ్యము చాలావర కున్నదిగాని ల—డలకు లేదు. ఈ ధ్వనిసామ్యము లేకుండ ప్రాస చెల్లుట ప్రాసపద్ధతికి విరుద్ధము. అందుకని అప్పకవి చెప్పిన అభేదప్రాసమున నొకభాగముగు ల—ళప్రాస నొప్పుకొనుచు తిమ్మన ల—డలప్రాసమైత్రిని నిరాకరించి నాడు. డ—ల, డ—ళ లతో కొన్ని పదములు ఉభయరూపములుగా, జల—జడ, వ్రీడ—వ్రీళ అని సంస్కృతముననే గాక, తెలుగునను మొసలి—మొసడి,వెడలుట—వెలుడుట ఇత్యాదిగా ఉన్నవి. ఈ ఉభయ రూపముల ననుసరించి, ధ్వనిసామ్యములో దేనిని దానికే ఉపయోగించుకొనవలె నని తిమ్మనఅభిప్రాయము. శృంగార నైషధమున

'చిలుకలుకూయునో చెవులు చిల్లులుపోవఁగ నంచు నెన్నఁడున్
వెడలఁడు వందనోపవనవీథుల——————'

అను శ్రీనాథుని ప్రయోగమును చూపించి, ల—డల కభేద మని ముద్దరాజురామన చెప్పగా, అప్పకవి దాని ననుసరించినాడు. కాగా తిమ్మన, తన గ్రంథమున రామనను పేర్కొని అతని మతమునే నిరసించినాడు. పైడిపాటి లక్ష్మణకవి 'ఆంధ్రనామ సంగ్రహము'లో 'నిర్గమించె' అనుటకు 'వెలుడె' అని ఒక పర్యాయపదమును 'వెడలె'కు రూపాంతరముగా చూపినాడు. దాని ఆధారమున తిమ్మన శృంగారనైషధమున 'వెడలఁడు' అనిగాక 'వెలుడఁడు' అని ఉండు నని చెప్పినాడు. అప్పకవి చూపిన లక్ష్యములలో రెంటిని తన కనుకూలముగా ప్రదర్శించినాడు .

ఇట్లే దీర్ఘముమీద అరసున్న ఉన్నప్పుడే ప్రాసలో లేనిపదముతో ప్రాస చెల్లు నని (వీఁక—ఆకరమున) రామనయు, అతనినిబట్టి అప్పకవియు చెప్పగా, తిమ్మన హ్రస్వముమీద ఉన్నను (తగ—బ,సఁగి) చెల్లునని చెప్పి, తిక్కనగారి ప్రయోగములను చూపినాడు. దీనితో ఈ ఖండాఖండ ప్రాసపరిధి విస్తరించి నట్లయినది.

'ద్యూతక్రీడకు కొండొక
నేర్తున్.
'కావికొని వచ్చి తగ నా
నేర్చినయ ట్లచట నచట——————'

ఇవి తిక్కనగారి ప్రయోగములు. వీటిలో ప్రాసనియమము తప్పినది. మొదటి పాదములలో అసంయుక్తము ప్రాసాక్షరము కాగా రెండవపాదములలో సంయుక్త మయినది. దీనిని కొందరిట్లు సమర్థింతురు. ఈనాడు 'నేర్తు, నేర్చు' అనురీతిలో వ్రాయబడు పదములు ప్రాచీనకాలమున 'నేతుఁ, నేచుఁ' అని వలపల గిలకతో వ్రాయబడెడివి. కాగా ఇక్కడ రెండవ అక్షరములుగా కన్పించునవి అసంయుక్తములే ఆ కాలపు వ్రాతను బట్టి పై పద్యములలో 'ద్యూత—నేతుఁ, కాచి—నేచిఁ' అని సరిగానే చెల్లినది. కాని ప్రాసను ప్రయోగించునపుడు అక్షరములు వ్రాసికొని రెండవ అక్షరము సరిపోయినదా లేదా అని చూచుకొందు రనుట అసహజము. మొదట, ఉచ్చరించుకొనియే తరువాత వ్రాయుట సహజము. వ్రాతలో ఎట్లున్నను ఉచ్చారణలో అది సంయుక్తముగానే ఉచ్చరింపబడును. ఏపద్ధతిలో వ్రాసినను అవి సంయుక్తములే. అట్లు కాకున్నచో 'వతిఁ— కుతల' అనువాటికిని ప్రాస చెల్లవలసియుండును. ఇది ప్రాసపద్ధతికి విరుద్ధము. కాగా తిక్కనగారి ప్రయోగములలో ప్రాస తప్పిన దనియే చెప్పవలెను. లేదా మరొక రూపమున చూపవలెను. తిమ్మన అప్పకవిని అనుసరించి 'నేర్తు, నేర్చు' ల లోని రేఫ ఒకొకచో' (అనగా ప్రాసంబులందని) లోపించు నన్నాడు. అప్పుడు 'నేతున్, నేచిను —'అనిరూపము లేర్పడగా ప్రాస కుదురును. అయితే అప్పకవి ఈ అంశమున నాన్యేషాం వైధర్మ్య....' అన్నసూత్రవ్యాఖ్యలో ప్రస్తావించగా, ఇది ప్రాసకు చెందిను అంశ మగుటచే తిమ్మన ఈ సందర్భమున దీనిని చెప్పినాడు.[1]

### యతులరీతి

ప్రాసములను వలెగాక, తిమ్మన తాను పేర్కొన్నయతులకు పేర్లను చెప్పినాడు. 2 తిమ్మన ఇరువదిమూడు యతిభేదములను చెప్పినాడు.

---

1. ప్రాసాక్షరము సంయుక్తము కాగా, దానికి కొంత హల్ సామ్యముతో ప్రాస చెల్లించిన 'శాంతప్రాస'మగు నని కన్నడలాక్షణికులు చెప్పినారు. తెలుగు లాక్షణికు లెవరును ఈ అంశమును చెప్పలేదు. దీనికి లక్ష్యములు పాల్కురికి సోమనాథాదుల రచనలలో తప్ప తెలుగున మరెచ్చట కన్పించవు.

2. స్వరయతి—వర్గయతి—అఖండయతి—ప్లుతయతి—సరసయతి — ప్రాదియతి—బిందుబయతి—సంయుక్తయతి—ఎక్కటియతి—పోలికయతి—వృద్ధియతి—వికల్పయతి—అభేదయతి—ప్రభునామయతి—విభాగయతి — అనునాసికయతి — కాకుస్వరయతి—

వీటిలో పేరు చెప్పక వదిలినది—అనగా మొదట యతిపరిగణనములో వదిలినది ఒక జ్ఞాయతియే. ఒక్క అఖండయతితప్ప మిగిలిన వన్నియు అప్పకవి నను సరించియే యున్నవి. అఖండయతి నొప్పికొనుట తిమ్మనలోని ప్రయోగదృష్టికి చిహ్నము. అప్పకవి చెప్పిన దేశ్యనిత్యసమాసయతులను అఖండ యతులలో, అంత్యోష్మసంధియతులను వికల్పయతులలో చేర్చినాడు. అప్పకవి చెప్పినవాటిలో తిమ్మన విడిచిన యతిభేదములలో కొన్ని అనవసరములు, అవసరములైన వే ఒకటీ రెండో ఉన్నవి. తిమన్న కీయతులను చెప్పటలో వాటి విస్తృతప్రయోగముపైన దృష్టి. కావుననే అప్పకవి చెప్పినవాటి నన్నిటిని, ప్రాసల సందర్భమున వలెనే చెప్పియుండకపోవచ్చును.

సంయుక్తయతిలో తిమ్మన ఒక అంశమును చెప్పినాడు. ఆ విశేషాంశము 'స్త్నాన'మునుగూర్చినది. 'స్త్నానశబ్దము సకార తకార నకార సంయుక్తమైనది గనుక మూడు వర్ణములకు యతి చెల్లును' అన్నాడు. నిజమున కీ విషయము చెప్ప నక్కరలేదు. సంయుక్తములో నెన్నిహల్లు లున్న వాటన్నికి చెల్లించుటయే సంయుక్తయతి. కాని ఇట్లు చెప్పటలో నిజమునకు 'స్నాన' శబ్దములో స—న సంయుక్తియే గాని, తకార మందు లేదని, కాని వ్యవహారమున 'స్త్నాన' మన్నదానిలో తకార ముండుటయు, కొన్ని ప్రయోగములు కన్పించుటయు కారణముగా ప్రత్యేకముగా చెప్పవలసి వచ్చిన దని యనుకొనవలెను. అయితే 'స్త్నాన' శబ్దమునకు వికృతి 'తానము' కావున, 'స్త్నాన'అని కన్పించు ప్రయోగములలో నిజమునకు 'తాన' అని ఉండవలె ననవచ్చును. కాని తిమ్మన దీనికి ఉదాహృతిగా చూపిన—

'ధీనిధి సెట్టి నంబి తన దేహమునిండ విభూతి మంగళ
స్త్నానము చేసి ధౌతపరిధానము గట్టి ——————'

---

నిత్యయతి—చక్కటియతి — ననమాసయతి—నఞ్సమాసయతి—నిత్యసమాసయతి — జ్ఞాయతి.

వీటిని అప్పకవివలె స్వర—వ్యంజన—ఉభయయతు లని తిమ్మన వర్గీకరించ లేదు. కలగలుపుగా చెప్పినాడు. ప్రాసమును నిర్వచింపనట్లే యతినిగూడ నిర్వచింపలేదు.

'బలబలవేగ తేపకడ, బంకజ దీర్ఘికః దాన మాడి—' కాశీ. 5–144
స్నాన, తాన అను రెంటివి ప్రయోగించిన శ్రీనాథుడు 'స్త్నాన' పదమును ప్రయోగించుట చిత్రమే మరి. అదియు సమాసములో బిగించి. 'స్త్నానో దాహృతులలో కాశీఖండమందలి దానిని 'స్నాన మహిమంబు భక్తి విశ్వాస గరిమ' అని మార్చిన మార్చవచ్చునేమో గాని, మొదటి దానిని సవరింప వీలులేదు. అందుకనియే తిమ్మన దీని నుదాహరించినాడు.

స్న-తయతిని తద్భవవ్యాజయతిగా, తిమ్మన చెప్పిన జ్ఞాయతిగా చెప్పవచ్చును. జ్ఞ తద్భవములో 'న' అయినట్లు, స్నానములోన స్న తద్భవములో తకారముగా (తాన) మారును. కావున జ్ఞాకు నకారము: యతిచెల్లినట్లు 'స్నా'కు తకారము యతి చెల్లవచ్చును. 'జ్ఞ' లోని 'న'కారశ్రుతివల్ల తద్భవములో నకారము వచ్చినట్లే,స్న లోని తకార శ్రుతివల్ల తకారము వచ్చినది. అందువలన దీనికి నకారము వలె, దీనికి తకారము చెల్లిన దనవచ్చును. ఇట్లు కానిచో శ్రీనాథుని సమాసమునకు గతిలేదు.

ఇక, స్నానములో తకారము నొప్పుకొన్న తిమ్మన, జ్ఞానములోగూడ నకారము నొప్పుకొని దానినిగూడ సంయుక్తయతిలో చేర్చి యుండవలసినది. కాని అనంతుని తద్భవవ్యాజయతిపద్యము నుదాహరించి 'జ్ఞాయతి'ని ప్రత్యేకముగా చెప్పినాడు. ఈ రెండును ఒక దానికొకటి విరుద్ధములుగా నున్నవి. చూడగా—
"గణపవరపు వేంకటకవి తన ఆంధ్రప్రయోగ రత్నాకరములో...'స్నాన అనేటప్పుడు అఘోషమైన ఊష్మ సకారమునకు నకారము స్పర్శము పరముండగా మధ్య తకారము వచ్చి స్త్నానమని యుండెను. ఇందుకు ప్రాతిశాఖ్య సూత్రము—
'అఘోషా దూష్మణః పరః ప్రథమోఽభిధానః స్పర్శపరాత స్ప స్త్నానః'[1]
అని చేసిన ప్రతిపాదనమును తిమ్మన అంగీకరించినాడేమో అనిపించును. ణత్వముతో 'త్రిణయన'పదమును ప్రయోగించిన శ్రీనాథుడు వైదికమయిన ఈ స్త్నానోచ్చారణ రీతిని కూడ స్వీకరించినట్లు తిమ్మన భావించినాడేమో' కాని 'వేదోచ్చారణము వేదమునకే గాని భాషకు గాదు' అని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి గారు శ్రీనాథుని ఈప్రయోగమున, తద్భవవ్యాజయతిగానే స్వీకరించవలెనని చెప్పినారు.[2]

1 చూ:'తెలుగు భాషలో ఛందోరీతులు' శ్రీ రావూరి దొరసామిశర్మ. పు.315.

2 చూ.'సింహావలోకనము'.పు.142.

దీని దృష్ట్యా చూచినచో,తిమ్మన ననుసరించి ఎక్కడ వేసిన గొంగడి అక్కడనే ఉన్నది. శ్రీనాథుని సమాసము తిమ్మనదృష్ట్యా అసాధ్యము. కావున వేంకటకవి భావమును,వ్యవహారమును తిమ్మన గ్రహించినా డనవలసియుండును.

అభేదయతిని వివరించుచు తిమ్మన, 'అగ్రాహ్యవిరామములప్రస్తావనలో అప్పకవి నిరసించిన ర—లయతిని తానును నిరసించినాడు. నిజమున కప్పకవి ఈ యతిని నిరసించుటలో సామంజస్యము లేదు. సంధిగతప్రాసమునం దప్పకవి పరోక్షముగా ర—లప్రాస నొప్పికొన్నాడు.

'సంధి గూడిన వ్రాలు ప్రాసంబు లైన
నవియె సంధిగతాఖ్యల నమరుచుండు
దివిజు లాశ్చర్య మొంద శౌరి వడ వైచె
జెంగి పోనీక మధురలోనం గరి యన' అప్పక. 3—372.

సంధిలో పకారమున కాదేశముగా వచ్చిన వకారము (గసడదవాదేశసంధి) సహజ వకారమునకు (దివిజ—శౌరివడవైచె) ప్రాసము చెల్లును. ఇట్లుదాహరణము లిచ్చి లకారప్రాస మనుచు—

'మారుం దద్భుతశంఖ మొక్కటిని సంపాదించి దోర్మధ్య క
స్తూరీ చర్చ నెపంబునం దనదు కే ల్సోపన్ సువర్ణత్సరే
ఖాలిప్సన్. ..................................................

కాకుత్సవిజయ పద్య ముదాహరించినాడు. ఇక్కడ ర—లప్రాస కన్పించు-చున్నది.కాగా, 'రభరాభస్యే' అను ధాతువు వలన లిప్సా శబ్దము పుట్టినది గాన రేఫ కిక్కడ లకారము ప్రాస చెల్లిన దని అప్పకవి సమర్ధన. కాని ఈ ఉదాహృతి 'సంధిగతప్రాస'కు విరుద్ధము. ఆదేశముగా వచ్చిన వకారము సహజవకారమునక ప్రాస చెల్లునుగాని, వకారమునకు మరేదయిన ఒకవేళ ఆదేశము వచ్చినచో, అది వకారమునకు చెల్లదు. అట్లే, లకారమున కాదేశము వచ్చిన రేఫ, సహజ రేఫకు ప్రాస చెల్లునుగాని, రేఫకు వచ్చిన లకారవారము చెల్లదు. అయినను అప్పకవి ఈ పద్యము నుదాహరించుటచే, ఏదో విధముగ ర—ల ప్రాస నొప్పినట్లయినది. ఆదేశముగా వచ్చినను, రాకున్నను అకారము లకారమే రేఫ

రేఫయే. అందువలన ధ్వనిసామ్యము లేని ఈరెంటి కిట్లు ప్రాస నొప్పిన అప్పకవి ర—లయతిని నిరసించుటకు కారణము కన్పించదు. మరియు లడప్రాసను గూడ అప్పకవి ఒప్పినాడు. ధ్వనిసామ్యము లేదని లడప్రాసను నిరాకరించినాడు గాన తిమ్మన, ఈ ర—లయతిని గూడ నిరసించినాడు. దీనివల్ల రలప్రాసగూడ తిమ్మన కనిష్ట మనియే చెప్పవలసి యుండును. అయితే రలయతిని అప్పకవితోబాటు తిమ్మన నిరసించినాడు గాని, శ్రీనాథాదుల ప్రయోగములు విరివిగాన ఒప్పటయే సమంజస ముగా నుండెడిది.

దేశ్యనిత్యసమాసయతులను [1] చెప్పిన పిదప అప్పకవి భారతాదులలోనివిగా చెప్పబడుచున్న అఖండయతి ప్రయోగములను ప్రస్తావించి '—బహుపుస్తకంబుల నిరీక్షించి వాని నెల్లను ప్రక్షిప్తంబులుగా నెఱింగినవాఁడనై లక్షణవంతంబు లగు పురాతన కవి ప్రోక్తంబుల వివరించెద—'(అప్పక. 3—303)అని కొన్ని పద్యములను అతని దృష్టిలో సరియగు పాఠములతో ప్రదర్శించినాడు. వాటిలో 'అన్నవు తండ్రి యట్లు...' అనుభాస్కరరామాయణ పద్యమును (యుద్ధ—141) తిమ్మన అఖండయతికి లక్ష్యముగా చూపినాడు. అప్పకవి పాఠమున అఖండయతి తొలగగా దీనియం దట్లే యున్నది. దీనినిబట్టి అప్పకవి చూపిన పాఠములన్నియు తిమ్మనకు సమ్మతములు కావని చెప్పుట కవకాశము కల్గుచున్నది. అప్పకవి పాఠములపై ఆధారపడక తానును 'బహుపుస్తకంబుల నిరీక్షించి' యుండును. భారతప్రయోగముల విషయమున అప్పకవి పాఠములే సరియయినవిగా నిశ్చయించుకొన్నారు తిమ్మన. కావుననే 'చూచె మనంబునఁ దలంచుచుండుదు నెపుడున్' అన్న పాఠము కాక, అప్పకవి చూపిన '.....తలంతు సుందరి నేనున్' అనుపాఠమే 'సంప్రదాయము' అని చెప్పినాడు. ఇట్లు సంప్రదాయ మనుట భారతమున అఖండయతి ప్రయోగము లేదన్న విశ్వాసమూలకము.

ఈ విధముగా ప్రాసలను యతులను తిమ్మన తన గ్రంథప్రణాళిక ననుసరించి తగుమాత్రముగనే ప్రదర్శించినాడు. ప్రాసభేదములలో వ్రటసుడి ఇకారము , మొదలగు నవి యన్నియు శబ్ద స్వరూప నిరూపణమ నకు

---

1 దేశ్యనిత్యసమాసయతులను అఖండయతులతో కలిపివేసిన తిమ్మన నిత్యసమాసయతులను కలుపకుండుటకు కారణము మృగ్యము.

సంబంధించినవే. యతిభేదములందును 'ఏకీభవించిన' వాటిని సరిగా పరిశీలించినచో, సంధి సమాస శబ్దాదుల స్వరూపమునకు తోడ్పడునవియే యని స్పష్టమగును. ఈ దృష్టితోడనే యతి–1 ప్రాసల నిర్వచనము మొదలగు అంశములు విడువబడినవి.

*

ప్రాసలను యతులనుగూర్చి చెప్పిన తరువాత తిమ్మన శబ్దప్రకరణముపేర ఏబదిపదములకు రూపాంతరములను ప్రదర్శించినాడు. వీటిలో కొన్ని వ్యవహార వశముగా ఏర్పడినవి కావచ్చు. కొన్ని కవుల నిరంకుశత్వమువలన ఏర్పడినవి కావచ్చు. మామిడి— మావిడి వంటివి మొదటితరహాకు చెందినవి కాగా, కేళాకుళి, కేళకుళి, కెళాకూళి, కేళాకూళి వంటివి రెండవ తరహాకు చెందిన వనవచ్చును. ఎట్లయినను, వీటి యన్నిటికి కావ్యములందు ప్రయోగము లున్నవి.

---

1 యతికి తెలుగులో 'వడి' పర్యాయపదము. 'వడి'యొక్క అర్థమును, యతికి పర్యాయపదముగా దాని సార్థకతను గూర్చి పలువురు పలువిధములుగా చెప్పియున్నారు. పాదప్రథమాక్షరమునకు 'వడి' అని పేరు పెట్టబడినది. పాదమధ్యమున నొక నియమిత స్థానమున దీనిని మరల ప్రయోగించ వలెను. కావున ఆస్థానమువరకు విరిగిన పాదములో ఉత్తర భాగమునకు దారి చూపువ దిగావున ఇది'వడి'. వడు అనగా మార్గము అని శ్రీ గిడుగు సీతాపతిగారు అభిప్రాయపడినారు. (తెలుగులో ఛందోరీతులు. పు. 215). ఇట్లే మరికొందరు మరికొన్ని విధములుగా అభిప్రాయపడినారు. కాని అన్నియు అర్ధమర్ధ ముగానే యున్నవి. అయితే, మరొకఅంశముగా దీనిని చూడ వలసి యున్నది. 'వడి' అన్నది తెలుగులో 'హల్మాత్రమునకు పేరుగా వ్యవహారమున కన్పడును. క్రా'వడి' —క్యా'వడి' అను చోట్ల రేఫ య కారహల్మాత్రముల కీనాటికిని గూడ 'వడి' ఉపయుక్త మగుచున్నది. 'వత్తు'(కావత్తు—చావత్తు) దీనికి తరువాత వ్యవహారమునకు వచ్చి, నేడు ప్రహతముగా వ్యాప్తిలో నున్నది. దీనినిబట్టి వడి చెల్లించుట యనగా, పాదాదిహల్లును మరల ఉపయోగించుట అని అర్థము. (హల్‌సామ్యముతోబాటు అచ్‌సామ్యము తరువాత చేర్చబడినది.) ఇట్లు హల్మాత్ర వాచకమైన 'వడి' ఛందస్సులో స్థిరముగా నిలిచిపోయినది.

అందువలన 'ప్రౌఢిమ'కొరకు ఈ విధమైన రూపములు ప్రదర్శింపబడినవి. ఇట్టివి మరికొన్నియు ఉండవచ్చును. కాని ఇక్కడ కేవలము కొంత దారిచూపుట మాత్రమే ప్రధానముగా ఈ మాత్రము ప్రసిద్ధమైనవాటిని, మహాకవులు ప్రయోగించినవాటిని ప్రదర్శించుట జరిగినది.

### శకటరేఫ విలాసము

తృతీయాశ్వాసమునందంతయు తిమ్మన రేఫ శకటరేఫములనుగూర్చి వివరించినాడు. తెలుగులో రెండువిధము లయిన రేఫ లున్నవి. వారు, వీరు వంటి పదములలోనిది ఒకవిధము కాగా, ఱేడు, విఱుగు వంటి పదములలోనిది మఱొకవిధ మయినది. మొదటివిధ మయిన దానిని. సామాన్యముగా రేఫ యనుటయు, రెండవవిధ మయిన దానిని శకటరేఫ (బండిఱ) అనుటయు వ్యవహారమునం దున్నది. ఈరెండు విధము లయిన రేఫలకు అతిప్రాచీనకాలమున స్పష్టముగా ఉచ్చారణలో భేద ముండెడిది. కాని క్రమముముగా ఈ భేదము తగ్గుచు వచ్చినది. నన్నయగారి నాటికి ఈ భేదస్పష్టత కొంత యుండెడిది గాని తిక్కనగారి నాటికి నామమాత్రావశేషమే యయిన దనవచ్చును. అప్పటినుండి ఆయా పదములు రేఫసహితము లని, లేదా శకటరేఫసహితము లని స్థూలముగా గుర్తుపెట్టుకొనుటయేతప్ప నిశ్చితత్వము పోయినది. ఈ పోవుటలో కొందరికి రేఫ కలపదములు మరికొందరికి శకటరేఫకల వగుటయు జరిగినది. మరియు కొన్నిపద ములు రేఫతో, శకటరేఫతో గూడ—ఉభయ రూపములతో—నున్నట్లు భావించుటయు జరిగినది. అనగా 'రంతు' 'ఱంతు' అని ఉభయరేఫాత్మకములుగా కొన్నిపదములు భావించబడినవి. దీనితో ఉభయ రేఫాత్మకములు కొన్ని యేర్పడినవి. నిజమున కొకపదము ఏదో ఒక రేఫతో నుండుటయే సహజము గాని, రెండింటితో నుండుట సహజము గాదు, సమంజసమును గాదు. కొన్నిచోట్ల అర్థకభేదము ననుసరించి ఒ అర్థములో శకటరేఫయు, మఱొక అర్థములో రేఫయు నున్నట్లు భావించబడినది. ఉదాహరణమునకు 'ఆరు'అనునది సంఖ్యావాచక మగునప్పుడు శకటరేఫ (ఆఱు)తో, నిండుట అనునర్థములో రేఫ (నిండారు,పొంగారు)తో నున్నట్లు భావించ బడిన దన్నమాట. మొత్తముమీద ఈ ఉభయ రేఫాత్మక భేరేఫోచ్చారణములో వచ్చిన భేదరాహిత్యమునే సూచించును. ఈనాడు ఉచ్చారణమందుగాని, వ్రాతల యందుగాని ఈ తద మేమాత్రముగూడ పాటింపబడుట లేదు. కేవలము

సాంప్రదాయికమయిన కొన్ని రచనలయందు మాత్రమే కొంత కొంత పాటింప బడుచున్నది. అయితే ఈనాడీపాటింపు లేకున్నను, ఈశతాబ్ది మొదటి వరకు(ఆతరువాతను కొన్నేండ్ల వరకును) ఈ భేదము నేదోవిధముగా పాటింప వలయునన్న ఆస్థ యుండెడిది. అందువలన రేఫ అకారములనుగూర్చి, అదియొక ప్రత్యేకవిషయముగా, పరిశోధనగా శబ్దస్వరూప నిరూపకముగా వివరించుటకు ప్రయత్నము సాగినది. దీనికి ఫలితముగనే రేఫ అకార నిర్ణయము చేయుట, ఆయా రేఫ లున్న పదముల పట్టికలను కూర్చుట జరిగినది. తాళ్లపాక తిరుమలయ్య నాటినుండి ఈ పట్టికాపద్ధతి మొదలయినది. అప్పటినుండి దాదాపుగా నందరు లాక్షణికులకును కొద్దిగనో గొప్పగనో ఇది యొక పనియైనది. చిత్రకవి పెద్దన, అప్పకవి మొదలగువా రంద రీ పని చేసినారు. వారినిబట్టి తిమ్మనయు పూనుకొన్నాడు. వారికన్న మరికొన్ని అంశములను క్రొత్తవాటిని వివరించినాడు ప్రయోగదృష్టిని ప్రదర్శించినాడు.

ఇంతకు, ఈ రేఫ అకారములనుగూర్చి ఇంత యాతన ఎందుకు? రేఫ శకటరేఫములకు యతిగావి, ప్రాసగాని పరస్పరము చెల్లింపగూడ దని ఒక నియమము చేయబడి యున్నది. అందుకొర కింత యాతన. మరి ఈ నియమమునకుగూడ కారణ మేమిటి'? కారణనిరూపణమున కే లాక్షణికుడును పూనుకొన్నట్లు కన్పించదు. శ్రీవజ్ఝలవా రిట్లు కారణము చెప్పుచున్నారు.—

> "ప్రాచీన ద్రావిడ భాషలలో అకారోచ్చారణమున టకారాదేశ ముండెడిది. అదియే నేటికిని తమిళభాషలో ద్విరుక్త అకారోచ్చారణమునం గన్పట్టుచున్నది. తమి. కూఱు—చెప్పు(ట) కూఱ్ఱు— (కూ'ట్ట్రు' అని తమిళులు పల్కుదురు.)మాట. తెలుఁగునందలి కుఱు+ఉసురు=కుట్ట్రుసురు(బాల.సంధి.12సూ.)మున్నగు సంధి స్వరూపము లిట్టి స్వభావము చేతనే లభించియుండు నన నగును. ఉచ్చారణము నందలి యిట్టి యత్యంత వైలక్షణ్యముచేతనే ప్రాచీనద్రావిడకవులు రేఫ అకారములకు యతి ప్రాస మైత్రి నంగీకరింపరైరి...' (అం.వ్యా.సం. స.పు. 135)

అయితే నన్నయగారినాటికి ప్రాచీనద్రావిడభాషలో నున్నంతటి వైరుధ్యము, వైలక్షణ్యము లేకున్నను, ద్రావిడ కవుల ప్రాచీన నియమము ననుసరించి నన్నయగా రీవిషయమును చింతామణిలో చెప్పినారు. చింతామణిలో ఈ సందర్భమునకు సంబంధించిన సూత్రము లీవిధముగా నున్నవి :

'లఘువో లఘువ శ్శ్రుతి ద్వేధాంతఃస్థాన్ వదంతి శాస్త్రారః
అన్యేన్య వ్యాకరణ స్పష్ట రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః
..............................................
నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం, రయోస్తు నిత్యం స్యాత్'

అంతఃస్థము లయిన య—ర—ల—వ అనువాటికి లఘ్వలఘు భేద మున్నది. య—ల—వ అనువాటి ఈభేదము సంస్కృత ప్రాకృత వ్యాకరణముల ద్వారా స్పష్టము. కాగా, రేఫకు సంబంధించిన ఈభేదము తెలుగునందే ఉన్నది. .....య—ల—వలకు వైరుధ్యము లేదుగాని, రేఫలకు మాత్రము నిత్యముగా నున్నది. ఇది సూత్రాభిప్రాయము. ఈ భేదనిత్యత్వకారణముగా వీటికి యతిప్రాసలమైత్రి కూడ దని ఉద్దేశ్యము.

నిజమునకు య—ల—వల కున్న లఘ్వలఘుభేదమునుగూర్చి తెలుగులో ఏనాడును పట్టింపులేదు. (ఒకటిరెండుచోట్ల మాత్రము చింతామణి అయకార లఘుత్వమును ప్రస్తావించినది.)మరియు ఈ భేదమునుబట్టి ఆమూడింటికిని లిపిలో ప్రత్యేక చిహ్నములు లేవు. (ళకారము వర్ణాంతరముగా గ్రహింపబడినది.) రేఫ కున్న లఘ్వలఘుభేదము గూడ అట్టిదే అయినచో దీనికిగూడ లిపిలో మరొక చిహ్న ముండరాదు. కాని నన్నయగారికన్న పూర్వమునుండియే, 'టకారాదేశము' తగ్గినినాటినుండియే రేఫకు ఉచ్చారణ భేదమునుబట్టి ప్రత్యేక చిహ్నము లేర్పడినవి. కావున యవల లకు మిగిలిన వ్యాకరణములదృష్ట్యా లఘ్వలఘుభేద మున్నను తెలుగున రేఫ కున్నభేదముతో దానికి సంబంధము లేదు. ఇది ప్రత్యేకముగా తెలుగుకు మాత్రమే చెందినది. అందువల్లనే చింతామణి 'రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః' అని 'అత్ర' (=ఇక్కడ=ఈతెలుగులో) పదము నుపయోగించినది. అట్లుగాక య—ల—వలవంటి లఘ్వలఘుత్వమే ఆ భేదమును బట్టి య—వ—లలకువలె రేఫకు ప్రత్యేకచిహ్నము లేదనుకొన్నచో, లిపిలో కన్పించు 'ఱ'కారమును వర్ణాంతరముగా గ్రహింపవలసి యుండును. ల—ళలకు

ఉచ్చారణసామ్య మున్నను ళకారమును చింతామణి వరా ంతరముగా ప్రదర్శించినది తెలుగులోని వర్ణములను పరిగణనము చేసిన చింతామణి సూత్రములన బాలసరస్వతి ఒకవిధముగా, అప్పకవి మరొక విధముగా పఠించినారు. ఆపాఠము లిట్లున్నవి.

బాల : "షట్త్రింశ ద్రత తే ఒన్యే చాను ప్రవిశంతి శబ్దయోగవశాత్
ద్వివిధా దిదుదేదోతోచో ఒవ్రకతమా వనుస్వారౌ
కగచజయుగ టడణ తదన పబమ యరలవ సహళంతు హల్వర్గః'

అప్పక—"సప్తత్రింశది హాన్యే ఒ చాను ప్రవిశంతి.........
.....య రయుగ లయుగ వసహాశ్చ హాః'

తెలుగులో ముప్పదియారక్షరము లని బాలసరస్వతి, ముప్పదియే డని అప్పకవి బాలసరస్వతిపాఠములో శకటరేఫ చేరలేదు. అప్పకవిపాఠములో (రయుగ)చేరినది. అందువలన ఈభేదము కలిగినది. రేఫకు య—ల—వలకువలె లఘ్వలఘు భేద విషయమెట్లున్నను శకటరేఫకు ప్రత్యేకలిపి చిహ్నము, ళకారమునకువలెనే ఉచ్చారణలో కొంతభేదము ఉండుటచే శకటరేఫను గూడ ప్రత్యేక వర్ణముగా పరిగణించిన అప్పకవి పాఠమే సరియైన దనిపించును.

అయితే, 'నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్' అని, య—ల—వలకు లఘ్వలఘు భేదమున్నను వైధర్మ్యము పాటింప నవసరము లేదనియు, రేఫకు మాత్రమే నిత్యముగా పాటింపవలె ననియు చెప్పుట యెట్లు సమన్వితమగును. 'రయోస్తు' అన్న ఏక శేషవైన రేఫశకట రేఫలకు అని చెప్పుటకు వీలులేదుగదా మరి! కాని, 'రయోః'వలన తెలియు లఘ్వలఘురేఫలు, రేఫ—శకటరేఫలు కానిచో వైధర్మ్యమును వీటికి యతిప్రాసల విషయమున పాటించుట ఎట్లో స్పష్టము కాదు. మరి యతిప్రాసలప్రసక్తి ఇట లేదనుకొన్నచో, ఈ వైధర్మ్య నిత్యత్వమును చెప్పుటలో ప్రయోజనము లేదు. అందువలన య—ల—వల లఘ్వలఘుత్వమునకును రేఫయొక్క లఘ్వల ఘుత్వమునకును భేదమున్న దనియు, ఈ భేదము తెలుగులో ఉభయరేఫల ఉచ్చారణ లిపి భేదముల నుద్దేశించి కల్పించబడినదని చెప్పుకొనుటయు అవసరము. ఈరెంటినే లఘ్వలఘు లనుకొన్నచో 'రయోః' అని ఏకశేష చెప్పుటలో నష్ట

మేమియు నుండదు. స్పష్టముగానే వినిపించు ధ్వనిభేదము, కనిపించు లిపిభేదము ఉండగా మరింకొక విధముగా భావించుటలో ఆ సూత్రప్రయోజనమును కుదించినట్లే యగు ననిపించును.

నన్నయగారికి రేఫఅకారముల విషయమున ఇంతగా స్పష్టమయిన దృష్టి ఉన్నందువలననే, వాటి ఉచ్చారణములో శైథిల్యము చాలవరకు వచ్చినను తమ రచనలో యతిప్రాసలం దెక్కడను రేఫ అకార సాంకర్యమును చేయలేదు. కాని తరువాతివారి కింతటి స్పష్టత లేకపోవుటచే సాంకర్యము, మతభేదము తప్పలేదు. అథర్వణుడు మతభేదములను ప్రస్తావించినాడు. కొందరు యతిలో ఈ సాంకర్య మొప్పుకొనగా, కొందరు ప్రాసలోకూడ ఒప్పి కొన్నారు.[1] కాని అథర్వణుడు నన్నయగారి ననుసరించి సాంకర్యమును ఉభయత్ర ఖండితముగా నిరాకరించుటయే కాదు సాంకర్యను చేసిన కవిని దుష్కవి యనియు నన్నాడు[2]. దీనిని బట్టి అథర్వణుని నాటికి రేఫ—శకటరేఫలు గల పదములు శకటరేఫ—రేఫలు గలవిగా బాగా వ్యాప్తికి వచ్చినట్లు చెప్పకొనవచ్చును. అందువలననే ఈ మార్పులను కవిపండిత ప్రయోగముల ద్వారా తెలుసుకొనవలె నన్నాడు. మరియు నన్నయగారి ప్రయోగముల ననుసరించి రేఫ—అకారములు గల పదములను సూచించినాడు. ఈ సూచనలే తరువాతివారికి రేఫ—అకారములుగల పదపట్టికలు సిద్ధము చేయుటలో మార్గదర్శకము లయినవి.

---

1. "కశ్చి ద్వదతి సాంగత్యం యతావే వానయో స్తథా
అవదచ్చాత్ర సాంగత్యం ప్రాసే ష్వపిచ కశ్చన." అథ–సంజ్ఞ.20
2. "అనయో స్సంగతిం యస్తు కరోతి కవితాకృతౌ
అస్యా అత్యంత దోషత్వాత్ దుష్కవి స్సహి కథ్యతే". అథ–సంజ్ఞ. 21
3. "లఘు ర్భవే ద్గురుః కుత్రచిద్ గురుశ్చ లఘు స్తథా
ఉచ్చారణస్య కష్టత్వాత్ నిదానం తత్ర సద్వచః' అథ.సంజ్ఞ.13
4 "క్రియాంతే చాన్యవర్ణేచ లఘురేఫాః ప్రకీర్తితాః
ద్వివిధా దిదుతశ్చస్యు రయవౌచ కగౌ తథా
చజౌ పవౌ తదౌ వర్ణౌ, సవరా వన సంయుతాః
ఏతే ద్వితయ సంయుక్తా రేఫోఽత్ర తతు సమ్మతః
ళఘు ర్నాస్తి జకారస్య లఘుస్స్యా కదాపిన

యతిప్రాసముల విషయమున ఒకదానికి మఱొకటి చెల్లవనియు, అవి దేవదానవులవలె జ్ఞాతివైరముతో ఎడపెడగా నుండుననియు రేఫఱకారములనుగూర్చి లాక్షణికులు కొందరు చెప్పినారు.[1] యతిప్రాసముల విషయమున వైరమనియే తప్ప నిజమునకు శకటరేఫ రాక్షస మని కాదు. యతిప్రాసములలో రేఫ ఱకారముల కభేదము చెప్పువాడు జీవేశ్వరు లొకటేయను దుర్వాది యని చిత్రకవి పెద్దన చెప్పినాడు.[2] చి. పెద్దన విశిష్టాద్వైతమునకు చెందినవాడు కావున అట్లు చెప్పినాడు. తిమ్మన కూడ రేఫ శకటరేఫముల జ్ఞాతివైరము నితరులవలెనే చెప్పినాడు. మఱియు,

---

లఘువ శ్లాఖి శైలాగ్ని యోన్యే ఖగతి బర్హిషః
అన్యేంతరిక్ష సదృశో ఒ న్యే నయుక్తాః కదాపి చ.
కేచి ద్వదంతి చ లఘూన్ బిందు బాణ శిలీముఖాన్... "
తథా వదంతి కేచిత్తు హర్యంఘ్రి ఖ శరాన్ పరాన్' అథ.సంజ్ఞ.14–18.

వీటిలో సంఖ్యావాచకములుగా కన్పించు పదములు, సంఖ్యావాచకములు కావని తదర్థము గల తెలుగు పదసూచకము లని శ్రీ వజ్ఝలవారు నిరూపించినారు. (చూ.ఆం.వ్యా.సం.స.పు.145).

1 'జ్ఞాతివైరంబు లంది ప్రాసంబులందు
విశ్రమములందుఁ దమలోన వేఱు కలిగి
దేవదానవులట్లన తెలుఁగులందు
మించి రేఫ ఱకారముల్ మెలఁగుఁ గృష్ణ'. అప్పక.2–229.

ఈపద్యము, మఱియు 'సారిదిభోజకస్య...' యను పద్యము అప్పకవివిగా అతని గ్రంథమున నున్నవి. తిమ్మన వీటిని ముద్దరాజు రామనవిగా పేర్కొన్నాడు.

2 'పృథివి జీవుఁ డీశుఁ డను నభేదవాది
వలెనె వాదించి కుకవి దుర్వాది సభలఁ
దాను రేఫకు ఱొకు భేదమె యనునది
కృతులఁ జేపట్టు, సుకవి సమ్మతము కాదు'. ల.సా.సం.3–4.

'ఎన్నిలక్షణంబు లెఱిఁగిన రేఫలు
బండిఱాలు నెఱుగ కుండునట్టి
కవి కవిత్వ మెల్ల గవ్వకుఁ గొఱగాక
కొఱఁతఁ జెందు, రజతకుధరనిలయ'

అనియు చెప్పినాడు. 'రయోస్తు నిత్యం స్యాత్' అని మాత్రము చింతామణి చెప్పుటయు, దానిపై 'అత్యంత దుష్టత్వాత్' అని అధర్వణుడు ఖండితముగా చెప్పుటయు, అప్పటినుండి లాక్షణికు లింత తీవ్రతకు పెరుగుటయు జరిగినది. చింతామణి సూత్రములో 'నిత్యం' అని లేకున్నచో వింత పెరిగెడిది కాదేమో యనిపించును.

ఈ రేఫ ఱకారము లేయే పదములం దుండు నననది గూడ ఒక ప్రశ్నయేగదా! రేఫకన్న ఈ విషయమున శకటరేఫ కధికప్రాధాన్య మున్నది. రేఫ గలపదముల పట్టికలను లాక్షణికులు సిద్ధము చేసినను ఱకారము గల పదముల విషయమున కవిప్రయోగములు చూపుటలో ఆస్థ మిక్కిలిగ చూపినారు. దీనికి కారణము శకటరేఫ యొక్క ఉచ్చారణములోని ప్రత్యేకత నశించుటయు, లేదా అత్యంతము తక్కువగుటయును. దీనివలన శకటరేఫ గుర్తింపులో కష్ట మధిక మగుటచే, దానిని సాధ్యమయినంతవరకు ప్రయోగములద్వారా తొలగించుటకు లాక్షణికులు శ్రమ పడినారు.

కేవలము హ్రస్వాక్షరముల తరువాతనేగాని, దీర్ఘాక్షరముల తరువాత శకటరేఫ ఉండ దని వెల్లంకి తాతంభట్టు చెప్పినాడు. ఈ మతమును అప్పకవితోబాటు తిమ్మనయు నిరాకరించినాడు.1 మరియు "—పదము మొదలు నిడుదఁ దుది

1. సీ."వెల్లంకి తాతన బొల్లెను బండిఱా
నిడుదపైఁ'గలుగదు నిక్కమనుచుఁ
గావున నేను దీర్ఘములపైఁ గల పెద్ద
ఱా లొకకొన్ని యేర్పఱతు నింక'. అప్పక. 2–197

దద్భవంబుల, రేఫకాని శకటరేఫ కాదు' అని దిట్టకవి వేంకటార్యుడు చెప్పినాడని తిమ్మన అతనిని కాదనుచు —'పదము మొదల నిడుదఁ దుదిఁ గురురేఫలు గలిగి యుండుఁ గృతుల' నని చెప్పినాడు. అయితే వేంకటార్యుడు చెప్పిన తద్భవముల విషయము మాత్రము తిమ్మన చెప్పలేదు. కాగా తద్భవములందు శకటరేఫ ముండదనియే తిమ్మన భావించినట్లు స్పష్టమగును.1

తిమ్మన ఏయే అక్షరముల తరువాత శకటరేఫము లుండునో చెప్పుచు క—గ—చ—జ—త—ద—న—ప—బ—మ—వ—స అను హల్లులను, అ—ఇ—ఉ—ఎ—ఒ— అను అచ్చులను పేర్కొనినాడు. అనగా వీటి తరువాతనే శకటరేఫము లుండునని. అథర్వణు ననుసరించి తిమ్మన ఇట్లు చెప్పినాడు. ఈ చెప్పిన వరుసలలోనే పదముల పట్టికల నిచ్చినాడు. ఇక్కడ అచ్చులు హ్రస్వములుగానే సూచింపబడినను. దిట్టకవిని నిరసించుటచేత, మరియు పట్టికలవల్ల దీర్ఘాచ్చులను గూడ తిమ్మన ఉద్దేశించినా డని చెప్పవలసియుండును.

శకటరేఫలు గల పదములను చెప్పుచు మధ్య మధ్య పూర్వులు చెప్పిన కొన్ని పదములను వారివారి మతము ననుసరించి శకటరేఫలుగానే చెప్పియు, 'అకార మగుట కుదాహరణము చింత్యము' ఇత్యాదిగా కొన్నిపదములలో అకారమునకు ప్రయోగ రాహిత్యము చెప్పినాడు. 'గరగరి యనుటకు, గొరవంకపిట్ట లనుటకు

---

'వెల్లంకితాతయార్యుఁడు
తెల్లముగా శకటరేఫ దీర్ఘంబులపైఁ
జెల్ల దని పలికె నదియుం
గల్ల వితర్కింపఁ ప్రౌఢకవిసమ్మతులన్.' తిమ్మన.3ఆ.

1 తద్భవములలో శకటరేఫ ఉండదని పలుమంది అభిప్రాయపడినారు. కవిసంశయవిచ్ఛేదమున సూరకవి 'తద్భవపుంబదములఁ దవిలిన యారేఫ రేఫకాని శకటరేఫ కాదు' (2—1)అని చెప్పినాడు. కాని ప్రౌఢవ్యాకరణకర్త తద్భవములందు శకటరేఫమునకు పలు ఉదాహరణములు చూపినాడు. (చూ.సంజ్ఞా.9సూ.) అయితే తద్భవస్థ శకటరేఫలు నన్నయగారి ప్రయోగములలో కనిపించ వని శ్రీ వజ్ఝలవారు చెప్పుచున్నారు. (వైయాకరణ పారిజాతము. పు.454).

రేఫఅకారము రెంటం జెప్పినాడు. గురురేఫ కుదాహరణ చింత్యము' ఇత్యాదిగా కొన్నిచోట్ల ప్రథమ పురుష క్రియలతో తిమ్మన ఎవరి నుద్దేశించినాడో చెప్పుట కష్టతరము. తిమ్మనకు పూర్వము శకటరేఫ నిర్ణయము చేసినవారు పలువు రున్నారు. వారందరి పట్టికల సమీకరించి, సమీకృత పట్టిక నొక దానిని సిద్ధము చేసినప్పుడే ఈ విషయమును కచ్చితముగా చెప్పుటకు కొంత వీలుండును. అయితే తిమ్మన ఈ విధముగా మధ్య మధ్య చెప్పుటబట్టి తనకు పూర్వపు రేఫ అకార నిర్ణయములను బాగుగా పరిశీలించియే, స్వమతానుసారముగా ఈ పనికి పూనుకొన్నా డని స్పష్టమగును.

శకటరేఫములను నిర్ణయించు నిర్ధారక ప్రయోగములను తిమ్మన విరివిగా చూపినాడు. కేవలము శకటరేఫములకే కాదు, ఉభయరేఫములు గల పదములకును విరివిగనే చూపినాడు. అప్పకవి కేవలము ఈ ఉభయరేఫాత్మక పదములలో పన్నెండింటికి మాత్రమే ప్రయోగములు చూపినాడు. దీనివలన రేఫఅకారముల నిర్ణయించు ప్రయోగముల విషయమున తిమ్మన చేసిన పరిశ్రమ తెలియవచ్చును.

రేఫ అకారముల వైరమును గూర్చి మొదట అంతటి వైరమును చెప్పిన తిమ్మన—

'అరయ గురురేఫ హల్లుతోఁ బెరసినపుడు
ప్రాసముల విశ్రమముల రేఫములతోడ
గలసి యుండును సుకవిపుంగవుల గృతుల...'

అని చెప్పినాడు. అనగా శకటరేఫ మరొక హల్లుతో గలసి సంయుక్తమయినపుడు, రేఫసంయుక్తముతో యతిప్రాసలు చెల్లునని భావము. నూఱు, కాఱు, వేఱు, మాఱు వంటి పదముల చివరి శకటరేఫములు మరొకహల్లుతో గలసి, చివరి ఉకారము లోపింపగా నూఱ్వురు, కాఱ్చిచ్చు, వేఱ్వేఱు, మాఱ్మలయు వంటి శకటరేఫ సంయుక్తము లేర్పడును. వీటికి రేఫతో, రేఫసంయుక్తముతో యతిప్రాసలు చెల్లవచ్చును. ఈ విధమయినవాటికి తిక్కన, ఎఱ్ఱన గ్రంథముల నుండి ప్రయోగములను తిమ్మన చూపినాడు.

'నూఱ్వురు—సర్వ—ఉర్వి—నిర్వహణంబు'
'కాఱ్చిచ్చు—నేఱ్చు—పేర్చి—అర్చులు'

రేఫశకటరేఫల యతిప్రాసలు దుష్టమన్నప్పుడు, ఈ విధమైన యతి ప్రాసలును దుష్టములే కావలయును. అట్టిచో వీటి నంగీకరించుటలో సామంజస్యము లేదు. కాని కవుల ప్రయోగములు కన్పించుచున్నవి. కా దనుదెట్లు? మరొక హల్లుతో బెరసినపుడు శకటరేఫ యొక్క వైరస్వభావము తగ్గ ననుకున్నాడో ఏమో మరి!. శుభాశుభ వర్ణములలో అశుభవర్ణము శుభవర్ణముతో సంయుక్తమయినప్పుడు తన యశుభత్వమును కోల్పోవుటయో, తగ్గించు కొనుటయో జరుగునట్లు సాంప్రదాయికముగా చెప్పబడుచున్నది. ఆ విధానవే ఇక్కడకూడా అవలంబిపబడినదేమో యనిపించును.

కాని, కాఱు + చిచ్చు మొదలగుచోట్ల శకటరేఫము పెరహల్లుతో కలిసి నప్పుడు 'కార్చిచ్చు'అని రేఫసంయుక్తముగా మారునని యొక అభిప్రాయ మున్నది[1]. కాని అట్లనుటలో సామంజస్యము కన్పించదు. శకటరేఫము అన్యహల్సం యోగములో రేఫోచ్చారణమును పొందు ననుటలో కొంత సామంజస్య ముండ వచ్చును. అంతెందుకు? అచ్చముగా శకటరేఫములకే వ్యవహారమున రేఫోచ్చా రణము కలుగుచున్నది. మరి ఉచ్చారణలోని ధ్వనియే ప్రధాన మనుకొన్నచో రేఫ శకట రేఫముల వైరమునే చెప్పనక్కర లేదు. ఎన్నియో అపవాదము లున్నవిగదా! 'కాఱ్చిచ్చు'లో శకటరేఫకు రేఫోచ్చారణ మున్నదనుకొన్నను 'కాఱు' లో శకటరేఫ మున్నదన్న గుర్తింపు ప్రధానము. నిజమునకు వట్టి 'కాఱు'లోని శకటరేఫకును రేఫోచ్చారణ మున్నది. గాని అక్కడ శకటరేఫగానే గుర్తింప బడుచున్నది. ద్రుతసంయోగమున కకారము గకార మగుచున్నను, సంయోగము లేనప్పుడు కకారమునకు ఉచ్చారణములో గకారధ్వని లేదుగదా! ఆ రెంటి ధ్వనుల మార్పిడికి అవకాశమే లేదు. రేఫ ఱకారముల విషయ మట్లుకాదు. వీటి మార్పిడికి అవకాశము సర్వత్ర యున్నది. కావున అక్కడ మారిన ధ్వనికిగాక శకటరేఫోచ్చారణ యుండె నన్న గుర్తింపునకే ప్రాధాన్యము. అందువలన 'కాఱ్చిచ్చు' వంటివాటిలో శకటరేఫకు, రేఫోచ్చారణ ఉన్నను, లేకున్నను,

1.'.....సంయోగమున్న నలఘువు లఘువుగా మాఱుననుట యెంతయు యుక్తము గదా! వర్ణాంతర సంయోగమున నక్షరములు మాఱుచుండు ననుటలో వింత యేమున్నది? ద్రుత సంశ్లిష్టములగు కచటతపలు గజడదబలుగా మాఱుచుండలేదా ....'(చూ: వైయాకరణ పారిజాతము. పు.440.)

అక్కడిది శకటరేఫ యగుట ప్రధానము. ఆ దృష్టితోడనే తిమ్మన ఇట్టి చోట్లను శకటరేఫ సంయుక్తములుగానే భావించినాడు. ప్రయోగదృష్టితో వీటికి యతిప్రాసమైత్రిని అంగీకరించినాడు. ఈ విషయమును ఇంత స్పష్టముగా, కచ్చితముగా తిమ్మనయే చెప్పినాడు.1

శకటరేఫోచ్చారణములో రేఫోచ్చారణము నన్నయగారి నాటికే వచ్చినదని, కాని ఆ రెంటిని విడిగా గుర్తించ వలెనని 'రయోస్తు నిత్యం స్యాత్' అని చెప్పి, నన్నయగారు జాగ్రత్తగా గుర్తించి ప్రయోగించినా రన్నది ఇదివరకే చెప్పబడినది. అయితే.

'నన్నయభట్టాదుల కృతు
ల న్నిలిపిన లక్ష్యములను లక్షణము లెఱుం
గ న్నేరక యిది కల్లని
యెన్నుదు రొక కొంద ఱిందు కేమి యనంగన్'

అని నన్నయగారితో బాటు 'ఆది' పదముతో మరికొందరిని గూడ తిమ్మన సూచించినాడు గాని, రేఫఱకార సాంకర్యము చేయని నన్నయేతర కవి ఎవ్వరును ఉన్నట్లు కన్పించదు. అరుదుగనో, విరివిగనో ఈ సాంకర్యమున కందరును పాల్పడిన వారే. 'అరచెయ్యి' 'అరకాలు' .....అను నప్పుడు రేఫ ఱకారములు రెండు న్నయ్యేటట్లుగాను మహాకవులు ప్రయోగించినారు' అని తిమ్మన

---

1. ఓగిరాల రంగనాధకవి తన ద్విరేఫవర్ణదర్పణమున 'కాఱ్చు'వంటి వాటిని, 'కాఱ్చు, కార్చు' అని ఉభయ రూపమున గ్రహించవలె నన్నాడట. కాని, '...స్వరలోపపక్షమున 'తీర్చు, తీఱ్చు' అను రెండురూపము లుండు ననియు స్వరలోపాభావపక్షమున 'తీఱుచు' అను ఱకారరూపము మాత్రమె యుండు ననియుఁ జెప్పుటచేత -స్వరలోపమునఁ బాక్షికముగ నైన శకటరేఫ మగుచున్న దన్న విషయము ఘట్టకుటీప్రభాతన్యాయమున దుర్వార మగుచున్న దని యాతఁ డెట్లు తలంపఁడయ్యెనో?...' అని ఈమతమును శ్రీవజ్ఝలవారు నిరాకరించినారు. (చూ.వై.పారి.పు.441)అట్టిచో శకట సంయుక్త రూపమునే గ్రహించుట సమంజసము.

అర–అఱ అని రెండువిధములుగా తిక్కనాదుల ప్రయోగములను తిమ్మన ప్రదర్శించవనే ప్రదర్శించినాడు. 'అఱ—అర'అన్న వాటిలో ఏదో ఒకరూపము అసలురూప మవి మంొకటి ఉచ్చారణలోని మార్పువలన వచ్చిన రూప మని స్పష్టము. ఈ రెంటిలో సహజముగా ఏరేఫ మున్నదనుకొన్నను, ఈరెంటిని ప్రయోగించుటవలన సాంకర్యము చేసినట్లే అగును.1 రేఫకు ప్రాస(యతి) చెల్లించినపుడు 'అర రేఫతో ఉన్నదని, శకటరేఫకు చెల్లించినపుడు శకటరేఫతో ఉన్న దనుట కేవలము సాంకర్యమును లాక్షణికముగా తొలగించు ప్రయాసయే.

శకటరేఫము లున్న పదములను చెప్పి 'అకారప్రకరణము'ను పూర్తి చేసిన తరువాత తిమ్మన—

'అలసానిపెద్దకవి పిం
గళిసూరన రామభద్ర కవివర్యుఁడు పి
ల్లలమఱ్ఱి వీరభద్రుఁడు
గలిపిరిగద కృతుల ఱొలఁగడు రేఫములున్'

అని వారు చేసిన రేఫ అకార సాంకర్యమునకు వారివారి పద్యములను ఉదాహరించినాడు. ఇంతకు ముందు చెప్పినట్లుగా 'అఱ—ఱొయి' వంటి పదములలో తిక్కనగారివంటి వారే రేఫఅకారసాంకర్యము చేసినట్లు స్పష్టము కాగా, అలసాని పెద్దన వంటి వారిని తిమ్మన ప్రత్యేకముగా పేర్కొన వలసిన అవసరము లేదు. 'అర'యొక్క ఉభయరేఫాత్మకతకు సూరన ప్రయోగములను తిమ్మన ఉదాహరిం చియే ఉన్నాడు. ఒక విధముగా రేఫఅకార సాంకర్యము నక్కడే చెప్పినట్లయినది,

---

1 '.....అఱ''శబ్దము 'అఱ్ఱి' (పెట్టెలోనగు వానిలో నొకభాగము) అనుదానిలో నొక అకారము లోపింపఁగా మిగిలిన రూపము. కావున 'అకార' ఘటిత మగు 'అఱ' శబ్దము దేశ్య మనియు, రేఫవంతముగ 'అర'శబ్దము 'అర్ధ'శబ్దభవ మనియు గ్రహింపనగును' (వై.పారి.పు.450) అయితే ఈ అర్థభేదమును కవులఁ పాటించినట్లు లేదు. 'అఱపాఱుడు.....' ఇత్యాది భారతపద్యము (అర. 2–135)న 'అట' పెట్టెలోనగువానిలో నొకభాగ మని అర్థము కుదురునా. 'అఱచందమామ' లోని 'అఱ' సగ మను అర్థము గలది గదా! కావున నిట్లనుటలో పెద్ద ప్రయోజనము లేదు.

ఇక 'పాలు—ఊఱు—గాయి—ద్రాఱు—తేవు—తెక్క—నూఱు (సంఖ్యావాచకము) —వ్రాఱు—తీఱు—తేఱు వంటి పదములుగూడ ఉభయరేఫాత్మకములుగా స్వీకరించినచో పెద్దనాదులు చేసినారని చెప్పబడుచున్న ఈ రేఫఱకార సాంకర్యమును నివారించి నట్లగును. 'అర' ఉభయరేఫాత్మక మనుటకు ప్రయోగములే ఆధారము. పై పదములుగూడ ఉభయరేఫాత్మకము లనుటకును పెద్దనాదుల ప్రయోగములే ఆధారము. మరియు ఈ పెద్దనాదులను ఇతరత్ర మహాకవులనుగా భావించి వారి ప్రయోగములను స్వీకరించుట జరిగినదిగదా! మరి తిమ్మన పై పదములను గూడ ఉభయరేఫాత్మకములుగా గ్రహించినచో సరిపోయెడిది. మరియు, బాలసరస్వతి 'నాన్యేషాం....'అనుచింతామణిసూత్రమునకు టీక వ్రాయుచు 'రేఫఱకారము లనుపరా దని 'చెప్పియు, తన 'చంద్రికాపరిణయము'న 'తెక్కలు—చరించి' అని యతిలో రేఫఱకార సాంకర్యము చేసినాడని తిమ్మన అధిక్షేపించినాడు. కాని తిమ్మనయే తన 'రాజశేఖర విలాసము'లో ఈ సాంకర్యమును విరివిగా చేసినాడు.[1] అందువలన తిమ్మన బాలసరస్వతి నధిక్షేపించుటలో సామంజస్యము లేదు. ఒక బాలసరస్వతి, తిమ్మనలేకాదు, రేఫఱకారములు కలుపకూడ దన్న అనంతాప్పకవ్యాదులు పలువురు, పొరపాటుగనో, వ్యవహారములోని అలవాటుగనో ఈ సాంకర్యము చేసినవారే.2

---

1 చ.''చిరతర విక్రమ స్ఫురణచే సముదంచిత కుంభి కుంభముల్
పఱియలు చేసి..........................................'' రా.శే.వి.1–72

చ''గుఱుతుగ పద్మరాగమయ కూట తటంబులఁ గ్రీడసేయు న
త్కరి నికరంబు .................. . ......... ........ . ''రా.శే.వి.2–34

చ. ''పురములు వాహనంబులును భూషణముల్ ధనధాన్యము ల్నవాం
బరములుఁ బాడిధేనువులుఁ బ్రార్థన సేయక జంగమయ్య యే
తెఱఁగున వేశ్యఁ గోరె............................''.రాశే.వి.3–148.

ఇట్టివి చాలా ఉన్నవి.

2 ''అంపమును వచ్చుగతి వచ్చె నఖముల రిపును
రంబు నరసింహాండనఁ గ్రాలు సంయుక్తయతి....' అనం.1–111
''మెఱయ వృత్తసంఖ్యయున్ బ్రత్యయంబు'' ల.సా.సం.3–144

''పురిటింటం బసిబిడ్డ చందమున వాపోవంగ నాఁడాత్మలో, ......గు,

ఇట్లు లాక్షణికులు రేఫఱకారసాంకర్యము చేసి పోతనగారిని ఈసాంకర్యము చేసినా డని నిందించుటలో అర్థము లేదు.

'బమ్మెర పోతరాజ కృత భాగవతంబు సలక్షణంబగా
కిమ్మహి నేమిటం గొదువ, యెంతయు నారసి చూడ నందు రే
ఫమ్ములు ఱాలునుం గదిసి ప్రాసము లైన కతమ్మునం గదా
యిమ్మహి నాదిలాక్షణికు లెల్లను మాని రుదాహరింపఁగన్'.

అప్పక. 2–234.

అని అప్పకవి1 వ్రాసినాడు. ఆదిలాక్షణికుల విషయ మెట్లున్నను పోతనగారి భాగవతములోని ద్వితీయస్కంధమందలి 'సర్వఫలప్రదాతయును...... 'అనుపద్యము ను అప్పకవియే ఉదాహరించినాడు. (4–69)మరి ద్వితీయస్కంధము పోతనగారి రచన కాదనుకున్నాడేమో? కాదనుకొన్నను, అవుననుకొన్నను రేఫఱకారసాంకర్య విషయమున నారయాదులరచనయు వెనుక బడినదేమియు కాదు. అయినను తానే ఉదాహరించి తానే మరల నిరసించుటలో ఔచిత్యము కన్పించదు. అహోబలు డును అప్పకవి మాదిరిగానే 'పురసతులవిలోకనములు, సరసాలాపములు నర్మసంభోగ ములున్, మఱిగి హరి మనల నొల్లఁడు, నరవరు లోయమ్మ నూతనప్రియులు గదే' అన్నపద్యము (భాగ.దశమ. 1216)నుదాహరించి. '—పోతన్న సూరన్న ప్రముఖైః క్రైశ్చి దుభయోః మైత్రీ ప్రోక్తా, సా ఽ నాకరత్వా దప్రామాణికీతి సుధీ పురోగై రనుసంధేయమ్' (అహో.సంజ్ఞా22సూ.వ్యాఖ్య) అని వ్రాసినాడు.

---

రైతుఱేఁ గిష్టంబుగ....'ఈపాఠము అప్పకవీయమున 4–320పద్యమునకు అధోజ్ఞాపికయందు చూపబడినది. అయితే 'ఎఱేఁగి + ఇష్టంబుగ అన్న క్వ్యర్థేకారసంధి అప్పకవి చేసియుండ డనియు వ్రాయబడినది. సంధివిషయ' మెట్లున్నను ఇక్కడ రేఫఱకారప్రాసము గలదు కాని ప్రాస లక్షింపబడలేదు సంధిదృష్ట్యా ''చ, న్నిరుకేలంగొని......' అనుపాఠముగా చూపబడినది.

1. ఈపద్యము ముద్దరాజు రామన్నదిగా తిమ్మన చెప్పినాడు కాని, అప్పకవిదిగా ఆయన గ్రంథమున నున్నది. ఇట్లు అప్పకవివిగా కనిపించు పద్యములను ముద్దరాజు రామన్నవిగా తిమ్మన పేర్కొనుట కొంత చిత్రముగా నున్నది. ఈపద్యము లేగ్రంథమునుండి దేనిలోనికి మారినవో నిర్ధారించుట మరొక పని.

పోతనగారి నింద రిట్లు నిరసింపగా తిమ్మన, వారినందరను నిరసించి 'అఖిలవేదాంతవిద్యారహస్యవిదుండు ....సకలాంధ్రలక్షణచక్రవర్తి.....—

'బుధజనహితుండు బమ్మెర పోతసుకవి
యెన్న రేఫఅకారంబు లెన్నఁ డనుచు
నజ్ఞ లోకకొంద ఱొడుదు, రమ్మహాత్ము
కవిత కెందును లోపమ్ము గలుగ దభవ!'

అని ఖండితముగా చెప్పినాడు. మరియు, సింగభూపాలుడు భాగవతమును పోతన గారు తన కంకిత మీయలే దను కోపముతో నాగ్రంథమును పాతిపెట్టించగా, అందులో కొంత శిధిలము కాగా, నారపరాజు గంగరాజు మొదలగువారు ఆ శిధిలభాగములు చెప్పినా రనియు, అట్టి భాగములందే రేఫఅకార సాంకర్యము కలిగినది కాని పోతనభాగమున గాదనియు చెప్పినాడు. ఈ కథలోని సత్యాసత్యము లెట్లు న్నను, పోతనగారు ఈ సాంకర్యమునకు పాల్పడలే దన్న తిమ్మన !దృఢవిశ్వాసమును ఈ కథ స్పష్టపరుచును. భాగవతమున ఏది పోతనగారి రచనయో, యేది కాదో ఎవరెవరి రచన ఎంతెంత ఉన్నదో తిమ్మన ఈవిధముగా చెప్పినాడు.

'పోతరాజు చెప్పినది ప్రథమస్కంధమును, ద్వితీయస్కంధమున గొంతయు, షష్ఠ సప్త మాష్టమ నవమ స్కంధములును, దశవ స్కంధము పూర్వభాగమున కొంత యున్నది. అందులో రేఫఅకార సాంకర్యము లేకుండుటకు వ్రాయుచున్నాము.'

ఈనిర్ణయము1 ననుసరించియే ఉదాహరణములను ప్రదర్శించినాడు. కాని షష్ఠస్కంధము అవతారిక, ఆశ్వాసాంతగద్యలతో కూడి సింగయరచన యని ముద్రితప్రతులందు (చూ.అకాడమీప్రతి) కన్పించుచున్నది.

1. తిమ్మన చెప్పిన దానిని బట్టి ద్వితీయస్కంధమున కొంత పోతనగారి రచన కాదని తెలియుచున్నది. మరి ఆ 'కొంత' ఎంతో? ఆ కాని కొంత నుండియే అప్పకవి పద్యము నుదాహరించినాడేమో? పోతనేతర భాగవతకవు లీసాంకర్యము చేయలే దని అప్పకవి చెప్పలేదు.

ఏకాదశ ద్వాదశస్కంధములు వెలిగందుల నారయ పేరిట నున్నవి. కాగా మిగిలిన స్కంధములన్నియు పోతనగారి పేరనే ఉన్నవి. తిమ్మన పేర్కొన్న గంగయ పేరు కన్పించదు. సింగయ, గంగయ పేరులలో తార్మారు జరిగినదేమో? లేక ద్వితీయ దశమ స్కంధముల 'కొంత' భాగము (దశమోత్తరభాగముతోబాటు) గంగయదిగా తిమ్మన భావించినాడేమో? అభాగములు 'కొంత'యే కావున గంగయ వాటిని పోతనగారిపేర బెట్టినాడేమో? కాని పరంపరగా గంగయ రచనగా చెప్పకొన బడుచుండెడివేమో? కచ్చితము లేదు. మొత్తముమీద పోతనగారి రచనలో రేఫఅకారసాంకర్యము లేదని మాత్రమే తిమ్మన నిరూపించ దలచుకొన్నాడు. ఆ ప్రయత్నమే చేసినాడు. ఇంత ప్రయత్నపడి సాధించన దేమిటి? పెద్దనాదులు అలాక్షణికకవు లని, పోతనగారు లాక్షణిక కవి యని రేఫ అకారముల విషయమున నిరూపించుటయేనా?పోతనగారికన్న ఎన్నోరెట్లు అధికముగా పెద్దనాదులనుదాహరించిన తిమ్మన వారి నలాక్షణికకవు లనుట ఎట్లు పొసగును? నిజమున కీ పోతనగారి ప్రస్తావన ముద్దరాజు రామన (అప్పకవి) చేయుట వలన, వారి నిరసనమును కాదనుటకు మాత్రమే తిమ్మన ప్రయత్నించినా డనవలెను తప్ప పెద్దనాదులను అలాక్షణికు లనుటకు కాదు. ''ఇటువలె మహాకవులకు రేఫఅకారములపట్ల పరిశీలన లేకపోయినది'' అని పెద్దనాదులను గూర్చి తిమ్మన అన్నమాట, పోతనగారికిని అన్వయించినచో పుట్టి మునిగెడి దేమిటో తెలియదు. ఇది పోతనగారిపై తిమ్మన కున్న ప్రత్యేకాభిమానమును మాత్రమే సూచించును.

నిజమునకు తిమ్మననాటికి రేఫఅకారముల విషయమున ఇంత పట్టుదల చూపవలసిన అవసరమే లేదు. కాని, సాంప్రదాయికముగా ఈ విషయమున చర్చ—నిర్ణయములు సాగుచుండుటవలన తిమ్మనయు ఆ విషయమున నీ ప్రయాసకు పాల్పడినాడు తప్ప అతనికిని పెద్ద పట్టుదల యున్నదన నవసరములేదు. పలు అపవాదములను ప్రదర్శించుట, సంయుక్తసందర్భమున సడలింపు ఈ పటు దలలోని విశ్లథత్వమును సూచించుచునే యున్నవి. ఉచ్చారణలో వచ్చిన ఈ శైథిల్యమును గూర్చి 'మహాకవులకే పరిశీలన' లేకపోయినప్పడు లాక్షణికుడుగా కొంత పరిశీలన చేసి దారులు చూపినాడు తిమ్మన. ఇవి తాను క్రొత్తగా వేసినవి కావు. పూర్వులు వేసినవాటినే పరిశీలనతో మరికొంత సంస్కరించి చూపినాడు.

**అర—నెరసున్నలు**

ఒక విధముగా చూచినచో ఈ రేఫ అకారములవంటిదే నెరసున్న–అరసున్నల సమస్యకూడ. నెరసున్నకే తప్ప అరసున్న కీనాడు పాటింపు లేదు. ద్రుతసంధి విషయములో దీనిపాటింపు కచ్చితమే అయినను అన్యత్ర కాదు. అరసున్న ఏపదములం దున్నది, లేనిది నిర్ణయించుట ఈనాడు కష్టతరము. ముఖ్యముగ దీర్ఘాక్షరములమీద. ఈ విషయములో తిమ్మన

'అఱసున్న లొదవు నిడుదల
నెఱసున్నలె గద్యములను నిలుచుఁ గృతులలో
నఱసున్నలు నెఱసున్నలు
కుఱుచలపైఁ గలిగియుండుఁ గుక్కుటలింగా'

అని సంజ్ఞా ప్రకరణమున వ్రాసినాడు.

మొదట ఈ అరసున్న నెరసున్నల విషయము చింతామణిలో ప్రస్తావించ బడినది.

'సిద్ధస్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధ భేదతో ద్వివిధః
హ్రస్వాత్ త్పూర్ణో ఽ పి భవేత్, 'దీర్ఘాచ్చేత్ ఖండఏవ స జ్ఞేయః'.

ఆధునిక కాలమున అరసున్నకు లిపి ఏర్పడినదిగాని ప్రాచీనకాలమున లేదు. అరసున్న పలుకవలసినచోటగూడ నెరసున్ననే వ్రాయువారు. అయితే ఏ నెరసున్నను, నెరసున్నగా, లేక అరసున్నగా పలుకవలెనో, సూచనగా, నెఱసున్నను నెరసున్నగానే పల్కవలసినచోట ఆ సున్నకు తరువాతి హల్లును ద్విత్వముగా, అరసున్నగా పల్కవలసినచోట ద్విత్వరహితముగా వ్రాయు పాక్షికలేఖనసంప్రదాయము నెలకొన్నది. ఇదియు సర్వత్ర కచ్చితముగా పాటింపబడిన దనుటకు వీలులేదు. అపవాదము లున్నవి.

నన్నయగారినాటికే హ్రస్వాక్షరములమీదను, దీర్ఘాక్షరములమీదన. పలుచోట్ల నెరసున్న నరసున్నగా తేల్చి పల్కుట బాగా అలవాటు లోనికిచ్చినది. హ్రస్వముమీదకన్న ఈ రీతి దీర్ఘములమీద అధికము. కాగా మొదట నెరసున్న గల పదములలోని నెరసున్నను తేల్చి పల్కుట కారణముగా, ఈ నాడు అరసున్న కన్పించు ప్రతి పదమునను నెరసున్న యుండియుండె నను

నిర్వివాదము. కాగా నెరసున్న స్థానమున నరసున్న వచ్చిన దని చెప్పవలసియుండును. జరిగినదిగూడ అంతే గదా మరి! కాగా పై చింతామణి సూత్రములకు, పదములలో మొదట అరసున్న యున్నట్లు, అది హ్రస్వములమీద నెరసున్నగా కూడ మారు నట్లు, దీర్ఘములమీద అరసున్నగనే ఉండునని అర్థము భావింప బడుచున్నది.1 మొదట నెరసున్నయే ఉండి, తేల్చుటవలన అది అరసున్నగా ఉచ్చారణలో మారగా నన్నయగా రట్లు చెప్పి రనుటలో సామంజస్యము లేదు మొదట పూర్ణ—అర్ధ భేదముతో అనుస్వారము రెండు విధము అని చెప్పబడినది తేల్చి పల్కబడు పూర్ణబిందువుకు నన్నయగారు పెట్టిన పేరు 'అర్ధబిందువు. హ్రస్వముమీద పూర్ణబిందువు'కూడ' ఉండు ననుటలో (పూర్వోక్తా'పి) హ్రస్వముపైగూడ కొన్నిచోట్ల బిందువును తేల్చిపల్కుట వ్యవహారములో నున్నను (తెనుంగు, తెనుఁగు) దానితో బాటు తేల్చకయే పల్కుటయు (బంతి, చెంత) ఉండుటచే, నెరసున్నగూడ హ్రస్వముమీద నుండునని భావము. ఇక, దీర్ఘముల మీద 'అది' (సః)— అనగా ఆ పూర్ణబిందువు ఖండమే. ఇట్లనుటవలన దీర్ఘమువిూద తేల్చిపల్కుటకే ప్రాచుర్య మని—భాషాపరిణామము దృష్ట్యా అదియే సమంజస మని ఉద్దేశ్యము. అంతేకాని అరసున్న స్థానమున నెరసున్న వచ్చుటయు రాకుండుటయు కాదు. 'పూర్ణార్ధ భేదతః' అని మొదట పూర్ణమున, పేర్కొనుటలో, అది తేల్చిపల్కగా 'అర్ధ' మగు నన్న స్ఫూర్తి ఉండనే ఉన్నది సూత్రములోని 'సః' అన్నదానికి, పూర్ణార్ధభేద ప్రసక్తి లేకుండ 'బిందువు' అనియే అర్థము చెప్పకొనవలెను గాని, అర్ధబిందు వని చెప్పకోరాదు అట్లర్థముచెప్పి అనర్థము కలిగించినవారు బాలసరస్వత్యాదులు.

కేతనయు పయివిధముగనే బిందువునుగూర్చి చెప్పినాడు. ఈ సందర మునకు చెందిన కేతన పద్యము ముద్రిత ప్రతులలో నిట్లున్నది.

1. ఆం. భా. భూ. శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారి పీఠిక. పు. xvii (1949)

'కుఱుచలపై నరబిందులు
నెఱయఁగ నూదినను జెల్లు నిడుపులమీఁదన్
నెఱయవు గద్యంబులలో
నెఱబిందువు లూదుఁ బద్యనికరములోనన్'. ఆం.భా.భూ.58.

దీని ఉత్తరార్ధమునకు తాళపత్రప్రతులపాఠ మిట్లున్నది.

'నెఱయవు పద్యంబులలో
నెఱబిందువులందు గద్యనికరములోనన్'

చివరిపాదమందలి 'నెఱబిందువులందు' అను దానికి 1923 నాటి వావిళ్ళప్రతిలో నెఱబిందువు లూఁదు' అని పాఠాంతరము చూపబడినది.1

ఉత్తరార్ధవిషయ మిట్లుండగా, పూర్వార్ధములో, కుఱుచలపై మొదట నరబిందువు లుండు ననియు అవి ఊదినను చెల్లు ననియు చెప్పినట్లగుచున్నది. కాని ఇది సరికాదు గదా! కుఱుచలపై నుండు నెరబిందువులను తేల్చి పలుకవచ్చునను భావ ముండవలెను. అట్లైచో 'అరబిందులు' అనికాక, 'నెరబిందులు' అని ఉండవలెను. అప్పుడు హ్రస్వములపై నెఱబిందువులను 'ఊదినను' చెల్లును అను అర్థము వచ్చును. 'ఊదినను' అనుటవల్ల 'ఊదకుండినను' అను అర్థము వచ్చును. 'ఊదినను' అన్నది 'పూర్వోక్తాపి'వలె నున్నది. వ్రాతలలో 'నెర' అన్నది 'నర' అని మారుటలో చిత్రము లేదు. తా.ప.ప్రతులలో 'కుఱులపై యరబిందులు' అని లేదు. తా.ప.ప్రతులలో 'కుఱుచలపై యరబిందులు' అని యున్నది. 'పై నర' అని ఉండవలెగాని, 'పైయర' అని ఉండరాదు గదా కాని 'నెరబిందు' వన్నది ప్రాతలలో పొరపాటున 'నరబిందు' వని మారినతరువాత 'పైన్'చివరి ద్రుతస్ఫూర్తిలేని వ్రాతలలో 'పైయర' అని మారి ఉండవచ్చును. కావున 'కుఱుచలపై నెరబిందులు' అని ఉండుటయే యుక్తము. ఇక, ఉత్తరార్ధములో 'నెఱయవు పద్యంబులలో' అని తా.ప.ప్రతులలో నుండగా '—గద్యంబులలో...' అని, నాల్గవపాదమున '—గద్యనికరములోనన్' అని ఉండగా '—పద్యనికరములోనన్' అని పరిష్కర్తలు సవరించినారు. ఈసవరణ కాధారము లేదు. తా.ప.ప్ర. పాఠమునుబట్టి, 'నిడుపులమీద పద్యములలో నెరబిందులు (ఊదగా) నెరయవు

1. ఆం. భా. భూ. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి పీఠిక. xvii పు.

—అనగా నెరబిందుల నూదిపల్కరాదు, గద్యములలో పల్కవచ్చును అనుభావము కలుగును. నిజమునకు గద్యములలో నెరసున్నను ఊది పల్కినను, తేల్చిపల్కినను వచ్చునష్టము లేదు. కాని పద్యములలో గణప్రాసాదులదృష్ట్యా నష్టమున్నది దీర్ఘములమీది పూర్ణబిందూచ్చారణ అత్యంతము దిగజారిపోయినను 'వీంగు' 'పోండి' వంటి వాటిలో నానాటి కింకను పూర్ణ మున్నట్లు నన్నెచోడాదుల ప్రయోగ ములవలన తెలియును. అందువలన ఈ దిగజారిపోవుటను, అన్నిదీర్ఘములపై సమానముగా నొక నియమము చేయుటకు 'పద్యంబులలో' నని చెప్ప బడినది. మరి గద్యములలో మాత్రము సమ్మతించు టెందుకు అనగా, గద్యములో ఊదినను ఊదకున్నను శబ్దస్వరూప నిర్ణయములో (ప్రత్యేకపదమం దలి సున్న తేల్చవలసినదా? కానిదా? అని నిర్ణయించుటకు) బాధ యుండదు. ఉచ్చారణలో నున్నంతవర కది ఆ యా పదములలో కొంతవరకు సమ్మతించవచు నని మాత్రమే పద్యవిషయమును ప్రస్తావించుటకు కారణము. లేనిచో గద్యపద్యవిషయప్రస్తావనయే అవసరము లేదు. మరియొకటి. సవరించిన పాఠములో గద్యములందు నిడుపులమీద నెరసున్న లూదవల దని తప్పనిసరి నియమము చేసినట్లు కన్పించును. పద్యములలోనే ఊదవచ్చు నన్నప్పుడు గద్యములలో ఊదవలయు ననుటలో ప్రయోజనము లేదు. అందువలన సవరించిన పాఠముకన్న తాళపత్రప్రతి పాఠమే సమంజస మనిపించును.

> కేతనయొక్క ఈ ఉద్దేశ్యమును సవరించియే,
> 'అఱసున్న లొదవు నిడుదల
> నెఱసున్నలు గద్యములను నిలుచుఁ గృతులలో'

అని తిమ్మన చెప్పినాడు. తిమ్మననాడు కొన్నిపదములలో నిడుదలపై నెరసున్న యొక్క ఉచ్చారణ, ఈనాడు కొన్ని ప్రాంతములందు కొన్ని పదములలో నిలిచి యుండినట్లే, ఉండి యుండును. ఆ కారణమున గద్యములందు మాత్రమే దాని ఉనికిని సమ్మతించినాడు. అప్పకవి ఈ సందర్భమున చింతామణి ననుసరించి గద్యపద్యప్రస్తావన యేమియును చేయలేదు. కాని తిమ్మన అట్లుకాక, కేతన ననుసరించి గద్యపద్యముల ప్రస్తావించి స్పష్టత కూర్చినాడు.

తిమ్మన పలుసందర్భములలో అప్పకవి ననుసరించినాడు. ప్రధానముగా చింతామణి సూత్ర పాఠమువిషయమున. ఉదాహరణమున కొకటి రెండంశము లిక్కడ గమనించవచ్చును.

'వికృతిపదాదౌ ప్రథమాంతఃస్థ తృతీయానునాసికౌ నస్తః
క్వచి దపి నస్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ'

అను చింతామణి సూత్రము నుదాహరించి తిమ్మన

'.......పదముల
మొదల వా కుత్వోత్వములు గలుగవు
లే దెయ్యెడలను శబ్దాది యకారంబు......'

అని సంజ్ఞా ప్రకరణమున వ్రాసినాడు. ఈ సూత్రము లప్పకవి చింతామణి పాఠమునందె యున్నవి. బాలసరస్వత్యహోబలుల పాఠములందు లేవు. ఈ సూత్రములు చింతామణియందు ప్రక్షిప్తము లని చెప్పబడుచున్నవి. అవి ప్రక్షిప్తము లవునా? కాదా? యన్న చర్చ ప్రస్తుతము కాదు. తిమ్మన ఈ విషయమున అప్పకవి ననుసరించినా డన్నది మాత్రమే ప్రస్తుతము.

ఇట్లే, తెలుగునం దుండు వర్ణములను పరిగణించు సందర్భమందును, తిమ్మన అప్పకవినే అనుసరించినాడు. అందుకనియే బాలసరస్వతి పాఠమున లేని శకటరేఫము తిమ్మన వర్ణపరిగణనములో చేరినది. (ఈ శకటరేఫ వర్ణమాలలో చేరుటనుగూర్చి ఇంతకు ముందే ప్రస్తావింపబడినది.)

అయితే, ఇంతమాత్రముననే అప్పకవినే తిమ్మన సర్వత్ర అనుసరించినాడని చెప్పుట కాదు. పలుచోట్ల అప్పకవిని —అప్పకవినే కాదు, చింతామణి సూత్రములనుగూడ కాదని, స్వమతమును తిమ్మన ప్రదర్శించినాడు. సాంస్కృతిక పరుషములకును గసడదవాదేశము వచ్చుటను, మూడు పురుషలలోను క్రియాంతేకార సంధి వైకల్పికతను సమ్మతించుటయు, కు విభక్తికి ముందు నకార రాహిత్యమున ప్రమాణీకరించుటయందును —ఇట్లే మరికొన్నిచోట్ల తిమ్మన స్వాతంత్ర్యవను

గమనించ వచ్చును. అవసర మనుకొన్నచోట్ల పూర్వులైన లాక్షణికుల మతమును కొన్నిచోట్ల నిరాకరించుటయు, కొన్నిచోట్ల స్వీకరించుటయు జరిగినది. ఇట్లు తిమ్మన స్వాతంత్ర్యమును వహించుటలో ప్రధాన మయినది తిమ్మన ప్రయోగ దృష్టి. ఏ ఒకటి రెండంశములందో సాంప్రదాయిక మయిన పట్టుదల భాసించినను, ప్రధానముగా మహాకవుల ప్రయోగములను ప్రమాణీకరించి విశాలదృష్టితో లక్షణ నిరూపణమే తిమ్మన కీ గ్రంథరచనమందు ప్రధానలక్ష్య మయినది. దాదాపు గ్రంథమంతయు దీనికి ప్రమాణము.

గ్రంథమునందు చర్చింపవలసినవిగాని, వివరింపవలసినవిగాని, చిన్నవి—పెద్దవి ఇంకా ఎన్నో అంశము లున్నవి. గ్రంథమున కొక విపుల వ్యాఖ్య రచించినప్పుడుగాని సమగ్రచర్చ, వివరణలకు అవకాశ ముండదు. ప్రస్తుత మిది ఇరుకయిన సందర్భము. అందువలన తిమ్మన ప్రయోగ పరిశీలనా రీతిని, సంస్కార దృష్టిని, దాని విస్తృతిని, సాంప్రదాయికమయిన ఒకటి రెండు చిన్నపట్టుదలలను సూచించుటకు మాత్రమే ఇక్కడ ప్రయత్నము చేయబడినది. ఈ పద్ధతిలోనే మిగిలిన అంశములను గూడ పరిశీలించుకొనవలసి యుండును.

### ఉపసంహృతి

మన కీనాడు లభించు లక్షణ గ్రంథములలో అప్పకవీయ మొక ప్రధాన ప్రమాణగ్రంథ మైనది. మిగిలిన లక్షణగ్రంథములకన్న ఈ గ్రంథమే మొదట ఆధునిక కాలమున అత్యధిక ప్రచారము నందుటయే దీనికి ప్రధానకారణము. ప్రాచీనకావ్యములను పరిష్కరించి ప్రకటించుట విస్తృతి పొందిన కాలమున, తాళపత్ర ప్రతులలోని దోషములను —కొన్ని దోషములే,మరికొన్ని దోషాభాసములు — సరిచేయుటలో పలుమంది పరిష్కర్తలకు అప్పకవీయమే దీపకంబ మయినవి. అందువలన ముద్రిత పరిష్కృతప్రతులలో, నిజమున కుండవలసిన —ఉండదగిన —పలు పాఠములో అప్పకవీయము ననుసరించి రూపు మార్చుకొన్నవి. భాషా ఛ్ఛందో లేఖన సంప్రదాయములను వాటి పరిణామక్రమమును నిరూపింప వీలయిన పాఠము లనేకములు మృగ్యమయినవి. ఈ విధముగా రూపుదిద్దుకొన్న పలుపాఠములు భాషా సాహిత్య విషయికముగా అనేకాంశములను నిర్ణయించుటకు దోహదము చేయలేకపోగా, అపనిర్ణయములకు మూలము లయినవి.అందువలన ఏదో ఒక లక్షణగ్రంథమును పట్టుకొని పాఠనిర్ణయము చేయుటలో ప్రయోజనము లేదు. భాష విశాలమయినది. నిత్యప్రవాహిని. పలువిషయములలో లాక్షణికులదృష్టి భిన్న భిన్నమయి

అయా కాలముల ననుసరించి ఆయా లక్షణకర్తల అభిప్రాయములను సమన్వయము చేసుకొనవలసియుండును. వేరువేరు కాలములలో వేరువేరు ప్రాంతములందలి లాక్షణికుల గ్రంథములు— కనీస మీనాటికి లభ్యమగుచున్నంతవరకైన పరిష్కృతములయి వెలువడినచో— తెలుగు భాషా చ్ఛందో లేఖన సంప్రదాయములు, మరి వాటి బహుముఖీనత, విశాల ప్రయోగ వైలక్షణ్యము, క్రమపరిణతి మొదలగు పలు విషయములు స్పష్టమగుటకు వీలు కలుగును.

ఈ దృష్టితోనే ప్రస్తుతమగు తిమ్మన గ్రంథ పరిష్కృతికి ప్రయత్నము చేయబడినది. నాకు లభించినప్రతు లాధారముగా ఈ పని జరిగినది విషయము విపులము. లాక్షణికమతములు భిన్నములు. అందువలన నెరసులు కలుగుట కవకాశము లేక పోదు. మరియు ఈ సమీక్షణమునందు లాక్షణిక మతప్రదర్శన పూర్వక సమన్వయమునకు ప్రయత్నింపబడినది. విషయచర్చలో అభిప్రాయ భేదము లున్నచోట ఔ గాదనుటలుగూడ తప్పవు. గమనించవలసినది విషయ ప్రతిపాదనములోని సామంజస్యము. భిన్నాభిప్రాయచర్చలో వ్యక్తుల ప్రసక్తికన్న విషయమునకే ప్రాధాన్యము. విషయ నిర్ణయమున నెరసులు దొరలినచో సహృదయుల సూచనలు శిరోధార్యము లని సవినయముగా మనవి చేసుకొనుచున్నాను. లాక్షణిక విషయముల పునఃపరిశీలనలో, నిర్ణయములలో నా యీ ప్రయత్న మేమాత్రము దోహదము కలిగించినను సార్థకమయినట్లే. ఈ ప్రయత్న సాఫల్యమునకు సహృదయులే ప్రమాణము.

—సంపత్కుమారాచార్య.

జగిత్యాల.

సాధారణ. ఆషాఢము.

శుద్ధ చతుర్థి.

జూలై 1970.

# లక్షణసారసంగ్రహము

## ప్రథమాశ్వాసము

ఉ. శ్రీనగజాఘనస్తనవిసృత్వరసంకుమద్రైణనాభిపం
కానిశవాసితస్ఫుటభుజాంతరుఁ, డిందుసుధాపయస్సదృ
గ్భ్వానుతకీర్తి, పీఠపుర కుక్కుటలింగ మహాప్రభుండు, శే
షానతభక్తపాలనపరాయణుఁ, డీవుత మా కభీష్టముల్. 1

క. రాణించుభక్తిఁ బొగడెదఁ
బాణిద్వంద్వంబు మోడ్చి, పరిపాలిత గీ
ర్వాణి, న్సమ్మదితాంత
ర్వాణి, న్మదరాజకీరవాణిన్, వాణిన్. 2

చ. కరములు దోయిలించి కుతుకంబున నిచ్చలుఁ బ్రస్తుతింతు, భా
స్వరగుణవంతునిన్ సకలసత్కవిజాలవనీవసంతునిన్,
జిరకరుణానిశాంతుని విశిష్టజనావనతానిశాంతునిన్,
సురతరుమంజరీనిభ యశోహరిదంతుని, నేకదంతునిన్. 3

క. చిరభక్తిన్ బొగడెద, మ
ద్గురునాథుని, దెండులూరి కులపావనునిన్,
గరుణానిధి, నపరాంతక
హరమూర్తిని, ఘనుని, లింగనారాధ్యమణిన్. 4

గీ. నన్నపార్యుని శ్రీనాథు నాచిరాజు
సోము నమరేశుఁ దిక్కన సోమయాజి
శంభుదాసుని భీము భాస్కరుని మఱియుఁ
గణుతి కెక్కిన సుకవిపుంగవులఁ దలఁతు.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును, వాణీగణేశ్వర స్తవంబును, గురుచరణ స్మరణంబును, మహాకవి వర్ణనంబునుం గావించి. 6

సీ. కౌండిన్యగోత్ర విఖ్యాతుండఁ, గూచిమం
చ్యన్వయాంభోధి నీహారకరుఁడ,
గంగనమంత్రిశేఖరునకుఁ బరమపా
వని యగు లచ్చమాంబకును సుతుఁడ,
1వెర వొప్ప రుక్మిణీపరిణయంబును, సింహ
శైల మాహాత్మ్యంబు, నీలపెండ్లి
కథయును, రాజశేఖరవిలాసము, నచ్చ
తెనుఁగు రామాయణంబును మొదలగు

కృతులు రచియించి పార్వతీపతికి భక్తి
తోడ నప్పన మొసఁగినవాఁడ, గంద
రాడపురసంస్థితుఁడఁ, గడుఁ బ్రోడ నేను,
దిమ్మకవిచంద్రుఁడను, జగద్వినుతయశుఁడ. 7

క. జగదుపకారార్థము క్రొ
త్తగ లక్షణలక్ష్యములు వితర్కించి బుధుల్
పొగడఁగఁ గృతిఁ జేసెద, నెర
వగు 'లక్షణసారసంగ్రహా' హ్వాయము వెనరన్. 8

1మ. ప్ర. బహుకావ్యనిర్మాణబంధురప్రతిభుండ
కుక్కుటేశ్వర కృపాంకూరలబ్ధ
సత్కవితామహా సామ్రాజ్యభారధౌ
రేయుఁడ బుధజనప్రియచరితుఁడ

దెందులూరి లింగనారాధ్య దేశికేంద్ర
దత్త మాహేశ్వరాచారవృత్తిరతుఁడఁ
బ్రథిత కంద్రాడ నగరాధిపత్యయుతుఁడఁ
దిమ్మనాఖ్యుఁడ నే జగద్వినుతయశుఁడ.

తే. తెలుఁగునకు మున్ను లక్షణంబులు మహాక
వీశ్వరులు పెక్కు రచియించి యిడి, రిఁ కేల
గూర్చవలె నన్నఁ, బ్రౌఢిమకొఱకు నాకుఁ
దెలిసిన తెరంగు నొకకొంత తేటపఱుతు. 9

క. నన్నయభట్టాదులు గృతు
ల న్నిలిపిన లక్ష్యములును లక్షణములు యు
క్తి న్నెమకి కృతి యొనర్చుచు
మున్నుగ నాంధ్రంబుచందమున్ వివరింతున్ ! 10

క. కరతలధృతసారంగా !
చిరతరకరుణాంతరంగ ! సింధునిషంగా !
కలిదైతేయవిభంగా
గురుతరగౌరాడ్తురంగ ! కుక్కుటలింగా ! 11

వ. అవధరింపుము. 12

## (చతుర్వి)ధాంధ్ర ప్రకరణము*

గీ. (ధాత్రిపైఁ దత్సమంబును దద్భవంబు,
ననఁగ దేశ్యంబు మఱియు గ్రామ్యంబునాఁగఁ
దెల్లముగ నాల్గు తెఱఁగులు తెనుఁగుబాస,
దనరుఁ దచ్విధమెఱిఁగింతు విను మహేశ) 13

## తత్సమములు

గీ. హరుఁ డనంగ, హరి యనంగ, గురుఁ డనంగ,
గురు వనఁగ నంబ యన, మహేశ్వరి యనంగఁ
గర్త యన, భర్త యనఁగ, సంహర్త యనఁగఁ,
దత్సమంబులు చెల్లు భూధరనిశాంత ! 14

గీ.తా.ప. ధాత్రిపైఁ దత్సమంబును దద్భవంబు,
2నచ్చతెనుగును. 3దేశ్య గ్రామ్యంబు లనఁగఁ
దెల్లముగ నైదుతెఱఁగులఁ దెనుఁగుబాస
దనరుఁ దచ్విధ మెఱిఁగింతు విను మహేశ!

తా.ప. *పంచవిధాంధ్ర ప్రకరణము
2. అచ్చతెనుఁగును గ్రామ్య దేశ్యములు
3. దేశ్య గ్రామ్యంబు నాఁగ.

ఆ. సవిత సవితృఁ డనఁగఁ జను, విధాత విధాతృఁ
డనఁగ నొప్పు, నాత్మ యాత్ముఁ డనఁగఁ
గృతులఁ దత్సమములు వితతంబు లగుచుండు
ధనదమిత్ర ! చారుధవళగాత్ర ! 15

### సవితృఁడు

క. సమరంబున భటులు గడున్
శ్రమ మొందిరి తమము గదిసినం గాని సము
ద్యమసంరంభ [4]ముడుప నిది
సమయం బని తొలఁగినట్లు సవితృఁడు గ్రుంకెన్. 16

*విరాటపర్వము* (3–194)

### విధాతృఁడు

తే. అతని కీర్తిప్రతాంబు లవనిఁ గలుగ
నేల యివి యంచు మదిలోన నెపుడు దలఁచు
నవుడు పరివేషమిషమున నబ్జసూర్య
మండలముల విధాతృండు గుండలించు. 17

*శృంగారనైషధము* (1- 58)

సీ. [5]ఓహో ! యుధిష్ఠిరుఁ డెచ్చట నడఁగియున్న
వాఁడొ, భీముని పార్థుని వర్తనంబు
లెయ్యెడల నేమిచందము [6]లయ్యెనొ క
టా, విధాతృండ ! కవ లెందు డాగి రొక్కొ. 18

*విరాటపర్వము* (4–129)

క. అలరఁగ భూ దివ్ శబ్దం
బులు భువి దివి యనఁగఁ బరగు, ముక్తపదములకున్
జలముక్కులు, రైనౌ పద
ములు రో నావ లగుఁ గృతులఁ, బురదైత్యహరా ! 19

4. ము. భార. ముడుగరిది. 5. ము. భార. అయ్యుధిష్ఠిరు.
6. ము. భార........ లయె నక్క, టా

క. హనుమద్భగవత్పదములు.
వనివడి హనుమంతుఁ డనఁగ భగవంతుఁ డవన్,
హనుమానుఁడు భగవానుఁడు
ననుచుఁ బ్రయోగింపఁ జెల్లు, నంబరవసనా!

సీ. భుక్పదమునకు భూభుజాలు భూభుక్కులు
వాక్పదంబున కగు వాకు, వాక్కు
జిత్పదంబున కింద్రజి త్తింద్రజిత్తుఁడు,
విత్పదంబున కగు వేదవిదుఁడు
ద్విట్పదంబునకు విద్విషుఁ డనం జెల్లు, భూ
భృత్పదంబునకు భూభృత్తు లయ్యె,
రాట్పదంబునకును రా ట్టగు, మఱియును
రాజపదం బొప్పు రా జనంగ,

దనరు విద్వత్పదంబు విద్వాంసుఁ డనఁగ,
నప్కకుప్శబ్దములకిల నప్పలును, గ
కుప్పు లనఁ దగు, దిక్పదం బొప్పుచుండు
దిక్కు లన దిశ లనఁగను త్రిపురవైరి!

సీ. శ్రేయోమనోయశస్తేజః పదంబుల
కొనరంగ శ్రేయము మనము యశము
తేజము నాఁగ వర్తిల్లును, మఱియు, శ్రే
యస్సు మనస్సు యశస్సు నాఁగ
తేజ స్సనఁగ నొప్పు, నోజఃపయోంభస్స
రశ్శబ్దములకుఁ జేర 'దము' వర్ణ
మరయ నోజస్సు పయస్సు నంభస్సు స—
రస్సనఁ దనరుఁ, బూర్శబ్దమునకు

పురము, కిమ్‌శబ్దమునకును బొసఁగఁగిమ్ము,
జగ మనంగ జగ త్తనఁ దగు జగత్పు

దంబునకు, నిట్లు విలసిల్లఁ దత మముఖు
కుంభిదైతేయ మదనాశ! కుక్కుటేశ! 22

గీ. వన ధన భుజంగ కీర శాక్వర పదములు
వనము ధనము భుజంగము, నొనరఁ గీర
మున, మఱియు శాక్వరము ననఁ దనరుచుండు,
దురితభవనాశ! రజతభూధరనివేశ! 23

క. దూతపదము స్త్రీలింగము
రీతిం బుంలింగ మట్లు గృతులఁ దనర్చున్
దూత యన, దూతుఁ డనఁగా
భూతేశ! మహేశ! నిఖిలభువనాధీశా! 24

దూత

సీ. నిత్యసత్యవ్రత నిషధేశ నీవు మా
కరయంగఁ దూతవై యభిమతంబు ... 25

అరణ్యపర్వము (2–34)

ఉ. దైన్యము దక్కి దూత యుచితంబుగఁ బాండునృపాలు (పాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న లోకసా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చి,కొంద మ
న్యోన్యవిరుద్ధభాషణము లాడినఁ దత్ఫల మాతఁ డందెడున్) 26

ఉద్యోగపర్వము (1–32)

దూతుఁడు

క. తనకడకు వచ్చి మొగమో
డని వాఁడగు దూత పల్కులకుఁ గోపింపన్
జనదు జననాథునకు, దూ
తునిఁ జంపుట నరక మౌట ధ్రువ మని రార్యుల్. 27

శాంతిపర్వము (2–378)

వ. ముద్దరాజు రామన్న కవిసంజీవినియందు దూత యనే కాని దూతుఁ డని లేదనెను గాని రెండును గలవు. 29

వ. ఇది తత్సమ ప్రకారం బిఁకఁ దద్భవ ప్రకారం బెఱిఁగించెద. 29

## తద్భవములు

సీ. అర్ఘ మగ్గువ, యాజ్ఞ యాన, కుబ్జుఁడు గుజ్జు,
భంగంబు బన్నంబు, ప్రౌఢ ప్రోడ,
విష్ణుండు వెన్నుండు, వీర్యంబు బీరంబు,
పుస్తంబు పొత్తంబు, భూతి బూది,
గుణములు గొనములు, కులము కొల మ్మగు,
బృందంబు బిందంబు, పృథివి పుడమి,
సంజ్ఞకు సన్న, యశంబునకు నసంబు,
తాంబూలమునకును దమ్మలంబు,

స్నిగ్ధమునకును నిద్దంబు శ్రీకి సిరియుఁ
జంద్రమశ్శబ్దమునకును జందమావ,
పీఠశబ్దంబునకుఁ బీట, పేర్మి నిట్లు
తద్భవంబులు చెల్లు, భూతలశతాంగ! 30

సీ. విను! యకారమునకుఁ దెనుఁగునఁ దద్భవం
బై, జకారము నిల్చు ననువు మీఱ
యజ్ఞంబు జన్నంబు, యత్నంబు జతనంబు,
యంత్రంబు జంత్రంబు, యముఁడు జముఁడు,
యౌవని జవ్వని, యకులు జక్కులు
యోధులు జోదులు, యోగి జోగి,
యాత్రకు జాతర, యయ్యె శయ్యకు సజ్జ,
కార్యశబ్దమునకు గర్జ మయ్యె,

నిట్టు లాద్యంతములఁ గొన్నియెడలఁ జెల్లు
చుండు బూర్వకవీంద్ర ప్రయోగ సరణిఁ,

జిరకృపాపాంగ! కరతలాంచితకురంగ!
కాశధవళాంగ! శ్రీకుక్కుటేశలింగ! 31

క. దోసము, రోసము, వేసము,
బాసయు, తోసంబు నంచుఁ బలుకఁగవలయున్
భాసురగతి కృతులం, బల
శాసనపూజితపదాబ్జ! షేలకు నరయున్. 32

## సంతోసము

ఉ. శ్రీ సతికిన్ మురారికిని సేసలు వెట్టిన పెండ్లిపెద్ద ల
బ్జాసనుఁ డంబుజోదరమునందు జనించినవాఁడు చేరి యు
ల్లాసము పల్లవింప నుపలాలనఁ జేసిన యమ్మలెల్ల సం
తోసము నమ్మకుందు సయిదోడలు తత్పరిపుణ్యభావినుల్. 33
నృసింహపురాణము (1–49)

గీ. సరవితో శబ్దమధ్యావసానములను
క్షాకు ద్విత్వకకారంబు గదిసి నిలుచు,
నాక్షకారంబుతోడ హల్లంటెనేని,
రాదు ద్విత్వకకారంబు, రాజభూష! 34

ఆ. బుక్షమునకు రిక్క, యక్షులు జక్కులు,
పక్షి పక్కి యయ్యె, లాక్ష లక్క,
యక్షరమున కరయ నక్కరం బగు, మఱి
లక్ష్మి లచ్చి యగు, నిలాశతాంగ! 35

ఆ. శిఖయు ముఖము నన్నఁ జెలఁగు శబ్దములకు
సిగయు సికయు, మఱియు మొగము మొకమ
నాఁగఁ గృతులఁ జెల్లు, నాగేంద్రకేయూర!
దురితదూర! పీఠపురవిహార! 36

## సిగ

క సిగ సంపెగపూలొసవరి
వగకస్తురి నామ మొఱపు వలెవా టౌరా!
(సొగ సిటు లుండఁగవలె నని
సొగసి లతాతన్వి యతని సొగసు నుతించెన్). 37
విజయవిలాసము (1–64)

గ. సిగ విరుల్ రాలి చేతికిఁ దగులకుండ 38
బహుళాశ్వచరిత్ర

## సిక

సీ వనిత యొక్కతె ధూపవాసన యొనఁగూర్చె
నొకకొమ్మ విరిదండ సికను జుట్టె 39
రామాభ్యుదయము (4–107)

సీ. ఒకయింతి యొఱగిన సికమీఁద ముడిపువ్వు
బొత్తులు వలయు తాయెతులఁ జుట్టె 40
చంద్రభానుచరిత్ర (1–89)

సీ. సిక పువ్వుటెత్తుతావికి వెంటఁబడుతేంట్ల
ఝంకృతి మాధవస్వనము గాఁగ, 41
బహుళాశ్వచరిత్ర

## మొగము

సీ. అలచెందొవలవిందు చెలువొంద వెల్ఁజిందు
మొగమున కొకవింత జిగి దొలంకె 42
పారిజాతాపహరణము (1–56)

సీ. పురుషునీఁగికి స్వల్పమునవె సంతోషింతు
మొగమెత్త నేఁవు మగని యెదుట 43
కాశీఖండము (2–72)

క. పగరసుతు లట్లు జగముల
నొగి బాధలు సేయుచున్న నోడి మరుత్వ
న్నగవరు లరిగిరి నాలుగు
**మొగములు**గలవేల్పుకడకు మునిసంఘముతోన్. .44

ఆరణ్యపర్వము (2–58)

**మొకము**

చ. వికవిక నవ్వి యక్కపటవిప్రకుమారుఁడు మేలు లెస్స వా
నికినయి రాగబంధమున నిల్చె మదిం దరళాయతాక్షి యీ
నకియ వివాహవేళ పురశాసను పాణి బరిగ్రహించుచో
**మొకమున** ముస్సురంచు నహి మోగిన యట్లు భయంబు నొందునో? 45

హరవిలాసము (4–27)

క. ఒకమాట చక్కెరల పా
నకమా చనుసోరు సౌమనసకందుకు మా
తృకమా యానాతుక మా
నికమా **మొకమా** సరోజినీరిపురకమా. 46

బహుకాళ్యచరిత్ర

క. **మొక** మెఱుక గలదు కదవే
మకరాంకుని యనుఁగు మేనమామకు నీకున్
దికమకలు సేయవల దను
మకటా, మేడపయి కేగినపుడైన్ జెలి! 47

విజయవిలాసము (2–199)

ఆ. ఇల శవర్ణమునకుఁ దెలుఁగులయందు న
కార మొదవు నొక్కకడల దాని
నేత్వ మెక్కుచుండు, నిందుకళాధర!
భుజగహార! పీఠపురవిహార! 48

ఆ. శంఖమునకు సంకు, శాణంబునకు సాన
శయ్య యనెడుచోట సజ్జ, సెజ్జ,
శల్యఁ డనెడుచోటఁ జర్చింప సెల్లఁడు
శక్తి సత్తి యయ్యె, జంద్రజూట! 49

సెజ్జ

ఆ. సెజ్జయందు మేను సేర్చి యర్జున కార్య
చింత పలుకకుండి కొంతవడికిఁ
బవ్వళించి కురునృపాలక జలశాయి
దారుకుండు గొలువ నూరకుండె. 50

ద్రోణపర్వము (2–340)

ఆ. చెట్ట యొడిసిపట్టి సెజ్జకుఁ దివియుచో
వడుగు బిగ్గఁ ద్రొక్కి యతివ యపుడు
కూర్మి విభునిమీఁద గొనయ మెక్కించుచో
నల్ల వంగు మరునివిల్లుఁబోలె. 51

కవికర్ణరసాయనము (3–207)

సీ. శేషపన్నగరాజు సెజ్జగా నాతఁడు
వాల్చినాఁ డీతఁడు దాల్చినాఁడు 52

కవిలోకబ్రహ్మ శివజ్ఞానదీపిక

సీ. సెజ్జపైఁ బఱచిన చేమంతిరేకుల
కలయ నిందీవరదళము లయ్యె. 53

జక్కన 7సాహసాంకము (1–139)

సజ్జ

చ. తళుకుపసిండియోదరులు దంతపుఁబావడ లర్చనాగృహం
బులు గుడిసీరు మేడలును భోజనశాలలు గెంపుటోడుబి

7. 'సాహసాంక' మన్నది 'విక్రమార్క చరిత్రము' నకే మరొకపేరు కావచ్చును. వి.చ.లో. ఈ పద్యము. 1–139.

ళ్లలు గరిడీల్ సుశీతలశిలాతలముల్ భవనేశ్వరంబు లు
జ్జ్వలజలయంత్రధామములు సజ్జలు దాటి ధరావతీర్ణనై. 54

వసు చరిత్ర (4–72)

సీ. ఉండు నేపీట మార్కండేయ[8]మునిరాజు
సజ్జలింగ మనంగశాసనుండు. 55

కాశీఖండము (1–58)

సెల్లుఁడు

చ. వెరపును లావుఁ జేవయును వీరల కారయ నొక్కరూప, సు
స్థిరభుజశక్తిధర్మజుఁ డు సెల్లనిరూ పడఁగించి యివ్వసుం
ధర గొను నొక్కొ నే డితనిఁ దా సమయించి సమస్తమేదినీ
శ్వరుఁడుగఁ జేయనోపునొకొ శల్యుడు గౌరవరాజనందనున్. 56

శల్యపర్వము (1–250)

ఆ. సెల్లుఁ డట్లు నేలఁ ద్రెళ్లి చెచ్చెర లేచి
యొడలు దుడిచికొనుచు నొయ్య నరిగె
వానిఁ జూచి నగుచు మానుగా విప్రులు
భూరిసత్వు భీముఁ బొగడి రోలి. 57

ఆదిపర్వము (7–204)

సెపియించు

క. నృప నీవు మదీయం బగు
జపము ఫలం బడిగితేని సమ్మతి నీగా
విపరీతఫణితు లాడిన
[9]సెపియింతుం జుమి యెఱుఁగఁజెప్పితి నీకున్. 58

శాంతిపర్వము (4–157)

8. ము. కాశీ. మునినాథ

9. ము. భార.శపియింతుఁ జుమీ యెఱుంగఁ జాటితి నీకున్.

క. ఓరి కచటతపవర్గ్గల
నాలవయక్కరము లెల్ల నవి కబ్బములన్
గ్రాలుచునుండును మూఁడవ
10వ్రాలై, రెండవవి మొదలి వ్రాలై, శర్వా ! 59

చతుర్థ వర్ణములు తృతీయ వర్ణము లగుటకు.—
శా. ఏడక్షౌహిణు లెన్నఁ బాండవబలం బేకాదశాక్షౌహిణుల్
11రూడిన్ గౌరవసైన్య మీ యుభయమున్ రోషహితాన్యోన్యమై
యీడన్పోవక వీఁకమైఁ బోడువఁగా నేపారు ఘోరాజి న
ల్లాడెన్ ధాత్రి శమంతపంచకమునం దష్టాదశాహంబులున్. 60

ఆదిపర్వము (1–70)

ఉ. జాదుర జాదురంచు మృదుచర్చలు గీతులు వారుణీరసా
స్వాదమదాతిరేకమునఁ జంద్రిక గాయఁగ 12దక్షవాటిలో
వీదులు వీదులం గనకవీణలు మీటుచుఁ బాడి రచ్చరల్
మోద మెలర్పఁగా భువనమోహనవిగ్రహు భీమనాథునిన్. 61

భీమఖండము (5–103)

ఉ. బీదశచీవిభుండు దితిబిడ్డ లవార్యులు, వారు పల్మఱున్
బాదలు పెట్టఁగాఁ జెఱలు పట్టఁగ నుండుట భార మంచు, రం
భాదిమరున్నివాసలసదప్సరసల్ చనుదెంచి వచ్చిరో
నా, దరఫుల్లపద్మవదనల్ 13విహరింపుదు రప్పురంబునన్ 62

ఇందుమతీ కల్యాణము

10. ము. ప్ర. 'వ్రాలగు'.

11. ము. భార. రూఢిన్.

12. ము. భీమ. దక్షవాటికా, వేదుల మీదటివ్ గనకవీణలు......

13. ము. ప్ర. వివరింపుదు

క. కాదేని బిరుదులాడక
సాదుల మ్మై వినయమొప్పఁ జని కురునాథుం
డేది పనిచినం జేసి ద
యాదృష్టి నతండు చూచునట్లుండఁదగున్. 63
కర్ణపర్వము (3-55)

క. విదురుఁడు తండ్రియుఁ దనకున్
బదివేల్విధములను జెప్పఁ బాటింపక దు
ర్మదమున దగియెడుబుద్ధులు
14 విధి మూడిన మర్త్యుఁ డేల విను నుచితోక్తుల్. 64
స్త్రీపర్వము (2-40)

ద్వితీయ వర్ణములు ప్రథమ వర్ణము లగుటకు:-

క. అతఁడు మఱి తీర్థయాత్రా
వ్రతవశమున వచ్చె మాపురంబు తెలివుగాఁ
గతలుగ మాసంసార
స్థితుల న్నియుఁ జెప్పె, నేమి సెప్పుదు నబలా! 65
మనుచరిత్ర (3-128)

శా. ఒచ్చెం చింతయు లేక హంసనడతో నొయ్యారముం జూపుచుం
బచ్చల్దాపిన కీల్కడెంపునగతో బాగైన నెమ్మోముతో
నచ్చంబైన మడుంగు గట్టి చెలితో నా మాటలే చెప్పుచున్
వచ్చెంబో కుచకుంభముల్ గదలగా వామాక్షి దా నీళ్లకున్. 66
శ్రీనాథునివీథినాటకము

క. లతకూనల కౌనుల సం
గతి గైకొని రోమరాజి ఖడ్గలత......
తతిగెలువ.... మీనాంకుని
కత యప్పుడు నప్రయోజకత చూపట్టెన్. 67
రామాభ్యుదయము

14. ము. భార. విధి మూడిన

వ. కడను యన్నిటికి నీలాగుననె తెలిసికొనునది. ఇది తద్భవ ప్రకారం
బిఁక నచ్చతెనుంగుం జెప్పెద. 68

**అచ్చతెనుఁగు**

క. సూరిజను లోకవ్యవ
హారం బగు బాస దేశ్య మం డ్రదియె హితం
బారఁగ నచ్చతెనుం గని
యారూఢిగఁ గొంద రందు రగజాధిశా ! 69

**గ్రామ్యము**

గీ. తగిలి వర్ణంబు లెక్కువతక్కువలుగ
నియమ మెడలించి పల్కునదియు తలంప
గ్రామ్య మగుచుండు, నోరులఁ దెగడెడు చోట్లఁ,
జెప్పఁదగునదిఁ కలధౌతశిఖరిసదన ! 70

ఆ. ప్రాకటముగఁ గృతుల నాకడ నీకడ
ననుచుఁ బల్కుచోట నాడ నీడ
యనిన వర్ణలోప మగు, ఫలములకు ఫ
లా లనంగ హెచ్చు నీలకంఠ ! 71

వ. ఇటువంటి గ్రామ్యపదము లయినను సుశబ్దంబు లగుట కుదాహరణలు
మహాకవిప్రయోగములు గలవు. 72

**వర్ణలోపము. ఏడ.**

చ. అనమున మీఁదెఱుంగక మహాగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం
బసులను గాయఁగాఁ జనియెఁ బాపఁడు కౌరవసేన '**యేడ**' యొం
టి ననుట **యేడ** నా కిది కడిందివిచారము పుట్టె సైన్యమున్
వెసఁ జని తోడు గావలయు వేగమె పంపుఁడు చాలువట్లుగన్. 73

*విరాటపర్వము* (5–225)

చ. అని మది మెచ్చి యొచ్చె మొకయందును లేని మనోహరాంగముల్
గన్గొని మౌని కాఁ వ్రతముఁ గైకొని యుండెడి నన్ను నేల తో
డ్కొని యిటుఁ దెచ్చె నీవెడఁగుఁ గోమలి, భూజగమేడ మారుతా
శన జగమేడ నెంత ఘనసాహసమింతుల కంచు నెంచుచున్. 74

*విజయవిలాసము* (1–87)

సీ. వీథఁ బోయెనొ గదా మేడలో మంజిష్ఠి
15 పెనుబండగందు బ్రైఁ బెట్టుజాల ...... 75

*కాశీఖండము* (4–108)

## వర్ణాధిక్యము

సీ. రమణులార! ఫలాలు రాల్చిన కీరపో
తముల ప్రాణాలకుఁ దప్పినారు. 76

*వరాహపురాణము*

శా. తల్లీ ! యిన్ని దినాల కేనియు సుధాధారారసస్యంది యై
యుల్లంబుం16దనియింపఁజేయు పలు కెట్లో వింటి నిప్పిటిలో
బెల్లాకొన్నతనాన నేనొకఁడనే భిక్షానకున్ వత్తునో
యెల్లిన్ శిష్యులఁ గొంచు వత్తునొ నిజం బేర్పాటుగాఁ జెప్పవూ! 77

*భీమఖండము* (2—120)

వ. ఫలములకు ఫలాలును దినములకు దినాలును నివి వర్ణాధిక్యములు. 78

క. మల్లెయు లంజెయు గద్దెయు
నొల్లెయు ననుపగిది పలుకు లొప్ప వటంచుం
బొల్లెను మారయ కేతన,
తెల్లంబుగ నవియుఁ గలవు, త్రిపురారాతీ! 79

---

15. ము. కాశీ. పెనుబండువున నైనఁ బెట్టఁజాల.

16. ము. భీమ. సుఖియింపఁ

## మల్లె

రగడ. రంతేమిటికిఁగొరంతే మల్లెల
వంతులకాసే వంతుల చెల్లెల 80
యయాతిచరిత్ర (4-26)

రగడ. మూలమూలల మల్లె లెంతటి మోహమో, హరిణాక్షి డాచితి
యేల యేఁకిపొదలు వెదికెద వింతవింతలె యెందుఁజూచితి 81
వసుచరిత్ర (3-149)

గీ. మెండు మీరిన పగటి బీరెండ దాఁకి
యొల్లఁ బోయిన లేబొండుమల్లెపొదల
తుదలఁ జప్పటలై కడుదొడ్డ లగుచుఁ
బొడమె మొగ్గలగము లగ్గిబొబ్బలట్లు. 82
ఆముక్తమాల్యద (2-56)

## లంజె

క. అంజెదవు గాక నను చెం
తం జేరఁగనీక యెంత తగ్గిన మిరియా
లుం జొన్నలు సరిగావే
లంజెతనమునందు కొమరులం గెలువనొకో. 83
నాచనసోముని హరివిలాసము

సీ. అ. 17లంజె తల్లు లనఁగ లక్షింపఁగా నిట్టి
కట్టిడులను నలువ కరుణ లేక
18జాతి మాలినట్టి ప్రబతుకులు నిడువుగాఁ
జేసి, విటుల గోడు వోసికొనియె 84
కవికర్ణరసాయనము (4-110)

ఉ. లంజెలు వేటె మాతల నిలాతల దైవనివాస...... 85
బహులాశ్వచరిత్ర (5-37)

17. ము. కవి. లంజ తల్లులనఁగ, .... కట్టిడులను.....
18. ము.ప్ర. జాతిమాలినట్టి పతులకు నిడువఁగా.

## గద్దె

సీ.గీ. చంద్రికాపాండు కౌశేయశాటి యొప్పిన
యతను జగజంపుగొడు గెవ్వఁ డవ్విభుండు
పెద్దకాలంబు ముత్యాలగద్దె యెక్కి
వసుధఁ బాలించు నేకోష్ణవారణముగ. 86

కాశీఖండము (4-195)

## ఒల్లె

సీ.గీ. నారికేళాసవపుఁదీపుటూరు పొలయు
వలిపె యొంటొల్లెతో నురస్థ్సలులఁ గూడు
ప్రియులఁ దేకువతో నెచ్చరించి కలసి
రెలమి ధమ్మిలు 19తలపిపెన్నెల బయళ్ల. 87

ఆముక్తమాల్యద (2-61)

సూ. 'ఏదంతతాచ నామ్నా మన్యతరస్యామియాంతానామ్' అని
శబ్దశాసన సూత్ర మున్నది గనుక, మల్లె లంజె గద్దె ఒల్లె యని
యనవచ్చును. 88

ఆ. చనియోఁ గనియోఁ గొనియొ ననుటకుఁ జనెఁ గనెఁ
గొనె నటంచుఁ జెప్పఁగూడ దనుచు
బలికె సూత్రుఁడండి పరికింప నివియును
గలవు కృతుల శిశిరకరవతంస. 89

## చనె

క. అని మందోదరి దెల్పిన
విని దైత్యుఁడు పిగ్గనొంది వెలఁదియుఁ దానుం
జనె నభ్యంతరమునకున్
మనమున జయకాంక్ష మిగుల మల్లడి గొనఁగన్. 90

భాస్కరరామాయణము (యుద్ధ. 1592)

19. ము. ఆము. పరపువెన్నెలబయళ్ల.

చ. మగఁటిమి [20]చంద్రదగుడ్డరక మట్టిన వామపదాంబుజంబనై
నిగళమునన్ సురాసురుల నించిన యందియ ఘల్లు ఘల్లనం
బొగడలు బొండుమల్లియలు పొన్నలు పొగడ నెల్లియంబున
న్నిగిడిచి వీరభద్రుఁడు చనెన్ శశిమౌళి సమీపభూమికిన్. 91

భీమఖండము (5—112)

ఉ. భీమునిజానుదేశముల భీషణవాము వు లుప్పతిల్లి
గ్రామతలంబునన్ వినరగాఁ జతురంగసమస్తసైనిక
స్తోమము నభమండలముతో నొరయం జనె బొందితోడ సు
త్రామునివీటి కేగెడు విధంబున దివ్యులు చోద్యమందఁగన్. 92

జైమినిభారతము (2–76)

కనె

క. వనకన్యక యఁట నేనఁట
వనమున గాంధర్వమున వివాహం బఁట నం
దను గనె నఁట మఱచితి నఁట
వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్. 93

ఆదిపర్వము [21] (4–100)

ఉ. అంత సుమిత్రయుం గనె ననంతవిలాసుల ధర్మశాస్త్రసి
ద్ధాంతరహస్యకోవిదుల నప్రతిమప్రతిభాప్రభావదు
ర్దాంతుల శ్రీనిశాంతుల నుదగ్రగభీరిమచాతురీనర
స్వాంతుల నిర్వురన్ విమతజైత్రులఁ బుత్త్రుల సచ్చరిత్రులన్. 94

రామాభ్యుదయము (3—114)

---

20. ము.భీమ. చంద్రదగుజ్జరస.మంటిన వామపదాంబుజంబునై, నిగళము నాసురాసురవి నిర్జితమౌ బిరుదందె,....... చొళ్లియంబునన్,.......:

21. ము. భార. న 4—100 వద్ద అధోజ్ఞాపికలో ఈ పద్య ముదాహృతమై, 'ఈ పద మాదిపర్వమున, నున్న దని అప్పకవి వ్రాసియున్నాఁడు. ఐనచో నిచ్చోట యుండఁబోలు నని వ్రాయఁబడినది. నిజమున కీపద్యము పిల్లలమఱ్ఱి పినవీరన 'శకుంతలా పరిణయము' లో, (4–114) నున్నది. (చూ. పీఠిక).

గీ. సవతి క్రుదువ శేషతక్షకులు మొదలు
గాఁగ నేవురు భుజగపుంగవులఁ గాంచె
22నండము రెంటఁ గలధౌతగండశైల
సన్నిభంబులఁ గనెఁ బుణ్యసాధ్వి వినత. 95
(కాశీఖండము 6—16)

## కొనె

మ. (భసితోద్ధూళితనిర్మలావయవుఁడున్ బంచాక్షరీసంతతా
భ్యసనవ్యాప్తిపరాయణుండును శివధ్యానానుసంధాతయున్
మసృణస్నిగ్ధతరకుచర్మమయకంథాభద్రపీఠుండునై)
యసమస్థేమఁ గిరీటి పాశుపతదీక్షారంభముం గైకొనెన్. 96
హరవిలాసము (7—29)

ఉ. పూని ముకుందునాజ్ఞ కనుబొమ్మనె గాంచి యజాండభాండముల్
వానను, విూఁదఁబోవ నడవం గొనె దన్నన నగ్గ నిశ్చల
త్వానుచలత్వనిష్ఠలె సమస్తజగంబుల జాడ్యచేతనల్
గా నుతికెక్కు సైన్యపతికాంచనవేత్రము నాశ్రయించెదన్. 97
ఆముక్తమాల్యద (1—4)

వ. ఇది *చతుర్విధాంధ్రలక్షణం బింక తద్వర్ణప్రకారంబు జెప్పెద 98

## వర్ణప్రకరణము

సీ. అ,ఇ,ఉలు ఏ వోలు నవి దీర్ఘ సహితంబు
లై ఔలు,కగచజ లరయు టడణ
త ప న లు ప బ మ లు దగ య ర ల వ స హ
ళ అ లును తెనుఁగున వరలు గాని
తక్కిన వర్ణముల్ దగులవు, పదముల
మొదల వా కుత్వోత్వములు గలుగవు,

---

22. ము. కాశీ. నండముల మూఁటి *పంచవిధాంధ్ర.......

తే. దెయ్యెడలను శబ్దాదియకారంబు
వచ్చు నచ్చులఁ దుదియచ్చున కది
తుదల క్రియఁ దక్క నేత్వ మెందులను దాని
కెనయనేరదు, సత్కవు లిటు లెఱింగి
కావ్యములు గూర్పవలయు విఖ్యాతి మీఱ
నిభదను జభంగ! కుక్కుటాధీశలింగ! 99

వ. 'వికృతి పదాదౌ ప్రథమాంతస్థతృతీయానునాసికౌనస్తః! క్వచి దపి నస్త ఉదోత్తా దంతోష్ఠ భవస్య వికృతి శబ్దాదౌ' అని శబ్దశాసనుఁడు చెప్పినాఁడు గనుక వకారమున కుత్వోత్వములును, యకారమును దెనుఁగునఁ బదాదిని లేవు. 100

క. శాలూాలు చారలేవయు
వాలాయంబుగఁ దెనుంగుఁ బ్రా లయ్యుఁ గృతిన్
గ్రాలుచునుండును, దొడ్డగు
ప్రా లై దేశ్యంబు లగుటవలన మహేశా! 101

సీ. జాణ రాణువ రాణ గాణ విన్నాణంబు
కాణాచి యనెడు దీర్ఘములమీఁదఁ
గాని, హ్రస్వముల ణా గలుగదు రవణము
రమణ య తక్క నాంధ్రములయందుఁ,
బడఁతుక మడఁతుక యుడుకువ యుడఁచుట
కడఁగుట తొడఁగుట కడఁక పొడఁక
పడుఁకులు వడఁకుట వెడఁగును మడుఁగును
దొడఁకున కడిఁదియు వెడఁద బెడఁద
యనఁగ బరగెడు పదములు నర్ధబిందు
యుతము లైన డకారము లొనరియుండు
కనకశైలేంద్రకోదండ! కపాలజాండ
భాండసంఘాతపూరితపటుపిచండ! 102

క. సిద్ధము సాధ్యము నన:గ బ్ర
సిద్ధము లై యిరుదెరగుల: జెల్లును గృతులం
దిద్దరణి ననుస్వారము
లుద్ధతరిపుదర్పహరణ ! యురగాభరణా ! 103

ఆ. చంద మంద మనెడు సహజబిందువులు సి
ద్ధంబు లగు, నొయ్యారపుంబడంతి
యన నకారమునకు నాదేశ మై వచ్చు
నవియె సాధ్యములు సురాద్రిచాప! 104

క. అఱసున్న లొదవు నిడుదల
నెఱసున్నలె గద్యములను నిలుచు: గృతులలో
నఱసున్నలు నెఱసున్నలు
కఱచలపై: గలిగియుండు: గుక్కుటలింగా! 105

## కళాద్రుతప్రకృతికములు

సీ. కొంటివి తింటివి వింటివి కంటివి
మని రని రనెడు తిజ్మధ్యములును,
గూర్చియున్న ద్వితీయకును శేషషష్ఠికి
వనము ధన మ్మను ప్రథమలందు
నౌర యో హో యను నద్భుతార్థముల న
క్కట యయో యని వగచుటల నించు
కరవంత యనియెడు కడల బళా మజ్ఙ
యను ప్రశంసనముల:, జని, హరించి,

యనెడుచో మిన్న కూరక యనెడుచోట
నప్పు డిపు డన్నచో నిన్నె యనెడుచోట
నరిగె, న:ట యనుచో నేమి యనెడుచోట
మొదలుగా: బైనకారంబు బొదవ దీశ ! 106

క. కళ లన(దగు నివి, మఱియు, మి
గిలినపదంబులు ద్రుతప్రకృతు లన(బరగున్
లలిఁ బొల్లునకారముపై
గలిగించుటచేతఁ గృతుల గౌరీరమణా! 107

వ. ఇది సంజ్ఞాప్రకరణం బింక సంధిప్రకరణం బెఱింగించెద. 108

## సంధి ప్రకరణము

సీ. ఆనతిచ్చుటయు, మేనత్త, యేమయ్యెను,
మగనాలు, పురుటాలు, మగువలిండ్లు,
బండెద్దు, పెండ్లాడి, వెండుంగరంబు, పై
డందెలు, చనకుంట, యఱువదాఱు,
నూటొక్కటియు, దొమ్మనూటాఱు, పాలిండ్లు,
తండ్రేడి, యొంటొల్లె, దాసరయ్య,
యింకేమిటికిఁ, బుట్టినిల్లు, రావాకు, మ
ఱేమి, యెల్లేనుఁగు, కోమటక్క,

యనఁగఁ బరఁగెడు నుడువలయందు సంధు
లడఁగుఁ బొడముచునుండు ని ట్లంధ్రకవుల
యనుమతంబున శైలకన్యాహృదీశ!
దురితభయనాశ! పీఠికాపురనివేశ! 109

**ఆనతిచ్చుట — ఇకార వికల్పసంధి**

సీ. గీ. తమ్మికే లుండఁ బెఱకేలు దండ యిచ్చు
లేము లుడిపెడు లేఁజూపులేమతోడఁ
దొలఁకు దయఁదేల్చు చిఱునవ్వుతోడఁ గలత
దంధ్రజలజాక్షుఁ డిట్లని యానతిచ్చె. 110

ఆముక్తమాల్యద (1—12)

క. ఆదిత్యమరుద్వసురు
ద్రా దిసురలు మునులు నంబుజాసనుఁ గని మా

కేది కరణీయ మిాశ! ద
యాదృష్టిని మమ్ముఁ జూచి యానతి యీవే. 111

శాంతిపర్వము (2—37)

## మేనత్త – అకారవికల్పసంధి

సీ. గీ. గరగరనివాఁడు నవ్వుమొగంబువాఁడు
చూడఁగలవాఁడు మేలైన సొబఁగువాఁడు
వావి మేనత్తకొడుకు గావలయు నాకు
నర్జునుండు పరాక్రమోపార్జునుండు. 112

విజయవిలాసము (2—164)

ఉ. మంచిగ **మేనయత్తలు** సమాదరణం బడరంగఁ బెట్టిపు
త్తెంచిన మంచికజ్జములు తేనియనేతను 23 దోఁచి దోఁచి (భ
క్షించుచుఁ దల్లి తండ్రిఁ దన చిన్నికరాంగుళి వంచి వంచి యూ
రించుచు నాడె మిన్నగమితేఁడుకుమారకుఁ డింటిముంగలన్.) 113

హరవిలాసము (2—106)

## ఏమయ్యె - ఇకార వికల్పసంధి

సీ. గీ.(అతిథి సంతర్పణంబు లేమయ్యె నాకొ)
24యగ్ని లేమయ్యె నాకొ నిత్యంబు లైన
కృత్యములఁ బాపె దైవంబు కినుక నిట్లు
(పాలివైచునె మిన్నులు పడ్డచోట) 114

మనుచరిత్రము (2—18)

## ఏమియయ్యె

చ. 25హరిహయుఁ డేమియయ్యెనొ కదా మదనానిలతాపవేదనన్,
(వరుణుఁడు విప్రయోగమున వాడఁడె యింతకు, దండపాణి దా

---

23. ము. హర. వి.'....ముంచిముంచిభ,.... యూరించుచు నిచ్చమీరఁగఁ జరించెఁ గఁ మారకుఁ డింటిముంగలన్.
24. ము. మను. అగ్ను లేమయ్యె....దైవంబ....సారవైచితె....
25. ము. వైష .పు. హరిహయుఁ డేమి యయ్యెనొకొయా

విరహాభరంబునన్ మిగుల వేఁగెడి, నొవ్వఁడె పితృహంత్ముఁడున్
26స్మరశరకేళికాననసమాగతమందసమీరణంబునన్). 115

*శృంగారనైషధము* (4–65)

**మగనాలు - ఇకారవికల్ప సంధి**

సీ. 27ఓర్మి మై నుప్పిండి యుపవాసముల నుండి
**మగనాలి** సరివోల్పఁ దగదు విధవ... 116

*కాశీఖండము* (2—83)

**మగనియాలు**

ఉ. ఆసమయంబునన్ **మగనియాండ్రును** గన్యలు నాక సొచ్చి ధా
త్రీసురరాజవైశ్యులను (దేకువ సేయక యెల్లజాతులుం
గాసిగనొక్కఁ పెట్టఁగఁ ప్రకాశరహస్యవిభేదహీనుఁ డై
యాసురవైరి పట్టెఁ జెఱ లడ్డము లేక మృగాయతాక్షులన్).117

*ఉత్తరరామాయణము* (5–98)

**పురుటాలు - ఇకారవికల్పసంధి**

క. పురు డీబోఁటికి నిందిర
పురు డంబిక గాక యొరులు పురుడే యనుచున్
**బురుటాలికిఁ** బదిదినములు
పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపుగరితల్. 118

*అష్టమస్కంధము* (516)

**పురుటియాలు**

సీ. పాదివితేఁ గానక పొత్తులలోపట్ల
బోనాడుకొనినలేఁబురుటియాండ్రు 119

*రామాభ్యుదయము* (6—250)

---

26. ము. వైష. బరిసరకేళికానన.........
27. ము. కాశీ. ఓర్పుమై నుప్పిండి నుపవాసముండని......

### మగువలిండ్లు - అకారవికల్పసంధి

సీ. గీ. వారికన్నను నీమహత్త్వంబు ఘనమె
పవనపర్ణాంబుభకులై నవసి యినుప
కచ్చడా ల్గట్టుకొను మునిముచ్చు లెల్లఁ
దామరస **నేత్రలిండ్ల** బందాలు గారె. 12

*మనుచరిత్ర* (2—73)

### పెండ్లాడి

గీ. 28పాఱుఁడొక్కఁడు **పెండ్లైన** బాలఁ దాను
బాల్యమున నీసునను జెల్లఁబడిని బుచ్చు
కొనిన తద్విధ మెఱిఁగి తజ్జనకుఁ డలిగి
తిట్టి వెడలి పొమ్మనుడుఁ బార్థివసుతుండు. 121

*హరివంశము* (పూ. భా 2—39)

### పెండ్లియాడి

ఉ. (ఏమనఁ బోయెదం దగుల మెంచక నీ విటులాడఁ దొల్లి శ్రీ
రాముకుమారుఁ డైన కుశరాజు వరింపఁడె నాకుముద్వతిన్)
కోమలచారుమూర్తి పురుకుత్సుఁడు నర్మదఁ **బెండ్లియాడఁడే**
(నీమన సొక్కటే కరఁగనేరదు గాని నృపాలకాగ్రణీ!) 122

*విజయవిలాసము* (1—101)

### వెండుంగరము

సీ. పంచాంగముష్టియుఁ బాణిపవిత్రంబు
29నాక జుట్టు వ్రేలి **వెండుంగరంబు.** 123

*హరవిలాసము* (7—12)

28. ము. హరి. వరుఁ డొకఁడు పెండ్లియైన యబ్బాల...

29. ము. హర. ఒక్కవ్రేలికి వెండియుంగరంబు

రావియాకు

సీ. 30అలరులు ఫణివీచు లభ్రభంబు సుడి
రావియాకు సైకతము లనంట్లదొనలు. 124
రుక్మాంగదచరిత్రము (2—113)

వెల్లేనుఁగు

ఉ. 31సైనికు లంత సంతరణసన్నహనం బెడరించి పారిన
న్వానయు నచ్చలంబు మది నాటుకొనంగఁ గపాలమండలీ
దానమిళద్విరేఫనినదంబుల ఫీంకృతు లుల్లసిల్ల వె
ల్లేనుఁగుమీఁద డీకొలిపి యింద్రుఁ డుపేంద్రునిఁ దాఁకె నుద్ధతిన్.125
పారిజాతాపహరణము (5—18)

వ. ఘటువలెనె కడమ యన్నిటికిని దెలిసికొనునది. 126

క. ఇమ్ముగ శబ్దముతుదివ
ర్ణమ్ముం దరిన్ వచ్చు నచ్చునకు యా యొదవున్
గొమ్ముగల హల్లు ప్రథమాం
త మ్మయిన నడంగు నచ్చు ధవళశరీరా! 127

చ. హయరథదంతిసంతతినిరంతరదుర్దమలీలఁ బేర్చి నే
ల యవిసి మ్రాఁగిన ట్లగు బలంబులతోడఁ ద్రిగర్తు లెంతయున్
రయమున గోవులం బొదువ రక్షకు లొక్కట యార్చి తాఁకినన్
భయదమహాస్త్రశస్త్రపటుపాతరయంబుల దున్మి రుద్ధతిన్. 128
విరాటపర్వము (3—137)

వ. కడమ సులభము.

క. ధర ప్రథమ మధ్య మోత్తమ
పురుషల బహువచనములను బొదలెడు నచ్చుల్

30. ము. రుక్మాం. (ఏకాదశీమాహాత్మ్యము) తలిరులు ధూలులు రత్నములు వారలువట,
ఫలములు దొనలనంటులు పులినము, రావాకు సుడి...

31. ము. పారి. సైనికులెల్ల నంతరణ సన్నహ...

బెరయుచు నెరయుచు నుండున్
గురుతరకరుణాంతరంగ కుక్కుటలింగా ! 129

వ. 'నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః' అని శబ్దశాసనుఁడు సూత్ర మున్నె జెప్పినాఁడు గనుక యుత్తమపురుష గాక ప్రథమ మధ్యమ పురుష క్రియలమీఁద యచ్చులు శిష్టమౌట సిద్ధమే. 130

**విడియుండుటకు ప్రథమపురుషకు**

సీ. గీ. చంద్రమౌళి భరద్వాజసంయములను
హంసపది యను నొక కిన్నరాంగనయును
నా ప్రవాళోష్ఠిమగఁడు వాణీప్రియుండు
సిద్ధిఁ **బొందిరి యవిముక్త**సీమయందు. 131

*కాశీఖండము* (3—232)

మ. బలభిద్వహ్నిపరేతరాజవరణుల్ పర్యుత్సుకత్వంబు సం
ధిలఁ **గూర్చుండిరి యొండొరుం** గదిసి యర్థిం దత్ప్రదేశంబులన్
నలనాళీకమృణాళనాళలతికానవ్యవ్రణాళీమిళ
ల్లలనాలాపకథాసుధానుభవలీలాలోలచేతస్కులై. 132

*శృంగారనైషధము* (3—78)

ఉ. **కూడిరి యొండొరుల్** దొరసి కుంతలకాంతు లొసంగి వీడుజో
[32]డాడిరి క్రేళ్ళు దాటిడుచు నాళులతో వెలిదమ్మిధూళిగో
(రాడిరి కంతుదంతు లన హస్తపుటంబుల వారిచల్లుఁబో
రాడిరి యోలలాడిరి లతాంగులు రాగరసైకమగ్నలై). 133

*రామాభ్యుదయము* (1—89)

క. మనుజులలోపలఁ గర్మం
బొనరుచువారెల్ల దండ్యులో వారలలోఁ

32. ము. రామ.... డాడిరి క్రేళ్ళుదాటెడు మదాళులతో, దెలిదమ్మి.....

గనుఁగొనఁ గొందఱే దండ్యులొ
యనవుడు హరిభటుల కనిరి యప్పార్శ్వచరుల్. 134

కవులషష్ఠము

మ. గురుభీష్మాదులు చూచుచుండ సభ మీాకుం గీడు నా డట్లు ము
ష్కరులై చేసిరి యెంత చేసియును బశ్చాత్తాపముం బొందనో
పరు వారెన్నఁడు నట్టిచోటఁ గృపయున్ బంధుత్వముం దక్కి మె
వ్వరు గోపింపరె యాదురాత్మకులగర్వక్రౌర్యముల్ చూచినన్. 135

ఉద్యోగపర్వము (3—36)

ఉ. కొంచెముగా నిజాంగకము గుంచి ధరిత్రికి నెంత యెంత లం
ఘించిన లేచు దంతిఁ బరికించు జనంబులు గొంద రాత్మ భా
వించి రవంధ్యవింధ్య పృథివీధర ఘోరతరోదయంబు 33 గా
వించిరి యందుఁ గొందఱు త్రివిక్రమవిక్రమవిస్మయస్మృతిన్. 136

కవికర్ణరసాయనము (2–101)

## మధ్యమపురుషేకారమునకు వికల్పసంధి

చ. అదలిచి నిల్వ వారిఁ గని యంతకు కింకరు లెవ్వరయ్య మీా
రిదె యమునాజ్ఞఁ, ద్రోచితిరి యెచ్చటనుం డిట వచ్చినార లె
య్యది గత మడ్డపెట్టుటకు నెవ్వరివార లెరుంగఁ జెప్పఁడా
యదితితనూజులో సురలొ యక్షులొ సిద్ధులొ కాక సాధ్యులో. 137

కవులషష్ఠము.

## ఉత్తమ పురుషమునకు వికల్పసంధి

క విలువిద్య నొరులు నీ క
గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదు నని మున్
బలికితిరి నాక కా దీ
త్రిలోకముల కధికుఁ జూచితిమి యొకయెఱుకున్. 138

ఆదిపర్వము (5—239)

33. ము.కవి. గా, వించిరి వేఱకొందఱు

క. తలఁపఁగ రిపులకు నిమ్మగు
కొలఁది గడచి **వచ్చితిమి యకుంఠిత** బాహా
బలము నెఱపఁ దరి యయ్యెం
బలింపవల దింక మనకు శత్రులవలనన్. 139

*విరాటపర్వము* (4—93)

గీ. కృతులఁ దద్ధర్మములఁ జెప్ప క్రియలమీఁద
యచ్చునకు సంధి లేకుండ నచ్చుమీఁద
**మనుచునీశ్వరుఁ డని** పల్కనొనరుఁ గాని
తగదు **మనుచీశ్వరుఁ** డనంగ నగనివేళ! 140

ప. గంగానది గంగానది
34గంగానది యనుచు భక్తి గడలుకొనంగా
గంగఁ **గొనియాడు నాతఁడు**
35భంగించు ననంతఘోరపాతకచయమున్. 141

*కాశీఖండము* (5—34)

వ. 'కొనియాడు నాతఁడ'ని యనవలె గాని 'కొనియా డాతండ'ని యనరాదు. 142

గీ. వర్తమానార్థ విహిత చువర్ణమునకుఁ
గలిగియుండును లేకుండు నలరు సంధి
**నగుచరిగె, నగుచునరిగె** నాఁగ, నిచ్చు
**చలరె నిచ్చుచునలరె** నా జలధితూణ. 143

సీ. గీ అనుచుఁ దొలినుడి యభిలాష మెనయ మూఁగి
36పలుక దరహాసనర్మగర్భంబు గాఁగ

34. ము. కాశీ. గాంగనది యనుచు **తేవకడ** మేల్కనుచో
35. ము. తా. ప్ర. 'భంగించు నతండు ఘోరపాతకచయమున్' 'భంగిం చతండు' అని యనరాదు.
36. ము. ఆము. పలుకుతోడనె

నుత్తరము పల్లవశ్రేణి కొనఁగు చలరు
లమ్ముదురు పుష్పలావిక లప్పురమున. 144

ఆముక్తమాల్యద (2—19)

గీ. హరునితోడ విరోధించి యంధకుండు
యుద్ధ మొనరించు చొక్కఁనా౯ డోహటించి
యజగవోన్ముక్త ఘననిశితార్ధచంద్ర
బాణనిర్భిన్నవక్షః ప్రపాతుఁ డగుచు. 145

కాశీఖండము (4—235)

క. విమలస్ఫాటికహాటక
రమణీయదరీనిరంతరస్ఫీతనగేం
ద్రము మాల్యవంతమును ను
త్తమచరితులు చూచుచరిగి తద్విపినమునన్. 146

ఆరణ్యపర్వము (4—5)

సీ. కానలోఁ దారు మృగంబులకై వడి
గైకొని యసమాస్త్రకర్మకలనఁ
దనరు చొక్కపురాణమునిదంపతులు 147

రాఘవపాండవీయము

క. అదియనుశబ్దముపై న
చ్చొదవెడుచోఁ గలయు నెడయుచుండుం గృతులం
దదియేటి కదేటి కనన్
విదితంబుగ సంధి నిఖిలవిశ్వాధీశా ! 148

ఇదియేటి

ఉ. డక్కెను రాజ్య మంచు నకటా 37 యిఁక సోదరరాజ్యభాగ మీ
వెక్కటి మ్రింగఁజూచె దిది యేటికి దక్కును మీనులోలతన్

37. ము. భార. ... యిటు తమ్ముని భాగమీ కనీ, వెక్కటి .....దది యెట్లరుగున్
విను మీను ......... నుల్లము నున్నటు లాడఁగూడునే.

గ్రక్కున నావిషంబుచవి గాలము మ్రింగిన చాడ్పు సువ్వె యి
ట్లుక్కివు డైన నీకొడుకు నుల్లమునం దిటు లోర యుండినన్. 149

*ఉద్యోగపర్వము (2—52)*

## ఇదేటి

ఉ. కొండగ నొండుచోట్బలె గొంకక బింకముతో నరుండు భీ
ముం డని మాటిమాటికి సమున్నతి నెన్నెడు కర్ణభీష్మకో
దండగురుప్రతాపవితతప్రధనోద్ధతి నొప్పు మద్భుజో
ద్దండత యించుకైన మది దార్ప విదేమిటి నేర్పు చెప్పవూ! 150

*రాఘవపాండవీయము*

ఆ. అనుచు వినుచు కనుచు నను వర్తమానార్థ
పద నువర్ణమునకు బరగులోప
మొదవి నిండునున్న లొదవు నొక్కొకయెడ
నంచు వించు కంచు నన మహేశ! 151

గీ. **అనుచు** తొలినుడి యభిలాష మెనయుమూగ్రి
పలుక దరహాస నర్మగర్భంబు గాగ
నుత్తరము పల్లవశ్రేణి కొసగు చలరు
లమ్మెదురు పుష్పలావిక లప్పరమున 152

*ఆముక్తమాల్యద (2—19)*

## అంచు—కంచు

శా. **అంచున్** వేలుపుమించుబోడులు శుభోదర్కంబు గాన్పించ దీ
వించన్ వారి ప్రియానులాపములతో వీడ్కొల్పి గోకర్ణభూ
ప్రాంచద్ధూర్జటి గొల్చి పశ్చిమసముద్రప్రాంతపుణ్యస్థలుల్
కంచున్ బోయి ప్రభాసతీర్థమున వేడ్కన్ గ్రీడి క్రీడింపుచున్. 153

*విజయవిలాసము (2—76)*

క. కాంచనపక్షం బగు రా
యంచం గనుగొని నృపాలుఁ డనురాగముతో

వంచించి పట్టుకొనియెద
నంచు దలఁచె దైవఘటన కనుకూలముగన్. 154

*శృంగార నైషధము* (1–10)

గీ. బనర నపు డిప్పు డను చప్పు డనెడు నుడుల
నుండెడు పువర్ణ శృంగంబు లుడుపఁబడును
సరవి నప్డును నిప్డును జప్డు ననఁగఁ
గోటికోటీందుసంకాశ ! కుక్కుటేశ! 155

**అప్డు**

ఉ. తుమ్మిన యప్పు డంబుదవు త్రోవఁ జరించిన యప్డు వారిపా
నమ్మొనరించి నప్పు డశనంబు భుజించిన యప్డు నవ్యవ
స్త్రమ్ము ధరించినప్డు దురితమ్ములు చూచినయప్డు పుణ్యకా
ర్యమ్ములయప్డు హేయముల నంటినయప్పుడు వారువందగున్. 156

*కాశీఖండము*

**చప్డు**

గీ. మోసమోక ముశానమ్మ ముద్దరాలు
తారె సడి సప్డు లేక పాతాళమునకుఁ
దాను గొడుకులు నొక కొంత తడసెనేనిఁ
గుటిల పఱుపరె నృపుబంట్లు గుదెలవారు. 157

*కాశీఖండము* (5–289)

గీ పదవు విూఁదటి యది యను పదము మొదలి
యత్వ మడఁగుచుఁ బొడముచు నలర సంధి
నమ్మయది యున్నయది కాపయది యనంగ
నమ్మయది యున్నదన కాపదన నుమేశ. 158

ఆ. 38కర్ణుపలుకు లోకగర్హితుఁ డగు దుస్స
సేనుచెయ్దుకంటె శిఖియపోలె
నడరి నామనంబు నతిదారుణక్రియు
నేర్చుచున్నయది మహీధరుండ ! 159

*అరణ్యపర్వము* (1–139)

38. ము. భార. కర్ణునగవులోక.....

ఉ హాలహలద్వయంబు కలశాంబుధి పుట్టి వినీలపాండుర
జ్వాలలతోడ నం దొకవిషం బొకవేలుపు మ్రింగ నెందఱే
వేలుపు లోలిమై ననుభవించిన రెండవ యావిషంబు ని
ర్మూలము గాక యున్నయది ముద్దియ పాంథులపాప మెట్టిదో. 160

*శృంగారనైషధము* (2-129)

గీ. ఇమ్ముమీఱ భవిష్యదర్థమ్ముఁ జెప్ప
39పదము నా మీఁద నేనియన్పదము నిలుపు
నపుడు సంధులు నగునేని నగునయేని
యనఁగ నొప్పు నగేంద్రకన్యాధినాథ. 161

గీ. అనలసంబంధవాంఛ నా కగునయేని
యనలసంబంధవాంఛ నా కగును జువ్వె
చాలు సందేహవక్రభాషణము లింకఁ
దరుణచక్రాంగ పాథఃపతంగ శక్ర. 162

*శృంగారనైషధము* (2—71)

ఆ. పడియె నన్పదంబు పరమునఁ గల్రప్రథ
మాంతశబ్దములకు నగు ముకార
మడఁగుఁ,బూర్ణబిందు వగు, భయపడి భయం
పడి యనంగఁ గృతుల ఫాలనేత్ర! 163

చ. వనజభవప్రభావుఁ డగు వాని వశిష్ఠునపత్యశోకమ న్
వననిధిలోన ముంచిన యవారితవీర్యుఁడు నిన్నుఁ దొట్టి య
య్యనిమిషులెల్ల వానిక భయంపడుచుండుదు రట్టియుగ్రకో
పనుకడ కేగు మిప్పు డని పాడియె యిప్పని నన్నుఁ బంపఁగన్. 164

*ఆదిపర్వము* (4—37)

ఉ. క్రచ్చర నొక్కరక్కసుఁడ కాడు సురాసురు లెల్ల నడ్డమై
వచ్చిన నీవ చూడఁగ నవార్యబలోన్నతిఁ జేసి వారలన్

39. ము. ప్ర. పదము నామీఁద

వచ్చి వధింతు గాక యిట వచ్చి **శ్రమంపడి** యున్న వీరల
న్నిచ్చగ వీరిదైన సుఖనిద్రకు భంగము సేయనేర్తునే. 165

*ఆదిపర్వము* (6-200)

క. ప్రజ యేన కాను నన్నుం
బ్రజ సంరక్షించు నని **ఖరంపడి** కోరం
బ్రజ విడిచెద నాయం దది
యజేయమును నవ్యయంబు నగు పద మిచ్చున్. 166

*శాంతిపర్వము* (5-387)

చ. అనుటయు మంత్రిమాటకుఁ **బ్రియంపడి** యాతని నాదరించి య
మ్మనుజకులేంద్రుఁడు ..... 167

*ఎఱ్ఱాప్రగడ రామాయణము*

క. భయపడి శ్రమపడి యనుట సులభము. 168

గీ. తగ నుకారాంతముల కర్మధారయమున,
షష్ఠి యగు చోటఁ, బై నచ్చు సంఘటిల్లె
నేని సంధులయెడఁ డన ల్నిలుచుఁ గొన్ని
యెడలఁ గులఁగక యుండు, మహీశతాంగ! 169

**కర్మధారయమునఁ డకారము వచ్చుటకు**

గీ. అగ్నిశిఖయుఁ బోలె నంటను డాయను
జూడగానియట్టిశుభచరిత్ర
నెఱుకలేని **కఱకు తెఱు** కపేక్షించెఁ గా
దనక తనకు నాయు వల్ప మైన. 170

*అరణ్యపర్వము* (2-91)

మ. [40]కమనీయద్యుతియోగ్యకీర్తనములన్ గన్పట్టునాశ్యామ యా
సుమబాణాంబక యాయమూల్యమణి యా చొక్కంపుఁబూబంతి యా

40. ము. వసు. కమనీయాకృతి.

సువనోవల్లరి యాసుధాసరసి యా సౌంపొప్పుడాల్జివి యా
కొమరుం బ్రాయ పురంభ యాచిగురుటాకుంబోడి నీకే తగున్. 171

*వసుచరిత్ర* (2–52)

క. జననాథ నాడు మొదలుగ
ననయము బురరక్షణంబు 41నాహవసమయం
బున నస్త్రము నై యతనికి
ననలుం డిల్లటపుటల్లుఁ డై వర్తించున్. 172

*జైమినిభారతము* (4–47)

**టకారము రాకుండుటకు**

క. ఈనెలతుక గని మన్మథుఁ
డై నను 42జిగురాకు బువ్వుటమ్ముల పాదులున్
లోనుగ సెజ్జలు సేయం
దా నియమించండె విరహతాపము పేర్మిన్. 173

*విరాటపర్వము* (2–28)

ఉ. ఎయ్యది కారణంబుగ మహీపతి యుంచితధైర్యకంచుకం
బయ్యతసుండు సించె నలరమ్ములచే నది కారణంబుగాఁ
దొయ్యలి రాజనందనునితోఁ గెడఁ గూర్ప దలంచి యున్న యా
దయ్యము నెత్తికోలు తుది దాఁకుట గానఁగనయ్యె నయ్యెడన్. 174

*శృంగారనైషధము* (1–83)

క. చిగురాకు బోఁడిమై చెమటపన్నీటిలో
నానుట ప్రతిషవణస్నాన మయ్యె. 175

*కవులషష్ఠము*

41. ము. జైమి. నాహవజయముం, గొనన్రస్త్రమునై వృపతికి.

42. ము. భార. జిగురు గొడుగు.

ఉ. తెల్లనిదీని తమ్మి నెలదేటివలెం దళుకొత్తువాగిడిన్
నల్లనివాని లచ్చిరతనంబును మచ్చ యెడం దలిర్ప రం
జిల్లెడువాని చట్టు లగు చిందము నంటినవాని నింపుసొం
పెల్లెడఁ గల్గు పాల్కడలి యిల్లటవల్లునిఁ గాంచి రయ్యెడన్. 176

రామాభ్యుదయము (3–44)

**షష్ఠికి నకారము వచ్చుటకు**

గీ. [43]**చెంచునింటికిఁ** బోయి చెంచితకుఁ బ్రియము
చెప్పి నమ్మించి తలవిరాఁదఁ జెయ్యి పెట్టి
వెఱకు మని తన్ముఖంబున నెఱుకుతేన్నిఁ
గాంచి యాతనితోడ సఖ్యంబుఁజేసి. 177

కాశీఖండము (5–71)

గీ. తరుణి వైదర్భి నీ వెట్టి ధన్యవొక్కొ
భావహావవిలాసవిభ్రమనిరూఢిఁ
గౌముదీలక్ష్మి యప్పాలకడలివోలె
[44]నలరఁ జేసితి నిషధ**రాజంత**వాని. 178

శృంగారనైషధము (2–92)

వ. అహోబలపతి 'నిషధేశుఁడంతవాని' యని దిద్దియున్నాఁడు. అది కవి
యాశయము గాదు. 179

ఉ. అల్లఁడు రామరాజనుఁగుటల్లఁడు గొబ్బురి యౌబళేశుఁ డా
హల్లకహారిఁ గన్న ఘనునల్లుఁడు పోషణబుద్ధి**గట్టురా**
**జల్లుఁడు** వింటినేర్పునసమంచితరూపమునందుఁ జందమా
మల్లుఁడు దేవకీరమణునల్లుఁడు శత్రుసమిజ్జయంబునన్. 180

రామాభ్యుదయము (పీఠిక—43)

43. ము. కాశీ. ......... చెంచెతకుఁ బ్రియము.

44. ము. శృం. నైష. నదురఁ జేసితి నైషధునంతవాని.

క. అన్నన్న మొగము వెన్నుని
యన్నన్న జయించుఁ గన్నులన్నన్నలినా
సన్నములు నడుము మిక్కిలి
సన్నము మాటలు సుధాప్రసన్నము లెన్నన్. 181

విజయవిలాసము (1–83)

ఆ. రెండుమారు లుచ్చరించు శబ్దమునకు
నంత్యపదము మొదలియు చ్చడంగు
నన్నయన్న యనక యన్నన్న యేమేమి
యనఁగవలయుఁ గృతుల నగనివేశ 182

క. అన్నగరి చిఱుతయేనుఁగు
గున్నలపై నెక్కి, నిక్కి కోయఁగవచ్చున్
మిన్నేటిపసిడితామర
లన్నన్న మఱేమి చెప్ప నందలి కరులన్న. 183

రాజశేఖర చరిత్ర (1–51)

ఏమేమి

శా. ఏమేమీ యను విన్నమాటయు వినున్ వీక్షించు నెమ్మోము సాం
ద్రామోదంబునఁ బక్షముల్ నివురు హస్తాంభోజయుగ్మంబునన్
భామారత్నము రూపసంపదఁ దగన్ భావించు నానందమా
ధ్వీమత్తుం డయి చొక్కుఁ జిత్తమునఁ బృథ్వీనాయకుం డెంతయున్. 184

శృంగారనైషధము (2–105)

వ. అమ్మమ్మ, అబ్బబ్బ మొదలయినవి యిటువలెనె తెలియునది. 185

క. అహ మనుచోఁ గి మనునెడన్
విహితంబుగ నంత్యహల్లు ద్విత్వము చెందున్
మహితప్రబంధములలో
నహ మ్మనియుఁ గి మ్మనియును నంగజదమనా! 186

## కిమ్మ

ఉ. కమ్మనికుందనంబు కసుగందనిమే నెలదేటిదాటులన్
బమ్మెర వోవఁ దోలుఁ దెగబారెడువెండ్రుక లిందుబింబముం
గిమ్మననీదు మోము గిరిక్రేపులు మూఁపులు కౌను గానరా
దమ్మకచెల్ల వాని వికచాంబకముల్ శతపత్రజైత్రముల్. 187

మనుచరిత్ర (3—6)

శా. ఆతన్వంగి యనంగరూంకరణవజ్ర్యాముక్తచూతాస్త్రని
ర్ఘాతం బోర్వక తమ్మ లంచు, దటినీగర్భైకసంజాతకం
జాతవ్రాతము మాటుఁ జెంద నవి యేచం జొచ్చె మున్మున్నుగా
జ్ఞాతిశ్చే దనలేన కి మ్మనెడి వాచారూఢి సత్యమ్ముగన్. 188

వసుచరిత్ర (3–101)

వ. కడమ యీలాగే తెలిసికొనునది. 189

క. తొడరి నమశ్శబ్దాదుల
యెడ నచ్చుగ నచ్చు గదిసెనేని విసర్గల్
చెడు నచ్చు యకారం బగు
మృడ ! ఫీఠపురీవిహార! మృత్యువిదూరా ! 190

## నమ

సీ. గీ (మధురసఫలోపహారంబు మధుపకీర
పరిజనపరాయణున కంచు భక్తి నొసఁగి)
'మానవమథనాయ మదనాయ మధుసఖాయ
మనసిజాయ నమో నమ' యనుచు మ్రొక్కి. 191

వసుచరిత్ర (3–170)

వ. నమో యనియుఁ గలదు. 192

ఉ. పాయక దైత్యు లిట్లు బహుభంగుల బాధ లొనర్ప విష్ణుదే
వాయ నమో నిరంతవిభవాయ నమో జలజాలయాకళ

త్రాయ నమో నిశాచరహరాయ నమో యను గాని క్రన్యభు
జ్నాయకనందనుండు చలనంబును బొందఁ డొకించుకేనియున్. 193

వరాహపురాణము

గీ కనమె కార్యార్థినః కుతో గర్వ యనఁగ. 194

చంద్రభానుచరిత్ర

ఉ. నవ్యవిలాసరమ్యనలినం బని బాలముఖాబ్జసౌరభా
భివ్యసంబనంబఱచు భృంగకులోత్తమ తద్వియోగతా
పవ్యథఁ బ్రాణి నిల్వదు కృపాగుణిమేర్పడ బ్రాహ్మణో న హం
తవ్య యనంగ నొప్పవచనస్థితి కుంద కెఱుంగఁ జేయువమా. 195

భీమఖండము

క. పొల్లు లగు హల్లులెల్లను
దెల్లమిగా నచ్చుబెరసి ద్విత్వము చెందుం
బెల్లుగ నసుకరణంబుల
హల్లకహితసుప్రకాశ ! హర ! పరమేశా ! 196

శా. (ఆత్మార్థంబు ధనంబు ధాన్యమును నాత్మార్థంబు పశ్వాదికం
బాత్మార్థంబు హితాప్తబంధుజన మాత్మార్థంబు గేహాచ్ఛ్రయం
బాత్మార్థంబు పరిత్యజింపఁదగు రాజ్యం బైన నప్పంద మ్మై)
యాత్మార్థం పృథివీం త్యజే త్తనెడు వాక్యం బు శ్రుతంబే నృపా! 197

కాశీఖండము (6–67)

వ. కడమవన్నియు నీలాగే తెలిసికొనునది. 198

గీ. నాంత పదములపై సక మగు పదముల
కచటతప లైదు నగుచుండు గజడదబలు
పిటిది నా సున్న లగ నిను బిలిచె నన, ని
నుంగొలిచె నాఁగ దివిజసన్నుత మహేశ ! 199

**కకారము**

శా. సింగం బాకటితో గుహాంతరమునం జేట్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యద్క్రోధ మై వచ్చు నో

జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనఁ జూపీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్. 200

విరాటపర్వము (4-95)

### చకారము

ఉ. అంజనమాన వాయుగుణమంతయు ఖంజతఁ జిక్కి నజ్జవో
ష్మం జనియుబ్బు చిక్కని సమానపు వాయువులో నొకండు క
ల్మిం జనియించు దుర్యశము మేల్కని లేహనవేళవాజు లూ
ర్చం జెడు 45మాణిమంథనికరంబుల కాళిమ పేరఁ దార్కొనన్. 201

ఆముక్తమాల్యద (2—28)

### తకారము

క. అందులకు ధరణిఁగల నృప
నందనులందఱు ముదంబునం బోయెడువే
డ్కం దమలోఁ గలహంబును
గ్రందుగ లేకున్నవారు గడునెయ్యమునన్. 202

ఆరణ్యపర్వము (2—32)

### పకారము

క. అంబాలికకును గుణర
త్నాంబుధి పాండురవిరాజితాంగుఁడు ప్రభవిం
చెం బాండురాజు గురువం
శంబు 46ప్రతిష్ఠిల్ల ధర్మసత్యవ్రతుఁ డై. 203

ఆదిపర్వము (4-257)

క. లెల్లవిగ గజడదబములు
పొల్లునకారంబుతోడఁ బొదలినయెడలం

45. ము. అము. మాణిబంధ.
46. ము. భార. ప్రతిష్ఠింప ధర్మసర్వజ్ఞుం డై.

బొల్లులె నిల్చు, నొకొకచో
జెల్లును నెఱసున్న లగుచు శ్రీ గౌరీశా! 204

## పొల్లునకారము నిల్చుటకు

శా. భారద్వాజపవిత్ర[47]గోత్రు విమలాపస్తంబసత్సూత్రు వి
ద్యారాజీవభవుండు మారయకుఁ బుణ్యాచార భీమాంబకున్
గారామైన తనూజు నన్ననఘు శ్రీనాథాఖ్యుఁ బిల్పించి స
త్కారం బొప్పఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్. 205

*శృంగారనైషధము* (1–12)

క. త్వరితముగ జనుము సఖుఁడు
స్థురుఁడు గదా నీకు నర్జునుండు పకృతిత
త్పరుఁ డై నెగడుట నుత్తము
పురుషులు వేచుతరి వచ్చె భుజశౌర్యనిధీ! 206

*ద్రోణపర్వము* (3–280)

వ. కడమవన్నింటికి నీలాగే తెలిసికొనునది. 207

## పొల్లుచెడి బిందువగుటకు - గకారమునకు

క. తుంగమడువున జెలఁగు మా
తంగమునకు మిగిలి యడవి దరికొను కార్చి
చ్చుం గడచి యచటి బలములు
భంగించె నరుండు ఘోరబహువిధగతులన్. 208

*ద్రోణపర్వము* (3–101)

## జకారమునకు

ఉ. అంజనమాన వాయుగుణమంతయు ఖంజతఁ జిక్క నజ్జవో
ష్మంజని యుబ్బుచిక్కని సమానపు వాయువులో నొకండు

47. ము. శృ. నైష. గోత్రుని శుభాపస్తంబ ............శ్రీ నాథాఖ్యునిం బిల్చి.

**ల్మిం జనియించు** దుర్యశము మేల్కొని లేహనవేళ వాజు లా
ర్చం జెడు 48నూణిమంధనికరంబుల కాళిమ పేర్చఁ దాఁకొనన్. 209

ఆముక్తమాల్యద (2–28)

**డకారమునకు**

శా. చండాంశుప్రభ చిక్కఁతిమ్మయతనూజా తిమ్మవిధ్వస్త పా
షండం బెన పత్రిలింగ భాగవత షష్ఠస్కంధకావ్యంబు నీ
**కుం డక్కెం** జతురాననత్వగుణయుక్తుల్ మీాఱ వాణీమనో
భండారోద్ధత చూరకారబిరుద ప్రఖ్యాతి సార్థంబుగన్. 210

కవులషష్ఠము

**దకారమునకు**

స్రగ్ధర :— తల్లిఁ పిట్టున్ లత్సాహ మొందం దనయుజనపరిత్రాణ మర్థించి **యక్కం**
**దళితా** పత్యానురక్తిన్ మహిపుననుగతిం దాను ర్యాబూనకుండన్
వలనొప్పన్ మాన్చి స్వస్థానమునకుఁ జనియెన్ రాము నాత్మేశుఁ బ్రేమా
త్యలఘుశ్రేయస్సుమిత్రానవరతనవయోగాఢ్యుఁ దోడ్కొంచు వేడ్కన్. 211

రాఘవపాండవీయము (2–13)

**మకారమునకు**

లయగ్రాహి. కమ్మని **లతాంతముల కుంమొనసి** వచ్చుమధు
పమ్ముల సుగీతనినదమ్ము లెసఁగెం జూ
(తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి ముకు
ళమ్ములను నానుచు ముదమొ నర వాచా
లమ్ము లగు కోకిలకులము ల రవమ్ము మధు
రమ్మగుచు విన్చె ననిశమ్ము సుమనోభా
రమ్ముల నశోకనికరమ్ములును జంపకచ
యము లును గింశుకవనము లను నొప్పెన్. 212

ఆదిపర్వము (5—138)

48. ము. ఆము. మాణిబంధ.

లయగ్రాహి:— 49అవ్వ్యాహీసురోత్తముఁడు నమ్మనుజభోజియు మ
నమ్ములను గ్రోధ మధిక మ్మగుచు విూఱిన్
హు మ్మనుచు డాయుచు శరమ్ము లరిబోయుచు ర
యమ్మెసఁగ నేయుచు జల మ్ముదవగా నొ
క్కుమ్మడి బరాక్రమములం మెఱిసి రక్తములు
గ్రమ్ముకొని మేనుల గరమ్ము దిగఁజారన్
రమ్మనుచుఁ జీరుచు జవ మ్మెసఁగ నుగ్రసమ
రమ్మ మపుడు చేసిరి బలమ్ములు చెలంగన్. 213

*రుక్మాంగదచరిత్ర* (5—38)

మత్త. అమ్మునీశునివాసశక్తిఁ దదంగరాజ్యమునందు మే
ఘమ్ము లెల్ల కెలంకులం గడుఁగ్రమ్మి సర్వజనప్రమో
దమ్మముగాఁ బ్రవతద్బృహజ్జలధార లొప్పఁగ వృష్టి సే
సెం మహానదులు న్మహాసరసీవనమ్ములు నిండఁగాన్. 214

*అరణ్యపర్వము* (3–113)

క. అమరఁ గ్రుతులందుఁ బ్రథమాం
తములపయిన్ నిలుచు కచటతపలకు నాదే
శము గసడదవ లగున్ ని
క్కము యాత్మాస్మత్పదములు గాక మహేశా! 215

గీ. కాకు సంబోధనా వ్యయ కర్మధార
యంబుల నచేతనంబుల నగు వికల్ప
మనియె మును ముద్దరాజు రామన సులక్ష్య
వ౦లు వినము కాకుసంబోధనలకు భర్గ! 216

**అవ్యయమున కాదేశము రానందునకు**

మ. ధృతరాష్ట్రుండును బుత్రులున్ వనము కుంతీనందనుల్ సింహముల్
మతి నూహింప నసింహ మ్మైన వనమున్ మర్దింతు రెందున్ వనా

49. ము. రుక్మాం. అమ్మహితవిక్రముఁడు.

వృతవృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందు గా
న తగం బొందుట కార్య మీయుభయమున్
సంతుష్టివై యున్కికిన్. 217
*ఉద్యోగపర్వము* (1-358)

ఉ. ఏచిన యాపురత్రయము నేకశరంబున రూపుమాపఁగాఁ
జూచినఁ బోవుఁ గాన పెఱచొప్పునఁ బోవదు సంగరోన్ముఖుం
డై చనుదెంచె నేని మదనాంతకుచే నది చెల్లు50నొర్లకుం
గోచర మెట్లుగుం జనుఁడు గొబ్బున మీరు మహాత్మపాలికిన్. 218
*కర్ణపర్వము* (1-266)

**ఆదేశము వచ్చుటకు**

క. ప్రదరప్రవాహమున న
మ్మదవద్ద్విరదంబు పటుగమన ముడిపి ముదం
బొదవిన సాత్యకివిలు వి
ట్టు దునిమె నమ్మగధనాథుఁడు మహోగ్రుం డై. 219
*ద్రోణపర్వము* (4-35)

క. ఆసభ నమ్మెయి నీదు
శ్శాసనుఁ డప్పాండుపుత్రసతిఁ గ్రూరాత్ముం
డై సీర లొలిచి పెద్దయు
గాసిం బెట్టంగ నెఱిఁగి గలఁగిన మదితోన్. 220
*స్త్రీపర్వము* (2-57)

చ. అసమున మీఁదె ఱుంగక మహాగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం
బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు కౌరవసేన యెడ యొం
టిసనుట యేడ నా కిది కడిందివిచారము పుట్టె సైన్యముల్
వెసఁ జని తోడు గావలయు వేగము పంపుఁడు చాలినట్లుగన్. 221
*విరాటపర్వము* (5-234)

50. ము. భా. ఒడ్లకు, న్గోచర మట్టె యింతలు పనుల్ సనుఁ డమ్మహితాత్మపాలికిన్.

### కర్మధారయమునకు ఆదేశము రానందులకు

చ. అకుటిలుఁ డార్యవర నుఁ డహక్షాంతిదుగార్యుఁడు నీతినిర్మలా
త్మకుఁ డనవద్యశీలుఁడు సుధర్ముఁడు భీముఁడు కుంతి ముద్దుసే
యు **కొడుకు** మేను లేఁత తన యుల్లము మెత్తన యిట్టియాత్మఁ డె
ట్లొకొ యొరు నాశ్రయించు విధి యోపఁడె యెవ్వరి కిన్ని

సేయఁగన్. 222

*విరాటపర్వము* (1–98)

### ఆదేశము వచ్చుటకు

ఉ. తెగి మన కగ్గలిచ్చి యురుగుదెంచినవాఁ డితఁ డల్క నింక నొం
**డుగడకుఁ** బోవకుండఁగఁ గడు న్వెస డగ్గఱి యేకపాలముం
బగులుతునో గదానిహతిఁ బార్థ భవత్ప్రకటప్రతిజ్ఞకై
తగ దని యాచె దీనిని శితప్రదరంబులఁ ద్రుంపు కంఠమున్. 223

*అరణ్యపర్వము*

క. **వేసేతుల** నిడుపగు బా
ణాసనము గుణస్వనోగ్ర ముగు నట్లుగ ను
ల్లాసంబునఁ ద్రిప్పుచు ఘో
రాసురుఁడు పరాహుఁ డొప్పె నఖిలధ్వజినిన్. 224

*హరివంశము* (పూ. 4–85)

క. నగరులలోపలి మాటలు
తగునే వెలి నుగ్గడింపఁ దన కేర్పడ నొం
**డుగడన్** బుట్టిన పతి విన
నగు నని చెప్పెడిది గాక యాతనితోడన్. 225

*విరాటపర్వము*

### అచేతనములకు ఆదేశము రానందులకు

క. నాపతు లగు గంధర్వుల
**చే పడి** న్మృతిఁ బొందె వీఁడె సింహబలుం డీ
పాపాత్మునిఁ జూడుఁడు దు
ర్వ్యాపారఫలంబు గాంచె నని పల్కుటయున్. 226

*విరాటపర్వము* (3–3)

**ఆదేశము వచ్చినందులకు**

క. కావలి యై సురరాజ్య
శ్రీవాలింపంగఁ దగు విశేషంబున సం
భావితుఁడు నహుషుఁ డనఁ జని
యా విభుఁ గని తారువారు నధిక ప్రీతిన్. 227

*ఉద్యోగపర్వము* (1—143)

క. పిదపఁ గరికాళచోళుం
డదయుం బై జలధిపరిమితోర్వీవలయం
బు దనకుఁ బంటపొలమ్ముగ
నెదు రెందును లేక పేర్మి నెసకం బెసఁగన్. 228

*ఉత్తరరామాయణము* (1–25)

క. కైసేసి మదవికారో
ల్లాసంబున మేను పొంగ లఘుగతి నుత్కం
ఠాసవపానవిధాన
వ్యాసంగ తరంగితాంతరంగుం డగుచున్. 229

*విరాటపర్వము* (2–329)

వ. ఒకానొకచోఁ గ్రియాపదములకు నాదేశము వచ్చును. అందుకు– 230

చ. కుదురు సమస ధర్మను లకున్ విను సత్యము యోగమోక్షస
త్ప్రదములు సత్యకార్యములు పాప మసత్యము కంటె నొండ లే
దు దలఁప నశ్వమేధములు తొమ్మిదినూరులు వెండి నూరు నై
యొదవిన సీడు గాదు భరతోత్తమ సత్యముతోడ నారయన్. 231

*శాంతిపర్వము* (3–419)

వ. చేతనములకు వికల్పము లేదు. ఆదేశము వచ్చుటకు— 232

చ. డిగకుఁడు వాహనంబులు కడిందిమగంటిమి గోలుపోవ విా
రు గడఁక దక్కి పెట్టి నను రూపఱ నాయుధముల్ మహాస్త్రశ

క్తి గెలుతు సంపతత్క్రాలిశతీవ్రశరంబుల ధీరబుద్ధి బా
రి గను విహారభంగుల నరిప్రకరంబులు పిచ్చలింపఁగన్. 233

ద్రోణపర్వము (5-381)

ఆ. శబ్దశాసనుండు సంస్కృతశబ్దంబుఁ
దెలుఁగుపదము మీఁద నిలుపునప్పు
డరయఁ బ్రథమలందు నాదేశ మొదవ ద
టంచు సూత్రమున విధించి యుండె. 234

వ. 51అందుకు సంస్కృతపదము తెనుఁగుపదముమీఁద నాదేశము
వచ్చుటకు : 235

క. అవిముక్తం బవిముక్తం
బవిముక్తం బనుచుఁ బ్రాతరారంభములం
దవధానపరత నెవ్వం
డు పఠించును వాఁడు ధన్యుఁడు మునిప్రవరా! 236

కాశీఖండము (6—260)

క. అది మొదలుగాఁగ విష్ణుని
మది నిల్పి యతండు నాకు మగఁ డగు నని యి
ట్లు దపంబు సేయుచుండెద
నిది నాతెఱఁ గనిన దానవేశ్వరుఁ డనియెన్. 237

ఉత్తరరామాయణము (5-8)

మ. వివిధోర్వీపతులం జగన్నుతుల ము న్వీక్షింపమో వారి పెం
పు వరీక్షింపమొ నింపమో చెలిమి యేభూపాలురం దైన నీ
భువనత్రాణపరాయణోద్భటభుజాభూరిప్రతాపంబు నీ
జవనాక్షీణబలంబుఁగంటిమె వసుక్ష్మామండలాఖండలా. 238

మనుచరిత్ర (3—6)

51. న విక్రుతిశబ్దా త్పరత స్సంస్కృతికావాం భవంతి గసడదవాః' చింతామణి.

క. విదితముగఁ దాను నే నను
పదములు ప్రథమ ములయి నాంతపదము లగుటఁ దాఁ
బదివెను నేఁ బదివితి నని
వదలక యిరుదెఱఁగుఁ బలుకవచ్చు మహేశా ! 239

**ఆదేశము రానందులకు**

క. నీ చెప్పిన పెద్దలు ద్రో
ణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లని వా
రై చన్న వారలం గొని
యే చక్కంబెట్టువాఁడనే పాండవులన్. 240
ఉద్యోగపర్వము (2-250)

**ఆదేశము వచ్చుటకు**

క. ఏఁ గోరిన చెలువుఁడె నను
దాఁగావలె నంచు వచ్చె దగ్గరి వేడన్
గ్గాఁగిలి యియ్యక వచ్చితి
న్నాఁ గా దని పెనఁగి యెంతయవివేక మయో. 241
విజయవిలాసము (3-20)

క. తెనుఁగుఁగృతిఁ గొన్నియెడలం
దనరఁగ వాక్యాంతగతపదముల నకారం
బునకున్ లోపం బొదవును
ఘనతర గోరాడ్తురంగ కలుషవిభంగా ! 242

**నకారము లోపించుటకు**

గీ. మత్పితామహు ధీపితామహునిఁ దలఁతుఁ
గలితకావ్యకళాలాభుఁ గమలనాభుఁ
జంద్రచందన మందార సదృశ కీర్తి
సరససాహిత్యసామ్రాజ్య చక్రవర్తి. 243
కాశీఖండము (1-20)

ఆ. ఏఁడు నూరనంగ మూఁడునా ళ్లనఁగను
పాడును య్యనంగఁ బరగుశబ్ద
ముల నకారములును వల నొప్ప డూలతో
శ్లిష్ట మగుచు నుండు శ్రీమహేశ! 244

సీ. కాశికానగరోపకంఠదేశము డాసి
52యేడ్నూరు ముఖముల నేగె జలధి. 245

కాశీఖండము (5—286)

గీ. ఇంక 53రెడ్నాళ్లు చూచి నీవంకఁ దెగువ
కలుగ కుండినఁ బ్రజ యూళ్లు దలఁగి పోవ
54మౌని వగు టొండె యొండె విహీనసంధి
నతనిఁ గనుఁగొంటగా కొండుమతము గలదె. 246

ఆముక్తమాల్యద (3—39)

గీ. సంస్కృతపదంబుఁ దగ విశేషణముఁ జేసి
సంధిఁ గూర్పంగ నాలను శబ్దమునకు
మొదల రేఫము గదియును **సదయురాలు**
**పుణ్యురా ల్ధన్యురా లన** భుజగభాష. 247

గీ. ప్రియము గల్గియు నంగీకరింప వలదు
ముండదీవెన రేపాడి మొగముఁ జూచి
బైసిమాలిన పరమ **నిర్భాగ్యురాలు**
విధవ దా నిచ్చునాయువు విషసమంబు. 248

కాశీఖండము (2–85)

సీ. ఒక్కింత శంకింపకున్న **సాహసురాల**
వేటికి వెఱపు నీ కిత్తెఱఁగున 249

హరిశ్చంద్రోపాఖ్యానము (5–173)

52. ము. ప్ర. యేణ్నూరు.
53. ము. ప్ర. రెన్నాళ్లు. ము. ఆము. ఆరెన్నాళ్లు.
54. ము. ఆము. ని వగుటయే యొండె.

వ. కడమవానికి నీలాగే తెలుసుకొనునది. 250

గీ. ఉందు రందరు కందురు కొందు రనఁగ,
నుంతు రెంతురు తగ భుజియింతు రనఁగ,
దగు క్రియలమీఁది రేఫలు దాపలిదెస
యక్కరముతోడ శ్లిష్ట మై యలరు నభవ. 251

ఉందురు

గీ. మమ్ము రక్షించి తని యేల మాటిమాటి
కభినుతింపఁగ దక్షవాటాధినాథ
తల్లిదండ్రులు రక్షింపఁ దల్పవ కుండ్రె
ప్రజల భీమేశ బహువిదోపద్రవముల. 252

భీమఖండము (4—79)

అందురు

సీ. నట మంద్రు కొందరు వటమేని యూడలు
వారి మండల మెల్లఁ బ్రబలవలదె. 253

కవికర్ణరసాయనము (3–140)

అనుభవింతురు

ఆ. తగిలి రుజయు జరయు దైవ వశంబున
నయ్యెనేని దా ననుభవింత్రు
గాక యెట్టిగి యెట్టిగి కడఁగి యారెంటఁ జే
కొందురయ్య యెట్టికుమతు లైన 254

ఆదిపర్వము (3–193)

గీ. బలముకలవాని నలువురు బలవిహీను
లొక్క టై కూడి నిర్జింప నుత్సహింత్రు
మధువుఁ గొన నుత్సహించిన మనుజుఁ బట్టి
కుట్టి నిర్జించు మధుమక్షికులమునట్లు. 255

ఆరణ్యపర్వము (1–251)

క. బాలులు నరపాలులు గుణ
శీలులు నను లులకు రూాలు చెందుం గరుణా
శాలులు దృఢతాలులు ననఁ
గా లిలులకు రూాలు రావు, కాయజదమనా ! 256

గీ. దేవతాభర్త శంభు ప్రతిష్ఠఁ జేసి
సురగణంబుల లోకపాలురను జూచి
యనియె మీరును భీమనాయకుని వీట
సిద్ధశివలింగములఁ బ్రతిష్ఠింపవలయు. 257

భీమఖండము (3–98)

మ. మరుదంభోరుహనేత్ర లంబరధునీమధ్యంబునన్ నిల్వ ని
ష్ఠుర తత్పీనపయోధరాహతి జలస్తోమంబు నల్వంకలం
దెరలన్ నాభిచయంబులోఁ గొనియె వానిం జాలగంభీరశీ
లురు సంక్షోభము నొందు వారి నెచటన్ లోఁ గొంచు వర్తింపరే. 258

పారిజాతాపహరణము (4–29)

క. ఇరువదియేవురు పాంచా
లురు లేనూార్వురు కేకయులును తానాంగకులై
ధరఁ దొరఁగి వీరరక్తము
కరినికరము రొంపిఁ బడినగతి నుండె నృపా ! 259

ద్రోణపర్వము (3–277)

క. మల్లులను శబ్దమునకున్
మల్లులు మల్లు రని కృతుల మానుగఁ బలుకం
జెల్లును గవియనుమతి నహి
వల్లభకేయూర ! దురితవారవిదూరా ! 260

మల్లులు

చ. వలసిన నేలు మేను బలవంతుఁడు గారెనుబోతు దంతి బె
బ్బులి మృగనాథునిం దొడరి పోరుదు శూరత యుల్లసిల్లఁగా

55. ము. ప్ర. 'నూార్వురు కేకయులును'.

దలమును లావు విద్యమెయి దర్పము పేర్చి పెనుంగు జెట్టి మ
ల్లుల విరుతున్ మతిన్ గడియలోనన చూడ్కికి వేడ్క పేయుచున్. 261
విరాటపర్వము (1–223)

## మల్లురు

మ. అరరే యయ్యలు రామరాజు పెదతిమ్మాధీశుబాహాభయం
కర కౌక్షేయకధార ఘోరనఁ గడంకం ద్రెవ్వ వీరారి మ
ల్లురకున్ మట్టి యగుం దదీయబలధూళుల్ సంగడా లౌ వియ
చ్చరకాంతాస్తనపాళి విన్నరిడి కాశ్చర్యంబు సంధింపఁగన్. 262
రామాభ్యుదయము (పీఠిక. 59)

క. విన్నారరు కన్నారరు
నున్నారరు ననుచుఁ బలుక నొప్పంగ్ర తులం
జెన్నగు మధ్యమపురుషకు
పన్నగకులరాజహార! భవభయదూరా! 263

## ఉన్నారరు

క. గురుఁడును నీవును మద్రే
శ్వరుఁడును గర్ణుండుఁ గృపుఁడు సౌబలుఁడున్ నన్
ధర యేలింపఁగ నున్నా
రరు నీకుం జనునె సంగరములోఁ గలఁగన్. 264
ద్రోణపర్వము (5–111)

క. నులు డులు నడుమంగల పద
ముల యుత్వము లుడుగుఁ గావ్యములఁ జిల్క యనం
జిలుక యనఁ గిన్క గిను కన
వలిగా ద్పన గాడు పనఁగ, నందితురంగా! 265

## చిల్క

ఉ. చంపకగంధి మోవి సరసం బగు బింబ మటంచుఁ బట్టితే
లింపు టెలుంగుతోఁ దమి దలిర్పఁగ బల్కినఁ జెక్కుగీటి న

న్వింపున ముద్దు పెట్టుకొని యెప్పుడు మన్నన సేయనున్నదో
పెంపుడు జిల్క నిన్ను మరపింతుఁ జుమీ చెలి నన్ను నేలినన్. 266

విజయవిలాసము (2—185)

## గాడ్పు

క. చిచ్చునకు గాడ్పు తోడై
వచ్చిన గతి మరున కబ్జవైరియుఁ దోడై
వచ్చె నడియూస వల దిఁక
మచ్చికఁ దలపోసి నన్ను మది మరువకుమీ! 267

కవికర్ణరసాయనము (3–130)

ఆ. కలికి కొలికి ములికి కడిగి యడిగి యనంగ
కలిమి బలిమి చెలిమి తెలివి యన్నఁగ
నునికి మనికి వినికి యనుపదంబులకడ
యక్కరములు శ్లిష్ట మగు మహేశ! 268

## కల్కి

సీ.[1] గరళాంజనము కల్కి క్రాలు గన్నులఁ దీర్చి
మధుపానమున నుబ్బు మదికి నొసఁగి 269

కాశీఖండము (6–209)

## కొల్కి

చ. (బలితపు గుబ్బిగుబ్బలులపై నిరవొంది మెఱుంగు దీఁగె చే
నలరి హృతాబ్జపూగరుచియై నిరవద్యకలారవామృతం
బులకలిమిం బికాంగనలమూఁకకు మూకత సంఘటించు నీ)
చిలుకలకొల్కి కంధర భజింపఁగఁ జెల్లదె కంధరాంకమున్.[2] 270

వసుచరిత్ర (2–72)

## ముల్కి

ఉ. మంపెసఁగన్ గటాక్షలవమాత్రముచేతనె ముజ్జగంబు మో
హింపఁగఁ జేయు భార మిఁక నీవు వహించితి గాక కేళి నీ

చంపకగంధి బిత్తరపుఁజన్నులమీఁద సుఖించుకొంచు నా
సంపెగమొగ్గ ముల్కిఁ గడసామరి సోమరి గాక యుండునే. 271

*విజయవిలాసము* (1–81)

## కర్మణి

చ. అడుగులు గడ్డి ప్రీతి యొసలారఁగఁ దద్దయు నెమ్మిఁ బల్కిర
ప్పుడు మది పల్లవింప మునిపుంగవుఁ డాతని కాత్మభాగ మె
క్కుడగు విభూతిఁ జూపి బుధకుంజర నిర్ధారితార్జునంబునం
బడసిన యట్టి సక్తువు కృపారతి న్వాకలి దీనఁ దీర్పవే. 272

*ఆశ్వమేధపర్వము* (4–223)

వ. కడమ వన్నియు నీలాగే తెలియునది 273

గీ. యుష్మ దస్మత్పదంబులం దొనర ఘనుఁడ
వైన నీవును నధికుఁడ నైన నేను
ననెడుచో ఘనుఁ డైన నీ వధికుఁ డైన
నే ననంగ వుసుల్ వాయు నీలకంఠ ! 274

## యుష్మత్పదంబు

శా. శ్రీఘ్రం బేటికి వచ్చి సంస్తుతిభవ శ్రీ సౌఖ్యగంధంబె దా
నాఘ్రాణింపని మత్తనూజుల దురాత్మా భికులం జేసినన్
శుఘ్రాదిన్యవమగ్నుఁ జేసితి కృపాశూన్యుండవై గోముఖ
వ్యాఘ్రం బింతియు గాక నీవు ఋషివే యాహా వితర్కింపఁగన్. 275

*కవులషష్ఠము*

మ. జయలక్ష్మీ ధవుఁడైన నీకుఁ దగ మత్సామ్రాజ్యభోగంబుల
న్నియు నర్పించితి నీకృపారతి శరన్నీరేజపత్రాయతా
క్ష యుదాత్తంసు మునీంద్రమానసరిరంసుం గంసవిధ్వంసు న
వ్యయు నద్వైతు భజించి యవ్విభునిసేవం గాంతు నిష్టార్థముల్. 276

*జైమినిభారతము* (2–94)

మ. జననంబొందితి దుగ్ధవారినిధి నా సర్వేశు జూటంబుపై
జనులే ప్రొద్దు ప్రశంససేయ **నవతంసం బైతి** నీ ప్రాభవం
బునకుం బాంధజనాపకారి యగు నా పూవిల్తునింగూడి వా
రనిదుష్కీర్తిగ తిట్టునం బడకు చంద్రా రోహిణీవల్లభా. 277

*శకుంతలాపరిణయము* (3–188)

చ. అరుదుగ నీ విమానము ప్రజాధిపుఁడుం బురుషోత్తముండు శం
కరుఁడును దక్క నన్యులకుఁగా దధిరోహమొనర్ప వారి సు
స్థిరకరుణావిశేషమున జిష్ణుఁడ నై గయికొంటి దీని నే
నరవర సర్వసద్గుణగణంబుల **ప్రోవగు** నీ కొసంగితిన్. 278

*వసుచరిత్ర* (3–16)

క. ఏ నీకు నొకటి చెప్పెద
దానవకులముఖ్య దేవతలకు **నవధ్యుం**
**డైన** నినుబోఁటి వాఁడీ
మానవుల జయింప విక్రమమునుం గలదే 279

*ఉత్తరరామాయణము* (5–38)

## అస్మత్పదంబు

గీ. అధికతాప **పరీతాత్ముఁ డైన నాకు**
నెట్లు వచ్చితి చలిగాడ్పునట్లు నీవు
పూర్వజన్మమహాతపః స్ఫురణ నాకు
నీదుసన్నిధి సమకూరె నిధియు పోలె. 280

*శృంగారనైషధము* (2–28)

గీ. రండు నన్నుఁ గూడి యోపరిగ్రాట్టులార
వత్సలత మీఱ మీరేల వత్తురయ్య
పరమ నిర్భాగ్యుఁ డైననాపజ్జఁ దగిలి
**కటకటా** సౌఖ్యజలరాశిఁ గాశిఁ బాసి. 281

*కాశీఖండము* (1—140)

చ. హరిహరపద్మ గర్భులను నాదికవీంద్రుల నాత్మసత్కవీ
శ్వరులను భక్తిఁగొల్చి తగ వారికృపం గవితావిలాసవి
స్తర మహనీయుఁడైన నను సర్వగుణోత్తర మూర్తి మన్మథా
వర్యుఁడు దగంగ రాఁబిలిచి వారనిమన్నన నాదరింపుచున్. 282
ఉత్తరరామాయణము (1–2)

చ. వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁ జొచ్చితి నందుఁ బాండుభూ
వరునకుఁ గోడలైతి జనవంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరులగు బుత్రులం బడసితిన్ సహజన్ముల ప్రాపు గాంచితిన్
సరసిజనాభ యిన్నిటఁ బ్రశస్తికి నెక్కిన దాననెంతయున్. 283
ఉద్యోగపర్వము (3—108)

గీ. యుష్మదర్థంబు బహువచనోక్తిఁ బలుకు
నపుడు ఘనులు ప్రసిద్ధులు ననుపదముల
కలర ఘనులరు కడుఁ బ్రసిద్ధులరు మీర
నంగఁ జను గావ్యములయం దనంగదమన. 284

చ. భరతకులప్రసిద్ధులరు భాసురశస్త్రమహాస్త్రవిద్యలం
గరము ప్రసిద్ధుఁడై పరగు గౌతము శిష్యులరట్టి మీరు దు
ష్కరముగ నాతిలోఁ బడిన కాంచనపీడఁ గొనంగనేర కొం
డొరుల మొగంబుఁ జూచి నగుచుండఁగఁ జన్నెయుపాయహీనతన్. 285
ఆదిపర్వము (5–210)

క. మీరును గుంతియు సహపరి
వార మహామాత్యభృత్య వర్గులరై నా
నారాజ్యలీలతోఁ జని
సారమతిం జేయుఁ డందు సతతోత్సవముల్. 286
ఆదిపర్వము (6–136)

సీ. వడముడియును నీవు వాయువాసవుల శ
క్తులు ధరియించిన దుర్జయులరు 287
శాంతిపర్వము (1–40)

క. నురు నుఋలు పొలు ్లగుచుం
దిరముగఁ బైహల్లు గదిసి ద్విత్వముఁ జెందున్
సరవి నవి వేఱె యుండున్
గరిదైత్యవినాశ! శైలకన్యాధీశా ! 288

వ. నులులకు సులభమే కనుక రుఋలకుఁ జెప్పచున్నాము. 289

ఉ. త్యాగులు బాతకేతరులు నై నుతికెక్కఁగ నాకలోక లీ
లా గరిమంబు నంబురము లాగు దనర్చిన సంస్కృతోజ్జ్వల
ద్వాగభియుక్తి నాత్మవిబుధత్వము సిద్ధత నొందఁగా సుధా
యోగము నొందుదుర్ శ్రుతిపయోధి మథించి రసజ్ఞులై కవుల్. 290
హరివంశము

క. వినుము రిచివునకు తనయుం
డనఘాయత తారనైజుఁ డతనికి ముఫ్ఫర్
తనయులు సుమతియు ధృడుఁడును
ఘనుఁడు ప్రతిరథుడు నన ప్రకాశితతేజుల్. 291
హరివంశము (పూ. 3-82)

సీ. శాకపాకములతో సంభారములతోడఁ
బరిపక్వ మగు పెసరప్పుతోడ 292
భీమఖండము (1-61)

భూతప్రేతపిశాచ
వ్రాతములుం దోడుగాఁగఁ బ్రమధులు పగలున్
రాతిరియును నష్టాదశ
జాతిప్రజలకును దుర్దశలు సంధింతుర్. 293
హరవిలాసము (5-13)

మ. పరిహాసంబునఁ దేలి భృత్యులయెడన్ బ్రహ్లాదమున్ బొందు భూ
వరునాజ్ఞాంజన రీగి మెచ్చరు పనిన్ వంచింతు రెగ్గాడఁ జొ
త్తురు కౌతూహలవేషభాషణములుం దుల్యత్వముం బొంది యే
తురు వారెల్ల పదంబు వేడుదురు సింతుర్భూమివారాండనన్. 294
శాంతిపర్వము (2-180)

### శకటరేఫ

సీ. మగఁడు_ద_న్మాత్తుచో మ్మూతొత్తు నలివేణి
వ్యాఘ్రి యై చరియించు వనములోన 295
కాశీఖండము (2–80)

ఆ. లేవనెత్తుటయును, చావకయుండుట
వెఱవకుండుటయును మఱవకుంట
56నోవనేయు టనెడు నుడువులఁ గల ఎఱ-
రమ్ము లోప మొందు రాజమకుట ! 296

### లేనెత్త

మ. తనతో నల్గినవాణిపాదములువ్రీఁదన్ వ్రాల లేనెత్త నా
య్యన పాశ్చాత్యనిజాస్యతన్ముఖములం దన్యోన్య మొక్కప్డు చుం
బన మబ్బంగఁ జతుర్ముఖత్వము ఫలింపం జొక్కు పద్మాసనుం
డనవద్యాయురుదీర్ణుఁ జేయు చికతిమాదీశు తిమ్మాధిపున్. 297
కవులషష్ఠము

### చాకుండ

శా. ఆకేశిధ్వజుఁ డంత నాన్నపునిరాజ్యం బెల్లఁ జేరన్ ఫలం
బాకాంక్షింపఁగ గెల్తు మృత్యువు నవిద్యం బుట్టకుండం దుదం
జాకుండ న్వలె నంచు యోగనిరతిన్ జ్ఞానాశ్రయుం డై మహా
నీకంబున్ రచియించుచుం డొకటికిన్ దీక్షించి తా నున్నచోన్. 298
ఆముక్తమాల్యద (3–18)

క. చాకున్న నీదుముక్తులు
శ్రీ కాశీక్షేత్ర మెవ్వరికి నిది నిక్కం
బీకుధర మిచ్చు శిఖరా
లోకనమాత్రమున ముక్తులు కురంగాక్షీ. 299
కాశీఖండము (3–61)

56. ము. ప్ర. నొవ్వ నేయుటనెడు.

క. నాలుగుదిశలను దాప
జ్వాలావలి గదిసె మంద్రి చానోపఁ గృపా
లోలా న న్నొక్క సరి
త్కూలముఁ జేరంగ నెత్తికొని పొమ్ము దయన్. 300

అరణ్యపర్వము (2–127)

వెఱకుండు

గీ. చెంచునింటికిఁ బోయి చెంచితకుఁ బ్రియము
చెప్పి నమ్మించి తలవ్రీఁదఁ జేయి వెట్టి
వెఱకు మని తన్ముఖంబున నెఱుకుఁజేని
గాంచి యాతనితోడ సఖ్యంబుఁ జేసి. 301

కాశీఖండము (5–71)

నోనేయుట

సీ. అర్జునుపైఁ గూర్మి నతని నోనేయుడు
సచరాచరంబైన జగమునెల్ల 302

ఉద్యోగపర్వము (4–229)

గీ. బలము నచ్చెరువందున ట్లలవు మెఱయ
నీసుతుండ నిలచుఁ దాఁకి నిశితసాయ
కముల నొప్పించి రథ[57]తురంగముల నొంచి
నూతు నోనేయఁ గ్రోధవిస్ఫూర్తి నతఁడు. 303

ద్రోణపర్వము (4–193)

గీ. మూఁడులింగంబులకును సముచ్చయార్థ
ములఁ దెనుంగునఁ గలపదములకు నెల్ల
యునులు వచ్చు నికారాంతమున కొకొక్క
తరినిఁ బొల్లనకారంబు ద యరు నభవ ! 304

57. ము. ప్ర.దురులకు

చ.! అనలుఁడు రెండు మూఁడు యముఁ డాసురనాథుడు నాలుగైదు, తో
యనిధిపుఁ డాఱు గంధవహుఁ డర్కపుఁ డేడు మహేశుఁ డెన్మిదిన్
ఘనవిశిఖంబు లేయ మురఘస్మరుఁ డన్నియుఁ ద్రుంచి శార్ఙ్గ సం
జనితమహాగ్రభల్లముఖ జర్ఝరితాంగులఁ జేసె నందఱన్. 305

*పారిజాతాపహరణము* (5–22)

చ. ఎఱుగవు గాక యొక్కపు డొకించుక నూర్మిగ మిడ్డ కూర్మికిం
గొఱుతయొ యెంత చెప్పినను గోమలి నేరవ యుల్కఁ దెచ్చుకో
నెఱియ నధినమౌ పెఱిఁగి నేఁ డిది గైగయికోమి మిక్కిలిన్
నెఱినె నతండు, నీవు విన నేర్చెదె మాపలు కెప్పుడేనియున్. 306

*కళాపూర్ణోదయము* (7–208)

శా. వాలింగిలియు వాయుపుత్త్రుసరియే వాఁ డాత్మశక్తిజ్ఞుఁడై
(యాలోకంబులు గెల్తు నే ననిన మా రెండుం గలండే ? మహీ
పాలాగ్రేసర ! వానివర్తనముఁ జెప్పం జిట్టు లా విక్రమ
శ్రీలోలున్ భవదీయసన్నిధిఁ బ్రశంసింపం దగుం, జెప్పెదన్) 307

*ఉత్తరరామాయణము* (7–99)

చ. వలసిన నేలు మేనుబలవంతుఁడఁ గారెనుబోతు దంతి బె
బ్బులి మృగనాథునిం దొడరి పోరుదు శూరత యుల్లసిల్లఁగా
దలమునులావు విద్యమెయి దర్పము పేర్చి పెనంగు జెట్టిమ
ల్లుల విరతన్ మఱిన్ గడియలో నన చూడ్కికి వేడ్కసేయుచున్.308

*విరాటపర్వము* (1–223)

క. అనుజులకు నడ్డపడి యే
మిని జేయఁగ లేమిఁ జూచి మెచ్చితిగా నీ
వును సాదు రేగెనేనిన్
విను దలపోలమునన కాని నిలువదు సుమ్మా. 309

*ఉద్యోగపర్వము* (2–13)

క. తనరిచి యొనరిచి యమరిచి
యనుపదముల రీలుసంధి నడఁగున్ బొడమున్

వినుము తనర్చి యొనర్చియు
ననంగ ననుర్చియు ననంగ నంగజదమనా ! 310

క. బొనులు ముడివడగ బిడికిలి
నుమరిచి కోపంబుతోడ నౌడుగఱచుచున్
జనుపాడ్వసనాహరి ను
గ్రనుగాః బయిఃబడుట దామొగంబున గ్రేలున్. 311

*హరివంశము* (పూ. 8-61)

అమర్చి

ఉ. లాలసరీగజాంకుశ, తలంపుల సొంపుల తన్మిచూరి యా
నేలయు నింగి దట్టముగ నిండ నమర్చిన యయ్యసంబుచే
గ్రారినొసంగుతేని యొడికంబును జుక్కలసోయుగంబు ము
ద్యాలపెడంగు డిగ్గనడునట్లుగ జేసిన చాగపుంబలీ ! 312

*యయాతిచరిత్ర* (4–163)

గీ. (తాయెదయు నుయ్యెలయు పయ్యెదయు ననంగ
గలుగ దెత్వంబునుధ్య యుకారమునకు
నసుచు నును నుద్ధరాజు రామున వచించె
గాని యెత్వంబు గృతులందుఁ గలదు శర్వ !) 313

తాయెద యని యెత్వము వచ్చుటకు

సీ. ఒకయింత యొరగిన సికపిూద నుడిపువ్వు
దెత్తుల నొలయు తాయెదలు జుట్టి 314

*చంద్రభానుచరిత్ర* (1–89)

---

58. లా. ప్ర. తాయెదయు నుయ్యెలయు పయ్యెదయు ననంగ
గలుగ దత్వంబు నుధ్యయుకారమునకు
ననుచు నును ముద్దరాజు రామున నచించె
గాని యుత్వంబు గృతులందుఁ గలదు శర్వ.

**ఉయ్యేల**

చ. కలి దమయంతిఁ బాప సమకట్టి పొరింబొరిఁ బాయ నోపఁ డా
లలన నుదీర్ణసౌహృదబలంబున నిట్టులు రెంటియందు న
న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగతకారి యయ్యె ను
య్యేలయునుబోలె నూరకయు నెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై. 315
ఆరణ్యపర్వము (2–79)

**పయ్యెద**

సీ. వలఁబడ్డ జక్కవల్ బలె నున్న జిలుఁగు ప
య్యెదలోని గుబ్బపాలిండ్లు మెఱయ 316
యయాతిచరిత్ర (3–84)

మ. పదముల్ దొట్రిలఁ గొనుదీవ వెలయింపం గేశముల్ దూలఁ బ
య్యెద వక్షోరుహపాళి చేర కనుదోయి న్బాష్పముల్ గ్రమ్మ గ
ద్గదకంఠంబున వాక్యము ల్దడబడన్ దద్గేహముం జొచ్చి యా
సుదతీరత్నముఁ గాంచె బాలుని, మనశ్శోకానలజ్వాలునిన్. 317
కవులషష్ఠము

**ఉయ్యల యని అర్థము వచ్చుటకు**

సీ. గీ. ఆడుచున్నవి పిప్పళ్ళ నంబరమున
సేయుచున్నవి త్రిభువనాశ్లేషకంబు
లబ్జనాభుని తూగుటుయ్యెలలు గంటె
వేనవేలు పయోరాశివీచిఘటలు. 318
భీమఖండము (3–52)

క. పలుమరుఁ దలయంటి తగ
న్బలుగిడి దోయిళ్ల జలమునం బోర్కాడిం
చి లలిన్ జన్నిచ్చుచు ను
య్యాల నూఁపుచు బెనుపఁ దొడఁగ నావరశిశువున్. 319
కళాపూర్ణోదయము (6–193)

శా. శ్రీలీలాత్మజ కృష్ణరాయ సమరోర్వి న్నీదు వైరిక్ష్మా
పాలు ల్వేఁగి హయాధిరూఢు లగుచున్ బారన్ వనీశాఖిశా
ఖాలగ్నాయతకేశపాశ లయి తూగం గేకిస ల్గొట్టి యు
**య్యాలో** జొంపము లంచుఁ బాడుదురు భిల్లాంభోజపత్రేక్షణల్. 320

చాటుధార

**పయ్యెద యని అర్థము వచ్చుటకు**

చ. కదిరిన వేడిబాష్పములు గ్రమ్మి పయింబయిఁ బర్వ భీతిమై
నదురుచు విన్ననైన హృదయంబునఁ బొల్పగు హారయష్టి **ప**
**య్యెద** దడియంగఁ గానఁబడె నంచితనిర్మలరత్నభూస్థలిన్
దదుదితదృశ్యమానమణిదామసముజ్జ్వలభాతిఁ దోఁపఁగన్. 321

భాస్కరరామాయణము (యు. 2357)

క. ఇల నా య్యా యే లగుపద
ములపైఁ బెర్రవాలు గదియు మొదలవి సొగుల్
లలిఁ గ్రుంగు, గ్రుంగునెడ వల
పల్రవాలకు జడ్డ లొదవుఁ బర్వతనిలయా! 322

ఆ. **అకుమారి** యన్నఁగ **నక్కుమారి** యనంగ
నీగ**యాళి** యనఁగ నిగ్గ**యాళి**
**యే చెనంటి** యనఁగ **నెచ్చెనఁటి** యనంగఁ
జెల్లుఁ గృతులయందు శ్రీమహేశ! 323

క. ఆరయుఁ దచ్ఛబ్దాదుల
పై రేఫోష్మములు మొదలఁబడు పదములిడన్
జేరవు హ్రస్వద్విత్వము
**లారాఘువుఁ డాశరంబు** లన నొప్పు శివా. 324

క. తగ్గఁ గ్గ తులఁ గకారమునకు
నగు నొక్కొకచో వకార మాంధ్రపదములన్
**నగర**నగ **నవర**నంగాఁ
బగడము పవడం బనంగఁ బర్వతనిలయా! 325

వివిధోత్పాతంబులకును
నవఖ్లలోఁ దోఁచుకీడునకుఁ దోడ్తో శాం
తివిధానమున నిరసనం
బవును పురోహితునిచేత ననవద్యముగన్. 326

శాంతిపర్వము (2-308)

క. అవయవము లెట్లు కూర్మము
నివుడించును లోని కడఁచు నెరినట్లన భూ
తవితతి భూతాత్మ్ముండును
ప్రబవర్తనములఁ·········—········ బాల్పడఁ జేయున్. 327

వ. కడమ మరికొన్నిశబ్దాలు ఇటువలె నే గలవు. 328

క. కావింపుట కావించుట
భావింపుట మఱియు దీని భావించు టనం
గా వెలయుఁ గృతులఁ, దుహిన
గ్రావసుతాప్రాణనాథ! ప్రమథసనాథా! 329

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁ బెట్టి పు
త్తెంచిన మంచికజ్జములుఁ దేనియనేతను దోఁచి దోఁచి భ
క్షించుచుఁ దల్లితండ్రి తన చిన్నికరాంగుళి వంచి వంచి,యూ
టించుచు నాడె మిన్నగమిఱేడుకుమారకుఁ డింటిముంగలన్. 330

హరవిలాసము (2-106)

గీ. కమలనేత్ర యవస్థానవిముఖ మైన
చంచలత్వంబు మఱిఁ బ్రకాశించుచుండె
బాల యాలీల నభ్యసింపంగఁ బోలు
. రమణ దూత పతంగ చక్రములతోడ ! 331

శృంగారనైషధము (2-111)

ఉ చంచలనేత్ర దాల్చు జలజాతమృణాళసరంబు లేన స
ల్లించిన బారుతెంచి కబళించి తదూష్మకు నంగలార్చునా

యుంచకుచేష్ట గాంచి యిఁకనైనను గందుమెయుంచు మోము వీ
క్షించఁగఁ దోఁచులేనగవు చేరుచు బోటి కొకింతఁ బ్రాణమున్. 332

ఆముక్తమాల్యద(5–152)

మహాస్రగ్ధర. వరభూభృత్ప్రాప్తి నబ్ధిం బడు రవిహరులం
బ్రౌఢి వాటించ వెందున్
సరిగాఁ దద్వింకృతుల్ సైవక రవి హరిగాఁ
జాయకున్ రానడంచున్
జరణోద్యద్వాళిఁ దద్వాసతఁ దగు హరియున్
సప్తిగాఁ బాదధారా
స్ఫురణం బేవింత యుంచుం బురిహరులు నగుం
బూర్ణధారాసమృద్ధిన్ 333

వసుచరిత్ర (1–102)

శా. అంచున్ రాయడివన్నెతాల్ వులుగుత్వేఁ డాసీను లూత ల్గొనన్
పంచాస్యంబులు గల్గ పాపదొర గ్రామ్యబ్రహ్మచారుల్ దువా
శించన్ బచ్చనవ్రాత లూడిపడు మేల్కొల్గత్తి మన్యంబులా?
పంచద్వాహము లుంచు మంటపము పంచం జేరి విశ్రాంతుఁ డై. 334

బహుళాశ్వ చరిత్ర (5–215)

ఉ. వంచన చేసి యిట్లు చెలువం గొనిపోవఁ బలంబవైరి సై
రించునె దుర్మదాధిపవరేణ్యులభూములు గొట్టి ధూళిఁ గా
వించఁడె పిండిపిండిగను వీరశిరోధికిరీటరత్నముల్
దంచఁడె ఘోరశీరమున లంబులు వ్యర్థములే ధరించుటల్. 335

విజయవిలాసము (3–164)

మత్త: పంచసాయకసాయకంబుల బారి కోర్వఁగఁ జాలకే
నంచయాన వరించు నవ్వ డొకప్పుడున్ మిము గూడి వ
ర్తించఁ గా దనిఁ యింతి నన్నుఁ బ్రతిజ్ఞఁ జేసిన నట్లు కా
వించఁ బాల్పడినాఁడ నట్లొనరించఁగాఁ దగు మీరలున్). 336

రుక్మాంగద చరిత్ర (4–15)

వ. కడమ తెలుసుకొనునది. ఇది సంధిప్రకరణం బింక
విభక్తి ప్రకరణం బెఱింగించెద. 337

## విభక్తిప్రకరణము

గీ. మహి నకారాంతములు తత్సమంబుఁ జేయు
నెడలఁ బ్రథమకు వచ్చు డుల్ చెడు సమాస
ములను నొక్కెడ ఘనుసేయువుణ్య మనిన
నదియె కొందఱు షష్టియం డ్రగనివేశ ! 338

చ. **అమితజగద్భయంకరు విషాగ్నియు** న్ప్రతిహన్యమానవీ
ర్యము గలయట్టి సర్పముల కా జనమేజయు సేయు సర్పయా
గమున నుదగ్రపావకశిఖాతతితో నెరియంగఁ గారణం
బమలచరిత్ర యేమి చెపుమయ్య వినం గడువేడు కయ్యెడున్. 339

*ఆదిపర్వము* (1–128)

చ. అనుపమతేజుఁ డున్నతభుజాగ్రుఁడు దుర్జయవైరినిగ్రహుం
డనఘుఁడు వాయుసూనుఁడు **నిజాగ్రజు** **సేసిన** సత్యపాశబం
ధనమునఁ జిక్కి (తత్సమయతత్పరుఁడై యిటు ఘోరదుఃఖవే
దనములు సైఁచెగాక మది తద్దయుఁ గ్రోధమయంబు వానికిన్). 340

*అరణ్యపర్వము* (5–334)

గీ. అప్పుడు రాధేయుఁ డమ్మెయి **ననుజువడుట**
చూచి యేనుంగునకు సిళ్లు చూపినట్లు 341

*విరాటపర్వము* (5–81)

ఉ. **అధృతరాష్ట్రిసేసిన** యనర్ఘమణిప్రవరానుబద్ధశో
భాధృతి నొప్పుచున్న సభ పార్థివముఖ్యుఁడు ధర్మజుండు దు
ర్యోధనుఁ డర్థిఁ జూపఁగ సహోదరవీరులు దానుఁ జూచి అ
క్షీణధరమూర్తి యెంతయును మెచ్చె మనంబునఁ దద్విభూతికిన్. 342

*సభాపర్వము* (2–162)

వ. అల్లుఁడు తమ్ముఁడు నను తెలుఁగుపదాలకును డుకారలోపము
వచ్చును. 343

గీ. తమ్ము నేసిన దురితంబు దలఁగఁబాని
ధర్మబుద్ధి వై వ్రతములఁ బేర్మిఁ జేసి
తనఘ నీకు నభీష్టంబు లైన వరము
లడుగు మిచ్చెద మీమెచ్చు గడపనగునె. 344
అనుశాసనికపర్వము

వ. ఈలాగే ప్రథమాంతాలు అన్నిటికి తెలుసుకొనునది. 345

గీ. ప్రాణిపదములు గాని శబ్దముల కిల వి
భక్తులందు ద్వితీయకుఁ బ్రథమ వచ్చు
మరి ద్వితీయయు నొకొకచో నెరయు నరద
మెక్కె నరదంబు నెక్కెనా మృగధరాంక. 346

ద్వితీయకు ప్రథమ

గీ. పసిఁడిరథ మెక్కి విపులవైభవము మెఱయు
చూపరుల కెల్ల వేకంబు చోద్య మొదవ
పొంగ మై వచ్చు భాగధేయంబు వోలె
మామయింటికి వచ్చె జామాత యపుడు. 347
కవికర్ణరసాయనము (3–174)

ద్వితీయ నిలుచుట

చ. అరదము నెక్కి కేతనపటాంచలచంచల మైన తాల్మితోఁ
దురగజవంబు మున్నడవఁ ద్రోచి కడంగెడు తత్తరంబుతోఁ
దిరిగెడు బండికండ్ల పగిదిన్ భ్రమియించు మనంబుతోడ నా
హరి చనుదెంచె సత్యసముదంచితకాంచనసౌధవీధికిన్. 348
పారిజాతాపహరణము (1–104)

చ. అరదము నెక్కి లోచనసహస్రముకాంతి వెలుంగఁ బొల్చుని
ర్జరపతి గన్నులారఁ గని సంతస మందెడు వారితోడి మ
చ్చరమున నొక్కొ నా నుదయశైలముమీఁద సహస్రదీధితి
స్ఫురణ దలిర్ప నొప్పు రవి పొంపున జృంభణఁ బొందె నబ్జముల్. 349
ఉత్తరరామాయణము (6–90)

గీ. విహగపతి నెక్కి వైష్ణవి ప్రహరిఁ దిరుగుఁ
బంచమియును జాముండయు సంచరించు
నాత్మ వాహనముల నెక్కి యహరహంబు
నవఘ శ్రీకాశికాపురాభ్యంతరమున. 350
*కాశీఖండము* (6–193)

క. విమలమణిమయము లగు దూ
లములం గంబముల గోడలను వేదులఁ గు
ట్టిమములఁ జుట్టిని ప్రాకా
రములం గడు నొప్పుచుండ రచియించె సభన్ 351
*సభాపర్వము* (1–11)

చ. తలిరుల నెల్లఁ గోసి కరతామరసద్యుతి వెల్లి గొల్పఁగా
నలరుల నెల్లఁ గోసి నఖరాంచలదీప్తులు పై నిగుడ్పగా
జిలుకల నెల్లఁ దోలి తమ చిన్నియెలుంగులభంగి జూపఁగాఁ
జెలువము క్రొత్త య్యై సతులచే వనవాటిక యొప్పె నయ్యెడన్. 352
*కవికర్ణరసాయనము* (4–32)

ఆ. కూర్చియను ద్వితీయకును 59యొక్క షష్ఠికిఁ
బై విభక్తి గానఁ బడఁగ రాక
యడఁగియుండుఁ గృతుల నాచార్యు ప్రణమిల్లె
రాజుకొడు కనంగ రాజమకుట. 353

కూర్చియను ద్వితీయ

ఉ. ఇంబుగ సర్వలోకజను లెవ్వని యేని ముఖామృతాంశు బిం
బంబున నుద్భవం బయిన భారతవాగమృతంబు గర్ణరం
ధ్రం బను నంజలిం దవిలి త్రావుదు రట్టి మునీంద్రలోకవం
ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్. 354
*ఆదిపర్వము*

చ. అని తగ నేకవాక్యతఁ బ్రియంబున నాతనితోడ నీవు మున్
గనినది విన్నయట్టి ప్రబమ కామకుతూహలచిత్తు డైన కృ

59. ము. ప్ర. నొక్కషష్ఠికి.

ష్ఠుని వినుపింపు నావుడు మనోజ్ఞకథాకథనంబునందు వే
డ్క నిగుడ నమ్మునీంద్రుఁడు వికాసమునన్ మొగ ముల్లసిల్లఁగన్. 355
*అనుశాసనికపర్వము* (4–413)

గీ. సమయసముచితమృదువాక్యసరణి వెలయఁ
గోరి సుఖగోష్ఠి నప్పుడు కొంత ప్రొద్దుఁ
జరిపి కుంతీసుతాగ్రణి సంయమీంద్రుఁ
బలికె నిట్లని వినయసంపదలు వొలయ. 356
*హరిశ్చంద్రోపాఖ్యానము* (1–9)

మ. అకటా బెత్తెఁడు నేలకుం దగఁడె సప్తాంభోధివేష్టిభవ
త్సకలద్వీపకలాపభూపమకుటాంచత్పద్మరాగోపల
ప్రకరానేకవినిర్గళత్కిరణశుంభత్పాదుఁ డైనట్టి రా
జకుమారుం డని యేడ్చె కన్నుఁగవ నశ్రుల్ కాల్వలై పారఁగన్. 357
*హరిశ్చంద్రోపాఖ్యానము* (5–86)

గీ. సప్తమికినిఁ దృతీయ కెంచఁగ ద్వితీయ
వచ్చు, ననిఁ జేరె పేతిని వచ్చె ననఁగ
నందుచేత వనందగునట్టియెడల
పన్నగాధీశకేయూర ! భయవిదూర ! 358

మ. హరివై సాది సిరంబు సాదిమయి జాత్యశ్వోత్తమాంగంబు గూ
డ రణోర్విన్ రఘునాథశౌరి యసిఁ జెండన్ దివ్యమందారపు
ష్పి రహిం బ్రాణయుతంబు లై గగనవాటింబర్వి గంధర్వకి
న్నరరూపంబులు దాల్చి పారె నని యానందించుఁ దచ్చౌర్యమున్. 359
*మనుచరిత్ర* (1—70)

క. కై యన్నఁగఁ గకారముపై
నై యన్నగ విభక్తు లొప్ప నరయఁగఁ గృతులన్
బాయక నెపుడుఁ జతుర్థికి
కాయజదుర్దర్పహరణ గౌరీరమణా !
'కొరకు కై చతుర్థ్యాస్తు' అని చతుర్థికి కొరకు కైలు వచ్చు నని
నన్నయభట్టు చెప్పినారు అందుకు కై వచ్చుట. 360

ఉ. నావుడు వాయునందనుఁడు నందన పొమ్ము చమూవధూటి నీ
కై వశమైన లెస్స యటుగాక నినుం దలమీఱి వేవి దౌ
దౌవుల విల్చి మధ్యదౌనగదావటువిక్రమతాండవంబులం
జేవ యడంతు నెందు గురుశిక్ష గదా నుతి గాంతు రంగనల్. 361

*జైమినిభారతము* (2-51)

ఆ. అరణి నగ్ని వొడము కరణి దేవకియందు
విప్రయజ్ఞకర్మ వేదగుప్తి
కై జనించె నెవ్వఁ డవ్వసుదేవనం
దను భజింతు నేకతావిరూఢి. 362

*శాంతిపర్వము* (2-23)

గీ. లల్ఁ దృతీయాదు లగు విభక్తులకు నెల్ల
గలుగు మధ్యనకారంబు దొఁలగుచుండు
రాముచే రాముకొఱకు శ్రీరాముకంటె
రాముకును రామునందన రాజభూష. 363

వ. 'టాది విభక్తౌ నిర్నేత్యేకే' అని శబ్దశాసన సూత్రము గలదు. దానికిఁ దృతీయాదివిభక్తులయందు నికారానకు అని కలదు గనుక రామునకు అన చోట నికారము గాక నకారము వస్తుంది. దానికి లోపము లేదని రాముకు అని కద్దు గనుక లోపము వచ్చి రాముచేత, రాముకొఱకు రామువలన, రాముకు రామునందలి అని బాలసరస్వతిగారు వ్యాఖ్యానము వ్రాసియున్నారు. కొందఱు షష్ఠికి రామునికి రామునకు అన్నచోట నికారము గాక నకారము వస్తుంది. దానికి లోపము లేదని రామునకు అని అనరా దన్నారు. అభినవదండి ఆంధ్రభాషాభూషణము–

'సుతుఁ గనియె, సుతుని గనియెన్
సుతుచేతన్ సుతునిచేత సుతునకు నిచ్చెన్
సుతు కిచ్చె సుతునివలనన్
సుతువలనన్ సుతునిధనము సుతుధన మెలమిన్.

అని చెప్పినాడు గనుక అందు కుదాహరణము: 364

ఉ. హాటకగర్భుచేతఁ గమలాసనుచేఁ జతురాస్యకంఠశ్రుం
గాటకవీధికాకృతవిగాహచతుశ్శ్రుతిచేత దేవతా
కోటికిరీటసంఘటితకోమలపాదసరోజుచే జగ
న్నాటకసూత్రుచేత గృతినాథుఁడు గాంచుఁ జిరాయురున్నతుల్. 365
శృంగారనైషధము (1–3)

చతుర్థి

క. 60తనయుఁడు తనయుని గదియుం
దనయునిచేఁ దనయుకొఱకు దనయునివలనన్
దనయునకు ధనము దొరకెను
61దనయునియందెల్ల మంచితనములు గలుగున్ 366
పెద్దిరాజు అలంకారము (9–102)

పంచమికి

క. పదియేనేడులబాలుని
సదమలగుణుఁ గాక పక్షసంయుతు నే ని
ట్లదయతఁ బుత్తేఁజాలనె
సదయుఁడ వగు రామువలన సంయమివర్యా! 367
భాస్కరరామాయణము (బా. 198)

సీ. రాత్రివెైఁ దాకి క్రూరతఁ బోరి మగటిమిఁ
బాసిన యంగారపర్ణుకంటె 368
కర్ణపర్వము (2–24)

ఉ. లాలనఁ గ్రొత్త బెబ్బులి కళాసము వెట్టిరి యాసనంబుగాఁ
గోలయు సాధు వైన యొకకోమటికిన్ నిషధేంద్రు బుచ్చుకున్
మేలపు మెైవడిన్ దమ సమీపపుధూర్జ్తులు తత్పురస్థ్సలాం
గూలత యవ్వణిక్కునకుఁ గోశవిజృంభణశంక సేయఁగన్). 369
శృంగారనైషధము (6—115)

60. ము. ప్ర.లో ఈపద్యమునకు ముందు, 'నతు లొనర్చెదఁ బార్వతీనాథు కొఱకు,' అని ఒకేఒక పాద మే గ్రంథములోనిదో కూడ సూచన లేకుండ యున్నది.

61. ము. కావ్యా. తనయుని గనియెను.

క. రామునిశుభచరితంబును
రామాయణమున్ రచించి ప్రాచేతసుకున్
ప్రేమ నెఱిఁగించి తగ నిజ
ధామమునకు నారదుం డుదారతఁ జనియెన్. 370

భాస్కర రామాయణము (బా. 2)

సీ. నీతూపు కోర్వక నిటలాక్షుఁడును తనూ
ఫలకంబు చాటునఁ బాయఁ డెపుడు 371

కవికర్ణరసాయనము (3–117)

చ. సహదేవనకుల వాసవసుతభీముల
గ్రనుమున నలువురఁ గౌరవేంద్రు
కొక్కొక్క మేటున నుక్కివంబున నొడ్డి
యోడి తన్నును నొడ్డి యోటు వడిన. 372

సభాపర్వము (2–196)

ఉ. (ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు శౌరివినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను విన్నఁగాఁ బలికెం బతిఁ గూర్పు దాన నా
యంతటి వారు లే రని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్)
వంతుకు వచ్చు సత్యగరువం బిఁకఁ జెల్ల దటంచు మానినీ ! 373

పారిజాతాపహరణము (1–80)

సీ. అహిమరుచిప్రతాపుఁ డగు నాకుశనాభుఁడు బ్రహ్మదత్తుకున్
దుహితృశతంబు నీ నతఁడు దోడన వారిఁ గ్రమంబునం గర
గ్రహణము సేయ (నావిభుకరంబులు మోసిన యంతలోనన

మ్మహిళలు కుబ్జరూపములు మానఁగ నొప్పిరి చారుమూర్తులై). 374

భాస్కర రామాయణము. (బాల 335)

వ. సప్తమికి నమునందని కద్దు 62

కం. పెల్లడరఁ గొన్నిపదములఁ
దెల్లమిగాఁ జేతనను దృతీయకుఁ గృతులం
జెల్లును మై యనుట, మరు
త్కల్లోలవతీభుజంగ ! కలుషవిభంగా ! 376

సీ. దుగ్ధాబ్ధికన్యక తోటి కోడలు గాఁగ
నౌరిమమై నుండ నీ కొప్పుగాదె ! 377

శృంగారనైషధము (3–126)

సీ. ఓర్మిమై నుప్పొంగి యువవాసముల నుండి
వగనాలి సరిబోల్పఁ దగదు విధవ. 378

కాశీఖండము

మ. అమలోదాత్తమనీషమై నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుఁడన్ గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మనమంత్రికిన్ సుతుఁడఁదిక్కాఖ్యుండ సన్మాన్యుఁడన్. 379

ఉత్తరరామాయణము (1–13)

క. గురుఁ డన జనకుఁ డనంద గు
పురుషాఖ్యలఁ డులు దొలంగి పొదవు నికి, నకుల్
పరికింపఁగ షష్ఠికి, సుర
వరివర వరిపూజితాంఘ్రిపద ! మహేశా ! 380

క. సకలభువనములు నరచే
తికిఁ దేరంజాలినట్టి ధీమంతుఁడు దే
వకికొడుకు గలఁడు ధర్మజా

62 ము. ప్ర.లో ఈ వచన మింక నిట్లు సాగినది షష్ఠికి గొందరు నకార లోపము లేదందురు అనినను టాదివిభక్తౌ నిర్దేశ్యేకే అన్న శబ్దశాసనసూత్రమునకును రాముచేత, రాముకొఱకు, రాము వలన రాముకు అని కల దని వ్యాఖ్యానము వ్రాసిన బాలసరస్వతి వ్రాత కును భంగము వచ్చును గనుక రాముకు అని చెప్పవచ్చును.

నికి నాతం డెత్తిరాక నిలుచునె యధిపా! 381

క. వివిధమణిమయరథంబులు
జవనాశ్వంబులును భద్రసామజములు ర
త్నవిభూషణములు దాసీ
నివహంబులుఁ జాల కృష్ణునికి నే నిత్తున్. 382

*ఉద్యోగపర్వము* (3–156)

క. దశకల్పసహస్రంబులు
నిశి యంతయొ దివస మిది సునిద్రారతికిన్
విశదప్రబోధమునకు
న్వశగతకాలములు విష్ణునకు విమలమతీ! 383

*అనుశాసనికపర్వము* (1–319)

క. ప్రథితముగఁ గృతుల షష్టిఁ
ప్రథమవిశేషణము చెల్లఁ బరిపంథిమదో
న్మథనుఁడు రాముని కెనయే
పృథివిం జిరుదొర లనంగ వృషపతిగమనా! 384

చ. తనుతరమధ్యయాగవిధానము దప్పకయుండ మౌనిచే
ననుమతిఁ గాంచి మ్రొక్కి వినయంబున నందఱ నామతించి క
ల్పనగము క్రొవ్విరుల్ గనకపాత్రికలం దగ నించి యిచ్చె వా
యనములు రుక్మిణి ప్రభుతులైన సతుల్ పదియాఱువేలకున్. 385

*పారిజాతాపహరణము* (5–90)

క. అపరాహ్ణసమయమున ని
ట్లుపమాతీతానుమోదయుద్ధం బయ్యెన్
విపులభుజబలుఁడు భీముని
కపరిమితబలుండు గౌరవాధీశునకున్. 386

*భీష్మపర్వము* (2–392)

క. మీపనుపున రాజ్యముపో
లీపాండుతనూభవులకు నీకున్న భుజా
టోపభయంకరుఁ డర్జును

కోపానల మడరి ముట్టుకొనదే వారిన్. 387

*ఉద్యోగ పర్వము*

శా. భారద్వాజపవిత్రగోత్రు విమలాపస్తంబసత్సూత్ర వి
ద్యారాజీవభవుండు **మారయకు** బుణ్యాచార భీమాంబకున్
గారామైనతనూజు న న్ననఘు శ్రీనాథాఖ్యుఁ బిల్పించి స
త్కారం బొప్పఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్. 388

*శృంగారనైషధము* (1–12)

క. కదిసి ముకారాంతము లగు
పదములపై సప్తమీవిభక్తి యొదవుచో
హ్రదమున హ్రదమునయందున్
**హ్రదమందున్ హ్రదమునందు** నన జను, శర్వా. 389

చ. **ఉరమునయందుఁ** గన్నులు పృథూదర**దేశమునందు** నోరుఁ బ్ర
స్ఫురిత భుజద్వయంబు గల భూమిధరోన్నతభావముం గరం
బరుదుగ నుగ్రమైన వికృతాకృతితోడన శేషసత్వఘు
స్మరుఁ డగువానిఁ బటుసత్త్వుఁ గబంధునిఁ గాంచి రచ్చటన్. 390

మ. హరుఁ డాతారకశైల**దుర్గమున** నధ్యాసీనుఁ డై రాజశే
ఖరవిఖ్యాతి వహించ చంద్రగిరి **దుర్గంబందు** శ్రీ వేంకటే
శ్వరుఁ డొప్పన్ బహురాజశేఖరసదాసంసేవ్యుఁ డై యౌర యి
ద్ధర బంగారుపేలిక వాసి తద్గిరులకున్ దద్వల్లభశ్రీలకున్. 391

*వసుచరిత్ర* (1–81)

వ. ఇందులో దుర్గమున దుర్గమునం దని రెండులక్ష్యము లున్నవి. సప్త
మికి దుర్గమం దని యనుకొనరా దని కొందఱిమతము అందులకు
మహాకవి ప్రయోగము

సీ. **అవిముక్తమందు** నుపాస్యుఁ డాత్మ యటంచు

యాజ్ఞవల్క్యుం డత్రి కానతిచ్చె. 392

*కాశీఖండము* (2—119)

మ. హరిదశ్వాన్వయమందు దాశరథి నై యస్మత్పదాంభోజత
త్పరుఁడై యుండు విభీషణాఖ్యునకు మద్ధామంబు శ్రీరంగమేఁ
గరుణాధీనత నీ నతండు గొనిరాఁ గావేరిలోఁ జంద్రపు 393
ష్కరిణీతీరమునందు గ్రైకొనియెడుం గల్పావధిస్థైర్యమున్.

*కవికర్ణరసాయనము* (పీఠి. 58)

విన్ను మన్ను కేలు వీడు ప్రో లనునెడ
వింట మంట కేల వీట ప్రోల
నన్నఁగ నొప్పు మఱియు నటులె యుత్వముపై న
కార మొదవుఁ గొన్నికడల, నీశ ! 394

విన్నున నేగు తామరల విందు కిలాతవు నీడ లెప్పుడున్
వెన్నెలరాచరాల గని వెళ్ళని నీళ్ల మునింగియున్న వీ
మన్ను లటంచుఁ జెంచెతలు మాటికిఁ దూఁపుల నేసి నాటమిన్
మిన్నక చూచి యబ్రపడి మెల్లనఁ బోవుదు రూళ్లపట్టుకున్. 395

*యయాతిచరిత్ర* (2–39)

వీఁడున

గీ. వీడు చదివించె నయ్యెడ
వీడని వేడుక బలారి విబుధులతో లే
వీడుమణు లన్నఁగఁ దగు తన
వీడున గల మానికములు వివిధాంబరముల్. 39

*వసుచరిత్ర* (6–35)

ప్రోలున

క. కనకమయ మైన యాప్రో
లున దమపుతు లాహవముబులో నమరులచే
త నవధ్యులుగా మఱియు
ప్పనజజుచేఁ బడసి రసురవనితలు గమణన్.

అరణ్యపర్వము (4–80)

వ. కడవ సులభము

గీ. నోరు నీరను గోరను నుడువులకును 398
నోట నీటను గోటను, నోర నీర
గోర నన మఱి నోరున నీరున నన
గోరున ననంగఁ జను,. మేరుకుధరచాప ! 399

నోర

గీ. **నోర** మానిసితలలు వేసారి కడుపు
బొండముల యట్లు పీల్చుచు భువనభయద......... 400

చంద్రభానుచరిత్ర

క. నకులుఁడు సహదేవుండును
ప్రకటభుజాస్ఫురణమున నరాతిబలము నే
లకుఁ గోలకుఁ దెత్తురు నో
రికి వచ్చినయట్లు లాడిరే యిభ్భంగిన్. 401

కర్ణపర్వము (3—88)

ఆ. నీర నగ్ని యునికి యారయ విస్మయం
బనుచు బాడబాగ్ని కడలి యుప్ప
రంబు చొచ్చె నొక్కొ రత్నాకరము మణు
లనఁగఁ జెలువ మమరు నాపణములు. 402

విక్రమసేనము

ఆ. నీరిలో నకాండతారకప్రతింబింబ
మొక్కొ యనఁగ వెలుఁగుచున్న నపుడు
రాచకొడుకులెల్లఁ జూచుచు నుండిరి
దానిఁ బుచ్చుకొనువిధంబు లేక. 403

ఆదిపర్వము (5–207)

నీటు

సీ. నీటఁ దేలుశరంబు పాటఁ దేలు సరంబు
బట్టఁగాఁ పట్టఁగాఁ బుట్టలేని. 404

రుక్మాంగద చరిత్ర (5—71)

గీ. పాలఁ బట్టిన మాత్రాన మేలిగుణము
నేఁడు నీ కేలఁ గల్గునో నీరజారి
నీటఁ బుట్టినవాఁడుగా డోటు వహ్ని
కాల్చుచున్నాఁడు జగమెల్ల కరుణ లేక. 405

మనుచరిత్ర (3—41)

గోరున

ఉ. కారణ మేమి రక్కసునఖంబుల వచ్చితి నాఁడు నీకుఁ బెం
పారకుతార మబ్బదొ పురారివిరించులు చేరి యేఁటికిన్
గోరునఁ బోవు సేతకును గొడ్డలి యన్న దొరంగితో వినం
గోరెద నన్న యిందిరకు గోరిక లిచ్చు ముకుందుఁ గొల్చెదన్. 406

కన్నప్పచరిత్ర

వ. కడమ యీలాగే తెలుసుకొనునది. 407

క. ఒనరఁ దృతీయకు సప్తమి
కిని యొక్కెడఁ బ్రథమ వచ్చుఁ గృతుల సుఖంబుం
డెను చిచ్చురితె ననంగా
ఘనతరగోరాట్తురంగ! కలుషవిభంగా! 408

తృతీయకుఁ బ్రథమ వచ్చుట

సీ. గీ. బ్రహ్మరతులు దపస్వులు భవ్యతీర్థ
సేవకులు సద్వ్రతులును నిస్పృహులు మొదలు
గాఁగ నొప్పెడు తత్వ్వణ్యకర్మపరులు
వీరె కన్గొందు సుఖమున్నవార లిందు. 409

కాశీఖండము (2–11)

## సప్తమికిఁ బ్రథమ వచ్చుట

గీ. ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్యవర్షంబు లన్ని మోదించు సాధ్వి
నాకభువనంబునం దాత్మనాథుఁగూడి
వెలి పోకింతయును లేక చిచ్చుఁజొచ్చెనేని. 410

కాశీఖండము (2—91)

సీ. తరిచూచి యిచ్చె నెద్దానిఁ బట్టికి తల్లి
జూద మోడిన పైడి చుట్టుకొనిన 411

కాశీఖండము

గీ. వనము ప్రాణము కాలము ధనము డెంద
మను ముకారాంతములకు నా లెనయు నొక్క
తరిని మూ ల్వోయి దీర్ఘముల్ దాపలిదెస
వర్ణములకు విభక్తుల వచ్చు నభవ. 412

క. మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రా
ణానం గలుఁగంగ బంధునాశము రాజ్య
శ్రీనాశము నుద్దామయ
శోనాశము జేయ నేల చూచెదు చెపుమా ! 413

ఉద్యోగపర్వము (3—345)

సీ.గీ. ఇంక నిన్నుఁ బోటి దొడరిన నింతకంటె
నెడరు వాటిల్లు వేగఁబొ మ్మింటికడకు
హరియుఁ బార్థుఁడు నున్నెడకైన నేగు
మేను దెగ నీదు ప్రాణాన కింత నిజము. 414

కర్ణపర్వము (2–194)

ఆ. వెండిపింజలతోడి వెడదయమ్ములఁ జిత్ర
సేన ధరణినాథు శిరము ద్రుంచి
వాడినారసంబ వర్మ్మని నిటలాన
నాట నేసె దివిజనాథసుతుఁడ. 415

కర్ణపర్వము

క. ఇలఁ గొన్నియచేతనముల
63నలరారఁగ షష్ఠి నిలుపునపుడు నకారం
బలవడు నేకవచనముల
బలభిన్ముఖనిఖిలదివిజపరివృఢ ! శర్వా ! 416

చ. అనుపలు కంకుకంబున క్రియం గుదియించిన నిల్చి భూరుహం
బున వెసవోక మత్తగజపుంగవుచందమునన్ సమీరనం
దనుఁడు శరీరదోహలవిధాపరిశోభితవిక్రమోద్యమం
బున విలసిల్లి యిట్లనును భ్రూకుటి ఫాల మలంకరింపఁగన్. 417

విరాటపర్వము (3—209)

గీ. భువి నుకారాంతములకు సంబుద్ధి యొదవు
నపుడు విష్ణుఁడ విష్ణుఁడా యనఁగ నొప్ప
మఱియు విష్ణూ యటంచు గొందఱు ప్లుతంబు
64పలుకుచుంద్రు మహాత్ముల వనధితూణ. 418

వ. ‘ డుజతౌతు నప్లుత స్యాత్సంబుద్ధా వీత్యుతాం విదుః కేచిత్ ’
అని వాగనుశాసనుని సూత్రమును ‘జరత్కారూ మునిశ్రేష్ఠ’ యని
ప్రయోగమును నున్నది. 419

సీ. శ్రీకంఠ ధర్మధురీణ శంభూ కమ
లాధిప యీశాన యదుపతి మృడ 420

కాశీఖండము (3—162)

---

63. ము. ప్ర. నలరు ద్వితీయాదికంబు లైనవిభక్తుల్
నిలిపెడుచోట నకారం
బలవడ నేకవచనముల నగజాధీశా!

64. ము. ప్ర. పల్కుదురు శైలకన్యకాప్రాణనాథ !

గీ. పదములకు నెల్ల నారయున్ పలుకు కృతులఁ
బొదవు బహువచనముల సంబోధనలకు
స్త్రీ పురుష శబ్దముల కొక చెంత నార
తొలఁగి ప్రథమాబహూక్తియు ట్లడరు నభవ! 421

వ. మృగములార, నరులార, తరులార యని ఆర వచ్చుట సులభము. 422

ప్రథమా బహువచన మట్లు వచ్చుటకు

క. ఒప్పులు గలిగిన మెచ్చుఁడు
దప్పులు గలిగిన నెఱింగి తగఁ దీర్పుఁడు ద
ప్పొప్పునకుఁ డొప్ప తప్పని
చెప్పకుఁడీ **కవు లు**పాస్తి జేసెద మిమ్మున్. 423

ఆంధ్రభాషా భూషణము(9)

చ. అనఘ మదీయవర్తనమునం దొక దోషము గన్నవారొ, నా
యనుజుఁడు లక్ష్మణుండు దన కర్జము గాని గతిం జరించెనో
జనకతనూజ నాకుఁ బరిచర్యలు సేయుతరిం దపస్విని
జనపరిచర్య లేమరెనొ, సంభ్రమకారణ మేమి **సంయములే**. 424

భాస్కరరామాయణము (అయో.402)

వ. ఈలాటి ప్రయోగములు బహుళముగాఁ గలవు. 425

క. ఓరి యనెడు సంబోధన
పేరునఁ బెక్కండ్ర నొకనిఁ బిలువఁగ నను వౌ
**నోరి జనులార** యనఁగా
**నోరి జనుండా** యనంగ, నుడుపతిమకుటా! 426

ద్విపద: ఓరిరాక్షసులార! యుర్విపై నేను
శూరత విలసిల్లు సుగ్రీవుబంట. 427

రంగనాథరామాయణము.

గీ. మొనసి కృతుల నుకారాంతములఁ దెనుంగు
సేయునెడలను వూల్ వచ్చుఁ జెడు నొకొక్క
తరిని, రాహువు బాహువు తరు వనంగ
రాహు, బాహును, తరు నన రాజభూష. 428

రాహు

క. ఉర్వీచక్రము వడఁకెను
పర్వము లేకయును రాహు భానునిఁ బట్టెన్
(బర్వము లురిలె వఱఁగులు
సర్వదిశల నఱచె నభము శర్కర గురిసెన్). 429

శల్యపర్వము (2—2:0)

గీ. తతతనువు రాహు సోమామృతంబు మ్రింగఁ
జక్రి దునిమినమెడగంటిచాయః బొలిచె
(నసితమేఘస్స్వమణిధను వాసుదర్శ
నం బనఁగ నింగిఁ బ్రతిసూర్యబింబ మలరె). 430

ఆముక్తమాల్యద (4—103)

బాహు

గీ నేల నాలుగుచెరఁగుల నృపులకొలువు
లందు నేను వర్తించితి నవనినాథ !
యుగ్గళించి నాయెదుర బాహువ్పళించి
గడువఁ జాలెడు మల్లురఁ గాన నెందు. 431

విరాటపర్వము (2–7)

ఊరు

చ. ఉరుతరవజ్రకర్కశతయున్ గుధరోన్నతియున్ గుచంబులన్
సరసిజసంవికాసమును జంద్రవిలాసము నెమ్మొగంబునన్
గరికరలక్ష్మియున్ గదలికాతరువిస్ఫురణంబు నూరులం
బొరయుట చిత్ర మయ్యె నృపపుత్రిక కా యెలజవ్వనంబునన్. 432

కవికర్ణ రసాయనము (3–19)

రఘు

మ. రజనీనాథకులైకభూషణుఁడ వై రాజర్షి వై ధారుణీ
ప్రజనెల్లం దయతోడ ధర్మచరితం బాలింపుచుం దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథుం దశరథున్ మాంధాత రామున్ రఘున్

విజయు న్నోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారీక్షితా ! 433

అదిపర్వము (2—224)

తరు

సీ. అరిగెడు రయమునఁ దరులు బాల్పడి [illegible]

బదఘట్టనంబునఁ జదిసి రాలు. 434

అదిపర్వము (6—162)

జంతు

మ. హలికుం డెంతయు నోజ దున్నఁగను సీరా[illegible]నం జొకి ప్రా

ణు లనేకంబులు సచ్చు హింస యది యొ[illegible] కాదొ వేయేల, మ

ర్త్యులు నేలం జరియించుచోఁ బదములం ద్రొక్కంబడుం బెక్కుజం

తులు హింసావిధి కా దనంగ వశమే దోషజ్ఞ ! యూహింపుమా ! 435

అరణ్యపర్వము (5—57)

క. జడపద తిర్యక్పదముల

కడరఁగఁ బుంలింగ మట్టులగుఁ గొన్నిటి కా

క్కిడల సముద్రుం డన నుర

గుఁ డనన్ వాయసుఁ డనంగఁ గుక్కుటలింగా! 436

ఉరగుఁడు

చ. అరిది తపోవిభూతి నమరారులబాధలు వొందకుండఁగా

నురగుల నెల్లఁ గాచిన మహోరగనాయకుఁ డానమత్సురా..

సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదుఁడు నద్రినందనే

శ్వరునకు భూషణం బయిన వాసుకి నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 437

అదిపర్వము (1—106)

క. మృగయార్థ మరిగి హిమవ

న్నగభూములయందుఁ బవననందునుఁ డొకప

న్నగుచేతఁ బట్టువడి యి

మ్మగ ధర్మతనూజుచేత వెూక్షితుం డయ్యెన్. 438

అరణ్యపర్వము (4—101)

## వాయసుఁడు

క. తలకొని జలములఁ బక్షం
బులఁ దుండముఁ ద్రోక త్రోక పొరి పొరి నెగయున్
బలమరివ్వే దిగఁబడఁగా
సొలసి యెగయలేక వాయసుఁడు వెగడొందన్. 439

కర్ణపర్వము (2—74)

క. అమరఁగ నొక్కొకయెడఁ గ
బ్బములఁ బ్రయోగింపఁ జెల్లుఁ బరికింపఁగ హం
సము లన హంసయు నన్నఁగా
గుముదాప్తనిభోజ్జ్వలాంగ! కుక్కుటలింగా! 440

## హంసము

క. బలశాలి యైనహంసము
బిలిచితి బురణించి పారఁ బెలుచఁదనమునన్
గలవే యింతకు మును హం
సలతోఁ బురణించు వాయసంబులు జగతిన్. 441

కర్ణపర్వము (2—60)

ఉ. దుందుభివాద్యనిస్వనముతోఁ దులఁదూగెడుఁబక్షపాత మం
దంద యతర్కితోపనత మై విన్నఁబడ్డ విహారలీలలం
జెంది పరాకున న్నెలఁగు చిత్తము లుద్దవిడిం జెలంగఁగా
నిందునిభాస్య లప్పుడు సమీక్షణఁ జేసిరి రాజహంసమున్. 442

శృంగారనైషధము (2—45)

సకలవేదంబుఁ జూచి నగుచు వాని
నొసఁటిమొగచి యొక్క నెగయకుండఁగ నొక్క
హంసఁ బట్టుకొనియె నతిరయమున. 443

ఆరణ్యపర్వము (2—12)

వ. ఇది విభక్తి ప్రకరణము. 444

శా. పారావారనిషంగ! సంశ్రితజనప్రాంచత్కృపాపాంగ! దు
ర్వారాఘౌఘతమఃపతంగ! ఘనసంగ్రామాంగణాభంగ! నీ
హారక్షీరపటీరహీరఘనసారాభ్రాపగాహారక
ర్పూరేందూపలశోభితాంగ! సతతప్రోద్యద్భుజంగాంగదా! 445

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరస
కవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్ర
పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర సకలసంస్కృతాంధ్ర
లక్షణకళాకౌశలాభిరామ తిమ్మకవిసార్వభౌమ ప్రణీతం బైన *లక్షణ
సారసంగ్రహం బను కృతియందు చతుర్విధాంధ్రప్రకరణంబును
సంజ్ఞాప్రకరణంబును, సంధిప్రకరణంబును అనునది ప్రథమాశ్వాసము.

# లక్షణసారసంగ్రహము

## ద్వితీయాశ్వాసము

శ్రీకలితాచలకన్యా
ప్రాకటహృదయాబ్జభృంగ! పాణికురంగా!
భీకరదనుజవిభంగా!
గోకర్ణవిభూషితాంగ! కుక్కుటలింగా! 1

### సమాసప్రకరణము

వ. అవధరింపు మింక సమాసప్రకరణం బెఱింగించెద.

గీ. పరిమితం బగు నాంధ్రశబ్దంబు కృతుల
సంస్కృతపదంబుతోడఁ బొసంగి కర్మ 2
ధారయం బగుఁ బ్రోడ గంధర్వకాంత
లలరి రన శైలజాధీశ! హర! మహేశ! 3

ఉ. **వాఁడిమయూఖముల్** గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె, ధేనువుల్
నేఁ డిట వచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగాఁబడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండునేనియున్
రాఁడు, వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నొందెనో. 4

ఆదిపర్వము (3–112)

ఉ. **మేలిమదావళంబులును మేటిహయంబులు** దమ్మి పిండు నా
భీలతఁ జుట్టిరాఁగ రథబృందముతోఁ గురురాజు కర్ణు దో
ర్లీలగు దోడ్పడంగ రథరేణు వుదీర్ణముగా నతండు పాం
చాలబలంబుపై నడరె శౌర్యసముద్భటబాహువీర్యుఁడై. 5

కర్ణపర్వము (2–156)

సీ. **జిలుగుసంధ్యారాగ చీనాంబరము**ఁ గట్టి
కుసుమగర్భపుఁగీలుకొప్పు దురిమి 6

కాశీఖండము (7–148)

గీ. నవతికౌరవ రధికులు గవిసి కడిమిఁ

బొదవుటయు నన్నిశరముల భూరిరయము
మెరయ నందందఁ దెగటార్చి తరుమ నతనిఁ
ద్రాకె వేయుమున్నూరు దంతావళములు. 7

*కర్ణపర్వము* (3—182)

ఉ. నన్నును గౌఁగిలించుకొని నావదనంబునకు న్నిజాస్యమా
సన్నముఁ జేసి యొక్కమృదుశబ్దము నించె మనోహరంబుగా
నెన్నఁడు నట్టిశబ్దము మునీశ్వర! ము న్విని యే నెఱుంగ న
య్యన్నువ బ్రహ్మచారి ముఖ మంబురుహంబ సమంబు సూడఁగన్. 8

*అరణ్యపర్వము* (3–107)

గీ. అరయు గర్పూరగంధియు హంసయాన
యను సమాసపదంబులు దెనుఁగు సేయు
నలరుఁ గప్పురగంధియు నంచయాన
యనఁగ నొకకొన్నిపదములు ధనదమిత్ర! 9

## కప్పుర గంధి

ఉ. అప్పుడు శౌరిఁ జూచి ప్రమదాతిశయంబు హృదంతరంబులం
జిప్పిలి సంభ్రమించి కయిసేయు తెరం గలరం దిరంబుగా
గుప్పనఁ గూరి యొండొరులఁ గూడఁగనీక కడంగి వేలుపుం
గప్పురగంధు లెక్కిరి ధగద్ధగితోన్నతహర్మ్యరేఖలన్. 10

*పారిజాతాపహరణము* (3—11)

## అంచయాన

మత్త. పంచసాయకసాయకంబుల బారి కోర్వఁగఁజాలకే
యంచయాన వరించునప్పు డొకప్పుడున్ మిముఁ గూడి వ
ర్తించరా దవి (యింతి నన్నుఁ బ్రతిజ్ఞఁ జేసిన నట్ల కా
వించఁ బొల్పడినాఁడ, న ట్లొనరించఁగాఁ దగు మీరలున్). 11

*రుక్మాంగదచరిత్ర* (4—14)

ఆ. తెనుఁగుపదముమీఁద దేవతాభాషయు

సంస్కృతంబు మీఁద సరవి తెనుఁగు
రూఢివిూఱఁ దత్పురుష లయి వర్తిల్ల
నిభవిభంగ ! కుక్కుటేశలింగ ! 12

**తెనుఁగుమీఁద సంస్కృతమునకు**

సీ. కస్తూరితోఁ గూర్చి గంధసార మలంది
**ముత్యాలతాటంకములు** ధరించి 13

*కాశీఖండము* (7—148)

గీ. **చెలువనేత్ర విలాసంబు** చెవులు సోక
(బాలకుచలీల యెదఁ జాలఁ బట్టి క్రాలఁ
గలికి వెలివేణి చెలువంబు కాళ్లఁ బెనఁగ
నవలఁ బోలేక నిలిచె నయ్యర్జునుండు). 14

*విజయవిలాసము* (2—116)

**సంస్కృతముమీఁద తెనుఁగునకు**

సీ. ధర యేయుపాంసుల తల చూవరాకుండ
దనకూర్మితేని నవ్వనవె ముంచె. 15

*వసుచరిత్ర* (1—36)

గీ. తెలుఁగు సంస్కృతపదమును గలయఁ గూర్చి
సరవిఁ జెప్పిన నది కవివరులు కృతుల
యందు మిశ్రసమాసం బటంచు నండ్రు
కలితవృషవాహ ! దురితాభ్రగంధవాహ ! 16

సీ. **కటికచీఁకటిదిండికరముల** గిలిగింత
నెవ్వాఁడు తొగకన్నె నవ్వఁ జెనకు 17

*మనుచరిత్ర* (1—18)

గీ. తన నా నీ యను పదముల
కొన సంస్కృతశబ్దవితతిఁ గూర్చి సమాసం
బొనరింపఁ జెల్లఁ గృతులన్
ధనపతిసన్మిత్ర ! కరటిదానవజైత్రా ! 18

సీ. తనయశోవిశదమ్ముక్తాసౌధపాళికి
నంబుదాయనము వాతాయనముగ 19

వసుచరిత్ర (1—116)

క. దినవెచ్చము కఱకంఠుఁడు
నను గ్రామ్య పదములు కొన్ని యలరుం గృతులన్
ఘను లైన కవుల రచనల
వనజాతభవాదిదివిజవందిత ! శర్వా ! 20

దినవెచ్చము

సీ. కైలాసమునఁ బంట మైలారవిభుఁ డుండె
దినవెచ్చ మెవ్వఁడు దీర్పఁగలఁడు 21

శ్రీనాథు.నిచాటుధార

కఱకంఠుఁడు

క. ఎఱుకని యొఱుఁగక నీకున్
యుఱకువ నెదిరించినాఁడ మఱువుము దీనిం
గఱకంఠా ! క్షమియింపుము
నెఱి నెవ్వఁడు నెఱుఁగఁగలఁడు నీచరితంబున్. 22

ఆరణ్యపర్వము (1—326)

గీ. సంస్కృతపదంబు లొగి సమాసములు గూర్చు
నపుడు క్రారను గూడిన యక్కరంబు
లూది యుండు నొకొక్కచో నూదకుండుఁ
దెనుఁగుఁగృతులందుఁ సామజాజిననిచోళ. 23

ఉ. కావునఁ గామక్రోధములఁ గ్రాగుచు నాశ్రితకోటిఁ గాచుచున్
బావలయుప్రజన్ సమతఁ బ్రోచుచు రాజ్యముసేత మేలు భి
క్షావిధి లోనుగాఁ గలుగు సారపుధర్మములం ఘటించువే
ల్పావిరి నప్రయత్నమున వానికి వచ్చు నృపాల యమ్మెయిన్. 24

శాంతిపర్వము (4–81)

సీ. సంధ్యాభివందన శ్రద్ధయుజ్జ్వన సేయు
గీతవాద్య వినోదక్రియలఁ దగులు. 25

కాశీఖండము (4—81)

చ. అనవుఁడు నిట్లనున్ విదురుఁ డక్కట ధర్మసుతుండు బాంధవుం
డును జెలికాఁడునుం దగు భటుండును బ్రెగ్గడయుం గురుండుగాఁ
డె నరవరేణ్య ధర్మప్రకటీకృతచిత్తుఁడు శాంతమూర్తి స
ద్వినయవివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు గీడ్పఁబల్కనే. 26

ఉద్యోగపర్వము (2—24)

చ. కృపకృతవర్మలం గడిమి గిట్టి శిఖండి ప్రభద్రకుల్ మహా
ప్రపువడిఁ దోడ్పడంగ భుజగర్వముఁ జూపిన నా బలాఢ్యులుం
గుపితమనస్కు లయ్యుఁ బలుగోల్తలఁ జేర్చిన లావు చేవగ
య్యాపు వెరవేల్పు దాల్మి సరివచ్చెడు పాటున ముంచెఁ జూపఱన్. 27

శల్యపర్వము (1—221)

వ. శ్లో. సంయుక్తే సంస్కృతాద్యేష్వా త్సర్వ మాంధ్రపదం లఘుః
భవే దాద్యసమాసేపి రేఫయోగా త్పదం తదా
పదేపి చ తథాత్వం స్యాత్ క్వచిన్నైవ న రేఫయో
*సర్వా స్వపి చ భాషాసు రహయుక్తేక్షరే పరే
పూర్వవర్ణ స్య లఘుతా చేష్టా మల్హాదికే పి చ.
అని అథర్వణసూత్ర మున్నది గనుక గీర్వాణమందును నీలాగున
కలదు 'ప్రాప్తనాభిహ్రదమజ్జన' మితి మాఘకావ్యము 'కస్మి
జ్జీవసి హే సఖే విషక్రిమిన్యాయేన జీవామ్యహ' మితి చాటుధారా. 28

గీ. సంస్కృతపదంబు లొగి సమాసములు గూర్చు
కడల స్త్రీలింగములకు దీర్ఘములు కురుచ
లగుచునుండు నొకొక్కచో నాంధ్రకృతుల
రమ్యధవళాంగ! కలశనీరధినిషంగ! 29

* ఈ కారిక 'సారావళిలోని దని అహోబలపండితీయము. సిద్ధస్సాధ్యశ్చానుస్వారః' కారికవ్యాఖ్య. కాని అహోబలపండితీయ మం దిచట నధోజ్ఞాపికలో 'శ్రీనాథవిరచితాయాం భీశోధి వ్యాఖ్యాయాం వృత్తరత్నాకర వ్యాఖ్యాయా మిదం పద్యం ఛంద శ్శేఖరగ్రంథస్థ ముపసాదితమ్' అని సూచితము. (పు.180).

క. పదిదినము లైదు ప్రొద్దులు
పదపడి రెన్నాళ్ళు నొక్క పగలున్ రేయిన్
గదనంబుఁ జేసి మడిసిరి
నదిసుత గురు కర్ణశ్యల్య నాగపురీశుల్. 30

అథర్వణభారతము

చ. జలరుహనాభ రమ్యగిరి సానువనంబున వేట లాడుచున్...
నలినసరస్సుగంధియమునానదితుంగతరంగ సంగతా... 31

ఆదిపర్వము

చ. తలిమము చేరక న్న మది తత్తర మెత్త విభుండు బాలికన్. 32

కవికర్ణరసాయనము

తే. అన జగంబుల మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచె
ధరణిధవ దత్త వివిధోపదానిధాన
మార్జితశ్రీవినిర్జితనిర్జరాల
యేశ్వరుఁడు తిమ్మభూపతి యూశ్వరుండ. 33

ఆముక్తమాల్యద (1—27)

చ. అపుడు పురంధ్రివర్గవృతయై చరణాంకకృతార్థ మైన క
ప్రపునుమ్రుగ్గుపై మకరపద్మము లేర్పడ వీక్షణప్రభా
స్నపనవిచిత్రకుట్టిమమునన్ వరనీరనిధుల్ జనింప న
న్నృపమణి భాగ్యలక్ష్మి కరణిం దరుణీమణి వచ్చె నొయ్యనన్. 34

వసుచరిత్ర (6—23)

మ. కనకక్షోణిధరంబు కార్ముకముగాఁ గద్రూతనూజుండు సిం
జినిగా మాధవుఁ డమ్ముగాఁ బురము లక్ష్యమై కదోశ్శక్తిఁ గె
ల్చిన జో దీశ్వరుఁ డిచ్చుగాత జయలక్ష్మినుస్థిరైశ్వర్యశో
భనముల్ పెద్దయసింగమంత్రికి జగత్ప్రఖ్యాతసత్కీర్తికిన్. 35

శృంగారనైషధము (1—2)

ఉత్సువి. అమ్మహిసురోత్తముఁడు నమ్మనుజభోజయును
నమ్మును గ్రో ధమధిక మ్మగుచు మీఱున్ 36
రుక్మాంగదచరిత్ర (5—38)

వ. ఉదాహరణము ద్విరూపకోశమునందు —
'స్వర్నది స్స్వర్నదీ చాపి వల్లి వల్లిశ్చ కీర్తితాః
లక్ష్మి రక్ష్మి ర్ద్వారి ప్రియా' అనిన్ని
'మహి శ్చాపి మహీ తథా' అనిన్ని కొన్ని శబ్దములు ఇకారాంతముగను
ఈకారాంతముగను చెప్పినారు ఈలాటి శబ్దాలు తెలుసుకొనవలెను. క్షోణీ
ధరణీ పురంధ్రీ శబ్దాలున్ను ఇటువలనే నడచును తెలుసుకొనేది.
'పురంధ్రిభి శ్చ క్రమశః ప్రయుక్త' మ్మని కాళిదాసుగా రికారాంతముగా
ప్రయోగించినారు. 37

క్రియా విశేషణ ప్రకరణము

గీ. పృథిని స్థావర తిర్యక్ ప్రభృతుల కెల్ల
క్రియలఁ దగ నేకవచనంబు లయి తనర్చు
దేవమనుజాదిక క్రియల్ దెలుప నేక.
వచనబహువచనంబు లై వరలు నీశ ! 38

శా. ఆకంపించె జగత్త్రయంబు దిశ లల్లాడెన్ సముద్రంబు లు
ద్రేకించెన్ భయమందె భూతములు భేదిల్లెన్ గులక్ష్మాధముల్
శ్రీకంఠుం డవికుంఠవిక్రమమునన్ దివ్యాస్త్రముం గూర్చి వి
ల్లాకర్ణాంతముగా వెసం దివిచి శీతాంశున్ నిరీక్షించినన్. 39
కాశీఖండము (4—222)

చ. బరగె వసుంధరాస్థలి మహోరగనాథుఁడు వంగెఁ గూర్మమున్
దరలె నభంబు మ్రోసె సురదంతులు మ్రొగ్గె దిగంతరంబు ల
త్తరి నదరెన్ మరుత్సుతుఁడు దర్ప మెలర్ప నహార్య ముద్ధతిం
బెరుకఁగ గోత్రశైలములు పెల్లదరెన్ గలగెం బయోనిధుల్. 40
భాస్కర రామాయణము (యు. 1732)

గీ. (చారుభీషణరేఖలు భూరిమదభి
రామయానంబుల నాహవోచి
తోగ్రకల్పనాభంగులు నుల్లసిల్ల)
కరులు ధాత్రీతలంబు గ్రక్కదల నడచె. 41

శల్యపర్వము (1—102)

క. ఉద్భిజములును జరాయు
ప్రోద్భూతము లండజాతములు స్వేదజముల్
తదుద్భవమండలిం జచ్చి మ
హద్భుతముగం బుట్టె హాలహాలకంధరు లై. 42

కాశీఖండము (3-98)

గీ. తెలుగుం గృతులందు స్త్రీలింగములకు స్త్రీన
పుంసకంబు లచేతనంబుల విశేష
ణంబు లగు, గౌరి శుభదృష్టి నవశుభప్ర
దాయిని, శుభప్రదం బన ధనదమిత్ర ! 43

## స్త్రీలింగమునకు స్త్రీలింగవిశేషణము

భారతార్థమందు —

ఆ. వెలయు నఖిలభువనములలోన వారణ
నగరి పురమతల్లి నాం దనర్చి
రాజ్యలక్ష్మి మిగులం బ్రబల నయోధ్య నా
రాజవినుతిం గన్న రాజధాని. 44

రాఘవపాండవీయము

## స్త్రీ లింగమునకు నపుంసకలింగవిశేణము

క. వరుణసభ సర్వలోకో
త్తర ముజ్జ్వలమణిమయము సితప్రభ మతిసుం
దర మందుండున్ వరుణుండ
వరుణానీసహితుం డై ధ్రువంబుగ నెమ్మిన్. 45

సభాపర్వము (1-07)

మ. దివిజాధీశు సుధర్మయున్సభ సముద్వీక్షింపు భూదేవ రెం
డవ **కైలాసము** వోలె నున్నయది బ్రహ్మాండంబుతో రాయుచన్
ధవళాభీలసుధాట్టహాసవిమలద్రాఘిష్ఠ **శృంగాగ్ర** మై
యువదాతధ్వజశాటికాంచలచపేటాధూతజీమూత మై. 46

కాశీఖండము (3-201)

సీ. ఆవేశచూర్ణంబు లఖిలేంద్రియములను
శృంగారరససముజ్జీవనములు
శంబరాతంకభుజాజయకీర్తిమహిమలు
కోకదంపతికి దృక్కూలశిఖలు
బ్రహ్మాండపురవీధి రత్నతోరణములు
యామినీకర్పూరహారలతలు
నీరదాధ్వాంభోజినీబిసాంకురములు
కుముదకాననముల కూర్మి చెలులు
గరళకంఠాట్టహాసంబు గర్వరేఖ
కైటభారాతి నతనాభి కమలశోభ
చంద్రికల గాయుచున్నవి సాంద్రలీల
భువన మిది యెద్ది పరమభాగవతులార. 47

కాశీఖండము (4-169)

క. తెలుగునఁ బ్రాణిపదంబులు
వెలిగా బహువచనమునకు విస్పష్టముగా
నిలుచును విశేషణం బై
పొలుపొందఁగ నేకవచనము మఖధ్వంసీ! 48

మాలిని. సురపతిసభఁ జూడం జూపె నంగారవృష్టుల్
గురిసెఁ **గులిశధారల్ గుంఠితం బయ్యె** దిక్కుం
జరమదము లడంగన్ సర్వదిక్పాలకాంతః
కరణములు భయోద్వేగంబునన్ సంచలించెన్. 49

ఆదిపర్వము (2-82)

వ. ఇందులోఁ గులిశధారలు కుంఠితంబు లయ్యె ననుటకుఁ గుంఠితం బయ్యె నని బహువచనమునకు (నన్నయగారు) ఏకవచనము విశేషణము బెట్టినారు. 50

గీ. కలిగి యనునట్టి యర్థంబుఁ దెలుపుచోట
నిలుపఁదగు నై యనుపదంబుఁ దెలుఁగునందు
గొడుగు లరిగెలుఁ బడగలు ఘోటకముల
నై విభుం డొప్పె ననఁగఁ గాయజవిభంగ! 51

మ. హిమవంతంబున కేఁగి యొక్కయెడ నం దేకాంత మొక్కర్తు నీ
రమ్ముఁ గృష్ణాజినముం గమండలువు నై రాగంబు వంచించి సం
యమముం గైకొని యున్నఁ జేరఁ జని పుణ్యాకారమున్ యౌవనో
ద్యమముం గాంతియుఁ జూచి రావణుఁడు కామాయత్తుఁ డై యిట్లనున్. 52
ఉత్తరరామాయణము (5–4)

క. అరుణాశ్వంబులఁ బూన్చిన
యరదముపై వీఁడె నిడుపు లగు చేతుల బం
ధురకంధరంబు వెడలుపు
టురమును నై ద్రోణుఁ డొప్పె నుత్తర! కంటే. 53
విరాటపర్వము (5–116)

సీ తెల్లనిగొడుగును వెల్లసిడమును నై
యల్లవాఁడే పాండవాగ్రజుండు 54
ద్రోణపర్వము

క. కలవాఁడనుచోఁ గల్గఁ డన
కలవారె యటన్నచోటఁ గలరె యటంచుం
బలుకఁ జనుఁ దెలుఁగుఁ గృతులన్
నలినభవాదికనిలింపనాయక! భర్గా! 55

క. సమరథుఁడు బిరుదు లక్ష్మణ

కుమారుడుం గదిసి మొనలఁ గోల్తల నేయున్
మిము నెల్ల మిగులు భుజగ
ర్వము మదమును గలఁడు; గొనఁ డరాతుల నధిపా! 56

ఉద్యోగపర్వము (4-224)

ఆ. చనునె నీకు నిట్టి సాహసక్రియఁ జేయ
నెల్లవారికంటె నెఱుక గలవు
గురుభుజాండ నాకుఁ గూర్తేని సేయకు
మయ్య యిట్టి చెయివు లనఘ! యింక. 57

అరణ్యపర్వము (3-377)

కలవారె యనుచోట కలరె యనుట

ఆ. చట్ట బన్నిదంబు చరచితి మట్లుగా
ననినఁ బాము లెల్ల ననయ మిదియుఁ
దల్లి పంచె నే నధర్మంబు సేయంగ
దగునె యెఱుక గలరె మగువ లెందు. 58

ఆదిపర్వము (2-34)

క. అమితం బగు నీతపమును
హిమ యెఱుఁగక యిట్లు చేసె నిది దీని సహిం
పుము మత్తైన్యంబునిరో
ధము నాపుమ యెఱుకగలరె తరుణులు ధరణిన్. 59

అరణ్యపర్వము (3-181)

వ. ఇది క్రియా విశేషణ ప్రకరణం, బింక ప్రాసప్రకరణం బెఱింగించెద 60

ప్రాసప్రకరణము.

గీ ఋత్వ రషలపయి న్వచ్చు నత్వమునకు
ణత్వ మాదేశ మొదవు నానణల కెపుడు
ప్రాసమైత్రి తనర్పు గోపతి తురంగ!
ధృతనభోభంగ కుక్కుటాదీశలింగ! 61

క. త్రిణయనుని రాణివాసము

నణిమాద్యైశ్వర్య వితరణామరతరువున్
మణికర్ణిక, ముక్తివధూ
మణికర్ణికఁ దలఁచుఁ దపసి మానసవీధిన్. 62

కాశీఖండము (2—150)

క. అనుటయుఁ గృష్ణద్వైపా
యనతనయుం డిట్టు లనియె నవహితమతివై
విను మతిగుహ్యము నారా
యణ కవచము భక్తివాంఛితార్థప్రదమున్. 63

శృంగారషష్ఠము

క. పో నుద్యోగము చేసిన
ప్రాణంబా యింక నీకు పాథేయంబా
మానిని మందస్మితమధు
రాననచంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్. 64

మధుసేనము

క. ప్రాణాపానవ్యానో ...
దానసమానములు దృప్తి దలకొనఁ జేయం
గానోపెడునది యన్నము
ప్రాణం బన నన్ను మనఁగఁ బర్యాయంబుల్. 65

కాశీఖండము (5–296)

క. త్రినయును గాత్రస్పర్శన
మున నరుగాత్రము పవిత్రమును వజ్రాఘం
బును నతితేజోవీర్యం
బును నైన పృథాసుతుండు ముదితుం డగుచున్. 66

అరణ్యపర్వము

వ. కొందఱుశాబ్దికులు 'త్రిణయనుఁడ 'ని ప్రయునరా దన్నారు. కాని శ్రీనా
థుఁడు మహాకవియయ్యుఁ బ్రయోగించినాడు (చూ. పె.62పద్యము)67

క. స్వరగణ మయ్యు ఋకారము
బరికింపఁగ రేఫతోడఁ బ్రాసం బగుచుం
గరమొప్పు వట్రసుడి య
క్షరమును బ్రాస మగు హల్లు గదిసి మహేశా 68

**ఋకార రేఫలు**

క. ఆ ఋషికుమారు గట్టిన
చీరలు మృదులములు కడువిచిత్రములు మనో
హారము లతని బృహత్కటి
భారమునం దొక్కకనకపట్టము వ్రేలున్. 69

ఆరణ్యపర్వము (3—104)

**వట్రసుడి కల, లేని అక్షరములు**

క. చావరు నొవ్వరు పాండవు
లేవురు నని నీవు చెప్ప నిప్పలుకులు దుః
ఖావేశకరము లై చే
తోవృత్తి దహింపఁ జొచ్చె దుర్భరభంగిన్. 70

శల్యపర్వము (1—14)

క. ఈ కృష్ణుని సారథ్యము
నా కృష్ణుని గాండీవంబునై దోపకము
న్నీకొల్ఁది జక్కఁబడి నీ
దీ కురువంశంబు గావు మిభపురనాథా !* 71

ఉద్యోగపర్వము (3—351)

గీ. ఆంధ్ర గీర్వాణముల నొకయక్షరమున
కంటె వచ్చిన క్రారల కరయ మైత్రి
చెల్లు ప్రాసంబులను గూర్పఁ దెల్లమిగను
బన్నగాధీశకేయూర ! భయవిదూర ! 72

*ఈపద్యము (71) తరువాత, చావరు, ఈకృష్ణుని— ఈరెండు దాహరణములు వ్యర్థములు, అని ఉన్నది.

క. ఏ ప్రొద్దు శూద్రముని విగ
తప్రాణుం జేసి తీవు ధర్మనిరతి నా
విప్రశిశువు చేతన్యం
బా ప్రొద్ద యనూనమగ సమాహిత మయ్యెన్. 73

ఉత్తరరామాయణము (10—83)

గీ. కబ్బముల క్లప్తియను స్వరల్కార మితర
హల్లుతో ప్రాసములఁ గూర్పఁ జెల్లు మును మ
హాకవీంద్రులు గడఁగి పద్యములయందు
నిలుపుట నశేషదివిజవందిత! మహేశ !* 74

శా. లోకత్రాణరతిం ద దాదిమమహాలోకప్రవేశోత్క భా
షాక్లప్త ప్రథమ ద్వితీయ పద గుంజన్మంజుమంజీర గ
ర్జాకల్పావల రామభారతకథాసర్గంబులన్ మించు వా
ల్మీకివ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లోకార్థసంసిద్ధికిన్. 75

రాఘవపాండవీయము —

ఆ. అందముగఁ గకారహల్లు పై నమలు చెం
దింప, దిఙ్నగంబు, దిగ్నగంబు
దిఙ్మతంగజంబు, దిగ్మతంగజమునాఁ
బ్రాస లిరుదెఱంగు లడరు నభవ! 76

క. అగ్ని హతిఁజేసి మానవ
ఖగ్నివహము మరణబాధఁ బొందింపుచు మూఁ
డగ్నులయొద్దను నాలవ
యగ్ని యనన్ వెలుగుచున్న యమ్మునినాథున్. 77

ఆదిపర్వము (7—153)

ఆ [1]బమలు బిందుపూర్వకముగ జమిలిమాకు
నిలుపఁ జెల్లుఁ బ్రాసముల నభేద
మొదవుఁ గృతుల ళశల కుడురాజకోటీర!

* ఇక్కడ ముద్రితప్రతిలో, కబ్బములనను లక్షణము, నుదాహరణమును సంగతములు కావు, అని యున్నది

1. ము.ప్ర.ఆ.బమలు బిందు పూర్వకముగఁ బ్రాసంబుల
నిలుపఁ జెల్లు ళశల కిల నభేద
మొదవు చుండుఁ గృతుల, నుడురాజకోటీర!

దురితదూర !పీఠపురవిహార! 78

### ఐమలకు

ఉ. ఇమ్ముగ సర్వలోకజను లెవ్వని యేని ముఖామృతాంశు బిం
బంబున నద్భుతంబయిన భారతవాగమృతంబు కర్ణరం
ధ్రంబను నంజలిం దవిలి ద్రావుదు రట్టి మునీంద్రలోకవం
ద్యుం ఐరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్. 79

*ఆదిపర్వము* (1–77)

ఉ. అమ్మఖవాజి పాండుతనయాధ్వరవాహ మెదిర్చి మోము మో
పం బసి వెట్టి హేషితరవంబున వక్షముఁ బూర్వపత్త్రరా
గంబున వ్రేయ జేసి యది కందము వట్టి విదల్చఁ బో నమి
త్రం బయి కేలికిం గడఁగి దంతములన్ గళ మప్పళింపఁగన్. 80

*జైమినిభారతము* (7–145)

### ళళలకు

ఉ. ప్రల్లద మేని యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రితుల్యుఁ డై
త్రెళ్లుడు వానిదైన పృథుదేహము వెల్వడి తేజ మంబరం
బెల్ల వెలుంగ వచ్చి పరమేశ్వరుదేహముఁ జొచ్చె విస్మయో
త్ఫుల్లవిశాలనేత్రు లయి భూపతులందఱుఁ జూచుచుండఁగన్. 81

*సభాపర్వము* (2–69)

క. లడలకు నభేద మనుచున్
వెడఁగులు గడు బ్రాసములను విశ్రమముల ను
బ్బుడరఁగఁ గలుపుదు రది యొ
య్యొడలను భవ్యంబు గాదు, హిమకరమకుటా! 82

ఆ. మొసలి మొసడి వ్యాళమును వ్యాడమును వ్రీళ
వ్రీడ వెలుడుటయును వెడలుటయును
దళము దడము వ్రాఁగ జలము జడము వ్రాఁగ
లడలు రెండుఁ జెల్లు నుడుపభూష! 83

ఆ. వెలుడె నన్నదంబు వెడలుట యంచు ల
క్ష్యంబు నైషధమున నరసి లడల
కిల నభేద మనుచు నల ముద్దరాజు రా
మన్న పలికె దలఁప నది హుళక్కి. 84

న. క క "లవు వివరింపఁగా నా
ఖ్యలు వరుసన్ నిర్గమించె ననుటకు ధరలో
వెలువడియె, వెళ్లె, వెడలెను
వెలుడె ననం జిత్ప్రకాశ ! విశ్వాధీశా !"
అని పైడిపాటి లక్ష్మణకవి (ఆంధ్ర నామ సంగ్రహమందు) చెప్పినాఁడు
గనుక వెలుడె ననియు కలదు. 85

చ. చిలుకలు కూయునో చెవులు చిల్లులు వోవఁగ నంచు నెన్నఁడున్
వెలుడడు నందనోపవనవీధులకై యటు మౌళిభాగని
ర్మలశశిరేఖ సేయునపరాధమునన్ గజదైత్యశాసనుం
గొలువఁడు పాక శాసనుఁడు కోమలి నీదెస కూర్మి పెంపునన్. 86

శృంగారనైషధము (4–24)

క. వెలుడి చనుదెంచె నపు డ
ప్పలభుక్కులకన్య వన్యఫలభుక్కులకున్
గలనయ్యె నందుఁ జేకొని
గెలువుఁ గపివీరు లొడ్డగిల దొరకొనినన్. 87

రామాభ్యుదయము (8–54)

దడము

క. కొడుకులుఁ దానును గుఱ్ఱపు
దడములు పెక్కైన బలవితానము దగుమై
నడిపింపుచు మేలపుసం
గడములతో నపుడు శౌరి కడు నొప్పారెన్. 88

శివపర్వము (1–93)

మొసడి

తరల. ఇది సారంగ వయోగ్య మెవ్వరి కిందువంశవరేణ్య వి

న్మిదియ కా దివి యేను తీర్థము లీసముద్రతటంబునన్
విదితముల్ దురితాపహంబులు వీని నెవ్వరు మున్న నో
డుదురు సన్మను లిందు కార్మొసడుల్ వడింగొన్నఁ జొచ్చినన్. 89
ఆదిపర్వము (8-148)

ప్రీళ

క. బాలోన్మత్తపిశాచద
శాలంబనమునఁ జరించు నంగడివీథిన్
వ్రీళా శూన్యతఁగంతే
కాలుని పాదములమీఁదఁ గల్గ విరాళిన్. 90
శ్రీమఖండము 3-193)

వ. ఈ శబ్దములు వినాగా మిగిలిన శబ్దములు ప్రయోగములు లేవు గనుక
లడలకు మైత్రి లేదు. 91

గీ. అర్ధబిందువు నిర్బిందు వగు పదముల
ప్రాసములు దీర్ఘములమీఁదఁ బలుకఁ జెల్లు
ననుచుఁ దగ ముద్దరాజు రామన్న చెప్పె
హ్రస్వముల నట్లు యొక్కచో నలరు, రుద్ర! 92

వ. ''గీ అర్ధబిందు వై తేలిన యట్టిటపల
కరయ ప్రాసంబు నిర్బిందు వైన నమరు
వీఁపు మూఁపును మఱి తల మోపు నయ్యె
మాట లేటికి ధాత్రిఁ దాబేఁటి కనఁగ.
అని అనంతుఁడు టపలకు మాత్రమె చెప్పినాఁడు గాని అన్నిటికి గద్దు.93

క. నా కొఱఁత దీర్చి వచ్చితి
నీ కొఱతయు యింక సూతునిం దెగఁ జూడన్
శోకము వం చింపందగు
చీఁకటిరే యొదవె నేమి సేయుదుఁ జెపుమా! 94
విరాటపర్వము (2-271)

క. వీఁకఁ బరతెంచి నలుగడ

దాఁటి నకులుఁ డరిగె ఘోరతరశరహతి నా
మూఁకలు విరియఁగ నర్జును
డాకరమున దాఁకె న్నుగ్రుఁ డె. రణభూమిన్. 95

ఆదిపర్వము (8-200)

ద్విపద. మూఁగి చరించు నమ్మొకరితుమ్మెదల
బాగొప్పు కొప్పునఁ బ్రబలిన దాని. 96

రంగనాథరామాయణము

ఆ చింతామణి ముని దన
పేఁచ మణచుదాఁక వీఁక పృథులోభము చే
దాఁచు కొనఁగాక నాచే
నీచే నిక మోసపోవునే నరనాథా! 97

వరాహపురాణము

క. మీాటుగల రధికులను నొక
నాటను వేవుర వధింతు నరుశరములు నో
నాటి పడవైచు నంతకు
వేఁటాడెదఁ బ్రతిబలంబువీరుల నెల్లన్. 98

ఉద్యోగపర్వము (4-407)

క. ఓడితిమె యేము రణమునఁ
గ్రీడికి గేడించిరాక గెలుపే యతఁడున్
వేఁడి డాఁగెనొకో మా
తోడి బవరమట్లు దాను దొలఁగంజనునే. 99

ద్రోణపర్వము (1-374)

క. అతఁడును బుష్కరిణి యును
నాతికి వైరిణి సమాఖ్య నందను గనియెన్
బ్రీతి యొసఁగ నుత్పల యును
గోఁతి యతని వలనఁ గాంచెఁ గొడుకుల పరుసన్.

హరివంశము (పూ.1-61)

క. ఆ పన్నగముఖ్యులు దన
వీఁపునఁ బెట్టుకొని పఱచి విపినములు మహా
ద్వీపములు నదులు నిఖిలది
శాపాలపురములు సూపి చని వారలకున్. 101

ఆదిపర్వము (2–45)

క. ఆపార్థుఁడు కోపానల
దీపితుఁడై విశిఖశిఖలఁ దీవ్రవనిహతి న
త్యూపులగవి యేర్చి జముని
కోపు గుడువఁ బనిచె వారిఁ గురువంశనిధీ. 102

ద్రోణపర్వము (1–253)

## కురుచలమీఁది అర్ధబిందువులు

చ. తగవులఁ బోక రాజు బెడిదమ్ముగఁ బల్కినయేని సైఁచి యొ
ప్పుఁగ నిలుమీ గురుత్వ ముడుపంగల వారికిఁ బెద్దవారి మా
టఁగొనమి యాసుయోధను కడ న్నిలుచున్ మన మెల్ల గౌరవం
బుగఁ గురువృద్ధపల్కుఁ దలపుం జననిచ్చిన మెచ్చరే జనుల్. 103

ఉద్యోగపర్వము (3–24

క. తగ నక్కురువృద్ధునకు నొ
సఁగె నాటికి నెల్లదృష్టి సాత్యవతేయుం
డగణితతపఃప్రభావం
బు గని యధికవిస్మయంబుఁ బొంది జనంబుల్. 104

ఆశ్రమవాసపర్వము (2–121)

వ. కుఱుచల మీఁద అర్ధబిందువులు బహుళముగాఁ బ్రయో
గములు కనఁబడుట లేదు. 105

గీ. అక్కజంబుగ నేర్తునునట్టిపదము
లోని రేఫం బొకొక్కచో లోప మొందు
నేర్తురన నేతు రనఁగను నేర్చి నేచి
యనఁగఁ బ్రాసంబులను గూర్చ, మనసిజారి. 106
ద్విపద : నీతల లందంద నేలపైఁ గూల్చ

నేతునే వీక్షింప నిర్జరవైరి 107

రంగనాథుని రామాయణము

క. ద్యూతక్రీడకుఁ గొండొక
నేతుం గపటమున నొప్పనిజనంబులు నా
చేతి ధనమెల్లఁ గొని పరి
భూతి యొనర్చిన విరక్తి పొడమి వెడలితిన్. 108

విరాటపర్వము (1–196)

క. కాచికొని వచ్చి తగ నా
నేచినయ ట్లచట నచట నిల్పితి ముని నా
ధా! చేటును భంగంబును
నై చిత్తము శోకమునకు నగ్గంబయ్యెన్. 109

మౌసలపర్వము (1–125)

వ. ఇది ప్రాసప్రకరణం బింక యతి ప్రకరణం బెఱింగించెద. 110

యతిప్రకరణము

క. స్వర వర్గాఖండ ప్లుత
సరస ప్రాదులును బిందు సంయుక్తములున్
బొరి నెక్కటి పోలికలును
విరతులు పది కబ్బములను వెలయు మహేశా! 111

వ. మఱియు వృద్ధి వికల్పాభేద ప్రభునామ విభాగానునాసిక కాకు విత్యాది విరమణంబులు చక్కటివళ్లును నసమాన నఞ్సమాస నిత్యసమాసాది విశ్రమంబులు నసం గొన్ని భేదంబులు గలవు వాని తెఱంగెఱింగించెద 112

స్వరవడి

గీ. ఓలి న ఆ లునై ఔలు నొక్కటగును
లీల ని ఈ ల్ బుకార మె ఏ లునొకట
తలప ను ఊ ల నోఓలు గలయు నొకట
స్వరవిరామంబు లివి కరివదనజనక! 113

అ ఆ

సీ. అవని భారధురీణతాధరీకృతమహా
క్రోడప్రధానుఁ డల్లాడనృపతి. 114

కాశీఖండము (1–25)

ఇ ఈ లకు ఋకారము

గీ. ఈశ్వరద్రోహి గర్వాంధ ఋషివరేణ్య
బంధునాశైకకారణ పాపకర్మ
చావు మని యొక్కపెట్టునఁ జక్రధార
దకుతలఁ ద్రెళ్లవైచె పాలాక్షసుతుఁడు. 115

కాళీఖండము (7–95)

గీ. చెఱకువిలుకానిబారికి వెఱచి నీదు
మఱుఁగు చేరితిఁ జేపట్టి మనుపు నన్నుఁ
బ్రాణదానంబుకన్నను వ్రతము గలదె
ఎఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార! 116

విజయవిలాసము (1–93)

వ. కడమ యీలాగే తెలుసుకొనునది. 117

వర్గవడి

క. అడరఁగఁ గచటతపంబుల
కడ నొక్కొక వర్ణ ముడుప కడమవి నాలుం
దొడరి తమతమకె వళ్లగు
నృడ! పీఠపురీనివేశ! మృత్యువినాశా! 118

సీ. కమనీయ రాజశిఖామణి కవిరాజ
గర్వమహీధ్రనిర్ఘాతమునకు
చతురకీర్తికి హితచ్ఛవికి నా యోధన
జయశీలునకు గుణఝంపునకును
టంకితరాయ కఠారిసాళువునకు
డంబలాంఛనకోలడాలునకును

తత్త్వపురాణ కథారసవేదికి
దానదయాధర్మధామమతికి
పశుపతిప్రాప్త సామ్రాజ్యఫలున కబ్జ
బంధు బంధురతేజోవిభాసురునకు
విశ్వవిభునకు సరి లేరు విశ్వజగతి
ననిన నివి వర్గవళులనం దనరుం గృతులం. 119

పెద్దిరాజు కావ్యాలంకారచూడామణి (7–37)

## అఖండవడి

గీ. హల్లునకు హల్లువడి యిడునపుడు దాని
తుదిని స్వరము ఘటిల్లిన నది యఖండ
వడి యనంగం బొల్చుం గృతుల దేవాదిదేవ
యనుచుం జెప్పిన, శైలకన్యాధినాథ! 120

ఉ. అన్నవు తండ్రి యట్లు నిను నంతియ గా దటమీంద రాజవే
మన్నం గొఱంత లేదు మణి మండన ముఖ్యములైన కానుకల్
మున్నుగ సీత నిచ్చి జనలోకపతిన్ శరణంబు వేడు మీ
సన్నపుంగార్యముల్ వలదు సందియమే లటుగాక తక్కినన్. 121

భాస్కరరామాయణము (యు. 141)

ఉ. ఆకులవృత్తి రాఘవుశరాగ్రమునందు దృణాగ్రలగ్నసీ
రాకృతి వార్ధి నిల్చుట దశాననుం డీల్గుట మిథ్య గాదె వా
ల్మీకులు చెప్పకున్నం గృతి లేని నరేశ్వరువర్తనంబు ర
త్నాకరవేష్టితావని వినంబడ దాతండు మేరు వెత్తినన్. 122

*శ్రీరంగమహాత్మ్యము

ఉ. తారకజిచ్ఛిఖండి శివతాండవ మాడ నతండు మర్దలో
దారరవంబు మేఘనినదం బని చేరినం జూచి నాసికా
ద్వారబిలంబు జన్నిదపువ్యాళము జొచ్చినం దొండ మెత్తి ఘీం
కారముం జేసి నవ్వు వెనకయ్య కృతీశ్వరు మంచుగావుతన్. 123

అరుణాచలపురాణము

*ఈపద్యము నీతిభూషణ మందలిదిగా సకలనీతి సమ్మతము చెప్పుచున్నది.

చ. అలరులబంతి జృంభికకు నడ్డమువేయుచుఁ గర్ణపాళి2కే
తలుకులు ద్రోయ మేనఁ బ్రమదాశ్రులు నొయ్యనఁ గోర మీటుచున్
జెలి భుజపీఠి నొత్తిగిలి చిల్కను దువ్వుచు వాలుఁగన్నుఁ గే
వలకుదధార చేర నొకవారవిలాసిని చూచె రాసుతున్. 124

మనుచరిత్ర (5–97)

వ. ఈలాంటి ప్రయోగాలు అడకాడకు గలవు కాని మహాకవిప్రయోగాలు లేవు గనుక యిది సుష్ఠువు గాదు.

క. నావచనమున నపత్యము
గావించుం గుంతి నీకుఁ గడునెయ్యమునన్
నీవగచిన యీ యర్థము
నూనె మనంబునఁ దలంచుచుండుదు నేనున్.
అని శబ్దానుశాసనుఁడు ఆదిపర్వమున బ్రయోగించినాఁ డని
కొందఱు భ్రమ చెందుదురు. కాని,
నీవగచిన యీయరమ
మూనె మనంబునఁ దలంతు సుందరి ! నేనున్.
అను పాఠమే సంప్రదాయము. 125

క. అక్కఱ తెమ్మెఱ రూపఱ
గ్రక్కదలఁగ నోలమాస క్రచ్చఱ యను నీ
పెక్కు పదము లిరుదెఱఁగుల
నిక్కముగ నఖండవడి గణించిరి సుకవుల్. 126

వ. ఈశబ్దములమీఁద వచ్చినవి అఖండయతు లని కొంద ఱన్నారు. 127

అక్కఱ

సీ. మునిమాపు బలుగంబమునఁ బుట్టి బంటున
క్కఱ దీర్చిన నృసింహంబ నీవ 128

పారిజాతాపహరణము (1–49)

2.ముద్రి. మను. పై, కలకలఁ ద్రోయుచున్ దరగతొ ప్రమదాశ్రులు గోట......

### హల్లునకు

మ. నెఱయుం బున్నమచందరుం జెనయు నీ నెమ్మోమునుం జెక్కులన్
జిఱున వ్వొప్పఁగఁ జూడగ నీకపుటకల్ చెల్వొంద నిం గ్రుచ్చి య
క్కఱతోడం బోరి నక్కునం గరము వీఁకం జేర్చ నీ కెమ్మెయిన్
వఱతం ద్రోవఁగఁ జేసెనే యకట దైవం బెందు జొత్తున్సుతా ! 129
ఆరణ్యపర్వము (7–343)

గీ. (చారు భీషణరేఖలు భూరిమదభి
రామయానంబుల నాహవోచి
తోగ్రకల్పనాభంగులు నుల్లసిల్ల)
కరులు ధాత్రీతలంబు గ్రక్కదల నడిచె. 130
శల్యపర్వము (1–102)

### ఓలమాస

గీ. అని విచారించుచుండెనయ్యవనినాథుఁ
డంతకయు మున్న నలునిఁగా నతని నెఱిఁగి
యెదురు గద్దియ డిగ్గి పృథ్వీశతనయ
యవనికాంతరమున నోలమాస గొనియె. 131
శృంగారనైషధము (4–97)

వ. అఱ యనుట తరుగుట యర్థము. గనుక క్రచ్చఱ, రూపఱ, ఉక్కఱయను
పదములు అచ్చు హల్లులు రెంటియందు యతు లౌను. 132

### అచ్చునకు

చ. తఱి యగునంతకున్ రిపునుదగ్రత సైఁచుట నీతి నీవు నా
కఱపినయట్లు సేయుము తగం జని యాతనిఁ గాంచి నన్ను నే
తెఱఁగున నైనఁ బొందఁగ మదిం దలపోతయు కల్గెనేనిఁ గ్ర
చ్చఱ మునివర్గవాహనుఁడ నై చనుదె మ్మను మంతఁ దీరెడున్. 133
ఉద్యోగపర్వము (1–176)

### హల్లునకు

చ. చిఱునగ వొప్ప గాండీవముఁ జెచ్చెర సజ్యముఁ జేసి సేన లు
క్కఱ రభసంబుమై నడరఁ గవ్వడి ద్రౌణియు నీడవోక య
త్తఱిఁ దరుమంగ వస్త్రములు దందడి మార్కొని మండుచుండె చి
చ్చఱపిడుగుల్ వడిం దొరఁగు చాడ్పున నంబరవీధి నుగ్రమై. 134
విరాటపర్వము (5–143)

## ప్లుతవడి

క. క్రమ మొప్పఁగ దూరాహ్వా
నములన్ గానముల రోదనంబుల సందే
హములఁ బ్లుత మొదవు, నదియున్
రమణఁ ద్రిమాత్రాన్వితస్వరంబు మహేశా ! 135

## దూరాహ్వానమునకు

ఉ. ఓవసుధామహేంద్ర ! కరుణోదధి యాతఁ డవేల ! ప్రోవ రా
వే, వసుభూప యంచు నెలుగెత్తి వెసన్ మొరవెట్టు చాడ్పునన్
(శైవలినీరవం బెసఁగె శైవలినీనినదంబుకన్న యు
న్నావిలభూరివారివిహగారవగౌరవ మెచ్చె నెల్లెడన్) 136

వసుచరిత్ర (2-141)

## గానప్లుతమునకు

శా. కాండానిర్భవభాండభూపరివృఢగ్రైవేయశైలేయ సూ
కాండాటాధిప కేతుమాతులబలాకాశస్రవంతీ మరు
త్కాండాఖండలతుండిపాండురయశఃకర్పూరపేటీభవ
త్కాండా రాయని మంత్రి భాస్కరుని కొండా ! దండనాథాగ్రణీ ! 137

స. గానప్లుత మనంగా స్తుతిచేయుటయందు వచ్చినది. 138

## రోదనప్లుతమునకు

ఉ. ఏ జనకాత్మజన్ దశరథేశ్వరుకోడల రాముభార్యఁజూం
డో జనులార ! యడ్డపడరో మరలార సురారి కంచు వం
భోజదళాక్షి శైలవనభూములు దాటుచు భీతి నేగుచో
నీజలరాశిఁ జూచి మది వెంత దలంకెనొ యేమి సేయుదున్. 139

భాస్కర రామాయణము (యు. 41)

## సంశయప్లుతమునకు

చ. హరిహయుఁ డేమి యయ్యెనొ కదా మదనానలతాపవేదన

వ్వరుణుఁడు విప్రయోగమున వాఁడఁడె యింతకు దండపాణి దా
విరహభరంబున న్మిగులఁ వేగఁడె నొవ్వఁడె పీతిహోత్రుఁడున్
స్మరశరకేళికాననసమాగతమందసమీరణంబునన్. 140

శృంగారనైషధము (4–65)

ఉ. ఏగతి యోగిరూపము వహించెదొ యేగతి ప్రౌఢి మించెదో
యేగతి వేళ గాంచెదవొ యేకత మున్న వధూజనంబు నీ
వేగతి సత్కరించెదవొ యిష్టసఖా ! భవదీయ నీతికా
ర్యాగతి నేడు చూతముగదా యని యెంచిన నాక్షణంబునన్. 141

వసుచరిత్ర (2–78)

సరసపడి

క. పరుగుకన్నుల లొండొంటికి
పరవిన్ శషసలు దనర్చు చభజయులకునున్
బరికింప సహయ లేకము
సరస విరామంబు లవి నిశాకరమకుటా ! 142

చ. అమరపతి న్వరించెదవొ హవ్యవహుం జరణంబుఁద్రొక్కెదో
శమనుని చెట్టవట్టెదవొ సాగరవల్లభుఁ బెండ్లియాడెదో
(ప్రమదము గౌతుకంబు ననురాగము పెంపును సొంపు మీఱఁగాఁ
గమలదళాక్షి యొక్కరునిఁ గైకొనుమా యనుమానమేటికిన్ 143

శృంగారనైషధము (4–48)

ప్రాదిపళ్లు

క. ఉపసర్గలు ప్రపరాపరస
మపి సుప్రత్యభ్యుదాఙ్వ్యా వాధ్యత్యను ప
ర్యుప నిర్దుర్ని ప్రభుతు, ల
3హిపదా యిందొదవు విరతు లిలఁ బ్రాదియతుల్. 144

3.ముద్ర. '.... హిపదర నిందొదవు......'

టీక. ప్ర—పర—అప—సమ్—అపి—సు—ప్రతి—అభి—ఉత్—ఆఙ్—వి—అవ—అధి—అతి—అను—పరి—ఉప—నిర్—దుర్—ని, ఇవి ప్రాదులు. 145

సీ. ప్రమదాజనేక్షణ ప్రార్థిత సౌందర్య
యాచకసంతతి ప్రార్థనీయ
పృథివీసుర ప్రజాభీష్ట సంధాయక
యిభముఖ్య సైన్యకాభీష్టయాత్ర
పరమధర్మక్రియోపాయ సంచితకీర్తి
యరిదుర్గసాధనోపాయవేది
వివిధశాస్త్రాగమ వీక్షణతాత్పర్య
యిందిరాసత్కృపావీక్షణీయ

ప్రబలతరగుణ నిరంతర వైభవ
యష్టసిద్ధిబలనిరంతరాయ
పరఁగుచుండు నివియ ప్రాదులు యతు లన
విద్వదంబుజార్క విక్రమార్క. 146

సింహాసనద్వాత్రింశిక (4–210)

వ. మఱియు నచ్చు హల్లులకుం జెప్పచున్నాను. 147

హల్లునకు

గీ. ప్రాణ బంధువుఁ డైన యుప్పక్షివిభుఁడ
అభ్రమార్గంబునం దొయ్య ననుచరింప
(నశ్రుధారాప్రవాహంబ యవధి గాఁగ
దైన్యమందుచు నరలె వైదర్భి చూడ్కి). 148

శృంగారనైషధము (2–100)

అచ్చునకు

గీ రజకితోడ నుదక్యతో శ్రమణితోడ
విధవతో నాథుతో రాయువెలఁదితోడఁ
జెడిపె తోడుతఁ బోరామి సేయఁదగదు

ప్రాణసంకట మైనఁ బుణ్యాంగసలకు. 149

కాశీఖండము (2–74)

ఉ. అత్తకు భక్తి కల్గి తగ నాయమ చెప్పినమాడ్కి జీవికా
వృత్తము లావహింతు గురువిప్రసురాతిథిపూజనంబు ల
త్యుత్తమ భక్తి నేన తగ నోపి యొనర్తుఁ బ్రియంబుఁ దాల్మియున్
మెత్తదనంబు సంతతము వేలుగఁ దాల్తు సమస్తభంగులన్. 150

ఆరణ్యపర్వము (5–304)

ఆ. అంత సుయోధనుండు హృదయంబున విస్మయమంది యంత వృ
త్తాంతము స్వప్నవృత్తముక్రియం దలపోసి నిజంబ కాఁగ న
త్యంతము నిశ్చయించుచుఁ బృథాసుతులన్ సమరంబులోన ని
ర్జింతున కాకయంచు వికసిల్లె దురాసదభగ్నబుద్ధియై. 151

ఆరణ్యపర్వము (6–50)

బిందువళ్లు

ఆ వరుస టతప వర్గ వర్ణ చతుష్కముల్
పిరుద సున్న లూని నెరియు నంత్య
వర్ణములకుఁ గృతుల వళు లగు నవి బిందు
యతులటండ్రు సుకవు లభకేశ! 152

సీ. నందనోద్యాన మందారకచ్ఛాయల
విశ్రమింపఁగ నీకు వేడ్క గాదె 153

శృంగారనైషధము (3–126)

సీ. మణిమయస్తంభకుంభదీపకళికలు
వేనవేలి రువంక వెలుఁగుచుండ 154

రామాభ్యుదయము (6–114)

వర్గవర్ణములు మొదట నుండఁగా నంత్యవర్ణములు తుదినుండఁటకు

ఉ. ఆకరివేల్పుసామిచరణాబ్జములం జనియించినారు మం
దాకిని తోడునీడ లయినారు నిజమ్ముగఁ గమ్మ కట్టు దా
వై కమనీయకీర్తి మహిమాతిశయంబుల మించినారు భ
ద్రాకృతు లద్రిధీరులు ప్రభాద్రులు మాద్రులు శూద్రు లవ్వరిన్.
తెనాలి రామలింగయ హరిలీలావిలాసము 155

క. 1. కడుదడవు నిద్రవోతిం
బడతీ నను దెలుపవలదె మఱి యొక్కరు డే
క్కుడు జవమునఁ బట్టి బలం
బెడలగఁ నను తిగిచె నాతఁ డెవ్వఁడు చెపుమా! 156
ఆరణ్యపర్వము (7–253)

సంయుక్తవళ్లు

ఆ. 2. వళులయెడ ప్రయుక్తవర్ణముల్ గూడిన
యక్కరంబు మాత్ర లనువువిూఱఁ
దమకుఁ దమకె విశ్రమము లై విరాజిల్లు
క్ష్మాశతాంగదక్ష! సవనభంగ! 157

సీ. నందీశ్వరక్షిప్త నారంగఫలపాక
తరల విద్యాధరీ స్తనభరములు. 158
హరవిలాసము (పీఠిక–6)

వ. స్నాన శబ్దము సకార తకార నకారసంయుక్త మైనది గనుక మూఁడు వర్ణములకు యతి చెల్లును. 159

ఉ. (దీనిధి సెట్టి నంబి తనదేహము నిండ విభూతి మంగళ)
3. స్నానముఁ జేసి ధౌతపరిధానముఁ గట్టి త్రిపుండ్ర ధారియై

---

1. ము.భార. కడుఁదడవు నిద్రవోయితిఁ,
బడఁతీ ననుఁ దెలుపవలదె బతియు.........

2. ము.ప్ర. వళులపట్ల ద్విత్వ వర్ణంబు నిలిచిన
నిరుదెఱంగు యతికిఁ బరగుచుండు
క్ష్మావిభుండు భువనమహితయశుం డన......

3. ము.హర. స్నానముచేసి

ము.ప్ర.లో "స్నాన శబ్దములో తకారము కలదనుట విచారణీయము" ముద్రాపకుల సూచన.

చే నమృతాంశుమౌళిని వశీకృతభక్తి ధరించి సంతత
ధ్యానముఁ జేసి యెంతయును దత్పరభావము ప్రస్ఫుటంబుగన్. 160
హరవిలాసము (2–37)

గీ. స్నానమును సంధ్యయునుఁ బితృతర్పణంబు 161
విష్ణుభక్తజనానందము

సీ. స్నానంబు దీర్చి ధౌతములైన వస్త్రముల్
ధరియించి సాంధ్యకృత్యములు నడిపి 162
మత్స్యపురాణము

## ఎక్కటివళ్లు

క. అక్కజముగ మరవఱలా
లొక్కొక్కటి తమకుఁ దమకె యొనరఁగ వళ్లై
చక్కంబడి కబ్బంబుల
నెక్కటి వళు లనఁగఁ దనరు నిభదైత్యహరా! 163

## మకారమునకు

చ. మదనుఁడు రెండుచేతులను మూర్పడ నేసెడు తూఁపులో యనన్
బది యయి వేఱువేఱ పరిపాటి నవస్థలు సంఘటింపఁగా
దుది దశ రాజునందు వెడ దోఁచుచునున్నది యేను వచ్చుచో
నది చిగురాకుఁబోణి యట నంబరపుష్పవికాస మయ్యెడిన్). 164
శృంగారనైషధము (2–90)

## రేఫకు

గీ. రాజబింబమునందు సారము హరించి
చేసినాఁడు విధాత యీ చెలువమోము
నడిమి రంధ్రంబునందుఁ గానంగవచ్చు
ఖనిఖనీలిమ యది నిదర్శనము గాదె. 165
శృంగారనైషధము (2–137)

వ. కడమ యిూలాగే తెలుసుకొనునది. 166

## పొలికవడి

వ. తగిలి ముకారము కడు నిం
పుగఁ బోలికవడి యనంగఁ బుఫు బుభుల కగుం
దగఁ బూల్ మూ లగు నెడ నొ
ప్పగ సుకవుల సత్త్వబంధములఁ బరమేశా ! 167

క. ఎట్టి విశిష్టకులంబునఁ
బుట్టిన సదసద్వివేకములు కలిగినఁ దాఁ
గట్టిన కర్మఫలంబులు
నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్. 168

ఆదిపర్వము (5–58)

## వృద్ధివళ్లు

క. పూని యకారాంతంబుల
పై నెఓ లదుక నవియొ పన్నుగ నైఔ
లై నిలిచి వృద్ధివళు లన
గా నిరుదెఱఁగులఁ బొసంగు గౌరీరమణా ! 169

## ఏకారమునకు

మ. అనురాగాకృతి కంద కందళము భోగైకాంతసారంబు యౌ
వనసర్వస్వవిశేషవిభ్రమకళాస్వాంతంబు విశ్వైకమో
హనశృంగారరహస్య మంగజవిజృంభావాహనాగ్రక్షణం
బు నరేశాత్మజచూడ్కి గ్రోలె నవు డాభూపాలసౌందర్యమున్. 170

కవికర్ణరసాయనము (3–67)

ఉ. ఆకమలాక్షిరూపమహిమాతిశయంబు మనోహరంబు భో
గైక పరాయణుల్ పురుషు లంగజుఁ డప్రతికార చేష్టిత
స్వీకృత లోకుఁ డట్లగుటఁ జేటు పురంబున వారి కెప్పుడుం

గా కెటులుండు నిట్టియవగాఢపుపొత్తు మసంగ వచ్చునే. 171

విరాటపర్వము (3—33)

సీ. ఎవ్వాని సత్యదావైకవిలాసంబు
లారూఢతరతులా పూరుషంబు 172

పారిజాతాపహరణము. (1–12)

శా. శ్రీకాశీనకరాధిరాజ్యపదవీసింహాసనాధ్యాసి లో
కైకగ్రామణి విశ్వనాథుఁడు విశాలాక్షీమనోభర్త సు
శ్లోకుం దొడ్డయ యల్ల భూవరతనూజున్ వీరభద్రేశ్వర
క్ష్మాకాంతుం జగనొబ్బగండని మహైశ్వర్యాన్వితుం జేయుతన్. 173

కాశీఖండము. (1–1)

ఓకారమునకు

శా. నీకంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
కౌకస్సంచయ కాళరాత్రిగళబద్ధోదగ్ర కాలాహి క
న్యాకారాగతమృత్యువుం జనకకన్యన్ వేగ మెప్పించి లో
కైకత్రాణుని రామునిం గనుము నీ కాబుద్ధి గాకుండినన్. 174

భాస్కరరామాయణము. (సుం. 450)

గీ. వీటిపెద్దతలారి నిస్సాటి కలికి
దిస్సమొలవేల్పు పార్వతీదేవిపట్టి
కాలభైరవుఁ గుర్కురగణ పరీతు
ననుసరించిరి మునులు నాకౌకసులును. 175

కాశీఖండము (2—38)

వికల్పయతి

ఆ. నల్కఁ గకారహల్లులమలతోఁ బొదిలి ది
జ్నగము దిగ్నగంబు నాఁగ, వాఙ్మ
నములు వాగ్మనములు నాఁగఁ గబ్బముల వి
కల్పయతులు రెండుఁ గలుగు నభవ ! 176

క. జ్ఞానంబు వడయుటకు వా
జ్మానములు సునిహితములు గావింతురు స
న్మానితశాంతికొఱకు వి
జ్ఞానంబున కాత్మనియతి సలుపుదురు బుధుల్. 177

శాంతిపర్వము (5–90)

వ. కడమవి ౹ఇలాగే తెలుసుకొనునది. 178

గీ. అమర నుద్ధతపదము పద్యముల నిలుపు
నపుడు వళు లిరుదెఱఁగుల నగుచునుండు
హరిమహోగ్రాహవాంగణోద్ధతుఁడు, శౌరి
దనుజసంపద్ధరణగుణోద్ధతుఁ డన, శివ ! 179

వ. ఇవియు వికల్పయతు లన్నారు. 180

అచ్చునకు

సీ. అరివీరభటమహోద్ధతి నబ్ధి గంపింప
దురమున నిల్చి తద్ద్రోహిఁ దునిమి 181

వసుచరిత్ర (1–44)

హల్లునకు

ద్విపద. అలఘుబలోదీర్ణు నాకుంభకర్ణు
తలఁ ద్రెవ్వ నేసి యుద్ధతి మించియున్న 182

రంగనాథరామాయణము

సీ. తరుణార్కకబళనోద్ధతి చూపె నెవ్వాఁడు
రుచులచే ఫలమోహరుచులచేత 183

వసుచరిత్ర (1–8)

అభేదవళ్లు

క. కృతుల పఫబభలు వాకున్
యతి నిలుప నభేదవిరతి యన్నగాఁ బరగున్

శతముఖముఖనిఖిలమరు
త్ప్రతతిస్తుతచారచరణవనజాత ! శివా ! 184

క. ఉరగకళేబర మంసాం
తరమునఁ బడి వ్రేలుచునికిఁ దలఁపక యచల
స్థిరుఁ డై పరమధ్యానా
పరతేంద్రియవృత్తి నున్న వాని శమీకున్. 185

ఆదిపర్వము (2–172)

ఉ. వారలు వారి భూరిపరివారముతోన విమాన మెక్కి రా
గా రఘునందనుండు గిరికాంచనతోరణచిత్రకేతన
ద్వారనికాయ మైన నిజపట్టణ ముత్సుకవృత్తిఁ జొచ్చి నిం
డారుముదంబునన్ భరతు నాకృతి వ్రాలినలీలఁ గౌఁగిలగన్. 186

ఉత్తరరామాయణము (1–84)

క. కోరి యనేకయుగంబు ల
పారతపోయుక్తు లైన వారికిఁ బడయం
దూరము నీసభ మఱి నీ
కారుణ్యం బంతకంటెఁ గడుద వ్వెందున్. 187

ఆరణ్యపర్వము (1–371)

వబయోరభేదమునకు

మత్త. ధీరు లాధృతరాష్ట్రపాండు లతిప్రశస్తగుణుల్ ప్రసి
ద్ధోరుకీర్తులు నాకు నిద్దఱు నొక్కరూప తలంపఁగా
వీరు వా రనునట్టిబుద్ధి విభేద మెన్నడు లేదు గాం
ధారిపుత్రశతంబునందు పృథాతనూజులయందునున్. 188

ఆదిపర్వము (8–29)

ఉ. నేఁటికి చెల్లెఁ గాక రజనీచరకోటికి నెల్లి నింకఁ బో
దాఁటి కవాటముల్ విరుగఁదాచుట చేతులతీట వోక మై
తీఁటలు వోవ రక్కసులఁ దీర్చుట రాముఁ డొనర్పకున్నె పెన్

వేఁటకు రావణాదిమృగబృందముఁ దార్చుట లంచుఁ దార్చినన్. 189

భాస్కరరామాయణము (యు.455)

క. పరిజనములకున్ నీకున్
ధరలోన సగంబె చాలు తక్కిన సగముం
గర ముచితంబుగఁ బాండవ
వరునకు ధర్మజున కిచ్చి బ్రతుకుము పుత్రా ! 190

ఉద్యోగపర్వము (2-245)

ఉ. వాలికచూపు మత్తవనబర్హికిశోరపులాస్యలీలపై
వ్రాలిచి పచ్చకప్పురపు వాసనతోడి ముఖారవింద తాం
బూలము మోవి మోవిపయి మోపుచు రాధిక కిచ్చు ధూర్తగో
పాలుఁడు బ్రోచుగావుత నపారకృపామతి మంత్రి యన్ననిన్. 191

భీమఖండము (1-3)

క. రలల కభేదం బని యి
మ్ముల్ఁ గొందఱు వసుచరిత్రమున లక్ష్యము ని
చ్చలగతి నారసి కలుఁగం
బలుకుదు రది యెల్ల కల్ల పర్వతనిలయా ! 192

శా. ఓలంబాలక యోలయోల యన నోలో లంచు మేలంబునన్
రోలంబాలక యోర్తు గ్రుంకి బిసవల్లుల్ దున్మి తూఁటాడి కెం
గేలం బూని తటాలున న్నగసె యక్షీణాంబునాధాంబుజా
క్షీలోకంబు జయించి వారల యశశ్రీఁ దెచ్చు చందంబునన్. 193

వసుచరిత్ర (3-66)

వ. అని రేఫ లకారములకు అభేదం చేసుకున్నారు. అది సరి కాదు. 'లోలం బాలక యోర్తు గ్రుంకి' యనవలెను. లో (న్)—నీళ్ళలోను, లంబాల యన్నఁగా విస్తారమైన యలకలు గలది యోర్తు గ్రుంకి అనిపాఠం సుష్టువు.

నైషధము. 'కేళాదిరాయ యభినవ

లీలామకరాంక చంద్రరేఖాంకురచూ
డాలంకార పదాంబురు
(హాలింగత సుఖితనిర్మలాంతఃకరణా) (1–110)

అని రేఫలకారాలకు అభేదం అనుకున్నారు. 'లీలామకరాంక చంద్ర లేఖాంకుర' అని (పాఠం సుష్ఠువు) రేఖా లేఖా శబ్దాలు రెండును గలవు. మరిన్ని వసుచరిత్ర

'రాయంచ కాళ్లఁదౌలకయమున్నె'

అనిపాఠం కల్పించుకున్నారు. 'రాయంచకాళ్ల దొరలక మున్నె' అని పాఠం సుష్ఠువు. ద్విరూపకోశమునందు 'మార్జారశ్చాపి మార్జాలో బిడారశ్చ బిడాలవత్, భవే ద్వాలశ్చ వారశ్చ, జలంచ జడమి త్యపి, రోలంబ శ్చాపి లోలంబో, రేఖా లేఖాపి కథ్యతే' అనిన్నీ, 'రీడా లీఢాచ కీర్తి తౌ' అనిన్నీ, 'తరుణీ తలునీతి చ' అనిన్ని, రోహిణీలో హినీతిచ' అనిన్ని కొన్ని శబ్దాలు ఉన్నవి అని తెలుసుకొనేది రేఫలకారాలకు మైత్రిలేదు. 4 194

ప్రభునామ యతి

ఆ. అమ్మ యక్క యప్ప యయ్య యన్నయు నని
పలుకుచోట, నిూదబడక పేళ్ల
నిరుదెసలను విరతు లెనయును బ్రభునామ
విరమణము లనంగ వృషతురంగ. 195

అచ్చుకు

మ. జయధాటీసమయంబులన్ విలయజంఝూమారుతాడంబరా

4.ము.ప్ర. లోలంబాలక యోర్తు గ్రుంకి యనఁగా — లో నీళ్లలోను, లంబాలక యనంగా — విస్తారమైన అలకలు గలది యోర్తు గ్రుంకి, యక్కడనే రోలంబాలక తుమ్మెదల వంటి అలకలు గలదని రేఫలకారములకు అభేదముఁ జెప్పచున్నారు. ఇటువంటి ప్రయోగములు మఱీ యెక్కడను లేవు. గనుక రోలంబాలక యనుపాఠము కాదు. లోలంబాలక యనియే చెప్పకొనునది. కనుక రేఫలకారములకు మైత్రిలేదు. నిఘంటువు: — 'సమో రోలంబ లోలంబౌ, రేఖా రే (లే) ఖాచకథ్యతే, తథా మార్జార మార్జాలే, తరుణీ తలునీతి చ' అనియు. 'కేళాది రాయ యభినవ లీలామకరాంక చంద్రలేఖాం కుర——–' అన్నచోట రేఖాంకుర మని నైషధమం దున్నదనుకొనిరి. 'రేఖాలేఖా చ కథ్యతే' అని ద్విరూపకోశమునందు చెప్పినాడు గనుక 'లేఖాంకుర' యని మూఁడో పాఠమే సిద్ధము.

క్షయరంహః ప్రవిజృంభమాణఘననిస్సాణోగ్రభేరీస్వనం
బయి యొడ్డాది భయంకరోద్దమర శౌర్యంబైన శ్రీరెడ్డి దొ
డ్డయ యల్లాడ నృపాలరాహుసకు విట్టల్లాడె దిక్చక్రముల్. 196

*కాశీఖండము* (1–29)

ద్విపద: శ్రీకరరుచిసాంద్ర చిరయశోరుంద్ర
ఆకారచంద్ర రామయభాస్కరేంద్ర! 197

*రుక్మాంగదచరిత్రము*—

మ. అమలోదాత్తమనీషమై నుభయకావ్యప్రౌఢి భావించు శి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమల ధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మన మంత్రికిన్ సుతుఁడఁ దిక్కా-ఖ్యుండసన్మాన్యుఁడన్. 198

*ఉత్తరరామాయణము* (1–13)

హల్లునకు

సీ. కూరిమితమ్ముఁడు గుంటూరివిభుడు కొ
మ్మన దండనాథుండు మహితకీర్తి 199

*విరాటపర్వము* (1–10)

మ. అనతారాతివసుంధరారమణ సపాంగాపహారక్రియా
ఘనసంరంభవిజృంభమాణపటుదోఃఖడ్గ ద్వితీయార్జునుం
డనవేమాధిపరాజ్యకార్యభరణవ్యాపారదక్షుండు పె
దన మంత్రీశుఁడు మామిడన్నసుతుఁ డేతన్మాత్రుఁడే చూడఁగన్. 200

*శృంగారనైషధము* (1–27)

విభాగవడి

ఆ. ఇచ్చె నృపుఁడు దోసెడేసి హొన్నులు నేబ
దేసిమణులు నెలమి ద్విజుల కనఁగ
సరివితో ప్రమాణసంఖ్యాపదములపై
నగు విభాగయతులు నగనివేశ! 201

హల్లునకు

గీ. నీవు చేసిన దోషంబు నీకె యుండె
దీర్ఘదోషంబు మాకు నింతేసి యేల
మొగమునం దున్న నీదైన్యముద్రఁ జూచి
కరుణ జనియింపఁ గాచితి ధరణినాథ ! 202

హరిశ్చంద్రోపాఖ్యానము (2–172)

అచ్చునకు

గీ. అప్పటికి నియ్యకొంటిగా కబ్జవదన
ఋషుల పాలిటివే యింత లేసి పనులు
కొసర క్కాఁబోతు న్నాఁబోతుఁ గ్రుమ్ములాడ
నడిమి లేఁబెయ్యదెస వచ్చె నాకు నిపుడు. 203

కాశీఖండము (2–104)

హల్లునకు

గీ. కొదవ సంపెగ పూవుల గుత్తి పుష్ప
లావి యొక్కతె శ్రీవత్సలాంఛనునకు
దర్శనం బిచ్చె వత్సయోధరము లింత
లేసి గలవని తెలిసెడు లీలతోడ. 204

రాధామాధవము (4–67)

అనునాసికవళ్లు

క. కవిసమ్మతులం గృతులం
టవర్గ చతురక్షరములు డాపలిసున్నం
గవసినయెడ నణలకు వళు
లవు నవి యనునాసికాఖ్యయుతులు మహేశా ! 205

క. బలవంతుఁ డైన వాలికిఁ
దలకుచుఁ గిష్కింధ వెడలి త్వరతో నలుది
క్కులకుం బారి మహీమ

డలమెలనుఁ జూచినాడ నాడు నరేంద్రా ! 206

భాస్కరరామాయణము (కిష్కింధ.616)

సీ. నిగమచోరకుని ఖండించినయలతయో
యబ్ధిలో గిరివేచినట్టి యలతొ 207

నూరన్నపరమయోగివిలాసము

ఉ. హస్తగృహీత పుస్తకమునందు లిఖించినయట్టినీల 5 కం
ఠస్తవముం బఠింపుచు ఘనస్థిరధీగుణవై భవోన్నతుల్
విస్తరిలంగ బాలకుల వేవురిలో సిరియాలుఁడొప్పె స
ధ్యస్తలిపిప్రపంచుఁడు గ్రహంబులలో నుడురాజుకైవడిన్. 208

హరవిలాసము (2–73)

శా. శ్రీరంగేశ్వరనాభిపంకజరజశ్శ్రీకంబెఁ జోళేంద్ర త
న్వీరాజత్కుచపాళి మంజరులకంటెన్ సహ్యభూభృత్తటీ
నీరంధ్రోజ్జ్వలగైరికద్రవముకంటెన్ వన్నె గావించెఁ గా
వేరీతోయము కృష్ణరాయఁ డహితోర్వీనాధరక్తప్రభన్. 209

పారిజాతాపహరణము (1–18)

## కాకుస్వరపడి

క. శోకభయసంశయాదులఁ
బ్రాకటముగఁ బ్రశ్నలందుఁ బ్రభవించు స్వరం
బే కాకు వందుఁ బొడముం
గాకుస్వరయుతు లనంగ, గర్వవిభంగా ! 210

మ. అనుమానింపక తోడబుట్టువుల కాదా దున్మి తూఁటాడ నెం
దును గొన్నెత్తురులేరు లై పరప నింద్రుం డుగ్రతన్ దైత్యులన్
మునుల న్వీరు భజింపరో క్రతువు లామోదంబుతో నమ్మహో

5. ము.హర. కం, ఠంప [illegible] ఘనఁబుగ ధీ గుణ...

తమ్మని జేయింపరా యుర్వ్యలోక మది కాదొ యేలడో నాకమున్. 211

శాంతిపర్వము (1-287)

ద్విపద. ఆట్టి నామీఁద నీవా యెదిర్చెదవు
పట్టి చట్టలు వాపి పారవైచెదను. 212

రంగనాథునిరామాయణము

ఉ. అక్కట యో గంధవాహ తగవా హరిణాంకునిఁ గూడి (పాంథులం
బొక్కఁగఁ జేయఁ బావకుని పొందొనరించి జగము లేర్చు నీ
యుక్కఱ గామి మాన వది యట్లిద; చుల్కనివృత్తి దుర్జనుం
డొక్కని జొచ్చి క్రిందుపడు నొడ్లకుఁ గీడొనరింపఁ గల్గినన్). 213

మనుచరిత్ర (3-50)

ఉ. అప్పుడు భీష్ము లేమి హృదయంబున నుమ్మలికంబుఁ గూరఁగా
నెప్పటిచందము ల్విడిచి యేడ్తెర దక్కిన చూపులొండొరున్
రెప్పలవ్రాటునన్ బొలయ నీసుతుపాలికి వచ్చు రాజులం
దిప్పు డితండు రావలువదే యని కర్ణుఁ దలంచి రందరున్. 214

ద్రోణపర్వము (1-14)

శా. ఏణీశాబకలోలనేత్ర కనుగొంటే వీరు విద్యాధరుల్
మాణిక్యోజ్జ్వలకర్ణకుండలులు సంబంధాసిధేనుల్ రణ
ప్రీణాపాణులు చంద్రికామలశిరోవేష్టుల్ త్రిపుండ్రాంకితుల్
నాణీయస్తనతారహారులు శివధ్యానైకనిష్ఠాపరుల్. 215

పారిజాతాపహరణము (2-91)

**నిత్యవడి**

క. విదితముగ నేని యనియెడు
పద మన్యపదంబుతోడ పద్యంబులలో
నడుకువెడ నిరుదెఱంగుఁ
బొదవున్ నిత్యయతి యన్నగ భుజగవిభూషా! 126

గీ. రాజవరుఁ డైన పార్థుతో రాజు గాని
యూత్రఁ డని సేయఁగాఁ దగఁడేని నీని
నెల్లవారలు చూడంగ నీక్షణంబ
రాజుఁ జేయుదు నే నంగరాజ్య మిచ్చి. 217

ఆదిపర్వము (6-48)

గీ. ఎట్టియపరాధ మొనరించెనేని తల్లి
కొడుకు శపియింప దిబ్బంగిఁ గ్రూరబుద్ధి
నతివ సత్యంబు చెప్పు మెవ్వతెవు నీవు
నాపుడును శాపభీతి నన్నలినన్నేత్ర. 218

కాశీఖండము (4-269)

రెండోవిధమునకు

వుత్త: మానితంబగు నాతపోమహిమం త్రిలోకపరాభవం
బేను జేయఁగఁబూని చేసితి నిట్టిదొక్క ప్రతిజ్ఞ మున్
దీని నెట్టులఁ గ్రమ్మరింతు మదీయభాషిత మెన్నడు
న్నేని మోఘము గాదు దిగ్ధరణీరవీందు లెఱుంగఁగాన్. 219

ఆదిపర్వము (7-142)

శా. వానప్రస్థునిఁ జంపి యొక్కవడితో స్వర్నాథుఁడుం బ్రుంగు ధా
త్రీనాథుం డన నెంతవాఁ డట విచారింపంగ నీకెంత నే
ర్పే నింపొప్ప శిరంబు వ్రక్కలయి తప్పెం దప్పె నీకృత్యము
జ్ఞానంబుం గడు నోడి చెప్పితివి పశ్చాత్తాపతప్తుండ నై. 220

భాస్కరరామాయణము (అయో. 337)

రికారవడికి

క. భావింప బుకారమునకు
రీవిశ్రమ మిడఁగఁజెల్లుఁ గ్రతులఁ గవీంద్రుల్
ధీవైఖరి విలసిల్లఁగ
భావజదుర్గర్వహరణ ! పర్వతశరణా ! 221

సీ. ప్రతిఫలించు చిగుళ్లపై నెట్టిబారిన
రీతి నున్నవి వీని మృదుపదములు. 222

మనుచరిత్ర (2-36)

సీ. ఋత్విజుం డని విచారించి పూజించితే
ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి. 223

సభాపర్వము (2—11)

శా. తృష్ణాతంతునిబద్ధబుద్ధులగు రాధేయాదులు న్వచ్చి శ్రీ
కృష్ణుం గేవలమర్త్యుగాఁ దలఁచి మర్దింపంగ నుత్సాహవ
ర్ధిష్ణుం డయ్యె సుయోధనుం డకట, ధాత్రీనాథ! యూహింపుమా
యుష్ణీషంబునఁ గట్టవచ్చునె మదవ్యాధోగ్రశుండాలమున్. 224

అథర్వణభారతము

సీ.గీ. రాయవేశ్యాభుజంగ వీరప్రతాప
భాసి యల్లాడనృపువీరభద్రనృపతి
సర్వసర్వంసహామహాచక్రభరము
పృథుభుజాపీఠమున సంభరించుటయును. 225

భీమఖండము (1-35)

చక్కటిపదులు.

క. అభినవగతిఁ గృతులం బు ష
బ్బభులకుఁ జక్కటి యనంగ మహాయతి నెల్లన్
బుభువిభునుతచరణాంబుజ
యిభదనుజవిభంగ! కుక్కుటేశ్వరలింగా 226

సీ. ఉరగవల్లీగాఢపరిరంభణంబులఁ
గ్రొక్కమ్మాకులసొంపు మురువుకొనఁగ 227

కాశీఖండము (1—91)

సీ.గీ. భువనబీజంబు కైవల్యమోక్షదాయి
యఖిలకల్యాణకారి విశ్వాద్భుతంబు

పూజ కొనియెను సురభి దంబుజభవాది
దేవతాకోటిచే సంప్రతిష్ఠఁ బొంది. 228

భీమఖండము (5–50)

గీ. పెక్కుమారులు వడివీచి ద్రెక్కొనంగ
వరలి వారిధిలోపల వైవ నతఁడు
ముక్తకేశాంబరోజ్జ్వలభూషుఁ డగుచుఁ
బడి రసాతలగతుఁ డయ్యె బలము దక్కి. 229

భాస్కరుని రామాయణము(యు 1 765)

గీ. అగరు లేలకివిరవాది యాకుతీఁగె
మల్లియలఁ గొజ్జగలు దాక మొల్ల మొగలి
మొదలుగా నివి యెప్పుడు బూచి కాచి
యుండు తోట లమీనుఖానుండు నిలిపె. 230

య. యాతిచరిత్ర (1–36)

క. అని యతని భ్రమయ నడచుచు
మును దత్పతి నిలిపి చనిన భూజముకడకుం
గొనిపోవ నచట నది లే
క నికిఁ బునశ్శోకవహ్ని నుల్ల మెరియఁగాన్. 231

భోజరాజీయము (5 61)

క. అల్లరి విటనాగరికులు
చిత్తములు వసంతకేలి చివురొత్తంగా
మొత్తములు గట్టి తరచిరి
ముత్యపుఁజల్లులకుఁ దోడి బూరట గొమ్మల్ 232

వసంతవిలాసము

ఉ. పరిచయముగాఁగ నేలె నిరపాయచరిత్ర ని శ్రుతుకానన
స్ఫురదురువీతిహోత్రుని సముజ్జ్వలమేరుసమానగాత్రునిన్
బరమపవిత్రునిన్ మునిసుపర్వవరను తిపాత్రుని న్మనో

హరఫలశేముషీకణశితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్. 233

శ్రీరంగమాహాత్మ్యము

## ననమాస నఞ్సమాస యతులు.

గీ. సరవి ననమాస నఞ్సమాసము కృతుల
నచ్చు హల్లులు రెంటికి నగును వళులు
నాకలోకాధిపప్రణుతాంఘ్రియుగళ
నాగకేయూర సంభృతానంతభువన! 234

గీ. మును వెఱతు నేయ మీరలు
నను వేసినఁగాని యనుడు నాకేశసుతున్
ధనురాచార్యుఁడు డెబ్బది
సునిశితబాణంబు లేసెఁ జాపము వెగడన్. 235

విరాటపర్వము (5-124)

గీ. ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్యవర్షంబు లన్ని మోదించు పార్థి
నాకభువనంబునం దాత్మనాథుఁ గూడి
వెలి పాకింతయు లేక చిచ్చులికె నేని. 236

కాశీఖండము (2-91)

ఉ. ప్రాకటదర్పులై సకలరాయని లక్కనృపాలు నాజిలోఁ
దాకు విరోధిసైన్యము ముదం బొదువన్ వరియింప వచ్చుచో
నాకస మెల్లఁ గ్రందుకొను నంచితదివ్యవిమానసంచర
న్నాకవిలాసినీచరణహంసకు భూరిరుణంరుణధ్వనుల్. 237

గవత్థాజు (ఆ. 3-158)

సీ. గీ. రాజసము తేజరిల్ల నీరాజుఁ గూడి
యింపుసొంపులు వెలయఁ గ్రీడింప వలదె

నాకలోకంబు వారలకైన లేని
యలఘుతరభోగభాగ్యముల్ గలఫలంబు. 238

విజయవిలాసము (1–71)

క. నీ కరవాలనిహతులై
నాకంబున కేగి రాజనారాయణ యా
భూకాంతు లెంతచనవో
నాకవిటోత్తముల చెంత నడతురు పేర్మిన్. 239

కావ్యాలంకార చూడామణి

నాస్తిశబ్దమునకు–హల్లునకు.

శా. ఆనిష్ఠానిధిగేహసీమ నడురే యాలించినం జాలు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలున్ దివ్యప్రబంధానుసం
ధానధ్వానము నాస్తిశాకబహుతా నాస్త్యుష్ణతా నా స్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవం చ కృపయా భోక్తవ్య మన్మాటలున్. 240

ఆముక్తమాల్యద (1–84)

అచ్చునకు

గీ. తల్లిదండ్రియు దైవంబుఁ దలఁప గురుఁడ
కాఁడె యతఁ డేమి చేసినఁ గనలఁ దగునె
నాస్తికాధమ యోరి యన్యాయవృత్తి
నాస్తి తత్త్వం గురోఃపరం బనఁగ వినవె. 241

శృంగారషష్ఠము

నఞ్ సమాసమునకు– హల్లునకు– (అనేకశబ్దమునకు)

ఉ. ప్రొగ్గెడు వాహనంబులును వ్రాములు ద్రెవ్వఁగఁబాఱు వాజులుం
డిగ్గి తొలంగు సైనికు లనేకులు కష్టపుపాటు వొప్పఁడన్
బ్రమగ్గు సిడంబులుం గులము మాటికి నెంచి యెదిర్చి యొంటిమై
ప్రమగ్గెడు వారునై కురుధరావరుసైన్యము రూపుమాయఁగన్. 242

కర్ణపర్వము (2–355)

చ మలచి పయోజకోశములమాడ్కి నొనర్చిన పద్మరాగపుం
గలపపు పెట్టిడాల్ బొమిడికంబులతో నవరంజి యోడుబి
ళ్లల నల వైజయంతము జలంబునఁ గెల్వఁగ దంసితంబు లై
సిలిచినమాడ్కి మాడువు లనేకము లుల్లసిలుం బురంబునన్. 243

*ఆముక్తమాల్యద* (1–52)

## అచ్చునకు

గీ. ఇవ్విధంబున మఱియు ననేకగతుల
లలితశృంగారచేష్టల లాచిలాచి
చూచుచున్నట్టి ప్రవరుఁ జూచి మునికి
మనసు గురగుర మనియె ఝుమ్మనియె నొడలు. 244

*కవులషష్ఠము*

గీ. చిత్తగింపు మనాదిసంసిద్ధమైన
యొక్కపుణ్యేతిహాస మనూనచరిత
శిశిరగిరిరాజసంప్రతిష్ఠితవిశుద్ధ
రత్నలింగేశ మహిమ విభ్రాజితంబు. 245

*కాశీఖండము* (6–168)

ఉ. ఆశ్రితపోషణంబున ననంతవిలాసమున న్మనీషివి
ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవి
ద్యాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహి నొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజనిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్. 246

*ఆదిపర్వము* (1–6)

## నిత్యసమాసపదులు

క. పదము విభజించి చెప్పఁగఁ
బొదవనిదియు నన శబ్దమున విగ్రహముం
గదియించునదియు, భుజగాం
గద ! నిత్యసమాస మండ్రు సుమతులగు నార్యుల్. 247

గీ. బాదరాయణ నారాయణాదులును, ప
రాయణ రసాయన జనార్దనాది శబ్ద
ములును వాతాయన పదంబు మొదలుగాఁగ
నలరు నిత్యసమాసంబు లగును నభవ. 248

వ. పీటిమీఁద వచ్చిన యతులు నిత్యసమాసయతులు. అచ్చు హల్లులు రెంటను వచ్చును 249

## నారాయణ శబ్దమునకు

ఉ. పాయక పాకశాసనికి భారతభారరణంబునాటి నా
రాయణునట్లు దానును ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దన కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునైన వాఁ డభిమతస్థితిఁ దోడయి నిర్వహింపఁగన్. 250

ఆదిపర్వము (1–25)

వ. ఈ పద్యములో అచ్చుహల్లులు రెంటికిని యున్నది. 251

## రసాయన శబ్దమునకు–హల్లునకు.

సీ. గీ. మట్టి మాత్రంబె పిల్లలమట్టి పేరు
పేరువలెఁ గాదు శారదాపీఠకంబు
వారిలోపల పినవీరు వాక్య సరణి
సరసులకు నెల్ల కర్ణరసాయనంబు. 252

జైమినిభారతము (1–22)

## అచ్చునకు

క. రాయంచలగుండె బెదరు
మాయామంత్రము విముక్తమానచ్యుతి క
త్యాయతమయూరకర్ణర
సాయన మను ప్రథమజలధరారవ మెసఁగెన్. 253

హరివంశము (పూ. 6.107)

## జనార్దన శబ్దహల్లునకు

చ. నగినగి యేనియున్ విను జనార్దన యెన్నఁడుఁ బొంక నల్కమ
త్యగణితవిక్రమోరుబలధైర్యసమగ్రుల మెల్లభంగిఁ గా
లగతి దలంగ ద్రోవగు బలం బగునే యగు గాక నీకు నె
చ్చ్పగ నిలఁ బ్రాణ మిచ్చెదము ద్రుక్కము చావున కాత్మనేనియున్. 254

*ఎఱ్ఱాప్రగడ అరణ్యపర్వము* (4–397)

## అచ్చునకు

చ. అపుడు విరించిసూనుఁడు జనార్దనునెయ్యపువాలుఁగంటిఁ జూ
చి పడఁతి నీమనోరమణుఁ జేకొను మిప్పుడు నీకు నిత్తు నా
నపరిమితప్రమోదభరితానన యై వెస నిచ్చె వేలుపుం
దపసికి రత్నభూషణవితానము లన్నియు నిశ్చయంబుగన్. 255

*పారిజాతాపహరణము* (5–88)

## వాతాయన శబ్దహల్లునకు

సీ. తరుణులుఁ బతులు వాతాయనంబుల నుల్ల
సులర వేఁబోకల మలయు పవన... 256

*విరాటపర్వము* (2–238)

సీ. తనయశోవిశదముక్తాసౌధపాళికి
నంబుదాయనవము వాతాయనముగ 257

*వసుచరిత్ర* (1–116)

గీ. స్వాంతవేదండమార్తాండసాంగములు గ
వాక్షకర్ణాట పదము లేకాంతశబ్ద
మరయ నాపోశనపదంబు నటులె రెండఁ
తెరఁగుల విరామముల కగు త్రిపురమథన! 258

వ. విశ్వామిత్ర శబ్దము యిటువలెనే నడుచును. 259

స్వాంత శబ్దహల్లునకు

ఉ. స్వాంతము బాహుగర్వఘనసంతమసాంధముఁ గాఁగ శంక యా
వంతయు లేక కీచకుఁ డహంకృతి ముంగిలి నాగమంటపా
భ్యంతరసీమఁ జొచ్చి దరియం జని యారసి సజ్జ గాంచి య
త్యంతమదావహం బగుడు నందుర యంబునఁ గేలు సాఁచగన్. 260

విరాటపర్వము (2—331)

అచ్చునకు

గీ. అధికరోషకషాయితస్వాంతుఁ డైన
నరపతికి విన్నవించకు నాయవస్థ
పైత్యదోషోదయంబునఁ బరుస నైన
జిహ్వకును బంచదారయుఁ జేదు గాదె. 261

శృంగార నైషధము (2—82)

ఉ. సంతతభక్తియుక్తిఁ గొనసాగకయుండిన నుండనిమ్ము దై
త్యాంతకపాదపద్మములయందు నోకానొకయప్పుడే నిజ
స్వాంతము దద్గుణాభిరతుఁ డై నరుఁ డెవ్వఁడు గీలు కొల్పువాఁ
డంతకుఁ దద్భటాళిఁ గలనైనను జూడడు భూవరోత్తమా ! 262

శృంగార షష్ఠము

వేదండశబ్దహల్లున

ఉ. పాండునృపాలనందనులు పావని మున్నుగఁ జేసి యట్లు భీ
ష్ముండు గడంకమై నడచు చోటికిఁ జక్కటి గాఁగఁ ద్రోచి యొం
డొండ కడంగి సేన తనయుబ్బున కుబ్బఁగ నన్యసైన్యవే
దండముఖాంగముల్ తృణవితానముగాఁ గొని నిర్వికారుఁడై. 263

భీష్మ పర్వము (1—234)

అచ్చునకు

మత్త: దండితాహితవీర సూరివిధాన దాననిధాన కో
దండపార్థ పరాక్రమప్రియధామదిక్పరిపూరితా
ఖండపాండుయశోనిధీ పరగండభైరవ వైరివే
దండతండవిదారిఘోరతరాసిభాసిభుజార్గళా! 264

ఆదిపర్వము (3–228)

**మార్తాండశబ్దహల్లునకు**

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె మార్తాండుండు కుంభీభవ
త్కిరణుం డయ్యె దిశావితానము వడంకెన్ మి న్నదర్చెన్ మహీ
ధరసంతానము లోలిఁ గ్రక్కదలె నుద్భ్రాంతంబులై యంబుధుల్
పొరలెన్ గట్టులమీఁద బిట్టుపిడుగుల్ మ్రోసెన్ మహోగ్రాగతన్. 265

ద్రోణపర్వము (5–377)

**అచ్చునకు**

సీ.గీ వలువదు భయంబు వా రెంతవారలైన
నట్టివారలు మన కగ్గమైనవారు
వారు నిరయంబునకు గాఁపువచ్చువార
లనుచుఁ బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు. 266

శృంగారషష్ఠము

**సాంగశబ్దహల్లునకు**

సీ. సాంగంబు లగుచున్న సకలవేదంబులుఁ
జదివె వశిష్ఠుతో సకలధర్మ...... 267

ఆదిపర్వము (4—169)

ఉ. హంససమానగామికిని నట్టివినూతనగర్భశుద్ధికిన్
బుంసవనాది కృత్యములు భూపశిఖామణి యార్యసంపదా
శంసితకర్మకర్మఠత సాంగముగా నొనరింప నవ్వియో
త్తంసుఁ గుమారుని న్గనియె దర్పకు నిందిర గన్నకైవడిన్. 268

శృంగారషష్ఠము

**అచ్చునకు**

ఆ. సకలకురుకుమారచాపశిక్షాచార్యుఁ
డాజి దుస్సహుండు సాంగవేద
వేది, నీతిశాస్త్రవిదుఁడు (దివ్యాస్త్రకో
విదుఁడు సుజనహితుఁడు విమలబుద్ధి). 269

విరాటపర్వము (5–118)

ఆ. సాంగవేదవేది యగుపురోహితుఁ డెవ్వఁ
డగర మేల వలయు దగవుఁ గృపయుఁ
జక్కటియును గల్గి సముచితప్రనములు
నరుల నరయఁ బనుచు నతివిభుండు. 270

శాంతిపర్వము (2—298)

వ. సాదర సాంబ శబ్దములఁను నీలాగే నడచును.

క. ఇది బ్రహ్మ వశిష్ఠునకున్
సదయుం డై చెప్పె, నతఁడు సాదరమున, నా
రదునకు విదితము చేసిన
వ.దాత్మకుం దేటపఱచె మహనీయకృపన్. 271

శాంతిపర్వము (6—69)

క. ఈదృశశుభగుణాకల్పున
కాదిమభాగవతహితసమంచితచర్యా
హ్లాదితఫణితల్పునకున్
సాదరజల్పునకు సత్యసంకల్పునకున్. 272

వరాహపురాణము

ఆ. సాంబుఁ బాయఁ మనుచుఁ జారుదేష్ణుం డేగి
వేగవంతుఁ దాఁకి వీఁకతోడ
(వానిమస్తకంబు వ్రయ్యంగ వడి గదం
బొడిచె రుధిరవారిపూర మొలుక). 273

అరణ్యపర్వము (1—159)

గవాక్షశబ్దహల్లనకు

చ. వనిత యొకర్తు మున్గాని గవాక్షతలంబుల నింతు లుండుటం
గనుఁగొనఁ జోటులేమి నొకకార్యముపేరిట బాల నోర్తు వం
చనఁ దొలగంగ నిల్పి రభసంబునఁ దత్పతిజాలకంబు చే
కొని హరిఁ జూచెఁ గేకిసలు గొట్టుచు బోటులు దాని నవ్వఁగన్. 274

పారిజాతాపహరణము (3—13)

### అచ్చునకు

చ. అపుడు సమీరచోరుఁడు గవాక్షపుఁ గన్నపుగండి దూరి య
త్యపరిమితాతిఖేదపరితర్పితకోమలమంచక స్వప
చ్చపలవిలోచనావదనసౌరభవిత్తము దోఁచు బల్మి నీ
విపినము చేర వెంటఁ గుయి వెళ్ల మదాళిభటప్రతాపముల్. 275

ద్వాదశరాజ చరిత్ర

### కర్ణాట శబ్దహల్లునకు

మ. కుసుమం బద్దిన చీరకొంగు వొలయం గ్రొవ్వారు పాలిండ్లపై
దిసరంబు ల్పొలుపార వేణి యవటూ దేశంబుపై రాయఁ గా
పస నెవ్వండొ యొకండు రాత్రి సురతప్రౌఢిం దనుం దన్పిన
న్వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం గంటిరే. 276

శ్రీనాథుని వీథి నాటకము.

### అచ్చునకు

శా. లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీగీతకళాసరస్వతి కళింగాంతఃపురీ మల్లికా
వాటీమంజరి గౌళవామనయనావక్షోజహారాళి యై
పాటింపందగు నీయశంబు ధరణీపాలాగ్రణీ సాహిణీ. 227

భాస్కర రామాయణము (కి. 831)

శా. ఘాటీఘోటకరత్నఘట్టనమిళద్ధాషిష్టకల్యాణఘం
టాటంకారవిలుంఠిలుంఠితమదోన్మత్తాహితక్షోణిభృ
త్కోటీఢౌకితకుంభినీధరమహాకూటాటవీఝూటక
ర్ణాటాంధ్రాధిప సాంపరాయని తెనుంగా ! నీకు బ్రహ్మాయువౌ. 278

శ్రీనాథుని చాటుధార

### ఏకాంత శబ్దహల్లు

గీ. కామభోగమ్ములకును నేకాంతగృహము
పాలిచి పాలిచియు ధర్మార్థములకు నిదియొ

యాస్పదంబు సవర్గ్యతయావిరుద్ధ
లైనఁ జనుటంతయును నొప్ప నప్పరంబు. 279

**ఆదిపర్వము** (8—74)

సీ. ఊర్ధ్వలాంగూల మత్యున్నతధ్వజలీలఁ
గ్రాలుచుండంగ నేకాంతయోగ
నిద్ర నున్న ధర్మనిర్మలు హనుమంతు... 280

**ఆరణ్యపర్వము** (3–319)

శా. కాంతల్ శుక్తిమతీనగేంద్రభవముక్తారత్నరాజిం దదే
కాంతస్వచ్ఛశరీరయుక్తి నగజాకల్యాణవేళార్హస
త్కాంతుల్ నించిరిగాక కానియెడ లోకశ్లాఘ్యసౌభాగ్యవ
త్కాంతాలోకమణిన్ మణీశతముచేఁ గైసేయఁగా ముగ్ధలై. 281

**వసుచరిత్ర** (5–123)

**అచ్చునకు.**

శా. ఎంతయు వృద్ధులై తమకు నీ వొకరుండవె తేపగాఁగ న
త్యంతముదంబునన్ బ్రదుకు తల్లినిఁ దండ్రిని నుజ్జగించి ని
శ్చింతుఁడ వై సదాధ్యయనశీలత వారి యనుజ్ఞ లేక యే
కాంతమ యిమ్ముల న్వెడలి తక్కట! నీవు గరంబుఁ గ్రూరతన్. 282

**ఆరణ్య పర్వము** (5–120)

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర! యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియ గాక (నీ వెఱుఁగనే మును వచ్చిన త్రోవచొప్ప, నీ
కింత భయంబులే కడుగ నెల్లిదమైతిమె, మాటలేటికిన్) 283

**మనుచరిత్ర** (2–41)

చ. అంతట పారిజాతకుసుమాగతనూతనదివ్యవాసవల్
వింతలు సేయఁ దావి యిది విస్మయమంచు ముసుంగు ద్రోచి యే
కాంతగృహంబు నల్గడల నారసి (సంభ్రుతతాలవృంతునిన్
గాంతునిఁ జూచి బాష్పకళికాతరళీకృతలోచనాంతయై). 284

**పారిజాతాపహరణము** (1–110)

ఆపోశన శబ్ద హల్లునకు

గీ. ఎసఁగఁ బ్రాతిక నోగిరం బిడకమున్నె
యతిరయంబునఁ బరిషేచ మాచరించుఁ
దత్తరమున నాపోశన మెత్తఁబోయి
భూసురుం డెత్తు నుత్తరాపోశనంబు. 285

కవులషష్ఠము

గీ పోసిరా యెల్లవారి కాపోశనంబు
నారగింపుఁడు లెండు మీ కమృత మస్తు
ప్రొద్దు వోయింది సుండని బుజ్జగించి
మ్రొక్కె నంజలి యెత్తి యమ్ముదుకపడఁతి. 286

శ్రీమఖండము:(2–138)

వ. అచ్చునకు సులభము.

విశ్వామిత్రశబ్దహల్లునకు.

మ. హరకోదండవిఖండనుండు జనక క్ష్మాధీశుజామాత భా
స్కరవంశాగ్రణి జానకీప్రియుఁ డుడు విశ్వామిత్రయాగాహితా
సురసంహారి (విరాధకాలుఁడు ఖరాసుధ్వంసి, మారీచసం
హరుఁ డన్యాప్రమదాపరాఙ్ముఖుఁ డయోనాయకుం డాదటన్.) 287

భాస్కరరామాయణము (సుందర.263)

ద్విపద : చని మహాతేజు విశ్వామిత్రుఁ గనిన
గనుఁగొని పలికె నా గాధినందనుఁడు 288

రంగనాథ రామాయణము

సీ. నన్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁ డతిఘోర
తపము సేయంగఁ దత్తపము పేర్మి 289

ఆదిపర్వము (4–36)

సీ. ఈ మచక్ర మెల్ల విశ్వామిత్రమునిశిఖా
మణికి నర్పించిన మంచిదాత 290

హరిశ్చంద్రోపాఖ్యానము (4–227)

ద్విపద : అని చెప్పి వీడ్కొల్పి నచ్చోటు వాసి
జననాథుఁ డరుగ విశ్వామిత్రుఁ డెలిఁగి 291

హరిశ్చంద్ర కథ

**అచ్చునకు**

ద్విపద : ఎక్కడ గురుఁ డని యెఱుఁగంగ నీకు
నక్కడ గురుఁడు విశ్వామిత్రుఁ డయ్యె 292

రంగనాథ రామాయణము

వ. మఱియును.

ద్విపద : అవధారు, దేవ! విశ్వామిత్రమౌని
తివిరి వాకిట నేగుదెంచియున్నాడు. 293

రంగనాథ రామాయణము (పు. 19)

మ. తన సామ్రాజ్యము బాసినం గులవధూత్యాగంబు వర్తించినం
దనయుం డీల్గిన హీనకృత్యముల చేతన్ దుర్దశం బొందినన్
వనటం గుందిన నా నరేంద్రుఁడు మనోవాక్కాయకర్మంబులం
దనృతం బాడిన నాప్రతిజ్ఞ, విను, విశ్వామిత్ర! చిత్రంబుగన్. 294

హరిశ్చంద్రోపాఖ్యానము (1–108)

ద్విపద : పటురయంబునఁ గూడఁ బఱచి యారాజు
నటు చననీక విశ్వామిత్రుఁ డనియె. 295

హరిశ్చంద్ర కథ

క. అక్షౌహిణి యనినను మఱి
యక్షౌహిణి యనఁగఁ గృతుల నౌత్పాత్యంబుల్
లాక్షణికులు యతు లిడుదురు
దక్షాధ్వరభంగ! పాణితల సారంగా! 296

### అక్షౌహిణి

సీ. సందడింపుచు దశాక్షౌహిణి సైన్యంబు
అనిశంబు గొలగొల మనుచునుండ 297

జైమినిభారతము (1-84)

### అక్షౌహిణి

క బాహుబలఘనుఁడు భీముఁడు
సాహసరసికాత్ముఁ డైన సాత్యకియు మహో
గ్రాహవభూమి సహస్రా
క్షౌహిణు లట్లగుట మీరు చూడరె యెందున్. 298

ఉద్యోగ పర్వము (1-236)

క. జ్ఞాకు నకారము విరమణ
మై కొందరి కృతులయందు నలరుచునుండున్
లోకావనవిలసత్ప్ర
జ్ఞాకౌశలనిఖిలదివిజనాయక! శర్వా! 299

గీ. "అప్రసిద్ధము జ్ఞలు శబ్దాదియందు
జ్ఞాజసంయుక్తి తద్భవవ్యాజముసను
నణలతోఁ బొందు విరతి యాజ్ఞప్తి యనఁగ,
జలరుహాదరాశితులు సుజ్ఞాను లనఁగ.

వ. అని అనంతుఁడు (1–12) చెప్పినాడు. అందుకు ఉదాహరణము. 300

ఉ. సూనులు నల్వురం బడసె సూరిజనస్తుతసత్యభారతీ
జ్ఞానులు పద్మగర్భవదనంబులు నాలుగు బోలు వారిలోన్ 301

పావులూరి మల్లన గణితము (1–7)

క. శ్వానమునకుఁ జండాలున
కైనను నాకొన్న నిడఁగ నగు నన్నము దు
ర్మానసుఁ డై పెట్టకయు
జ్ఞానంబునఁ గడపెనేని నరకమునఁ బడున్. 302

రుక్మాంగద చరిత్రము (2–68)

వ. ఇది యతి ప్రకరణం బింక శబ్దప్రకరణం బెఱింగించెద. 303

## శబ్ద ప్రకరణము

క. పూవు పువు పువ్వు పూ యన
మామిడి మావిడి యనంగ మావి యనంగా
దౌవు దవు దవ్వు దౌ యన
గా వెలయుం గృతులయందు గౌరీరమణా! 304

### పూవు

శా. ఆ వామాక్షిమనోహరాకృతి యమోఘాస్త్రంబుగా భూవరున్
లావణ్యాధికు నిచ్చలంబు మెయి గొల్వం బూని యిందిందిర
జ్యావల్లీకిణకర్కశం బయిన హస్తం బుద్ధతిం జాచి వే
పూవుందూపులజోదు పుచ్చుకొనియెం బుండ్రేక్షుకోదండమున్. 305
శృంగార నైషధము(1-79)

### పువు

క. శ్రవణావతంస మయ్యెను
ధవళాయతనేత్రగణము ధరణీపతికిన్
శ్రవణావతంస మయ్యెను
పువువింటిగుణంబు నపుడు పుష్పాస్త్రునకున్ . 306
శృంగార నైషధము

క. ఇవ్విధమున దానముఁ గొని
చివ్వలయోగిరపుఁదపసి చెట్టుసు గూడఁ
బువ్వుల సరులం జుట్టిన
యవ్విభునిచెరంగు విడిచి యల్లన నగుచున్. 307
పారిజాతాపహరణము (5-84)

### పూ

సీ. పసుపుఁగమ్మలతోడి కుసుమపూవన్నియ

నిద్దంపుఁబుట్టంబు నెఱికగట్టి. 308

కాళీఖండము (7-5)

### మామిడి

ఉ. మావిడి మోక క్రింద నిగమత్రితయార్థసమృద్ధిఁ బార్వతీ
దేవికుచంబులం బదను దీర్చనికస్తురిముద్రగా జగ
జ్జీవనకారణం బయిన శ్రీనిధి కంచిపురీశ్వరుండు మా
దేవయసెట్టినందనుని తిప్పఁ గృతార్థునిఁ జేయుఁగావుతన్. 309

హరవిలాసము (పీఠిక-2)

### మామిడి

సీ. మినుములు పెసలు మామిడి తాండ్ర టెంకాయ
అల్లంబు తమలపుటాకుకట్లు 310

రుక్మాంగద చరిత్ర (3-6)

చ. (ఒక చిగురాకుఁ గొమ్మఁ బిక, మొక్కప్రసూనలతాగ్రసీమఁ దేం
ట్లొకఫలశాఖ రాచిలుకయున్ రొదసేయఁగఁ గాడ్పుపొందు వా
యక పయి వెన్నెలల్ పొలయ నామని సొంపుల నింపుజొంపమౌ)
నొకయెలమావి క్రింద మరుఁడో యనఁగా నరుఁ డుండె నయ్యెడన్. 311

విజయ విలాసము (1-147)

### దౌవు

ఉ. నావుడు వాయునందనుఁడు నందన పొమ్ము చమూవధూటి నీ
కైవసమైన లెస్స యటుగాక నినుం దలమీఁటెనేని దౌ
దౌవున నిల్పి మద్ఘనగదాపటువిక్రయతాడనంబులం
జేవ యడంచు నెందు గురుశిక్షగఁ దా నుతిగాంతు రంగనల్. 312

జైమిని భారతము (2-51)

### దవు దవ్వు

క. శివనింద సేయు పాతకు
దవు దవ్వులఁ జూచి తొలఁగఁ దగు శైవులకున్
శివనిందాపరుపలుకులు

చెవియొగ్గి వినంగవలదు శివభక్తులకున్. 313

కాశీఖండము (6-286)

## దౌ

ఉ. సందడి యధ్వరక్రియ కసంగతి మేనిబలంబుతోడ బెన్
గ్రందడి యేల మేన తగఁ గొర్మ్మకహస్తుఁడనై కడంగి మీ
ముందర నిల్చెదన్ గ్రతువు ముట్టక యుండఁ బ్రపంచదైత్యరా
జిం దెగ దవ్వ దౌల వెసఁ జించెదఁ బెంచెద మీకు మోదమున్. 314

ఎఱ్ఱాప్రగడ రామాయణము

క. కేళాకూళి యనంగా
కేళాకుళి కేళకుళియుఁ గీర్తింపఁ గెళా
కూళియు ననఁ దగుఁ దీర్ఘిక
నాళీకభవాదిదివిజనాయక! భర్గా! 315

## కేళాకూళి

మ. బలుకప్రంపుటనంటికప్పురపుఁదిప్ప ల్గప్పి యుప్పొంగు జా
ల్గల కొజ్జంగుల నీరు సజ్జకపు కేళాకూళికిం డిగ్గఁ త
జ్జలసూత్రంబులు వ్రాకి తుంపురులుగా జారున్ నిదాఘాంశు నా
వళి వీడ్కొన్న తమంబుఁ గాంచి వనిలో వర్తిలు మంచో యనన్. 316

వసుచరిత్ర (1-139)

## కేళాకుళి

సీ. కేళాకుళులలోని కెందమితూఁడులు
వింతగా నజా నెక్కిరింత నసుర 317

శ్రీరంగమాహాత్మ్యము (4-998)

సీ. సారమై హినుజలా సారమై పూదేనె
నెరయఁ గేళాకుళుల్ నింపవలదు 318

వసుచరిత్ర (1-141)

### కేళకుళి

గీ: అంబుధులు కేళకుళులు కులాచలములు
మేడ లౌచక్రగిరి చుట్టు గోడ గాఁగ
నవనిఁ బాలించె శుద్ధాంతభవనమట్లు
కీర్తిలక్ష్మికళత్రుఁ డాక్షితివరుండు. 319

కవికర్ణరసాయనము (2–56)

### కేళాకూళి

సీ. కుక్కుటేశ్వరు కేళాకూళి నుద్భవమైన
మణికర్ణిక నొనర్చు మజ్జనములు 320

భీమఖండము (3–189)

క. మోసల యన మొగసా లన
మోసాల యనంగఁ గావ్యములఁ బలుకఁదగున్
వాసిగఁ దలసావిడికిన్
వాసవముఖనిఖిలదివిజవంద్య! మహేశా! 321

### మోసల

ఉ. (అద్రివిజాధినాయకుని యానతి సేయుము, చితవృత్తి నొం
డెద్దియునుం దలంపకు, మహీనపరాక్రమ నీతిశాలి నీ)
ముద్దుమఱంది కుఱ హరిమోసలఁ గార్యభరంబుఁదీర్పఁగా
గద్దియమీఁద నుండి త్రిజగంబుల నేలుకొనంగఁ నొల్లవే! 322

శృంగారనైషధము (3–127)

### మొగసాల

సీ. మొగసాల నున్నారు జగతీసుపర్వులు
గ్రాసార్థు లగుచుఁ బెక్కండ్రతిథులు 323

కాశీఖండము (4–105)

### మోసాల

సీ. డుంఠివిఘ్నేశుఁ డుండు ప్రదేశ మీక్షించి
లోలార్కునగరిమోసాల వెదకి 324

కాశీఖండము

క. వాలెము కృతులం జెల్లను
వేళమ వైళం బనంగ, వేఁడీ యేఁడీ
మీాలన మీాను లనంగా
జాలంధరములు, నిశాటసంహరణ ! శివా ! 325

## వేళము

ఉ. వ్రేసిన వ్రేటునం బడక వేళమ దాటి పిటీంది కంటి బా
హా సముదాయ మధ్యమున కర్కశతనూభవునిం దగుల్పడన్
జేసికొనంగఁ జేర్చి కడుఁ జిక్కఁగఁ బట్టి సురారి నేలకున్
వ్రేసిన వెంటనే యెగసి వ్రేసెఁ దటాలునఁ జెంప లాతఁడున్). 326
రామాభ్యుదయము (7–250)

## వైళము

ఉ. అంగముతోడఁ గట్టు మీఁక యజ్ఞవిఘాతక చోరు నెందు వో
వంగలవాఁడ వింక నిటు వైళమ తాపసవేషధారివై ......... 327
ఎఱ్ఱాప్రగడరామాయణము

## వేఁడి

క. ఓడితిమె యేము రణమునఁ
గ్రీడికిఁ గేడించిరాక గెలుపే యతఁడున్
వేఁడీ డాగెనొకో మా
తోడి బవర మిట్లుఁ దానుఁ దొలఁగం జనునే. 328
ద్రోణపర్వము (1–374)

## ఏకి

శా. ఈక్షోణిన్ నినుబోలు సత్కవులు నేరీనాటికాలంబునన్
ద్రాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న

ధ్యక్షించున్ గవిసార్వభౌమ ! భవదీయప్రౌఢసాహిత్యముల్). 329

తాళీఖండము (11–14)

### మీలు

సీ. మగమీల నగఁజాలు తెగఁగీలుకొనువాలు
కనుఁగవ కొకవింత కాంతి యొదవె.........  330

పారిజాతాపహరణము (1–56)

### మీనులు

చ. కొలఁకులు చేరవచ్చి యనుకూలతటంబుల నిల్చి ముగ్ధ ల
య్యలికులవేణు లయ్యెడ నిజావయవప్రతిబింబ శోభగాఁ
దలఁపుచు నుల్లము ల్పొదలఁ దప్పక చూడదొడంగి రందులో
జలజములన్ మృణాళములఁ జక్రయుగంబుల గండుమీనులన్. 331

కవికర్ణరసాయనము (4–41)

క. కొమ యనఁ గొమ్మ యనంగా
బొమ యన బొమ్మ యన మఱియుఁ బొరపర యనఁ, గా
వ్యములఁ బ్రయోగింపందగుఁ
గుముదహితార్యమరథాంగ ! కుక్కుటలింగా ! 332

### కొమ

సీ. ఎల్లెడలఁ జదలేటి యిసుముచే నచ్చర
కొమ లిడు వెన్నెలకుప్ప లనఁగ 333

పారిజాతాపహరణము (2–37)

క. కమలముల నుజ్జగించుం
గుముదంబుల బుజ్జగించుఁ గొమచూపులు పు
న్నమచందమామ వెన్నెల
కొమరంతయుఁ బుడికిపుచ్చుకొనఁ జాలుసుమీ ! 334

విజయవిలాసము (1–133)

వ. కొమ్మ సులభము. 335

బొమ

సీ. జగము లొక్కుమ్మడి సాధింప నెత్తిన
రతిమన్మథులవిండు లతివబొమలు 336

*శృంగారనైషధము* (2–15)

బొమ్మ

చ. బల బల వేగ రేపకడఁ బంకజదీర్ఘిక దీర్థమాడు, నె
చ్చెలులును దాను నిందుముఖి శేషవిభూషణుఁ బూజసేయు ని
చ్చలుఁ దెలిగన్నులున్ మొలకచన్నులు బొమ్మలు మీఁద వ్రాలు కుం
తలములుఁ జూచి పౌరులు మనంబుల నువ్విళులూరుచుండఁగన్. 337

*కాశీఖండము* (5–144)

వ. పొర సులభము. 338

పర

సీ. బొమలు కన్నుల మీఁద బొదలి వ్రాలకమున్న
పరనేత్రముల కడ్డపడకమున్న. 339

*కాశీఖండము* (3–85)

ఆ. ఇంపెసంగఁ గృతుల సంపంగి సంపెంగ
సంపెఁగయును మఱి సంపఁగియును
కొమరు మీఱ మఱియు గొజ్జెంగ గొజ్జెంగి
గొజ్జఁగియు ననంగఁ గూడు నభవ! 340

సంపంగి

సీ. గీ. నాతి చన్నుల వ్రేగున నడుము వడఁక
నధిపు వాతెర తెల్లనా కందుకొనుచు
పసిఁడిగిన్నియలోని సంపంగినూనె
వనిత దల యంటెఁ దనప్రాణవల్లభుండు. 341

*చిత్రభారతము*

సంపెఁగ

ఉ. కంపనలీలమ్మై వసదుకౌ నసియాడఁ గుచద్వయంబు న
ర్తింప లలాటరేఖ చెమరింపఁగ హారలతాగుళుచ్ఛముల్
తుంపెసలాడఁ గంకణమృదుధ్వని తాళగతిం జెలంగఁగా
సంపెఁగనూనె యంటెఁ నొక చంద్రనిభానన కంసవైరికిన్. 342
పారిజాతాపహరణము (2–9)

గొజ్జెంగ

గీ. బహుళకస్తూరికామేఘపటలమునకు
శీకరాసార మయ్యె గొజ్జెంగ నీరు
వలుద వడగండు లయ్యె నవ్వర్షమునకు
కామినులు చల్లు కర్పూరఖండవితతి. 343
భీమఖండము (5–124)

గొజ్జంగి

గీ. దేవకి యొసంగఁగా వసుదేవుఁ డపుడు
చంద్రకాంతపు గిండి గొజ్జంగినీట
పసిడిపళ్లెంబులోఁ బదాబ్జములు గడిగి
తనదు మేనల్లునికిఁ గన్యధార వోసె. 344
విజయ విలాసము (3-111)

గొజ్జఁగ

ఉ. గొజ్జఁగనీరు చల్లె నొకకోమలి యొక్కలతాంగి త్రిప్పె లా
మజ్జక తాలవృంత మొకమానిని (చందనకర్దమంబునన్
మజ్జన మాచరించె గుచమండలి, నొక్కవధూటి యెంతయుం
బుజ్జన మొప్పఁ బాదములఁ బుప్పొడి యొత్తె విదర్భకన్యకున్). 345
శృంగారనైషధము(2-140)

సీ. మలయజోదరత జంభలఫలత్వగ్గత

క్రీమించు చెవుల గొజ్జెగలు మెఱయు 346

ఆముక్తమాల్యద (5–143)

ఆ. ఈల్గుటయును బోర నీల్గుట యిలుగుట
నెగయుటయును మింటి కెగయుటయును
నంటునంటునాఁగ నమ్మిక నమ్మిగ
బదుకు బతు కనంగఁ బరఁగు శర్వ! 347

### ఈల్గుటకు

గీ. ఎడమ క్రిందుగఁ గాశిలో నీల్గ నట్టి
మశకశిశువున కోంకారమం త్రరాజ
మభవుఁ డుపదేశ మొనరింప నమరకోటి
సిగ్గువడుచుండుఁ దమ వృథాజీవములకు. 348

కాశీఖండము (3–99)

### నీల్గుట

క. వడి నవుడు గఱచి వలకేల్
విడుచనచ గొనయమునఁ బెనచి నీల్గి బలం బే
ర్పడ విల్లు వంచ నోపక
యుడిగిరి నృపసుతులు గొంద ఱొయ్యన లజ్జన్. 349

ఆదిపర్వము (7–176)

### ఇలుగుట

క. బలవిక్రమఘను లగు దొర
లిలిగిన మనసేన మేదినీశ్వరు విన క
న్నులు చెడినట్లున్నది యూ
కొలదిం బొరిగొనుట నరునకున్ సుకర మగున్. 350

శల్యపర్వము (1–51)

### నెగయుట

గీ. క్షుద్రవేయులు భూమియుఁ గైకొనంగ
నురగలోకంబు వెడలి తత్పరిఘనీట

నెగసి తోడన క్రుంకుదుర్ నిలువ లేక
తత్తటీబద్ధగారుత్మతముల కలిమి. 351

ఆముక్తమాల్యద (2–7)

ఆ. కర్మబంధనములు గ్రక్కునం బాయుడు౯
పుణ్యగతికి నెగయు పురుషు నట్లు
బంధనంబు లెల్లఁ బాయుడు భీముండు
నీటిలోన నుండి నెగయుదెంచె. 352

ఆదిపర్వము (5–173)

క. నెఱకలు విచ్చుచుఁ దుండము
దెఱచుచు వ్రేగడరి సొగసి త్రెళ్లి వివశుఁడై
యుఱచిన నోడకు మని హరి
నెఱి చక్కఁగఁద్రోచి యెత్తె నెగయఁగఁ గృపతోన్. 353

ఉద్యోగపర్వము (3–301)

నంటు

క. ఇంటికిఁ జనుటయు మానెన్
నంటొనరింపంగఁ జాగె నాగరికలతో
కుంటెనకాఁడులఁ గూడెన్
గొంటరియై యతఁ డసాధుగోష్ఠీపరతన్. 354

కవులషష్ఠము

గీ. తొలుదొలుతఁ గృష్ణవర్త్మకుఁ గళ యొసంగి
నంటు గావించు టెల్ల ననాథయువతి
జనతనూదాహసాహాయ్యమునకుఁ గాక
కానవా వారి నెవ్వారిఁ గములవైరి. 355

వసుచరిత్ర (4–36)

నమ్మిగ

క. తగుమాట లాంబికేయుం
డగు నని గైకొనునె యెన్నఁడైనను గొడుకుల్

మగటిమి గల రనియెడు న
వ్విమ్మగఁ జూచుచు నుండు విషము ద్రింగినయేనిన్. 356

ఉద్యోగపర్వము (1–315)

క. మగఁ డింక నన్నుఁ బ్రేచునె
తెగవిడుచుం జంపుఁ గాక తెల్లము మదిన
వ్విమ్మగ బుట్టునె యిది చెప్పిన
మొగమోటన మనవునుండి మూసితిఁ జపలా ! 357

హరివంశము (పూ. 5–225)

బదుకు

గీ. మునులు నజుఁడు మున్నుగ మహామూర్తి విష్ణు
నుదురుదేశంబు సొత్తురు బదుకు గోరి...... 358

హరివంశము (పూ. 1–161)

సీ. వదనచంద్రునిఁ జొచ్చి బదికెడు చీకట్ల
గతి నవశ్మశ్రు రేఖలు జనించె 359

కవికర్ణరసాయనము (1–58)

బతుకు

మ. రతికిన్ భారతికిన్ వినోదకథలన్ బ్రాగల్భ్యము ల్చూపి త
త్పతులం గూరిచి మాట వాసిగను పెద్ద ల్గారె మీవార లా
చతురత్వం బిటు నేఁడు గానఁబడ నీచంద్రాననం గూర్చి నన్
బతికింపంగదె ముద్దుకీరమ ! సుధాబంధూభవద్గీరమా ! 360

విజయవిలాసము (2–184)

క. అలకము లలక లనంగా
పులకలు పులకము లనంగఁ బొసగఁగఁ గృతులన్
బలుకనగు సుకవివరులకు
జలజాతభవార్చితాంఘ్రిజలజ మహేశా ! 361

అలకములు

క. వరమకుటరత్నకిరణ

స్ఫురణ ప్రతిఘట్టనమున భుగ్నాగ్రములై
మరలు తనుద్యుతులను మతి
నెరపె సుపర్వులకు విభుని నిటలాలకముల్. 362

కవికర్ణరసాయనము (6–131)

సీ. నిటలాలకము లంట నివురు జుంజుంమ్మని
ముఖసరోజమునకు ముసరు దేంట్లు 363

అష్టమస్కంధము (104)

**అలకలు**

ఉ. కామిను లన్నగాత్మజకుఁ గల్పకభూరుహదత్తకోమల
క్షౌమము గట్టనిచ్చి యలకల్ దడియార్చి విరుల్ ఘటించిఁ ము
క్తామణిభూషణంబు లిడి, గంధ మలంది, వెలందియానతిం
దాము సలంకృతాంగు లయి దర్పకరాడ్భజనాదరంబునన్. 364

వసుచరిత్ర (3–166)

సీ. వదనంబు కొమరు భావనఁ జేసి నేరుగ
నుదుటిపెం పౌకలఁ బొదఁవఁబడఁగ 365

విరాటపర్వము (1–228)

**పులకలు**

సీ. తనువు మైఁద్రీఁగెకుఁ దావలంబుగఁ జేసి
పులకల జిత్తంబు నెల వెఱింగి 366

ఉత్తరరామాయణము (8–72)

గీ. తనువు పులకలఁ బ్రోవుగ మనము గాఢ
సంభృతానందముగ శరాచార్యసుతుఁడు
వితతసంభ్రమముఁ డై వేది వెడలి చాగి
మ్రొక్కి లేచి ఫాలమ్మున మోడ్పుఁ గేలు. 367

సౌప్తికపర్వము (1–130)

**పులకములు**

ఉ. చిప్పిలు చెక్కుపై చెమట చిత్తరులన్ గరపల్లవంబునన్
గప్పుచుఁ జన్నుఁగవ పులకంబులు పయ్యెద నొత్తి యొరగఁ

ద్రిప్పిన మోము వంచి జగతీవరు చిత్త మపాంగ దృష్టిచేఁ
దప్పక చూచి రాజసుతఁ దానును జిత్తరువయ్యె నత్తరిన్. 368

*కవికర్ణరసాయనము*

క॰ చొటు చోటనఁ, బొద పద, యొు
క్కొటి యొుక్కొటి, పొలతి పొల్తి, గణుతింపఁగఁ జె
న్నఁటి చెనఁటి యనఁగ నొప్పం
గుటిలాహితమదవిభంగ! కుక్కుటలింగా! 369

చొటు

క. కటకట పేరిన పెన్నె
త్తుటఁ జొత్తిలియున్న మోముతోడం గొడు కె
చ్చటఁ బడియున్నాఁడో య
చ్చొటుఁ జూపెడువారు లేరె చూచెద వానిన్. 370

*ద్రోణపర్వము* (2–251)

మ. స్ఫుటభూయోహ్వతిశంకవార్ధి నినరశ్మిల్ మున్ను జేర్పం దటి
చ్చటు లౌర్వంబుగఁ గారుకొంచు ఘనమై క్ష్మాలీల వర్షింప న
చ్చొటునం దోఁచి గ్రసింపఁ బోలుఁ గలశీసూనుండుఁ గా కున్న నొ
క్కొటఁ దారాగ్రహభాస్కరేందుమణిశుక్తుల్ వ్యక్తమై తోఁచునే. 371

*ఆముక్తమాల్యద* (4–145)

వ. ఇందులో చొటు అనిన్ని, ఒక్కొట నిన్ని రెండు లక్ష్యము లున్నవి. 372

## చోటు–పొద

సీ. నుతతపస్స్వాధ్యాయరతులకుఁ గర్తవ్య
మచ్చోటు నాకేల యనుడు వరుణు
పురిఁ గుంభ గైకొను పొద మన్న మునిఁ జూచి 373

*అనుశాసనికము* (4–70)

క. రదనిం గొను మచ్చోటుం
బొద ప్రాజాపత్యలోకమున కనవుడు నా

కదియేల యశ్వమేధుల
పద మనియెం బతి తపస్విపతి యాతనితోన్. 374

వ. కడమ సులభము. 375

ఒక్కొటి

గీ. కొడుకు తమ్ములుఁ దోడ్పడఁ గడఁగి శత్రు
కోటి గెల్చెద నంటి యొక్కొరుఁడు దక్క
కుండ నీతమ్మకుబ్జిల నూచముట్టు
గొనియెనే విధి యేగతి నొనరఁ జెపుమ. 376

శల్యపర్వము (1-28)

క. పాండవులవ లన్ గీడొ
క్కొండును లే దధిప నీకు కొడుకులు ధరణీ
మండల మంతయు గ్రమింగిరి
పాండున్పపతి భాగమునకుఁ బాపిరి వారిన్. 377

స్త్రీపర్వము (1-83)

సీ. గొడుగుఁగాఁ బడగ లొక్కొటి పట్టుదగఁ దొట్టి
భుజగాధిపతి మీఁద బుస్సు రనఁగ 378

పాండురంగమాహాత్మ్యము

మ. అనుమానం బది యేల నీమది మదీయస్ఫారబాహాబలం
బు నిరూపింపఁదలంచితేని విను మేపుం జేవయుం జూపఁ గృ
ష్ణుని తోడ్పాటునఁ బేర్చి యేఁ గడఁగినం జూర్ణంబు గావించు నొ
క్కొ నిమేషంబున దేవదానవులతోఁ గూడం ద్రిలోకంబులన్. 379

ఉద్యోగపర్వము (4-424)

పొల్తి

చ. చెలువుగ నానవాబ్జముల చేరువఁ గుంతలభంగమాలికల్
మెలఁగ వళీతరంగముల మీఁద ఘనస్తనచక్రయుగ్మకం
బులు విలసిల్లఁ గూడుకొని పొల్తులు పద్మిని వారిపొంత సొం
పొలయఁగ వేడ్కమై నరిగి రొండొకపద్మినిఁ బోలి లీలతోన్. 380

ఉత్తరరామాయణము (8-45)

చ. తడయక కౌరవానుజ్ఞుఁడు దాని పిఱుందన పారి యింక నె
క్కడి కరుగంగవచ్చుఁ జాలకం జనుదె మ్మిటు సౌబలుండు ని
న్నొడిచె దురోదరంబునఁ గురూద్వహు నర్థమవైతి నిన్నునుం
బుడమియుఁ దమ్ముఁ గోల్పడిరి పొల్తి భవత్పతులైన పాండవుల్. 381

నభాపర్వము (2–214)

చెన్నఁటి

ఉ. ప్రోడవు గాన నీపలుకు పోలదు కాదనరాదు గాని యా
వీడని తాపవేదనల వేగెడు చెన్నఁటి మేనఁ బ్రాణముల్
గూడి వసింప నోర్వ నిదిగో చనుచున్నవి యేల ప్రీడయుం
గ్రీడయు నాకు హారమును గీరము చూతము గీతముం జెలీ. 382

కవికర్ణరసాయనము (3–112)

క. నినుఁ దాచి కుటిలభావం
బున దుష్టచరిత్ర నైతి ముక్తుల తెరఁగే
వనితా యిది యే బలువర
చిననైనను మానవలదె చెన్నటి చూపుల్. 383

శాంతిపర్వము (6–185)

ఆ. దక్కె డక్కె నన్నఁగ దబ్బర డబ్బర
దాపి డాసి యనఁగ దప్పి డప్పి
1దాగి డాగి యనఁగ దాపల డాపల
దొప్ప డొప్ప యనఁగ నొప్ప నభవ ! 384

వ. దిగ్గి డిగ్గి యనిన్ని కలదు. 385

2"క. డక్కె నని కాని చెల్లదు

1. ముద్ర. దిగ్గి డిగ్గి యనఁగ తిని దాగి డాగి, దా
పలను డాప లనఁగఁబరఁగు నీశ.

2. ముద్ర. డక్కె ననికాని చెల్లదు దక్కెనుద్ర
మోగ వంచు వచించె నింపొదవ ముద్ద
రాజు రామన్న, యదియథార్థంబు గాదు
రెండుఁ గల వెన్నఁ గృతుల, గౌరీకళత్ర!

దక్కె నను ప్రయోగ మబ్జదళనేత్రునకున్
జక్కెఅవిలుతునికేళికి
డక్కరి పసిగాపు తెగ మిటారు లనంగన్". (1-112)

అని ముద్దరాజు రామన్న చెప్పినాఁడు గాని రెండున్ను గలవు. ఉదా
హరణము దక్కెననుటకు— 386

మత్త: దేవమూర్తులు పాండుపుత్రులు ధీరచిత్తులు వారి పెం
పీ వెఱుంగని వాఁడవే ధరణీశ! వాయుసుతుండు గాం
డీవియున్ భుజవిక్రమప్రకటీకృతుల్ వివిధాస్త్రవి
ద్యావిశేషులు వైరివీరులు దక్కనిత్తురె పోరులన్. 387

ఆరణ్యపర్వము (1-46)

ఉ. ఎక్కటివోలె రుద్రునికి నేమిటఁ దక్కువ ఫల్గుణుండు వాఁ
డొక్కఁడ యయ్యెనే జగము లొక్కట మ్రింగఁగఁ జాలుఁ గేశవుం
డెక్కినవాఁడు వాని నొగ లేల బలం బని యెంత చెప్పినన్
దక్కెడు రాజ్యలోభము మదంబున నాకొడు కేమి సేయుదున్. 388

ద్రోణపర్వము (3-25)

దక్కు

ఉ. డక్కెను రాజ్యమంచు నకటా యిట సోదరరాజ్యభాగ మీ
వెక్కటి మ్రింగఁ జూచె దిది యేటికి డక్కును మీను లోలతం
గ్రక్కున నామిషంబు చని గాలము మ్రింగిన చాడ్పు నువ్వె యి
ట్లుక్కిఁవుడైన నీకొడుకు నుల్లమునం దిటు లోర యుండినన్. 389

ఉద్యోగ పర్వము (2-52)

ఉ. అక్కట మందభాగ్యునకు నట్టి తనూభవరత్న మేటికిం
డక్కె విధాత నిర్దయుఁ డొడంబడునే కడు మేలివస్తువుల్
పెక్కుదినంబు లున్కి నరిబృందము పిల్చిన పోటుబంటనై
యక్కడి కేల పోయితి మహాగుణభూషణుఁ గోలుపోయితిన్. 390

ద్రోణ పర్వము (2-240)

## దబ్బర

ఉ. గాళకు లాపురీభటశిఖామణు లెక్కటి యుక్కుతున్క లా
ఖీలతరాశనుల్ చిదిమి పెట్టిన బంటులు వైరికల్ల బే
తాళుఁడు వచ్చి డగ్గరిన దబ్బరగా దొక దెబ్బతీయఁగాఁ
జాలుదు రేమి చెప్ప ధరణీ సాధన మేలును సాహసంబులున్. 391

విజయ విలాసము (1–10)

## దబ్బర

గీ. తల్లి బడికొర్ది చెట్టంచు నుల్లసంబు
లాడుదురు నన్నుగూర్చి ని న్నహరహంబు
దుర్నయుం బెల్ల నామీఁద ద్రోపి జనులు
డబ్బరలు పల్కువారి కడ్డంబు గలదె. 392

కాశీఖండము (4–96)

## దాయుట

ఆ. వలను చూడ కొండు వగవక యెప్పటి
యట్ల గుడుచుచున్న నలిగి బకుఁడు
వీని బాస చూడ వే రంచు డాసిన
తరువు వెఱికి కొంచు దాయవచ్చె. 393

ఆదిపర్వము (6–295)

## డాయు

ఉ. అనియుని యుగ్గడించు ధృతి యల్లల నాడఁగఁ దల్లడిల్లఁ బై
కొనఁ దల యొారగించు మదిఁ గోర్కులు పేర్చిన నప్పళించు నె
ట్టన తగ నచ్చటన్ జనులు డాయఁగ రాఁ బరికించి బుద్ధి మా
లిన వెస నెంతయుం గళవళించు మనోజవికారమగ్నుఁడై. 394

విరాట పర్వము (2–31)

## డప్పి

గీ. అభవుఁ డే రీతి తాండవం బాడి డస్సి
డప్పిగొని యారగింప కాండంబు వెదకి

కానఁడయ్యెను సప్తలోకంబులందుఁ
దియ్యనై జిహ్వకింపైన తేటనీరు. 395

కాశీఖండము (5–131)

ఉ. డప్పి జనించె నంగుళిపుటంబులు పొక్కఁ దొడంగె గోళ్లు సుం
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు (చిత్తము నాకుఁ గడున్ వశంబుగా
దప్పర మిచ్చటచ్చటను నాసల వచ్చితి నెంత దవ్వొకో
యిప్పటిభంగి నొక్కడుగు నేఁగెడు దానికి నోర్వ నెమ్మెయిన్.) 396

విరాటపర్వము (1–148)

ఉగ

క. జగముల నెల్లను గ్రింగెడు
జగదంతరమౌళివామచరణం బిడి పె
ల్లగు రోగజరాభరములు
దిగవిడువం జెల్లె నీకుఁ ద్రిభువనదీపా ! 397

అరణ్యపర్వము

డిగ

చ. డిగకుఁడు వాహనంబులు కడింది మగంటిమి గోలుపోవ మీా
రు గడఁక డక్కి పెట్టకుఁడు రూపర నాయుధముల్ (మహాస్త్ర శ
క్తి గెలుతు గోత్రభిత్కులిశతీవ్రశరంబులనైభవంబు భూ
రి గదవిహారభంగయు నరిప్రకరంబులు పిచ్చలింపఁగన్.) 398

ద్రోణపర్వము (5–381)

దాగి

క. వేమారుఁ గ్రుచ్చి గ్రుచ్చి పు
డేమో యడిగెదవు నీ కొకించుక మనసా
భూమీశు మీాఁదఁ గలదో
తామరసదళాక్షి ! నాకు దాచక చెపుమా ! 399

విజయ విలాసము (2–172)

డాగు

సీ. జనని యూరుప్రదేశంబున నతి నిగూ

థంబుగా నార్చ్వండు డాగుటయును 400

విరాటపర్వము

క. పవనజుఁ డొక్కఁడె పెరపాం
డవులును సాత్యకియు హరియు డాతురె యుగ్రా
హవమునఁ బ్రాణము లావును
నవిజేయులు వారిఁ దొడరనగునే తనకున్. 401

ద్రోణపర్వము (4–208)

డాపల

సీ. డాకాలిగండపెండారంబు దాపున
బొమ్మలై వైరిభూభుజులు వ్రేల 402

కాశీఖండము (–145)

వ. దొప్ప డొప్ప అనిన్ని కద్దు దొప్ప సులభము. డొప్ప యనుటకు 403

సీ గీ. కోరమీసలు మిడిగ్రుడ్లు కురుచపొడవు
డొప్పచెవులును గొగ్గిపండులును గలిగి
(యున్నమద్దీవుఁడై వచ్చుచున్నవానిఁ
గలిమహారాజుఁ గనిరి దిక్పాలవరులు.) 404

శృంగారనైషధము (7–93)

క. అక్షత లక్షతములనన్
లక్షింపఁగ లాజ లనఁగ లాజము లనఁగా
నీక్షితిఁ గృతులం జెల్లును
శిక్షితరిపు దానవేశ! శ్రీగౌరీశా! 405

అక్షతము

ద్విపద: బంధుర దక్షిణ ప్రవర వేదికకు
గంధపుష్పాక్షతల్ కరమొప్ప నునిచి 406

రంగనాథరామాయణము

## అక్షతములు

గీ. గురుజనోక్తవిధానానుకూల బాల
నిజవివాహవిలాసంబు నిర్వహించె
భోజుఁ డప్పుడు వేడ్కతో బుధసతీవి
తానములతోడ నార్ద్రాక్షతములు జల్లె. 407

ఇందుమతీకల్యాణము

గీ. అహిమభానుఁడు చనుదేర నస్తశిఖరి
సరవి నర్పించు కుంకుమాక్షతము లయ్యె
పరిసరాతపసంధానభాసమాన
శిఖరసానుఝరోద్ధూతశీకరములు. 408

కవికర్ణరసాయనము (4–68)

## లాజలు

చ. దనుజనిరోధిమీఁద నొక తన్వి కరంబున లాజ లెత్తి చ
ల్లిన నెటివేణి యాసునఁ బలెన్ విరివిప్పువ్వులు చల్లెఁ (జల్లె లో
చనములు సమ్మదాశ్రువులఁ జల్లె లలాటము ఘర్మబిందులన్
జనుఁగవ సల్లె సంభ్రమవశత్రుటితాములమౌక్తికావళుల్). 409

పారిజాతాపహరణము (3–19)

ఉ. కంకణనిక్వణంబు మొగకట్టఁగఁ గౌ నసియాడ రత్నతా
టంకవిభూషణంబులు వడంకఁ గుచంబులు రాయిడింపఁగాఁ
బంకజనేత్ర గౌతమునిపంపున లాజలు దోయిలించి ధూ
మాంకునియందు వేల్చె దరహాసము రెప్పలలోన డాపుచున్. 410

శృంగారనైషధము (6–102)

## లాజములు

ఉ. పౌరపురంధ్రు లిట్లు వసుపార్థివుఁ గన్గొన వచ్చి మంగళా
చారమనోజ్ఞలాజములు చల్లిరి (సింధుభవావివాహదీ
క్షారమణీయమూర్తి యగు శౌరిపయిం గలశాబ్ధినిర్మలో
దారతరంగరేఖలు సుధాలవము ల్వెదచల్లు కైవడిన్). 411

వసుచరిత్ర (6–17)

ఆ. రక్తమాంససహిత భక్తపిండములను
లసితలోహితార్క్యలాజములను

పురము బలి యొనర్చ పురగయక్షాసుర
ప్రముఖభూతములు శుభంబు లొసఁగు. 412

అను గానసికపర్వము (4–30)

క. అబ్బుర మబుబుర వ్రబం
బబ్బురము నటంచుఁ గవుల యనుమతి వలనన్
నిబ్బరముగఁ బలుకందగుఁ
గబ్బంబులయందు, నవలకన్యారమణా ! 413

అబ్బురము

గీ. రాజవీధుల నొసఁగు నీరాజనములు
కటకవా రెచ్చరింప నక్కటికభూమి
వందిజనములు వొగడఁ జెల్వొంది మిగులఁ
బురము సొత్తెంచె విజయుఁ డబ్బురముగాను. 414

విజయవిలాసము (1–156)

అబుబురము

చ. 1తబిసివి గానఁ జావునకుఁ దప్పితిగా కిది వేఁటపంతమా
యబుబురపుం దెఱంగునఁ బరాటవికాయతచాపవల్లరీ
నిబిడశరాహతం బగు వనేచరజంతువు నొక్కఁ డీగతిన్
సబముపయి న్నిగుడ్చునె నిశాతశిలీముఖ మెట్టి వె ట్టివో. 415

హరవిలాసము (7–55)

అబ్రము

ఉ. విన్నన నేగు తామరలవిందు కిలాతపు నీడ లెప్పుడున్
వెన్నెల రాచరాలఁ గని వెళ్ళని నీళ్ళ మునింగి యున్న పీ
మన్ను లటంచుఁ జెంచెతలు మాటికిఁ దూఁపుల నేసి నాటమిన్
మిన్నక చూచి యబ్రపడి మెల్లన పోపుదు రిళ్ళపట్టుకున్. 416

యయాతిచరిత్ర (2–39)

1. ము. హర. మబసరపుందెఱంగున..............జంతువునేసిపీగతిన్

అబ్బరము

గీ. తప్పకుండఁగఁ బక్షపాతంబు లేక
1పంచిపెట్టెఁడు వార లబ్బరము గాన
యన్నదమ్ముల మైయుండి యకట మేము
మిమ్ము మము మీరు వంచింప మేర యగునె. 417

హరవిలాసము (6–114)

క. మొనసి నీచ వృద్ధ మూర్ఖ శబ్దంబులు
నీచు వృద్ధు మూర్ఖు నెరయ నీచుఁ
డనఁగ వృద్ధుఁ డనఁగ నను వొప్పు మూర్ఖుఁడు
నాఁగఁ దనరు కృతుల నాగహార! 418

నీచ

క. అనిపలికిన పలుకులకుం
గన కోపము గదిరి నీచు గావున యుంకిం
చినఁ గాని మెత్తఁబడి పొం
డని మనమునఁ దలఁచి యిట్టు లనియెం బెలుచన్. 419

విరాటపర్వము (2–54)

ఆ. విదురుఁ డిట్టులనియె నిది యొక్క కార్యంబుఁ
గాఁగఁ బూని యిందు రాఁగఁజనునె
దుష్టబుద్ధి నీచు దుర్యోధనుండు నీ
మాట వినఁడు దురభిమానధనుఁడు. 420

ఉద్యోగపర్వము (3–233)

వృద్ధ

క. వృద్ధులోక లక్ష యున్నను
బుద్ధియె యెవ్వరికి వారి బూజింపంగా
నిద్ధరణీశులలో గుణ
వృద్ధని పూజించితిమి ప్రతివిక్రమ బుద్ధిన్. 421

సభాపర్వము (2-27)

1. ము హర. వంచిపెట్టెడు వారలబ్బరముగాన

## మూర్ఖ

చ. అవినయబుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్యమ యంటి నీవు మూ
ర్ఖవు శిశుపాల యింకఁ బలుకన్ వలసెన్ సభలోన నున్న యీ
యవనిపులెల్ల నాతనిదయం బ్రవిముక్తులు వానిచేత నా
హవజితులుం దదీయశరణార్థు లుగాఁ గొరులయ్యె చెప్పవమా. 422

సభాపర్వము (2–24)

క. వేయి వెయి వెయ్యి వేయనఁ
గోయిల కోవెల యనంగఁ గొమరొప్పంగా
నేయి నెయి నెయ్యి నే యనఁ
బాయక కబ్బముల నిల్చు, పర్వతనిలయా ! 423

## వేయి

ఉ. వేయిగజంబు లుండఁ బదివేలు తురంగము లుండ నాజిలో
రాయలఁ గూర్చి సజ్జనగరంబునఁ బట్టము గట్టినట్టి యా
రాయకళింగగంగు నరిరాయభయంకరుఁ జూడవేడ్క నేఁ
బోయెద మీనమాసమున పున్నమ పోయిన షష్ఠి నాటికిన్. 424

శ్రీమకవిచాటుధార

## వెయి

క. లెక్కలు పెట్టఁగ వచ్చుం
జుక్కలుఁ దద్భక్ష్యభోజ్యచోష్యాదుల క
మ్మక్క మఱి లెక్క యెక్కడి
దక్కడి యొక్కొక్కకడి వెయాఱులు సేయున్. 425

బహుకావ్యచరిత్ర (4–51)

## వెయ్యి

క. అయ్యారే చెలు వెక్కడ
నయ్యారే గెలువఁ జాలు నంగజునారిన్
వెయ్యారులలో సరి లే
రయ్యా రుచిరాంగరుచుల నయ్యంగనకున్. 426

విజయవిలాసము (1–38)

గీ. (స్మరశిలీముఖ కుసుమకేసరపరాగ
ధూళిపాళిక చుళుకించెఁ దూర్పుదిక్కు)
నింతి వేగన్నులను గాన్నఁ డింద్రుఁ డిపుడు
నీవిలాసంబు పెంపు వర్ణింపఁ దరమె ! 427

శృంగారనైషధము (4–25)

## కోయిల

ఉ. ఆయెలనాగవేణి మెఱుఁగారు కటారికి మాసటీఁడగుం
బో యనవచ్చు' నయ్యలరుబోఁడి పిరుందు సమస్తభూమికిన్
రాయలనంగవచ్చు, నలరాజనిభాస్య యెలుంగుఁ గట్టురా
కోయిలకంచుకుత్తుకలకుం బయకాఁ డనవచ్చు, నెచ్చెలీ ! 428

విజయవిలాసము (1–119)

## కోవెల

సీ. ఎలమావి కొన యెక్కి 1తెలతెలవార్చి కో
వెల పోటు కూకలు వెట్టెనేని 429

రాజశేఖరచరిత్ర (3–80)

ద్విపద: నేయి కల్లును దేనె నెత్తురు పెరుగు
పాయసాన్నమును దర్పులు ప్రవాళములు 430

రంగనాథరామాయణము

## నే

క. నావుడు సంజయుఁ డిట్లను
దేవా పాండవులయలుక ధృష్టద్యుమ్నుం
డేవరవు మాటనైనన్
నే వోసిన నగ్నివోలె నిగుడంజేయున్. 431

ఉద్యోగపర్వము (2–243)

వ. కడమవి సులభము. 432

1. ము. రాజ. పెళ పెళవార్చి......

ఆ. ఎగ్గు నెగ్గు నాఁగ నేలిద మెల్లిదం
బనఁగఁ జామరములు నటులె చామ
రలు ననంగఁ గృతుల నలరొందు ననిశంబు
భవభయప్రణాశ ! పార్వతీశ! 433

## ఎగ్గు

గీ. పుష్పఫలపత్రజలమాత్రముల శరీర
యాత్ర నడుపుచు సన్మార్గ మధిగమించి
యొసఁగు నివియెల్ల నీకేల యెగ్గు దలఁచు
వనిత యావంత యావంత వలువదమ్మ. 434

వసుచరిత్ర (3–128)

## నెగ్గు

గీ. చెప్పకుండినఁ గోపించి చిషిక యెత్తి
చూలు కరుగగంగ వ్రేయంగఁ జూచె గురుఁడు
వేల్పు లాయిందుముఖి జేరిఁ వెఱక చెప్ప
నిజము చెప్పిన మఱి నీకుఁ నెగ్గు లేదు. 435

కాశీఖండము (4–227)

## ఏలిదము

క. బాలుఁ డని నమ్మి రిపుతో
నేలిదముగఁ గలసి యునికి యిది కార్యమె యు
త్కీలానలకణ మించుక
చాలదె కాల్పంగ నుగ్రశైలాటవులన్. 436

ఆరణ్యపర్వము (6–117)

## ఎల్లిదము

క. తొల్లిటి వలె సేవకుఁ బోఁ
జెల్లునె మావారె పెండ్లిఁ జేసెద రిదిగో
యెల్లిదమ యంచుఁ బల్కితి
నెల్లిద మగుఁ గాదె నొరిగి యేఁ బైకొన్నన్. 437

విజయవిలాసము (3–22)

చామరము

ద్విపద: కోమరొప్ప నొఱపు చేకొని యిరుగడల
రమణులు వింజామరంబులు వీవ 438

రంగనాథరామాయణము

చామరలు

క. ఎడపక కూలు గొడుగులం
బడగలు జామరలు గలయఁబడి మూర్ఛితులై
పడియెడు దొరలకు మునుము
న్నెడఁగూడెడు మెత్తబరపు నెఱవు వహించెన్. 439

కవికర్ణరసాయనము (2—199)

శా. సారథ్యంబు వహింప భీముఁడు సితచ్ఛత్రంబు గాండీవి చె
ల్వారం బట్టఁగ జామరల్ కవ లిడన్ హారిప్రభంబయ్యె న
త్త్రేరం దేవురు నగ్నిపంచకము వేదిం బోల్చు నట్లొప్పి రం
భోరాశిధ్వనిఁబోలెఁ దూర్యనికరంబుల్ మ్రోసె నొక్కుమ్మడిన్. 440

శాంతిపర్వము (1—349)

గీ. రమణతో నాంధ్రనామసంగ్రహమునందు
చెయివులకు చైవు లంచు వచించెఁ బైడి
పాటి లక్ష్మణకవి, యది పాటిసేయఁ
దగదుగద కబ్బముల, మహీధరశతాంగ! 441

చెమవులు

శా. ధారాస్ఫారక ఘోరవృష్టి కమలధ్వంసంబు వాటిల్లినం
జేరం జోటొక యెందుఁ గానక భ్రమం జెయ్వేది భృంగావలిం
గారామార్గఁగ నుద్ధరించెఁ బొగడంగా నొప్పదే నాఁగ నిం
పారెం బ్రస్ఫుట కందలీకకఫలీపామోది కాంతారముల్. 442

హరివంశము (పూ. 6—112)

సీ. మరువక పూనె మైమఱపు వరూధిని
చెయివులన్నియుఁ దక్కఁ జిత్రరేఖ 443

వసుచరిత్ర (5—14)

శా. స్వింగంబుల్ మునిబాలకుల్ దిరుగుచుం జెయ్వేది మోదించు సా

రంగంబుల్ దిరుగం దపోవనసతుల్ రాజీవముల్ గోయుటల్
(రంగద్వీచులఁ బద్మముల్ మెఱయ ధర్మప్రీతిమైఁ జూచుచున్
గంగాతీరము కానలోనఁ దిరుగంగాఁ గౌతుకంబయ్యెడిన్. 444

ఉత్తరరామాయణము (8—89)

ఆ. తొడిగి తొడి యనంగఁ దోడ్కొని తొడుకొని
యొప్పుటయును మఱియు నొప్పుటయును
ననఁగఁ గృతులఁ జెల్లు నహిరాజకేయూర
దురితదూర పీఠపురవిహార ! 445

వ. తొడిగి యనుట సులభము. 446

**తొడి**

ఉ. వీఁక నెదిర్చి యిట్లు కురువీరులకుం బ్రమదం బొనర్చుచుని
దాఁకిన క్రోధవేగసముదగ్రత నెఱ్ఱనిచూడ్కిఁ జూచి పే
రాఁకలి తోడ నున్న జమునాకృతి భీషణరేఖ యొప్పఁగా
వ్రేకని నారసంబు తొడి క్రీడి కడున్ దృఢముష్టి నేసినన్. 447

విరాటపర్వము (5–193)

గీ. వేడఁ దొడిపూసి కట్టి యువ్విరటుఁ డుత్త
రుండుఁ దోఁజను దేరఁ గొల్వుండు బుద్ధి
(నచటి కేతెంచి కని విస్మయంబు నొంది
యెల్లిదంబుగఁ దలఁచుచు నిట్టులనియె). 448

విరాటపర్వము (5–317)

క. ఆయుధము విడిచియుండఁగఁ
సాయకగురు మీరుచూడఁ జంపిన కష్టో
పాయుని ధృష్టద్యుమ్నుని
మాయించియు కాని తొడిన మరు వే నూడ్వన్. 449

కర్ణపర్వము (2–130))

సీ. ఉనికిఁ గృష్ణునిచేత విని పూసి తొడి కట్టి
కొలు విచ్చి మణిహేమకుంజరాశ్వ 450
శాంతిపర్వము (1–346)

వ. తొడుకొని యనుట సులభము. 451

## తొడుకొని

చ. ముడిగి ముసుంగుతో వెనుకముందును జూడక వచ్చి లోనికిం
దొడుకొని పోయి వ్రేల్మిడిన ద్రొచ్చిన బెంపునకుం బసిండికిం
జెడి తము దార తిట్టుకొని చీయని కేలు విదిర్చి రోయుచుం
గుడిసెలు దూరి వెళ్ళడిరి క్రొత్తరి సిగ్గరి మిండ లయ్యెడన్. 452
కవికర్ణరసాయనము (4–96)

## బవ్వట

ఉ. ఒవ్వనివారు నవ్వ మహిమోద్ధతి ధర్మసుతుండు వీధికై
నెవ్వగఁ బొంద భూజనులు నింద యొనర్పఁగ నేఁ బొనర్చు నీ
చివ్వకు నీవు నల్కమెయిఁ జేసిన యీపనిఁగూడ నీతికిన్
దవ్వగునేని నాయభిమతం బొడఁగూడియు నిష్ఫలంబగున్. 453
విరాటపర్వము (2286)

క. బవ్వనివారల యెదురన
నివ్విధమున భంగపడితి నే నింక జనుల్
నవ్వంగ నేటి బ్రతుకుగ
నివ్వసుమతి యేలువాఁడ నెట్లు చరింతున్. 454
అరణ్యపర్వము (6–16)

క. బంగారన బంగరు నా
బంగారము బంగరంబు బంగరు వనఁగా
రంగుగఁ గృతులం జెల్లును
గంగాసరిదుత్తమాంగ! కలుషవిభంగా! 455

**బంగారు**

సీ. చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకుఁ బువ్వుఁబోఁడి 456
శృంగారనైషధము (2-49)

**బంగరు**

చ. పసిఁడికురుంజుల న్మెఱుఁగు బంగరుబొమ్మలఁ జూచు దేవతా
ప్రసవసుగంధులన్ ధ్వజపరంపరఁ బిల్చి వివాహవీటికా
విసర మొసంగ నెత్తు వసువీరపురేందిరబాహులో యనన్
లస దహివల్లికావృత ఫలక్రముకంబులు నాఁటి రెల్లెడన్. 457
వసుచరిత్ర (5-66)

**బంగారము**

గీ. కలిగెఁ బదియాఱువన్నెబంగారమునకు
పద్మరాగంబు తోడ సంపర్కలబ్ధి
కాశికాఖండ మను మహాగ్రంథమునకు
నాయకుఁడు వీరభద్రభూనాథుఁ డగుట. 458
కాశీఖండము (1-17)

**బంగరువు**

సీ గీ. గురుతనూభవ నాకు బంగరువు తొడవు
వజ్రభూషలు వేయు తాల్పంగ వలయు
ననుచు, బ్రార్థించి రందఱు కతఁడు మ్రొక్కి
యున్నియును దాన కల్పింప నియ్యకొనియె. 459
కాశీఖండము (7-40)

వ. ఇది శబ్దప్రకరణము. 460

మ. ఘనకారుణ్యకటాక్షరాక్షసచమూగంభీరహర్యక్ష స

జ్ఞానసంరక్షణదీక్ష పాలితసరోజాతాక్ష శక్రాంబుజా
సనముఖ్యామరపక్ష దక్షసవనాంచత్క్రోధతామ్రాక్ష యా
చనకప్రాంగణకల్పవృక్ష రిపుశిక్షా దక్షమోక్షప్రదా! 461

గద్య: ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితా సామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర సకలసంస్కృతాంధ్రలక్షణకళా కౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమ ప్రణీతంబైన లక్షణ సారసంగ్రహం బను కృతియందు సమాసప్రకరణంబును ప్రాసప్రకరణంబును యతిప్రకరణంబును శబ్దప్రకరణంబును ననునది ద్వితీయాశ్వాసము.

# లక్షణసారసంగ్రహము

## తృతీయాశ్వాసము

శ్రీమద్ధరణీధరక
న్యామాననపద్మభృంగ ! నయగుణసంగా !
సామజదనుజవిభంగా !
కోమలభసితావృతాంగ ! కుక్కుటలింగా ! 1

## రేఫప్రకరణము

వ. దేవా ! యవధరింపు మింక రేఫఅకారముల ప్రకరణం బెఱింగించెద, నందుః
రేఫంబు లెవ్వి యనిన— 2

క. అరి యొప్పన మరి సింజిని
యరదం బరవాయి యరిది యరగ/ న్ననఁగా
నరయుట యరణం బను పురి
కరుగుట యరిగెయున రేఫ, లహిపతివలయా ! 3

క. ఇర వనఁగ నునికిప ట్టగు
నిరువది యున నిరు ననంగ నిరువు రనంగా
నిరవన్నె పసిఁడి యిరసయు
నిరుగుడుమ్రా ననఁగ రేఫ, లిభచర్మధరా ! 4

క. ఉరులొడ్డుట యురియాడుట
యురలించుట యురవడించు టురువలి యనఁగా
బరగు నివియెల్ల రేఫలు
శరదిందునిభప్రకాశ ! శైలనివేశా ! 5

. ఎరగలి బిచ్చకు చిత్తం
క బెరియుట మేకెరు వనంగ నెర్రమింగెను సా
మ్మెర విమ్మెర పరికెమునాఁ
బరువడి నివి రేఫ లయ్యె, బాలేందుధరా! 6

ఆ. ఒరు లనంగ నన్యు లొండొరు లొరిమెయు
నొరిమికయును సొమ్ము లొరయుటిల్ల
మొరయు టొక్కరుండు నొరగంట రాచుట
రేఫ లయ్యె, ధవళవృషతురంగ ! 7

సీ. కరివాడి తూఁపులు కరిసేము కృషిపైఁడి
గరగుట కరణియు కరువలియును
కరవాలు ఖడ్గంబు కరకలు కరకరి
కరువున బోయుట కనికరంబు
కరకర గ్రాలుట కరమొప్పుటయుఁ గూడు
కరడుగట్టుట లక్క కరవటంబు
కరిగోరుటయు వాన గురియుట కెరలుట
కొరగ్రబాణమును నాఁగ బరగునట్టి
పలుకులం దెల్ల పరికింప ప్రౌఢకవుల
యనుమతంబున లఘురేఫ లమరియుండు
గురుతరోల్లాస ! పీఠికాపురనివాస !
కాశధవళాంగ ! శ్రీ కుక్కుటేశలింగ ! 8

సీ. గరిత పతివ్రత గరికరియును మేను
గరుదాల్చుటయుఁ బెండ్లి గరగ గరికి
గరువతనంబును గరిడియు గరపచే
ల్గిరగిర వ్రాయుట గురుగుకూర
గురబోతు సవరపు గురుజాలు గురువింద
గురువులు దారుట గురువు రొడ్డు
గురుగులు పిడతలు గొరవంక పిట్టలు
గొరగొర నడచుట గొరజమోపు
నాఁగఁ దగు శబ్దములయందు నలువ మీఁఱు
నట్టి వన్నియు. లఘురేఫ లగుచునుండుఁ
బన్నగాధీశకేయూర! భవవిదూర !
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ! 9

క. చిరుగుట చిత్తరు బొమ్మలు
చెరువులు చ్చెచెరయుఁగోక చెరఁగులు చేటం
జెరుగుటఁ జెరువుట చొరవయుఁ
జొరకుండుట రేఫ లయ్యె, సుమశరహరణా ! 10

సీ. తరచి యాడుట యేటి తరగలు తరతర
తరముల చుట్టలు తరము గామి
తరచిన మజ్జిగ తరువాయి దేహంబు
తరలబారుటయును తరబడియును
తిరుగుట తిరియుట తిరుగ గ్రమ్మర నంట
తెర తెర వచ్చుట తెరువు తోడు
తెరలు కట్టులు రెండు తెరగలు తెగ లగు
తెరల గ్రాగిన నెయ్యి తొరలుటయును
తొరగుటయు నను పలుకుల దొరలియున్న
వన్నియును రేఫ లని కవు లెన్నుచుండ్రు
భూనుతవిలాస ! పీఠికాపురనివాస !
కుముదహితకోటిసంకాశ ! కుక్కుటేశ ! 11

గీ. దరికొనుట దరిద్రొక్కుట దరి దరియుట
దురము దురటిల్లుటయు దుర దుర నెదురుట
దొరయు దొరకంటె దొరలుట దొరకొలుపుట
దొరయుటయు దొరకుట రేఫ లురగభూష ! 12

క. నరములన నురుము లనంగా
నెరపుట యన నెరి యనంగ నెరసు లనంగా
నెరయుట నెరసిన తలయనఁ
బరగున్ రేఫంబు లగుచు, భావజదమనా ! 13

సీ. పరువులు వెట్టుట పరిచనుదెంచుట
పరపుట నించుట పరపు నిడుపు
పరిపడి పరువడి పరిమార్చు టమ్ములు

పరగ్గించుటయు తెల్పి పరుగుటయును
పరుసదనంబును పుర పుర బొక్కుట
పురికొల్పుటయు తుట్టె పురుగు తనకుఁ
బురుడెవ్వఁ డనుటయుఁ బురిటాలు గుమ్మడి
పెరడాలు పెరుగుమే న్పెరుగుటయును

పొరుగు పొరిగొంట పొరిఁబొరి పొరలుటయును
పొరలు పొరపొచ్చెమును మరి పొరుగరుఁగుట
యాదిగాఁగల శబ్దంబు లందు రేఫ
లమరియుండును శైలకన్యాధినాథ! 14

గీ. బరులు బరిమేను బరిగట్టె బరడు బరువు
బరువసంబును బరుజులు బిరుదు బిరుసు
బురద బురబుర బొరగుట బెరయుటయును
బెరుకు బొరుసును రేఫమ్ము లురగహార! 15

గీ. మరులు మరియాద మరలుట ఎరియములును
మురువు మురముర లాడుట మురియుటయును
మురుగు మురియలు మెరమెత మొరపనేల
మొరుడు మొరయుఁట రేఫలు, గిరినిశాంత! 16

ఆ. రచ్చ రజ్జులాఁడి రమ్మంట రంకెలు
రమణ రవణి రంతు రహియు రంగు
రిత్తయగుట రెండు రెట్టె వెట్టుటయును
రొదయు రేఫ లయ్యె, మదనమథన! 17

గీ. వరపు వరపులు వరవుడుల్ వరియు వరగ
వరుస విరవిర బోవుట విరయుటయును
విరియఁ జల్లుట విరులును విరివి వెరవు
వెరసులును రేఫలై యొప్పు, గరళకంఠ! 18

గీ. సరకులమ్ముట సరిసరుల్ సరకు గొనమి
సరగ సరుదుట సరసను సరివి సరిగె
సిరి సురటి సురె సురుగుట సెరబడియును
సొరిదియును రేఫములు ధరాధరనివేశ ! 19

క. హరివాణము తెలిహరు వన
నరయఁగ హారుమంజి ముత్తియంబు హొరంగుం
బరికింపఁగ రేఫము లగు
గిరితనయాధీశ ! గగనకేశమహేశా ! 20

సీ. చక్కెర పక్కెర ముక్కర ముప్వురు
నలువురు పలువురు నగరు తొగరు
జేగురు తొలకరి చీపురు బంగరు
మార్తురు నెత్తురు వాదురు కుదురు
తలపరి జూదరి తనరుట దేవర
కొబ్బరి వెరవరి యబ్బురంబు
క్రమ్మర తామర కనరెవ్వరియ్యరు
వివరము మోహరం బివురు సవురు

డెప్పరంబును పొగరును చప్పరంబు
వేగిరం బోగిరంబును వెదురు కదురు
నదరు మొదలగు పదముల తుదలఁ గొన్ని
రేఫ లగుచుండుఁ బార్వతీప్రియ ! మహేశ ! 21

క. ఇవి కుఱుచలపై రేఫలు
భువి నెన్నఁగ నింక దీర్ఘములపై రేఫల్
వివరింతుఁ జిత్తగింపుము
కువలయమిత్రోత్తమాంగ ! కుక్కుటలింగా ! 22

క. ఆరుట నిండుట యారెక:
లారాటం బారగించు టారట మెదలో
నారయుట రేఫ లయ్యెను

క్రూరాహితమదవిభంగ! కుక్కుటలింగా! 23

క. ఈరికె లెత్తుట యీరెలు
నీరేడు జగంబులందు నీరన నిర వౌ
నీరస మీర్ష్యము దానం
బీరేయన రేఫ లయ్యె, నిభదైత్యహరా! 24

క. ఊ రనఁగ గ్రామనామం
బూరార్చుట యూరకుంటయును రేఫము తా
నేరీ యన నేరికి యన
నేరా యన రేఫ లయ్యె నిందువతంసా! 25

క. ఓరసిక యోరసిల్లుట
యోరుచుకొను టోరెమిడుట యోరీ యనుటల్
ఘోరుణి లఘురేఫము లగు
గౌరీహృత్పద్మభృంగ! కంధినిషంగా! 26

సీ. కారులు కళ్లలు కారుమెఱుంగులు
కారించుటయును ముక్కారుపంట
కారకులును బట్టుకారు కారాటము
కూరుకు నిద్రచే కూరుటయును
కూరిమి యెమ్మెలు కూరసేయుట మన్ను
గూరుటయును తోటకూర నెనరుఁ
గూరిచియుండుటఁ గూరుట పొగలుట
కేరుట కోరడి కోరిక యును
కోరునాఁ బన్ను వెట్టుట కోరగిన్నె
వంది కోరాడుటయునునాఁ బరుగునట్టి
నుడువులం దెల్ల రేఫము లడరుచుండు
శమితకీనాశ! నగతనూజాహృదీశ! 27

క. గారము గారనట్టుట
గారాబము గారవంబు గారెలు నాఁగాఁ
గారయనఁ దరువిశేషము
గోరు లనన్ రేఫ లయ్యె, గోపతిగమనా ! 28

సీ. చీరికిఁ గొనకుంట, చీరలు గోకలు
చీరుట పిల్చుట, చించుటయును
చూర యనం బొడి చూరిలు చేరుట
చేర చేరుచుకొంట చేరికయును
చేరువ ప్రోగును చెంతయు ముత్తెంపు
చేరును రేఫలై చెలఁగు మఱియు
తారసిల్లుటయును దారు దారనుటయుఁ
దీరనికిన్కయుఁ దూరుపుదెస
తేరు నరదంబు తేరకు తేర గంజి
తేరు తేరో రియుచటికే తేరఁ బోకు
తోరమై యొప్పెసందిటి తోర మనెడు
పలుకు లెల్లను రేఫముల్ పార్వతీశ ! 29

ఆ. దారిఁ జనుట పట్టుదారము, దూరులు
పలుకుటయును దోరపండ్లు శిలలు
దోరవెట్టుట యును దోరుటయును దోర
గల్లు రేఫ లయ్యె గరళకంఠ ! 30

గీ. నారచీరలు సింగాణి నారి పోర
నీరగుట చప్పుటగుఁ దేటనీరు నాఁగ
నేరుపును గంగనేరెడు నోరనంగఁ
బరుగునవి యెల్ల రేఫలు ఫాలనేత్ర. 31

క. పూరేడు పూరి ంపెరుగుట
పేరెద పేరెములు పూసపేరులఁ జేర

భేరుం బోరచి పోరుం
భోరానియుఁ బోరితంబు ఘని రేఫ లజా ! 32

ఆ. బార బారి బారు బీరము బూరుఁగ
బూరటిలుట బూర బూరె బేర
ములును బేరజంబు బోరగిలుట బోర
బోరు గొండ రేఫములు గిరీశ ! 33

గీ. మారి మసఁగుట మారేడు మారట పరి
మారుతు రనంగ రిపులు వేమారు మీరు
మూర మేరయు మోరయు మోరతోపు
ననెడు నుడువులు లఘురేఫ లగునుతేశ ! 34

సీ. రాణి రాణించుట రాయిడి రాయఁడు
రాచూలి రాయంచ రాపాడియును
రాముల్క పండులు రాము రాగిల్లుట
రారాపు రాచుట రావిమ్రాను
రాణువ రాయుట రాజుట రాలుట
రాపి రాకొట్టుట రాచబంటు
రీతి రూపుట రూక రేయి రేఁగుట రోఁత
రోయుట వెదుకుట రోవెలంది
రోలు రోకలి రోజుటం చోలిఁ బలుకు
పలుకు లన్నియు రేఫలై పరుగుచుండు
కుధరజాసంగ ! కలశనీరధినిషంగ
ఇభదనుజభంగ ! శ్రీకుక్కుటేశలింగ ! 35

క. వారని కోపము వారక
వారించుట వారువంబు వారకులును కూ
డ్యాలుచుట వారకంబును
వారున్వి రనెడు తీరు వలురేఫ లజా ! 36

గీ. సొరెలును బెండ్లి సొరె వేసొరుటయును
సొరెలును నూరెలును సేరు స్త్యైరణయును
సరవి సోరణగండ్లును సౌరు నాఁగఁ
బరుగు నివి యెల్ల రేఫ లంబరశిరోజ ! 37

క. ఇది రేఫ ప్రకరణ మగు
ముద మొదవఁగ శకటరేఫముల తెఱఁగెల్లన్
విదితంబుగ నెఱిఁగించెద
పదమలమతి చిత్తగింపు జగదీశ ! శివా ! 38

## శకట రేఫ ప్రకరణము

క. మేర చెడకుండ రేఫ ఱ
కారంబుల తెఱఁగెఱింగి కబ్బంబులలో
గూరుప వలయును సుకవులు
సొరెకుఁ దద్భేదములు విచారించి శివా ! 39

ఆ. ఎన్ని లక్షణంబు లెఱిఁగిన రేఫలు
బండిఱాలు నెఱుఁగకుండు నట్టి
కవి కవిత్వ మెల్ల గవ్వకుఁ గొఱగాక
కొఱఁతఁ జెందు రజితకుధరనిలయ ! 40

వ. "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్"
అని వాగనుశాసనుఁడు చెప్పినాఁడు గనుక

"గీ. జ్ఞాతి వైరంబులంది ప్రాసంబులందు
విశ్రమములందుఁ దమలోన వేఱు గల్గి
దేవదానవు లట్లుగఁ దెలుఁగులందు
మించి రేఫఱకారముల్ మెలఁగుఁ గృష్ణ!

ఆ. సొరిది భోజకన్య నరదంబుపై నిడి
రేయిఁ దెచ్చెననఁగ రేఫ మయ్యె

పుట్టింది యనక సిగ్గుపరచి రుక్మిణీ జాల
అట్టు పరచె సస్యంగ తామకుంద"

అని ముద్దరాజు రామన్న చెప్పినాఁడు

"ఆ. అజ్జలాని యాగి తాపడి సభలోన
తేసి పోరిలోన అచ్చంబొలసి
జెన్న మడుఁగు పుడమి తేంద్ర నేల నుతింప
మనకు విశ్వనాథుఁ డౌనరి యుండ,

అని పెద్దిరాజు (కా. చూ. 7–45) చెప్పినాఁడు

"ఆ. మరునితండ్రి లోకమహితుండు యాదవ
రాజసింహమూర్తి రక్షకుండు
తాఁగ వేలు పనఁగ అంపిల్లు నెక్కటి
వళ్ళు నాఁగ నిట్లు వనజనాభ,

అని యనంతుఁడు (ఛం. ద. 1–118) చెప్పినాడు. అటువలెనే మహాకవులు రేఫఱకారములు గలియకుండం బ్రయోగించినారు. 41

గీ. దేవదానవులట్లు విద్వేష మెపుడుఁ
గలిగియుండును రేఫఱకారములకు
నట్లు గావున నవి కలియంగనీక
కావ్యములఁ గూర్పవలయు సత్కవు లెఱింగి. 42

క. నన్నయభట్టాదుల కృతు
ల న్నిలిపిన లక్ష్యములును లక్షణము లెఱుం
గన్నేరక యిది కల్లని
యెన్నుదు రొక కొంద ఱిందు కేమియనంగన్. 43

క. వెల్లంకి తాతయార్యుఁడు
తెల్లముగా శకటరేఫ దీర్ఘంబులపైఁ

జెల్ల దని పలికె నదియుం
గల్ల విర్కితంపఁ బ్రౌఢకవిసమ్మతులన్ 44

ఆ. పదము మొదలు నిడుదఁ దుదిఁ దద్భవంబుల
రేఫకాని శకటరేఫ కాదు
నిక్క మనుచు సుగుణనిధి దిట్టకవి వేంక
టార్యవరుఁడు నుడివె, నది హుళక్కి. 45

ఆ. పదముమొదల నిడుదఁ దుదిఁ గురు రేఫలు
గలిగియుండుఁ గృతుల గాటముగను
తెలియవలయు దీని తెరఁ గెల్ల సుకవులు
లేటపరతు వినుము త్రిపురమథన! 46

క. కగ చజ తదనల పబమల
దగ వసలంద ఇఉఎఒలఁ దక్కఁగ నెందున్
మిగిలిన వర్ణంబులపైఁ
దగులవు గద బండిఱాలు ధనపతిమిత్రా! 47

సీ. తఱవఱ లఱగాఱ లఱిముఱి యఱచుట
అఱఁముట యఱచెయ్యి యఱపుకొనుట
యఱకట బెట్టుట యఱమఱ యఱి లేక
యఱవుడు కుప్పసం బఱుగు లఱిసె
యుఱుఁగుట తక్కువ యఱవడి యఱపోర
డఱమూత యిల్లఱ ళ్ళక్కఱపడి
యఱకమ్ముట మఱింటు లఱవళ్లు ద్రావిళ్లు
లఱకమ్మనఁగ నన్ను మఱుగ కుంట

యఱుట తఱుగుట యయ్యో రూపఱ పొలుపఱి
క్రచ్చఱయుననవివియెల్ల నత్తు మీఁద
శకటరేఫలు రాజతాచలనివేశ!
భవ! వియత్కేశ! పార్వతీధవ ! మహేశ! 48

వ. ఇందులో అరచెయ్యి అరకాలు అరవది యనునప్పుడు రేఫఅకారములు రెండున్నయ్యేటట్టుగాను మహాకవులు ప్రయోగించినారు. అందుకు 49

రేఫ యగుటకు

క. అరకాలు ముల్లు గొనకిదె
తిరిగి రఘుస్వామి యేఁగుదెంచె న్మదిలోఁ
దరుణీ వెఱువకు విపినాం
తరమున నను విడిచిపోవఁదగ దీఁక నాకున్. 50

రామాభ్యుదయము (5–172)

క. అరపైకంబును జేయని
హరివాసరమునకునై నిజాత్మజుఁ దునుమన్
గరవాలు చేతఁబూనిన
కరణి యినుప మొలకు మేడ గాల్చుట సుమ్మా! 51

రుక్మాంగద చరిత్రము (5–143)

సీ. 'అరవిడు గొప్పలు విరులవాసనకుఁ దో
రపు టూడ్పుగాడ్పులు ప్రాపు గాఁగ. 52

కళాపూర్ణోదయము (1–41)

. కరివంకబొమలపైఁ గ
స్తురిఁ దీర్చిన తిలకరేఖ సుదతికిఁ బొలిచెన్
మరుఁడు వెడవింటఁ దొడిగిన
యరవిరి నును నల్లగల్వయమ్మును బోలెన్. 53

కవికర్ణరసాయనము (3–167)

చ. అరవిరిగుత్తులం బొలిచి యల్లన గొడ్డల నీఁగు నీరతన్
దరహసితోదయంబున (విలాసతనూవలనంబుఁ గల్లు సుం
దరుల తెఱంగుగాఁ బతివిధంబున నున్న రసాలపోత మీ
గిరితటభూమికిన్ సరసకేళికి వచ్చిన మాడ్కి నొప్పెడున్). 54

ఉత్తర రామాయణము (6–30)

క. అరచందమామ నేలిన
దొరగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్
(బరువంపు మొల్లమొగ్గల
దొరగాఁ బల్కుదురుఁ బల్కుదురు జవ్వనికిన్). 55
విజయ విలాసము (2-78)

శకట రేఫయగుటకు

సీ. కరువలి సుడియమిఁ గదలక చెన్నొందు
నఱవిరిదమ్మల నుఱకఁ దెగడి 56
విరాటపర్వము (2—83)

క. పిఱుదం గురుధరణీపతి
యఱచేతం బ్రాణములుగ నరినృపతిబలం
బుఱుతెగువ ముందటం బే
ర్గాఱలుట చిత్తమునఁ బెట్టుకొని హరియించున్. 57
స్త్రీ పర్వము(2-88)

క. అఱపు లుడిగి పోపో నీ
యఱచేతం బళ్లు వచ్చి నప్పుడు మమ్ముం
గఱచెదవు గాని తగునెడ
మొఱయిడు మది యెట్టి దైవములు వినియెడినో. 58
కళా పూర్ణోదయము (3—230)

క. అఱ బొరడు కుఱుచ చేతులు
నొఱవ శరీరంబు గలిగి యొరులకుఁ జూడం
గొఱ గాకుండియు మన్మథు
నొఱపులఁ బడియెడు నితండు యువతిప్రీతిన్. 59
అరణ్యపర్వము (2-135)

క. అఱువది కోటులు కపివరు
లుఱక జగత్త్రయము నొకట నుద్వేతుగొనన్

దఱికొన్న యట్ల నడువంగ
నెఱసి కుముదుఁ డరుగుదెంచె నృపవరుఁ గనఁగన్. 60

ద్విపద : అఱి గొను లసియాడ నలసి యాననముల
మెఱుపు గోయిల తళ్లై మెయిదీఁగె లొలయ. 61

రంగనాథ రామాయణము

క. ఉఱికి భుజాయుద్ధమునకుఁ
దఱిమినఁ గైదువులు విడిచి ధట్టించుచు బి
ట్టఱచేత బిట్టు చఱచిన
నొఱ గొఱిగి యతండు నతని యురు మస్తకముల్. 62

భాస్కర రామాయణము (యు. 476)

క. ఇఱియుట యుఱికి గొనుట కూ
డఱిసి చనుట యిఱకటంబు నిఱు లనఁ జీక
ట్లిఱుకును గ్రిక్కఱియుట బం
డిఱుసును గరురేఫ లయ్యె నిభచర్మధరా! 63

వ. ఇందులో నిరులు చీక ట్లనుటకు గురురేఫ కుదాహరణము చింత్యము
లఘురేఫ యగుటకు. 64

సీ. ఇసుక వెట్టిన నేల నేచి యర్కాంశులఁ
జొరనీక దట్టమై యిరులు గవయ 65

మనుచరిత్ర (2—19)

సీ. కన్నులపండువు గ్రహసార్వభౌముండు
సురలయూఁకటిపంట యిరులదాయ 66

శృంగార నైషధము (8—201)

క. ఇరులు బలియుచును సలుబులు
కర మరుదై కరడు గట్టి కదిసిన కరణిం

బరగఁగ దోముడు కాటక
కరవటముంబోలె నిజ్జగంబు దనర్చెన్. 67

యయాతిచరిత్ర (2–75)

చ. పెరిగిన యీసునన్ నెమలిపింఛములన్ బురివిప్పఁ బోలు నీ
సరసిరుహాక్షివేనలికి సాటిగ నిల్వఁగ నోడి చొచ్చె నిం
దిర శరణంబు తేఁటి గమి నీలము లింద్రుని పేరు గాంచె పె
న్నిరులు గుహాశ్రయంబు గనియె న్నెఱీఁ గల్గినవారి కోర్తురే! 68

శృంగారాష్టకము

సీ. నిండుచందురునవ్వు నెమ్మోముసిరితోడ
నిరులు గ్రమ్మెడు వేణి భరము తోడ 69

కళాపూర్ణోదయము (3-31)

గీ. ఉఱుడు గ్రైకొనఁ డుఱుకుట యుఱుము లుఱక
యుఱిది బిగ్గర యుఱు మిక్కి లుఱపు కొంప
లుఱియు టుఱుకటి యుఱియము నుఱని తెగువ
యుఱత పిల్లలు బండిఱా లురగహార! 70

క. ఎఱకలు ఱెక్క లెఱుంగుట
యెఱపఱి కెంబెఱుకు వాఁడు నెఱ పెఱుగుట సా
మ్మెఱ విడుట యెఱచి మాంసం
బెఱికతయును బండిఱా లహీనవిభూషా! 71

వ. ఇందులో నెఱవనుట రేఫ రకారముల రెంటం జెప్పినాడు అకారమున కుదాహరణము చింత్యము. 72

## రేఫకు

చ. ఎరవుగఁ జూడసాగె హరిణేక్షణ పిన్నటనాటనుండియుం
బరిచితిఁ బూని మంజుగతి మాధురియున్ మృదువాగ్విభూతియు
న్వరుసన తెల్పి (తల్లికడవారును తండ్రి భజించు వారునై
గరిమముఁ గన్న సద్ద్విజశిఖామణులన్ వసులబ్ధచిత్తయ్యై). /3

వసుచరిత్ర (3–102)

క. ఇమ్ము నరేశ్వర! మాతుర
గమ్ముల నీకార్య మయ్యెఁగాదే కడులో
ప మ్మెమ్మనర నౌరుల సొమ్ములు
రమ్మనినన్ వచ్చునే యెరవు సతమగునే. 74

అరణ్యపర్వము (4–347)

క. హరి పలికిన విధమంతయు
నెరవై యున్న యది వింటె యీ మాట తెరం
గరయుదము (తొలుత నీపెను
పరిచందం బెల్ల నెఱుకపడియెడుఁ బిదపన్). 75

ఉద్యోగపర్వము (3–214)

ఆ. ఒఱకటంపు ద్రోవ యొఱగాల నిలుచుట
యొఱగు వంక కత్తి యొఱ యొఱయుట
యొఁఱగు బిళ్ల లొఱపు లొఱవ దేహం బిది
శకటరేఫ లుదధిశయనబాణ! 76

సీ. కఱపుట నేర్పుట కఱవు దుర్భిక్షంబు
కఱతలు పోకిళ్లు కఱటి మంకు
కఱదలు బుద్ధులు కఱకు కాఠిన్యంబు
కఱకప్పు బెబ్బులి గఱచుట యును
కిఱవుట కుఱుమాపు కుఱుగంట కుఱుగడ
కుఱుకొని కుఱుకులు కుఱువు కుఱులు
కుఱుకుఱు మన్నిలు కురుగలి కుఱుచయు
కెఱయు ఱుక్కెఱయు పక్కెఱయు కొఱత

కొఱకు కొఱలుట కొఱగామి కొఱుకు కొఱవి
కొఱకుటయు కొఱకొఱయును గుఱుతు విూఱ
శకటరేఫంబు లని తొంటిసుకవు లండ్రు
శమితకీనాశ! గిరితనూజాహృదీశ! 77

వ. ఇందులో కుఱు లనుటయుఁ బక్కెఱ యనుటయు ఱకారము లగుటకు నుదాహరణము చింత్యము. 78

## రేఫకు

పంచచామరము :—

సరు ల్వెనంగొనంగ జిల్గు జన్ను గప్పు మీఱఁగాఁ
గురుల్వెస న్వెస ల్వెసించి కూడి చాల మీఱఁగాఁ
దరు ల్వెడంకుచుండ వాని తారసిల్ల నేగి (క్రొ)
వ్విరుల్గురించ కోసె నేర్తు వెంటఁ జాన లంటఁగాన్. 79

యయాతిచరిత్ర (4–19)

గీ. ఇరులు గెలిచిన యంత శపురేందుముఖుల
కురులు మరుఁ డను వేటకాఁ డురులు వేసి
మరులు గొలుపంగ లేఁడయ్యె మనుజవిభుని
సరులు లేని దృక్ఖంజనశాబకములు. 80

శృంగార నైషధము (3–90)

వ. ఇవి రేఫ ప్రయోగములు. మఱియు

సీ. ఇందుబింబము మీఁది కందుచందంబునఁ
గురులు నెమ్మొగమున నెరసియుండ. 81

విరాట పర్వము (2–138)

గీ. కురులు కెంపులఁ బొగడల నొరయు దువ్వి
(నిక్కుచనుగుబ్బలఁ బయంట చక్కఁ జేర్చి
పలికెఁగలకంఠిమోమునఁ దెలివి తొలుక
ముత్తియఁపుముంగఱ యొకింత మోవిఁ గదియ). 82

విజయ విలాసము (2–161)

వ. ఇందులో నెరయుటను, బరయుటను రేఫరకారములు రెంటం గలవు. గనుక కురులు రేఫరకారముల రెంటం గలవనుట చింత్యము. పక్కెఱయు ఱకార మగుటయు చింత్యము. 83

## రేఫ యగుటకు

సీ. పన్నగాశికి నెదుర్పడి రెండు తెక్కలు
ధరియించె ననఁగఁ బిక్కెర జెలంగె. 84
పారిజాతాపహరణము (4–77)

సీ. గఱికె నట్టుల గఱగఱికయు గుఱుగు కా
యలు పరికింపఁ జింత్యములు, మఱియు
గఱుడి డగ్గరియంప గఱి పగఱియు మోట
గిఱకయు గిఱుమెట్లు గిఱికొనుటయు
గిఱులు వ్రాయుటయును గిఱుపుట గుఱుకొని
గుఱుకు వెట్టుటయును గుఱిగడచుట
గుఱుకొండి గుఱుగుర గుఱువెట్టుటయు గుఱి
గుఱుసులు గింజలు గుఱుతు గొఱియ

గుఱుకు కట్టెలు గొఱవంక గొఱుగుటయును
మొదలుగాఁ గల పలుకులఁ గదిసియుండు
నట్టివన్నియు గురురేఫ లై తనర్చు
భవ! విరూపాక్ష! త్రిపురదానవవిపక్ష! 85

వ. ఇందులో గరగరి యనుటకు గొరవంకపిట్ట లనుటకు రేఫఅకారముల రెంటం జెప్పినాఁడు. గురురేఫ కుదాహరణ చింత్యము. 86

## లఘు రేఫ యగుటకు గరగరికకు

క. సిరి వంటి బడే బీబీ
విరిబోడికి వెన్నుఁ డనఁగ వెలయుచు మిగులన్
గరగిరి కలఁ దనరెడు రా
సిరులొందు నమీనుఖాను చెలువము లమరున్. 87
యయాతిచరిత్ర (2–1)

క. పరమసుమనోమనోజ్ఞత
గరమాత్మారామవరవికాసము దనరన్

గరువపుఁ జరితల గరితల
గరగరికల గరిమ నగరి గరిమకు సమరున్. 88

కళాపూర్ణోదయము (8-227)

లఘురేఫ యగుటకు-గౌరవంకకు

మ. శరసంధానముతోనె కొన్ని యడుగుల్ జౌ జౌవునం బారి యా
ధరణిం గాల్గొని ద్రోణము ల్దివిచి దోరండంబులం జేసి యే
సిరి బోయల్ దినుమంచు నార్చు పఱచున్ జెట్ట్రాసలన్ డాయుచున్
గౌరవంకల్ మొఱవెట్టినట్లు గుణముల్ ఘోషింప రోషంబునన్. 89

మనుచరిత్రము(4-111)

క. మఱఁ డపుడు బేసితూఁపులు
ధరియించియు నేమి చెప్పఁ దరుణిన్ వరునిన్,
సరిగోలల వడనేసెన్
గౌరవంకరొద ల్పెలంగఁ గ్రొన్ననవింటన్. 90

విజయ విలాసము(2-179)

సీ. చఱచుట యుఱచేతఁ జఱచుట గొడ్డలి
చఱచుట బిట్టు వాచఱచుటయును
చిఱులు బిచ్చఱమంట చిఱుతది చిఱునవ్వు
చిఱుకొట్టుటయును ముచ్చిఱితనంబు
చిఱిమిదేహంబెల్ల చుఱచుఱఁ గాల్చుట
చుఱుకు పుట్టుటయును చెఱిసగంబు
చెఱుకులు చెఱసాల చెఱుముట చెఱుగుట
చెఱచుట చెఱిలాట చెఱిక బట్టి

చెఱువున ద్విజుల్ భుజించుట చెఱుపుటయును
చెఱువనం దటాక మగు నివి చెప్ప శకట
రేఫములు సుమ్ము పీఠపురీవిహార !
యురగపరివృఢకేయూర ! దురితదూర ! 91

వ. ఇందులో చెఱఁ గులసుట చెఱు వనుట రేఫ ఱకారములు రెంటం
జెప్పినాఁడు. 92

### చెరఁగు రేఫ యగుటకు

చ. రవియను దివ్వె కేతువు చెరంగున మూసి కృతోర్ధ్వయంత్ర వా
రవిరళఘర్మయై కలరవాల్పరవోక్తుల (నాంతధూపరా
జివరనిశన్ గన నమ్మదనచేతులఁజాతురి నెయ్యపుంగురుం
జునిదలు దార్ప విష్ణుపద మొత్తఁ బురీగృహలక్ష్మి నూత్న నాన్). 93

ఆముక్తమాల్యద (2–17)

ఉ. రంగు మెఱుంగు బంగరు చెరంగుల రెంటెము నాల్గు కొంగులన్. 94

బహుళాశ్వచరిత్ర (4–5)

### చెఱఁగు శకటరేఫ యగుటకు

మ. చెఱఁగుల్ పూత పసిండివ్రాత పసిమిన్ జిత్రాతిచిత్రంబులై
మెఱయన్ రత్నపుగుచ్చు లంచులఁ బడెన్ మించం దువాళించు క్రొ
మ్మెఱుఁగుల్ చంద్రిక కాటపట్టు సురభూమీజార్పితం బచ్చెనా
దఱచున్ గన్నులవేల్పుపట్టి వసుగోత్రామండలస్వామికిన్. 95

వసుచరిత్ర (5–93)

గీ. అవని గంపింప లలితపీతాంబరంబు
చెఱఁగు దూలఁ జక్రాంశులు దుఱఁగలింప
సింహనాదంబు క్రోధరంజితభయంక
రాననంబునఁ జెలఁగంగ నడరుఁ జెలుచ). 96

భీష్మ పర్వము (2–155)

సీ. కనకమేఖలఁ గుచ్చి కట్టె నెవ్వఁడు లీల
చెఱఁగునఁ బూషార్కు మెఱుఁగు పండ్లు 97

కాశీఖండము (2–32)

వ. చెఱువనుట శకటరేఫ యనుట చింత్యము. 98

### చెరువు రేఫ యగుటకు

చ. కరమున నున్న శూలమునఁ గ్రమ్మ మెఱుంగులు శత్రుసంఘభీ
కరములుగా గజాశ్వభటకాయములన్ గుదిగ్రుచ్చునట్లుగాఁ

జెరువుచు వచ్చువానిఁ గురుసింహుఁడు సూచి మదాంధసింధురో
త్కరరభసాతిభీషణముగాఁ గవిసెం బటువిక్రమోద్ధతిన్. 99

భీష్మపర్వము (3–108)

సీ. రిక్కలో యివి గావు రేచామతురుముపైఁ
జెరివిన మల్లిక్రొవ్విరులుగాని 100

శృంగార నైషధము (8–161)

## చెరువు (తటాకము) రేఫయగుటకు

సీ. గీ. తనరు బకపంక్తులకు జూసుదప్పు మయ్యెఁ
జెరువుగమి యుడుము లన రేల్ దిరిగెఁ గుక్క
పసికి (బావులఁ బడుటకుఁ బసుల యెరువు
పెఱిలకు మొసళ్ళు, మలుఁగు మీన్బారియఁ దూరె). 101

ఆముక్తమాల్యద (2–53)

## చెరువు శకట రేఫ యగుటకు

మ. చెఱుకుందోటలఁ బెంచి శాలిమయసుక్షేత్రస్థలుల్ నించి య
క్కఱ లేకుండఁగఁ బూగనాగలతికాకాంతారముల్ ద్రోచి యే
డ్తెఱ నంతం గుముదోత్పలాబ్జవనవాటీకోటి బాటించి పెం
జెఱువుల్ వోల్చెఁ బురంబులన్ దెసలఁ బ్రస్ఫీతాంబుపూర్ణస్థితిన్. 102

ఎఱ్ఱాప్రగడ రామాయణము

క. చెఱువులు గట్టించిన పుణ్యులు
తఱపక ధాన్యంబు లమ్మ ధన్యులు ప్రజలం
జెఱ విడిపించిన సుకృతులు
నెఱి నర్కతనూజ ! రారు నీ పురమునకున్. 103

రుక్మాంగద చరిత్ర (2–107)

గీ. జఱిజఱీయుఁ బూజఱీయును పూజఱి జఱిగొని
జఱపుటయుఁ జేత జమఱుట జఱజఱియును

జిఱజిఱను త్రిప్పటయును జుంజుఱు నెఱులును
జొఱజొఱయు బండిఱాలగు సోమమకుట. 104

సీ. తఱగుట కోయుట తక్కువ యగుటయు
తఱుగరి జేహరి తఱిగోల పుట
తఱలుట పుచ్చున తఱకలు శత్రులం
దఱియుట తఱుముట తఱులు తఱపి
తఱచు దట్టము తఱి తఱిగొని నడచుట
తిఱుగుట త్రిమ్మరి తిఱివెనచుట
తుఱగలి తుఱుము వాతెఱ యేత్తెఱకను
దెఱచుట తెఱవలు తెఱగోలుపుట

తెఱపి తెఱలిన వాసన తెఱకువయును
తెఱుగు తెప్పిఱి తొఱలుట తొఱగుటయును
పలుకులన్నియు శకటరేఫంబు లయ్యె
రజతధరణీధరవిహార ! భుజగహార ! 105

వ. ఇందులో తరలుటను, తరులనుటను, తిరుగటను, వాతెర యనుటను తొరగుటను రేఫ ఱకారంబుల రెంటం జెప్పినారు. 106

తరలుట రేఫయగుటకు

చ. అరిజయకీర్తిసాంద్రుఁ డగు నయ్యళిరామనరేంద్రసోదరున్
తిరుమలదేవరాయని నుతింపఁ దరంబె తదీయ హేతి శాం
కరి యతిలోహితావయవగాఁ దను నాత్మ హృదంతరంబులన్
దరలక తాల్పు వారలకుఁ దార్చు సురీవరణీయ వైఖరుల్. 107

వసుచరిత్ర (1—49)

ఱకారమునకు

చ. ఒఱగె వసుంధరాస్థలి మహోరగనాథుఁడు వంగెఁ గూర్మమున్
దఱలె నభంబు ద్రోసె సురదంతులు మ్రొగ్గె దిగంతరంబు ల
త్తఱి నదరెన్ పరిత్రస్తుఁడు దర్పు మెలర్చ నహార్య ముద్ధతిన్
బెఱుకఁగ గోత్రశైలములు పెల్లగిలెం గలగెం బయోనిధుల్. 108

భాస్కర రామాయణము

### తరులు రేఫ యగుటకు

చ. మురియుచుఁ దమ్మిచూలి మఱి ముందర రెఱింగిన యట్లు నేర్పుతో
దరులను బ్రేడికంట్లిడిన దాన దిరంబయి యుండెఁ గాక యే
వెరవున నిల్పు దీనివగు ప్రేకపుఁజన్నుల ప్రేగునం బయల్
దొరసినయట్టి నెన్నడుము తోరపు నల్పకడంగ మెచ్చితిన్. 109

యయాతిచరిత్ర (4–47)

### శకటరేఫకు

ఉ. తఱు లఱనిక్కఁ బూత నెఱితావియ చిక్క నపాంగమాలికల్
మెఱుఁగులు గక్క నూరుపుల మేలిమి దేఁటులు చొక్క హారము
లుక్కఱచలు దొక్క మంగురులు కొంజెమటం బదనెక్క వేలుపుం
దెఱవయొకర్తు చేదిజగతీపతికిన్ శిరసంటె నేర్పునన్. 110

వసుచరిత్ర (5–75)

చ. చఱివడి తీవ్రఘూర్ణవశంబున నొక్కట త్రిఁగె చుట్టి నె
త్తఱులయియున్న పాప తరిత్రాటి మలంకల నిర్ఘరాంబువుల్
గిఱికొని మీఁదనుండి దిగ కిన్నరకంఠి పయోధిఁ దర్పున
త్తఱి ఫణిరాజు చుట్టిన విధంబున నున్నది చూడు మిగ్గిరిన్. 111

కాశీఖండము (5–284)

### తిరుగుట రేఫకు.

చ. తిరిగెడి పుట్టలన్ బొదలఁ దిమ్మరు పాముల రోసిరోసి ని
ష్ఠురతరదీర్ఘదండమున ఁ్రొల్లగ వేయుచు (వచ్చివచ్చి య
య్యెర నొక డుండుంభ బను నహిం గని వేయఁగ దండ మెత్తుడున్
హరిహరి యంచు డుండుభమహాహి భయంపడి పల్కు భార్గవున్). 112

ఆదిపర్వము (1–153)

### శకటరేఫకు

గీ. ఉడుకు కన్నీరు దడియఁగ నొరలుచును వి
చేష్టయై యూరకుండుచుఁ జెలుల తోడఁ
దిఱిగి పొగులంగ వేసరి నెఱియు మనల
యవులఁ దిరుగుచునున్నది యక్కటకట ! 113

స్త్రీ పర్వము (2–45)

తరులు రేఫ యగుటకు

చ. మురియుచుఁదమ్మిచూలి మఱి ముంద రెఱింగిన యట్లు నేర్పుతో
దరులను బ్రేడికంట్లిడిన దాన దిరంబయి యుండె గాక యే
వెరవున నిల్పు దీనివగు వేఁకపుఁజన్నుల వేఁగునం బయల్
దొరసినయట్టి నెన్నడుము తోరపు నల్పకడంగ మెచ్చితిన్. 109

యయాతిచరిత్ర (4–47)

శకటరేఫకు

చ. తఱు లఱనిక్కఁ బూత నెఱితావియ చిక్క నపాంగమాలికల్
మెఱుఁగులు గక్క నూరుపుల మేలిమి ధేటులు చొక్క హారము
ల్కుఱచలు డొక్క మంగురులు కొంజెమటం బదనెక్క వేలుపుం
దెఱవయొకర్తు చేదిజగతీపతికిన్ శిరసంటె నేర్పునన్. 110

వసుచరిత్ర (5–75)

చ. చఱివడి తీవ్రఘూర్ణవశంబున నొక్కట త్రిఁగె చుట్టి నె
త్తఱులయియున్న పాప తరిత్రాటి మలంకల నిర్ఝరాంబువుల్
గిఱికొని మీఁదనుండి దిగ కిన్నరకంఠి పయోధిఁ దర్పున
త్తఱి ఫణిరాజు చుట్టిన విధంబున నున్నది చూడు మిగ్గిరిన్. 111

కాశీఖండము (5–284)

తిరుగుట రేఫకు.

చ. తిరిగెడి పుట్టలన్ బొదలఁ దిమ్మరు పాముల రోసిరోసి ని
ష్ఠురతరదీర్ఘదండమున డొల్లగ వేయుచు (వచ్చివచ్చి య
య్యెర నొక డుండుంభ బను నహిం గని వేయఁగ దండ మెత్తుడున్
హరిహరి యంచు డుండుభమహాహి భయంపడి పల్కు భార్గవున్). 112

ఆదిపర్వము (1–153)

శకటరేఫకు

గీ. ఉడుకు కన్నీరు దడియఁగ నొరలుచును వి
చేష్టయై యూరకుండుచుఁ జెలుల తోడఁ
దిఱిగి పొగులంగ వేసరి నెఱియు మనల
యవులఁ దిరుగుచునున్నది యక్కటకట ! 113

స్త్రీ పర్వము (2–45)

## తొరగుట రేపయగుటకు

సీ. పొరలెత్తి ఘనసారతరవులఁ దను దానె
తొరగెడు పచ్చకప్పురపు విడెము. 119

మనుచరిత్ర (2–55)

క. పరిజనములు గన్నీరులు
దొరుగఁగ నడలొందువారితోడం జనున
ప్పురుసునఁ(దనదు తనూజులు
మరలమికిం బాండురాజమహిషి మఱుఁగుచున్. 120

ఆశ్రమవాస పర్వము (1–164)

చ. చరణహతిన్ లతాతరులు చాల్పడి జర్ఝరితంబులై మహిం
దొరుగఁగ నిట్టు లొండొరుల తోడ మదోద్ధతి షష్టిహాయన
ద్విరదములట్లు (ఘోరరణవీరులు సేసిరి మల్లయుద్ధ ము
ద్ధురబలులై సమీరణసుతుండు హిడింబుఁడుఁ దద్వనంబునన్). 121

ఆదిపర్వము (6—210)

సీ. పరమాత్మపదములఁ దొరఁగి పారెడు నేటి
తరగలపై లీలఁదాఁ టి దాఁటి 122

నృసింహ పురాణము (1–54)

## అకారమగుటకు

చ. మఱియొక డేను చెప్పెద నమాసుషవిక్రమలీల నక్కడన్
బఱపియుఁ జంపియున్ రిపున్నపాలక సైన్యము రూపడంచి మేన్
దొఱగుట యొప్పిదే తనువు తూటులుగాఁ గడు బేరువాడి (గెల్సుకో
లు ఱ డాకొ నాదుపెం పుడుపనోపుదురే నిసుబోటు లెమ్మయిన్.) 123

కర్ణపర్వము (2—49)

గీ. తొఱఁగు నోకుండ మెకములు గఱవకుండఁ
(బాడి దఱుఁగకయుండ నాపాటి గొల్ల

లిచ్చు మెచ్చు నీదృష్టికి నెక్కఁ గదుపు
నరయ నేర్తు న న్నేలును ధరణినాథ !) 124

విరాటపర్వము (1–279)

గీ. పొగడ గ్రమ్మాఁకుల మొదలను పుష్పరసము
1తొఱఁగి నెత్తావియందున నెఱియ నొప్పెఁ
(బూచుకొఱకున్నై మున్న యింపులు దలిర్పఁ
గడఁగి వనలక్ష్మి యుమిసిన కళ్లలనఁగ). 125

నృసింహ పురాణము (2–69)

గీ. అంద టెంద ఱు కొంద ఱు మ్రుంద ఱ యన
పెద్దఱిక మిద్దిఱద్దిఱ గద్దిఱ యన
పదఱు లెదుఱుట యనఁదగు పల్కులెల్ల
శకటరేఫంబు లుడురాజశకలమౌళి ! 126

వ. ఇందులో ఎదుఱుట అకార మగుట చింత్యము. 127

రేఫయగుటకు

క. ఒకపరికిరీటి కక్కొది
రికి గ్రమ్మనఁ బోయిరేని రెండవమారి
య్యకొనుట కోర్వక 128

విరాటపర్వము(5–55)

క. మగటిమి వారికి వీఁ డెదు
రుగ నమ్మి సుయోధనుఁడు విరోధముఁ గొని (స
ర్వగుణాఢ్యులు బలవంతులు
నగు పాండునృపాలసుతుల నవమానించెన్.) 129

ఉద్యోగపర్వము(2—161)

సీ. నఱుజు కొంచెము చెట్లు నఱుకుట నిఱుపేద
నుఱుము సేయుట వడ్లు నుఱుపుటయును
నెఱకు లాయంబులు నెఱులు వెంట్రుక లగు
నెఱయుట నిండుట నెఱియ మిగుల

1. ము. నృసింహ. తొరఁగి నెత్తావియందును నెరయ నొప్పెఁ

నెఱి బాగు నీటులు నెఱపుట నెఱపును
నెఱలేని మిత్రుఁడు నెఱికకాసె
నెఱ దొడ్డ గొప్పలై నెగడును నెఱబంటు
నెఱజాణ నెఱచక్కి నెఱకటారి

యనఁగఁదగి ప్రౌఢసుకవుల యనుమతమునఁ
బరగు నివి యెల్ల శకటరేఫంబు లగుచు
రజతధరణీధరవిహార ! భుజగహార !
పురనిశాచరమదహార ! దురితదూర ! 130

వ. ఇందులో నెరయుటను, నెరపుటను రేఫఱకారముల రెంటం గలిగి యుండును. 131

### నెరయుట రేఫయగుటకు

క. తరళనయనాబ్జదళములు
నెరయగమై మున్న చల్ల నృపసుతుఁ బూజిం
చిరి. 132

ఆదిపర్వము (3-157)

క. నెరసె నెఱసంజ చక్రక
సరసీరుహవిరహఖేద సంసూచకమై 133

కవులషష్ఠము

మ. అరవిందోదరమూర్తి భానుఁ డపు డూష్మాంతంబునన్ సంకుచ
త్పరసీజేక్షణుఁడై పయోనిధి చొరన్ సంధ్యాతటిత్పూర్వమై
నెరసెన్ జీకటి కార్మొగుల్ జగతిపై నిమ్నోన్నతాభోగముల్
సరిగావించుచు సర్వతోముఖమహాసారప్రసారంబులన్. 134

వసుచరిత్ర (4-11)

### శకటరేఫయగుటకు

ద్విపద: అఱి ముఱి బుచ్చి హేమాగ్నిలో వైచి
నెఱసి యార్చిరి దైత్యనికరంబు బెదఱ 135

రంగనాథ రామాయణము

## నెరపుట రేఫయగుటకు

సీ. పరిమళస్పర్శంబు నెరపె సింధురవల్లి
గ్రుచ్చి తావులు సోఁకఁ గ్రోవిరెమ్మ 136
వసుచరిత్ర (1–158)

క. వరమకుటరత్నకిరణ
స్ఫురణ ప్రతిఫుట్టనమున భుగ్నాగ్రములై
మరలు తనుద్యుతులను మఱి
నెరపె సుపర్వులకు విభుని నిటలాలకముల్. 137
కవికర్ణరసాయనము (6–131)

## శకటరేఫయగుటకు

చ. ఎఱుఁగవుగాక యొక్కవు డాకించుక మార్మొగమిడ్డ కూర్మికిన్
గొఱఁతయె యెంత చెప్పినను కోమల నేరవ యల్కఁదెచ్చుకో
నెఱియు నదీన వౌలెఱఁగి నేఁడిది కైకయి కోమి మిక్కిలిన్
నెఱపె నతండు నీవు వినవేర్పెద మా పలు కిప్పుడేనియున్. 138
కళాపూర్ణోదయము (7–208)

సీ. గీ. మెఱపువిల్లువిలాసంబు నెఱపు విల్లు
(గలుగునుతి కెక్కు జేని నాకరము లెత్తి
మ్రొక్కునటువంటి దైవసమూహములకుఁ
గ్లేశభవభంగ! యిష్టకామేశలింగ!) 139
రుక్మాంగదచరిత్ర (2–135)

గీ. వత్సరంబునఁ గడచన వ్రతము నాకు
దాని నీపాల జరిపి యుత్సాహవృత్తి
మెఱయు నీకుఁ గృతజ్ఞత నెఱపి తొల్లి
యెగ్గు చేసినవారి జయింపఁబోదు. 140
విరాట పర్వము (1–198)

గీ. ఆయుధంబులు విడిచితి నంతమీఁద
మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ 141
ఉద్యోగపర్వము (2–289)

సీ. ప్రవహించుటయుఁ వేగఁ బరువిడుటయును నే
యుటయును నగుఁ బఱచుట యనంగఁ
బఱపఁ జించుట పఱుసఁదనము పఱ
పటియలు పటికెలు పటిగొనుటయు
పఱతెంచు టమ్ములు పఱపుట శత్రులఁ
బరపుట పఱయు వెంపరయుఁ బఱుపు
పటిమార్చుటయును తెంపఱ పఱివోవుట
పఱువైన పువ్వు చూపఱ పిఱుంద

పిఱిచనుట పిఱివోవుట పిఱికితనము
పిఱుఁదు తెప్పిఱి పుఱియ మేల్పెఱుఁగుటయును
పెఱయు పెఱసని పోవుట పెఱుకుటయును
పెఱికెలును బండిఱాలు భూభృన్నివేశ! 142

వ. ఇందులో పరసఁదన మనుటయు, పరతెంచుటయు, పరిమార్చుటయు పరువగుటయు, చూపర యనుటయు, పెఱుగుటయు రేఫరకారముల రెంటం గల వని ప్రాచీనలక్షణకారుఁడు చెప్పినాఁడు. అందు 143

**పరుసఁదనము రేఫయగుటకు.**

సీ. కల్యాణగోత్రంబు గరిమ వంచిన దూరు
సరసుల నింకించు పరుసఁదనము. 144

వసుచరిత్ర (1–107)

క. తురగముఁదురగము గరిఁగరి
నరుఁడు నరునిఁ దేరుఁదేరు నరిఁ దాఁకినన
ప్పరుసఁదన మేమి చెప్పదుఁ
బొరిమిడు గురులెగసెఁ గైదువుల పొడి రాలెన్. 145

ద్రోణపర్వము (5–51)

**ఱకారమగుటకు**

ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు

లేల నీకు నెఱుఁగ నేలవలసె
జిరుతవాని కింత పరుసఁదనమ్ములు
సన్నె వృద్ధజనము లున్నచోట. 146

సభాపర్వము (2-228)

పరతెంచుట రేఫ యగుటకు

క. ఒరసికొనిపోవ నత్తఱి
సురసైన్యం బార్చుటయును జూచి తిమిరముం
గర మచ్చెరువుగఁ గ్రక్కునఁ
బరతెంచుడు నసురకొడుకు పరతెంచి వడిన్. 147

ఉత్తర రామాయణము (6-140)

అకారమగుటకు

క. వెఱచఱవ నీరిలో న
క్కొఱ గొన నొకమొసరి చూడ్కికి నగోచరమై
పఱతెంచి కుంభసంభవు
ఛిఱుతొడ పడిఁ బట్టుకొనియె శిష్యులు బెదఱన్. 148

ఆదిపర్వము (5-256)

క. నెఱయఁగ నసహ్యమగు న
మ్మెఱ వీనులఁబడఁగ మిన్నుముట్టు నెలుఁగుతో
వెఱవకు వెఱవకు మిదె నే
బఱతెంచితి సత్వరమున భామిని యనుచున్. 149

కళాపూర్ణోదయము (3-160)

సీ. చఱచి నిబ్బరముగాఁ బఱతెంచు ఖగరాజు
తెక్కగాడ్పుల మింట టెంగురనఁగ 150

పాండురంగమాహాత్మ్యము

ద్విపద : ఉరక నీరుగఁ జేసి యుగ్రవేగమునఁ
బరతెంచుగతిఁ జూచి భానువంశజుఁడు 151

రంగనాథరామాయణము

వ. పరివార్చుట అకారమగుట కుదాహరణము చింత్యము. 152

రేఫ యగుటకు

సీ. పరివార్పఁ జాల రెవ్వరు పెక్కుభంగుల
మాటలాడక మరుమాట లేల 153

స్త్రీ పర్వము (2–77)

క. కురుభీష్మకర్ణసైంధవ
గురుతనయులతోడఁ గూడఁ గురుపతిబలమున్
బరివార్చునట్టి సత్వము
పురుహూతా! యిమ్ము కరుణ పొంపిరివోవన్. 154

హరవిలాసము (7–24)

క. పరిభవకరుఁడగు కీచకుఁ
బరివార్చుట యిపుడు గడువఁబడియెనె యిమ్మై
దురిటిల్ల నేల వ్రేల్మిడి
బొరిగొని నీ మనసు కలఁక బుత్తు, లతాంగీ! 155

విరాటపర్వము (2–83)

వ. పరువనుట అకార మగుట చింత్యము. 156

రేఫ యగుటకు

క. తరుణీ! యీతరుశాఖాం
తరలోలదుకూలమారుతము లింద్రాణీ
పరివారవారసతులకుఁ
బరువపు విరిగొంత పొడము బడలిక కడఁచున్. 157

పారిజాతాపహరణము (4–4)

సీ. పరువంబు దప్పిన విరులు దాల్చుచుఁ దరు
చయము చుక్కలఁ జేసిచంద మఱయ. 158

ఉద్యోగపర్వము (2–112)

సీ. పరువంపు మంకెన విరివంపు నరవంపు
ఘాతెరచంద్రదంపు వాన గుఱియు 159
ఆముక్తమాల్యద (5-67)

### చూపర రేఫయగుటకు

మ. గురుబంధుల్ దను జుట్టి రాఁ దిగిచి య్యాక్రోశింప నిశ్శేషుఁడై
యొరలన్ దన్ను నెఱుంగ లేక యసుహృద్వ్యాధార్తి మ్రుంజెంది చూ
పరతన్ వ్రాయుచుఁ బో వివర్ణతమెయిం బాటిల్లె. 160
శృంగారషష్ఠము

### అకారమగుటకు

క. కొఱవియుఁ గొఱవియుఁ దాఁకిన
తెఱగున నర్జునుఁడు సురనదీసూనుఁడు చూ
పఱ వొగడన్ దాఁకుట ని
ద్దఱిదిక్కుల సైన్యములును దలపడియె వడిన్. 161
భీష్మపర్వము (1-288).

క. మెఱయు వెలిపూవులుం గడు
మెఱుగారెడు నఱటములును మింటను మంటల్
వరపెడువాలమ్ములు చూ
పఱ నల్లొలితాఁకు వెరఁగుపడఁజేసె నృపా! 162
కర్ణపర్వము (3-278)

వ. పెరుగుట శకటరేఫ యగుటకు చింత్యము. 163

### రేఫయగుటకు

సీ. ధృతరాష్ట్రునొద్దఁ దత్సుతులతో నొక్కటఁ
బెరుగుచు భూసురవరులవలన. 164
ఆదిపర్వము: (3-12)

చ. పెరిగిన యూసున స్నెమలిపింఛములన్ బురివిప్పఁ బోలునీ
సరసిరుహాక్షివేనలికి సాటెగ నిల్వఁగ నోడి... 165
శృంగారషష్ఠము

క. బఱబఱ నీడ్చుటయును ద
బ్బుఱ బిఱబిఱఁ ద్రిప్పుటయు వివాహముల తఱిన్
బిఱుసుఁ గొల్చుట కోటకు
బుఱుజులు వెట్టుటయు జొలు పురదైత్యహరా! 166

సీ. మఱచుట మఱునాఁడు మఱదలు మఱఁది యే
మఱుపాటు పలుమఱు మఱియు మఱుఁగు
మఱవ మృదాఖండంబు, మఱుగుట వేమఱు
మఱుపడి మఱలేక మఱుఁగు లేక
మఱగాలు మఱల త్రిమ్మఱుటయుఁ బడమఱ
మిఱే చూపులును మిఱుమిట్లు గొనుట
ముఱే వ ంఱే చీఁకటి ముఱే ముఱే బడి బడి
ముఱే మొండె మఱే మఱే మొఱము విడుట

మెఱపు మెఱయుట మెఱుఁగు కన్మొఱఁగుటయును
మెఱకతనమును వేపులు మొఱఁగుటయును
మొఱయు మొఱ మొఱ లాడుట మొఱక వెలితి
మొఱయుటయు బండిజొలు సముద్రతూణ! 167

వ. ఇందులో పలుమరు వేమరు సనుశబ్దములు రెంటం గలిగియుండు. అందు. 168

### పలుమరు రేఫ యగుటకు

చ. ఇరువురు సిగ్గులగ్గలపుటేవఁ గచాకచిఁ బైకొనన్ ముఖాం
బురుహయుగంబు వాంచి తలపుల్ మది నువ్విళు లూరఁ జూపులొం
డొరులపదంబులన్ దొరయ నొండు నెపంబున వోముల్లెత్తి ప
ల్మరు మరువెట్టిచూపునెడమన్ గుడిసేయఁ దొడంగెఁ గంతుఁడున్. 169
రావాభ్యుదయము (4–126)

### అకారమగుటకు

క. విఱుఁగుట నొచ్చుట మనదెస
దఱుచుగ నాడెదవు పాండుతనయులబల మే

డ్లెఱుఁ దలుగక పెనఁగుట బ
ల్మఱుఁ జెప్పెద నగుట యేమి మాయయొ తలఁపన్. 170
భీష్మపర్వము(3–31)

మ. మఱియున్ వచ్చిరి ధాత్రిఁ గల్గు నగసామ్రాజ్యైకధౌరేయులం
దఱుఁ దదుర్వరిభరాప్తి గ్రుంగ నవనిన్ దా మృత్పణారాజి బ
ల్మరు సంధింపుచు నుండెఁ గాని వసుకల్యాణంబు వీక్షింపఁగా
వెఱచెన్ శేషుఁడు శేషవృత్తి కగునే విస్రంభసంభారముల్. 171
వసుచరిత్ర (5–39)

## వేమరు రేఫయగుటకు

క. మరుఁ డన నెలకడ దాచిన
విరితూఁపును నల్లచెఱకువిండ్లను బలె వే
మరు నలరు చేరు చుక్కయు
సరుదుగఁ గనుబొమలు మిగుల నతివకు నమరెన్. 172
యయాతిచరిత్ర (4–35)

## అకార మగుటకు

పంచచామరము

మెఱుంగుబోడి కిట్లు చెల్వుమీఱ మారు వేసినన్
గుఱంగటన్ నిలంగరాని కూర్మివెచ్చ హెచ్చఁగాఁ
దుఱంగలించువేడ్కతోడ దూరి పల్కి రంత వే
మఱున్ మరున్ మరున్మృగాంకమత్తకోకిలాదులన్. 173
విజయవిలాసము (3–42)

వ. మరలుట రేఫఅకారముల రెంటం జెప్పియున్నారు. 174

## రేఫకు

క. పరిజనములు కన్నీరులు
దొరుగఁగ నడలొందె వారితోడన్ జనున

ప్పరుసునఁ దనదు తనూజుల
మరలమికిన్ బాండురాజమహిషి మరుగుచున్. 175

ఆశ్రమవాస పర్వము (1-164)

క. గిరితటముఁ దాఁకి తిరిగెడు
తరంగిణియుఁబోలె దేవతాపతి యాజ్ఞన్
మరలి వియచ్చరవాహిని
మురహరునిం బొదవి ఘోరముగఁ బోరుతఱిన్. 176

పారిజాతాపహరణము (5-15)

క. అరిగి సమిత్కుశకుశాం
కురపక్వఫలోత్కరంబుఁ గొని గృహమునకున్
మరలి యట వచ్చునప్పుడు
ధరణీసురనందనుండు దనకెట్టెదురన్. 177

కవులషష్ఠము

అకారమగుటకు

చ. నెఱయఁగ నీ ప్రసాదమున నిర్జరలోకలలామ నాకు నే
గొఱంతయు లేదు కోరఁగల కోరిక యెద్దియుఁ గానవైన నా
కొఱకు రణంబులోనఁ గపికుంజరు లీల్గిన వారు, వారలన్
మఱలఁగ వేగ నిచ్చుటయె మన్నన దీననె సంతసిల్లుదున్. 178

భాస్కరరామాయణము (యు.2450)

సీ. అట్టు వొందుటయును అంపిల్లుటయు అంకు
అవఅపల్ కోపము అవళి అవికె
అంతులు వజ్రపు అవలును అంపము
అకిరించుటయు అిచ్చ అిక్క విడుట
అివ్వన నెగయుట అింగున మ్రోగుట
శిలలు అువ్వుటయును చిలుక తెక్క
తెల్లిగడ్డియు కనుతెప్పలు మూయుట
పూతెమ్మలును అొమ్ము పాలుపు మీఱ

శకటరేఫమ్ము లై మహాసుకవివరుల
కావ్యములయందుఁ దఱచుగఁ గ్రాలుచుండుఁ
జక్రధరబాణ ! భువనరక్షాధురీణ !
దురితనిర్నాశ ! పీఠికాపురనివాస ! 179

వ. ఇందులో రవళి అకార మగుట కుదాహరణము చింత్యము. 180

**రవళి రేఫయగుటకు**

సీ. ఎల్లప్పుడును బిక్కటిల్లు పేరుల్గ మోత
రహి మించు తరగలరవళి గాఁగ 181

యయాతిచరిత్ర (4–154)

మ. నవలావణ్యపయోధిఁ జిత్తమను మంథానాద్రికిన్ జంద్రికా
పవనాశిం దర్కితాడుఁగాఁ జెనచి యబ్జాతాసనుందీర్చినన్
రవళిం గోకిలకీరముల్ దరువ నారత్నాకరంబందు ను
ద్భవముం బొందిన లక్ష్మిగావలయు నప్పద్మాక్షి వీక్షింపఁగన్. 182

శకుంతలాపరిణయము (2–184)

**అవికె అకారమగుటకు**

చ. అవికెయుఁ బట్టుపుట్టము చెఱంగు మఱుంగయి యున్కిఁ జేసి గౌ
రవపరిమాణముం దెలియరామికి (ముచ్చిరుచున్న యొక్కప
ల్లవునకుఁ జూపె నొక్కతె విలాసముతోఁ దనదోరపుంజనుం
గవపొడ వింతపొ మ్మనిన కైవడిఁ బానకహేమకుంభమున్). 183

శృంగారనైషధము (6–131)

వ. రంతనుట రేఫఅకారములు రెంటం గలిగియుండును. 184

**రేఫయగుటకు**

ఉ. అంగడివీధిఁ బల్లవుల కానగ మామిడిపండు లమ్మచున్
జంగమువారిపిన్నది పిసాళితనంబునఁ జూచెంబో నిశా

తాంగజబాణ కైరవ సితాంబుజమత్తచకోరబాలసా
రంగతటిన్నికాయముల రంతులు చేసెడి వాడితూపులన్. 185
శ్రీనాథుని చాటుధార

కొ. అంతుల్ సేయకు కుక్కుటాధమ! దరిద్రక్షుద్రశూద్రాంగణ
ప్రాంతోలూఖలమూలతండులకణగ్రాసంబుచే గ్రొవ్వి దు
ర్వాంతాస్వానిలభిన్న హృత్ఫణిఫణాంతర్మాంసమాధుర్య మే
చెంతం గ్రోలు ఖగేంద్రుచెంగటను నీజెంజాటముల్ సాగునే 186
శ్రీ నాథునిచాటుధార

అకారమగుటకు

రగడ : అంతేమిటికిఁ గొరంతే మల్లెల
వంతులుకా సే వంతులు చెల్లెల 187
యాయాతి చరిత్ర (4–26)

సీ. అంతుతో మేర మీర దొకప్పుడును ఘన
శ్రీలఁ బొందియును నీసింధుకన్య 188
వసుచరిత్ర (6–56)

ఉ. అంతులు మీటి మిక్కిలిగ టౌగతనంబున దొమ్మిచేసి దు
ర్దాంతపరాక్రమోన్నతులు దానవదైత్యులు (వేల్పువెజ్జుధ
న్వంతరిచేతి దుగ్ధమయవార్ధిసుధాకరపూర్ణకుంభమున్
సంతన కట్టి పుచ్చుకొని చయ్యన నేగిరి నిర్వశంకతన్) 189
శివఖండము (11–14)

టీకిరించు, టింగురను, టెక్కు, టిచ్చ టెప్ప యనునవి అకారమగుటకు

సీ. టీకిరించుకొనియున్న టెక్కుమొత్తము తోడ
నొడలు జాడించి నెవ్వడి విదుర్చు. 190
శృంగారనైషధము (2–5)

సీ. చరచి నిబ్బరముగాఁ బఱతెంచు ఖగరాజు
టెక్కుగాడ్పులు మింట టింగురనగ 191
పాండురంగమాహాత్మ్యము

వొప్పులకుప్పవై సిరులు నొందెద వేటికిఁ గుందె దమ్మ మా
యప్పనుగా మదిం దలఁపకమ్మ నినూతనసాహసంబులన్. 197
వసుచరిత్ర (4–53)

ఉ. ముప్పిరి గొన్న వాచవుల మోహ మొకింతయుఁ దప్ప నీదుకన్
జెప్పలు గప్ప నీదొకతఱిన్ జెమరారఁగ నీదుమేన (నె
ల్లప్పుడుఁ దృష్ణచేఁ దనివినందఁగ నీదు నృపాల మౌళి నే
చొప్పనఁ బుట్టెనో భువనసుందరి సింధువరామృతంబునన్). 198
వసుచరిత్ర (6–93)

ఉ. ఱెప్పలు వ్రాల్ప కప్పడమిఱేని మనోహరమూర్తిఁ గన్నులన్
దప్పక చూచిచూచి విబుధప్రమదల్ ప్రముదంబు లాత్మలం
జిప్పిలుచుండ నెద్ది పరిశీలన సేసిరొ యట్టియబ్బెసం
బిప్పుడు వారుచూపుదు రపేతనిమేషములైన చూపులన్. 199
శృంగారనైషధము (1–67)

ఉ. ఎప్పుడు నెయ్యుడం బొదవి యుండఱకుం దగ నీవు కంటికిన్
ఱెప్పయుపోలె మాటయి నెఱిన్ బను లారసి యొజ్జచాడ్పునన్
జెప్పచు (వీరబుద్ధిఁ గొని చేయుము కార్యము నీకు రక్ష దా
నిప్పరమేశ్వరుండు గలఁ డిచ్చు శుభం బని చూపె కృష్ణునిన్.) 200
ఉద్యోగపర్వము (4–114)

వ. రొమ్ము గురురేఫ యగుట చింత్యము. 201

రొమ్ము రేఫయగుటకు

ద్విపద : నీ రొమ్ముఁగొని కాఁడ నేర్తునా చూడ
నీ రాజ్యగతిఁ జూడ నేరుతుఁగాక 202
రంగనాథరామాయణము

వ. తక్కిన విశ్లే గ్రహించునది. 203

గీ. వఱత వఱదయు వఱలుట వఱడు వఱుగు
విఱుఁగు విఱివోటు విఱిగాలి విఱివిడియును.

వెలుపు నివ్వెఱ వెఱబొమ్మ వెఱచఱచుట
వెఱగుఁ గురురేఫ లుష్ణాంశువిధురధాంగ ! 204

క. సుఱసుఱ స్రుక్కుటయునుఁ బెం
పఱి యుసుఱుసు రనుట యారయఁగ గురురేఫల్
మఱి నిడుపుల గురురేఫము
లెఱిఁగించెద చిత్తగింపు మిందువతంసా ! 205

ఉ. ఆఱనితేజ మాఱడియు నాఱిక పంటయు నాఱు షట్కమూ
టాఱిన ముత్తియంబు తడియాఱెను పాపము లాఱె జిల్గునూ
గాఱు వెలంది కొప్పెనను నట్టి పదంబులయందు పెద్ద ఱాల్
మీఱుచు నుండుఁ గబ్బముల మేరుమహీధరరాజకార్ముకా ! 206

వ. ఇందులో ఆఱుట యనఁగా నిండుటకును, అడంగుటకును అర్థ
మగును. నిండెనను అర్థము చెప్పునప్పుడు లఘురేఫయును, అడంగె
నను అర్థము చెప్పునపుడు గురురేఫయు నగును. 207

**నిండెనను అర్థమునందు లఘురేఫ అగుటకు**

క. కౌరవులు సేయునపకృతి
కారణమునఁ గోప మెత్తు కర్ణుని వదనాం
భోరుహముఁ గనుఁగొనఁగ శమ
మారున్ నావశము గాక యంతన బుద్ధిన్. 208

శాంతిపర్వము (1–13)

వ. శమమారు ననఁగా శాంతము నిండు ననుట. 209

**అడంగు నను అర్థమందు గురురేఫ యగుటకు**

క. కాఱడవిఁ బఱచు మృగముల
నూఱటకున్ డిగిచి డస్సియున్నతనిశ్రమం
బాఱఁగ నెదఁ బరితాపముఁ
దీఱఁగఁ బైవీచె నన్నదీపవనంబుల్. 210

ఆదిపర్వము (4–19)

వ. శ్రమ మాఱఁగ ననఁగా నలయిక యడంగఁగా ననుట. 211

ఉ. ఆఱడియాన నీరసధనాధిపలోకము నిండ్లవాకిళుల్
దూఱుట మాని శ్రీనగము తూరుపువాకిలి దూఱి పాపముల్
నీఱుగఁ జేసె గంధవతి నీళ్లను గ్రుంకి మనంబులోని చి
చ్చాఱఁగఁ జేయు టొప్పు త్రిపురాంతకదేవునికై నమస్కృతుల్. 212
త్రిపురాంతకోదాహరణము

ఉ. ఆఱడిపోకయున్ ఫలము నందుటయుం గని పల్కనేరమిన్
మాఱటనోరిదాన నయి మాటలు చిత్తమునం దలంపకే
కాఱులు పల్కెదన్ వినుఁడు కర్ణము నెగ్గనుఁ గాన నల్కనై
వీఱిడి యైన మానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే. 213
ఉద్యోగపర్వము (3–107)

ఆఱు సంఖ్యాపరమై నప్పుడు గురురేఫ యగుటకు

క. ఆఱమ్ము లతని మేనం
దూఱంగా నేసె నాల్గు తురగాంగములన్
గీఱించినఁ గని ద్రోణుం
డూఱట ధర్మజుని దెసకు నున్ముఖుఁ డయ్యెన్. 214
ద్రోణపర్వము (4–13)

ఉ. ఆఱురసంబులం జవులయందలి క్రొత్తలు పుట్ట నిచ్చలున్
వేఱొకభంగిఁ బాకములు విన్నను వొప్పగఁ జేసి చేసినన్
మీఱఁగ బాసినీఁ డొకరినిం బురిఁ గానని యట్లుగాఁగ మే
న్గాఱియ పెట్టి యైన నొడికంబున వండుదుఁ గూడుఁ గూరలున్.215
విరాటపర్వవం (1–77)

నూగాఱు అకార మగుటకు

సీ. వెడవెడ నూగాఱు వింతయై యేర్పడ
దాఱని వళులతో నాఱు నిగుడ. 216
విరాటపర్వము (1–245)

క. ఊఱడి యనఁ జాలించుట
ఊఱుంగాయలును జలము లూఱుటయును బం
డ్లేఱుట యేఱువ సీమయు
నేఱును గురురేఫ లయ్యె నిందుకిరీటా ! 217

సీ. కోలుమసంగెడు కోర్కులు వెనువెంటఁ
బాఱుచు చునునికికి నూఱటయును. 218

విరాటపర్వము (2–315)

క. కాఱడవిఁ బఱచు మృగముల
నూఱటకుం డిగిచి డస్సియున్నతనిశ్రమం
బాఱఁగ నెదఁ బరితాపముఁ
దీఱఁగఁ బై వీచె నన్నదీపవనంబుల్. 219

ఆదిపర్వము (4–19)

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁ బెట్టిపు
త్తెంచిన మంచి కజ్జములు తేనియ నేతను దోఁచి తోఁచి భ
క్షించుచుఁ దల్లిఁదండ్రిఁ దన చిన్నికరాంగుళి వంచివంచి యూ
ఱించుచునాడె మిన్నగమి తేనికుమారకుఁ డింటి ముంగలన్. 220

హరవిలాసము (2–106)

క. ఆఱెడు వగల చారుల్
నూరు విధంబుల రసావళుల్ వేయివహుల్
గూఱలు బచ్చ ళ్లార్చిం
డూఱుంగాయలకు లెక్కయు న్మరి కలదే ! 221

బహుళాశ్వచరిత్ర (4–50)

క. కాఱుమెఱుఁ గతని నారుల్
నాఱు ల్వోసిన విలోకనమ్ములు నాఱుల్
నూఱొఱువగలఁ బెట్టిన
యూఱుంగాయలు ఘటించి రొండొరు లెడలన్. 222

బహుళాశ్వచరిత్ర (4–36)

గీ. తాను నల్వురుఁ జని తృణధాన్య మల్ప
మేటికొని వత్తు రాకలి దీఱకుండ. 223

అశ్వమేధపర్వము (4–220)

క. ఏఱకుమీ కసుగాయలు
దూఱకుమీ బంధుజనుల దోసము సుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువులాజ్ఞ మేదిని సుమతీ! 224

సుమతిశతకము

క. ఈఱములు గుబురుకొనునెడ
దాఱును వా రేగుతెరవు దప్పి చెమటమై
నేఱులుగఁ గాకి దూఱని
కాఱడవిం బఱచుచో నొకానొకచోటన్. 225

చంద్రభానుచరిత్ర (3–42)

గీ. వినుము సత్త్వాది గుణము నాననమయాత్మ
తత్త్వమున లీనములు సేయఁ దన్మయత్వ
దర్శనము దాన నదిమహాదధి నడంగు
నేఱు లట్లన రూపఱు వేఱులేక. 226

శాంతిపర్వము (4–356)

గీ. కాఱడవి కాఱుపోతులు కాఱుటయును
కాఱియలఁ బెట్టుటయు హెంచకాఱిపాము
కోఱలును బండ్లు గీఱుట, గీఱు టనఁగ
నాడుటయు బండిఱాలు పన్నగవిభూష! 227

క. కాఱడవిఁ బఱచు మృగముల
నూఱటకుం డిగ్గిచి డస్సియున్నతన్విశ్రమం
బాఱఁగ నెరఁ బరితాపముఁ
దీఱఁగఁ బై వీచె నన్నదీపవనంబుల్. 228

ఆదిపర్వము (4–19)

సీ. మీఱుచు నేట్లాడు కాఱుపోతుల కొమ్ము
చప్పళ్లఁ బులుఁగులు కుప్పకూల. 229
యయాతి చరిత్ర (1–116)

ఉ. కోఱలు గీటుచు న్నయనకోణములన్ దహనస్ఫులింగముల్
గాఱఁగ నూర్పులం జదల గాలికి నొక్కట తూల బాహువుల్
నూఱును బూచి మై వెనిచి నూఱుశిరంబుల నూర్ధ్వ దిక్తటుల్
దూఱఁగఁ గాలనేమి రణదోహలియై కడఁగెన్ సముద్ధతిన్. 230
హరివంశము (పూ. 4–143)

ఉ. పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మద్భలంబునకుఁ గాఁదగునే వివిధాస్త్రసంపదల్
మీఱిన నీవు సూడఁగ నమేయపరాక్రమ నీకుఁ బాండవుల్
మాఱె తలంప నీ తగు బలంబును జేవయుఁ జూపు మిత్తఱిన్. 231
కర్ణపర్వము (3–10)

క. పాఱిన నాతని వెనుకన
పాఱితి సంప్రార్థన ప్రభాషణములతోఁ
దేఱి మఱలి యమ్మని మిము
గాఱియఁ బెట్టితిఁ గదే యకట! యనుచు దమున్. 232
అనుశాసనిక పర్వము (5–373)

వ. కాఱులనుటకుఁ గూఱ లనుటకుఁ బ్రాచీనలక్షణకారుఁడు (లఘు) రేఫలు గానే చెప్పెను గాని ఱకారములలో చెప్పినాడు కాడు. మహాకవులు ఱకారములుగా ప్రయోగించినారు. ఉదాహరణము. 233

ఉ. ఆఱడిపోకయున్ ఫలము నందుటయున్ గని పల్కనేరమిన్
మాఱటనోరిదాన నయి మాటలు చిత్తమునం దలంపకే
కాఱులు పల్కెదన్ వినుము కర్జము నెగ్గను గాన నల్కమై
పీఱిడి యైన మానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే. 234
ఉద్యోగపర్వము (3–107)

క. ఆఱేడు వగల చారుల్
నూఱువిధంబుల రసావళుల్ వేయువహుల్

కూఱలు వచ్చ ళ్ళూర్పిం
డూఱుంగాయలకు లెక్కయున్ మఱిగలదే. 235

బహుళాశ్వచరిత్ర (4-50)

ఉ. వేఱొకచాప మెత్తి పృధివీవర ధర్మతనూజుఁ డింతతోఁ
దీఱఁగఁ జేయుదున్ బగ యతిప్రకటంబుగ నంచు సూతుమై
దూఱుతురంగమాంగములు దూలులు వోవఁగ శల్యు నంగముల్
గీఱ సిడంబు గాడఁబఱగించె సముజ్జ్వలచండకాండముల్. 236

శల్యపర్వము (1-197)

ఆ. చాఱు త్రావుటయును జాఱల బెబ్బులి
చాఱపప్పు సఖులఁ జీఱుటయును
చూఱఁగొనుట యుట్టి చేఱు చేఱెడు చోఱ
మీఱు బండిఱాలు శూలపాణి.237

చాఱు ఱకారముగుటకు

ఉ జోఱున వర్షముల్ గుఱియ సువ్రతుఁ డా చిఱుతొండనంబి దై
వాఱెడు భక్తిఁ బెట్టు శివభక్తుల కర్థిఁ జతుర్విధాన్నముల్
తాఱని యొప్పు పప్పును ఘృతంబును తియ్యని పానకంబులున్
జాఱులు పిండివంటలును శర్కరయున్ దధియున్ యథేచ్ఛగన్. 238

హరవిలాసము (2-32)

చీఱుట పిల్చుట యగు నప్పుడు ఱకారముగుటకు

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు బాహుల నొడ్డఁడు బంధురాజిలో
దూఱఁడు ఘోరకృత్య మని దూఱఁడు తండ్రిని మిత్రవర్గమున్
జీఱఁడు మాతృసంఘము వసించు సువర్ణగృహంబులోనికిన్
దాఱఁడు కావరే యనఁడు తాపము నొందఁడు కంటగింపఁడున్. 239

సప్తమస్కంధము (194)

### చీరుట, చించుట యగునప్పుడు రేఫయగుటకు

ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి రథంబు వగిల్చి కేతువున్
జీరి శరాసనంబు వొడి చేసిన... 240
అశ్వమేధపర్వము (4–104)

వ చూఱ యనుట రేఫ అకారములు రెంటం గలిగి యుండును. 241

### రేఫ యగుటకు

ద్విపద : ఏసి బంగారంపుటెండ్లలోఁ జూచ్చి
రాసు లర్థములు చూరలు చల్లువారు. 242
రంగనాథరామాయణము

సీ. వందిమాగధుల కైవారంబు శుభతూర్య
వార రవంబులఁ జూరఁగొనఁగ 243
కవికర్ణరసాయనము (3–174)

### శకటరేఫ యగుటకు

క. నూఱు తెరంగుల నెరసులు
మీఱఁగ నీ విభ్రమములు మెఱయించి మునిం
గాఱఁగఁ జేయుము, మేనక
చూఱఁ గొనదె యతని తెలివిసొమ్ములు మున్నున్. 244
ఎఱ్ఱాప్రగడరామాయణము

క. వేఱుగఁ గన్నినం బ్రకృతిం
జూఱవిడిచినట్లు తనదు సుజ్ఞానమున
క్కాఱు విడచి తనకం టెను
మీఱ నొకటి లేమి కాన్పు మేకొన వలయున్. 245
అనుశాసనికపర్వము (4–202)

ఉ. మీఱిన భద్రరాగముల మీఁదికి దాటి తదీయకుంభముల్
చూఱలు వట్టు కేసరికిశోరనఖావళినుండి రాలి యా

ఱాఁటని మౌక్తికంబులు ప్రియంబున నేఱి కిరాతబాలికల్
గీఱిన గింజ లాడుదురు కేలిదలిర్పఁగఁ బక్కణంబులన్. 246

కువలయాశ్వచరిత్ర

వ. చేరనుట శకటరేఫ యగుట చింత్యము. రేఫ యగుటకు. 247

ఉ. క్రిందను మీఁదనుం బడియుఁ గించిదసూయఁ బెనంగులాడున
ర్చేందుఁడు నుల్లసత్త్వలసమృద్ధతమిస్రముపోలెఁ జాలఁ జె
న్నొందెడు ఫాలము న్గబరి యుప్పరి పాపట ముత్తియంపు చే
రుం దిలకంబుఁ గస్తురియు రూఢిగ బాహుల లీల నొప్పఁగన్. 248

కళాపూర్ణోదయము (7–124)

వ. చేరెడనుట శకటరేఫ యగుటకు చింత్యము. 249

క. జాఱుట యనఁగ బజాఱు హ
జాఱము మొగసాల, మఱి తుజాఱులు ధనికుల్
జోఱున వానలు గుఱియుట
మీఱుట గురురేఫ లగుచు మిహికాంశుధరా! 250

జాఱు శకట రేఫయగుటకు

ఉ. జాఱుటయుం దదూరుయుగసాంద్రరుచుల్కటిమీఁద నుండి దై
వాఱినఁ గాంచి పంచశరపంచశరీపరికంపితాత్ముఁడై
పాఱుడు దా బహుశ్రుతము బల్మియు భావవిశుద్ధి కల్మియున్
మీఱిన నెమ్మనంబు గడిమి న్నిలు పోపఁగ లేక లోలతన్. 251

శృంగారషష్ఠము

గీ. తాఱుటయుఁ దీఱుటయు తీఱు తీఱిమయును
దూఱుటయుఁ దేఱుటయుఁ గడిదేఱుటయును
దేఱిచూచుట ధర్మంబు దేరుటయును
వేఱుదు రనంగ బండిఱాల్ త్రిపురవైరి! 252

### తాఱుట గురురేఫ యగుటకు

శా. తాఱం గాగిన నేల తంపఱతఁ బాతాళంబుదాఁకం జనం
దూఱం జెల్మిఱి మిన్నుఁ దాఁకి తరగల్ దోరంబులై నల్గడల్
బాఱం జెల్లఁగ నేఱు లుబ్బుఱముగాఁ బైపైన నీఱెక్కి దై
నాఱం జెర్వులు చెన్నుమీఱె నఖిలప్రాణుల్ ముదంబందఁగన్. 253

ఎఱ్ఱాప్రగడ రామాయణము

### తీఱుట గురురేఫ యగుటకు

క. తీఱిడితనంబు వెట్టుచుఁ
దూఱంబనిలేదు నిన్నుఁ దొల్లిఁటి చెయ్వుల్
దీఱ నది యనుభవింపక
వేఱుండునె పూర్వజన్మవివిధకృతంబుల్. 254

భాస్కరరామాయణము (యు. 2238)

వ. తీరనుట రేఫ రకారములు రెంట నుండును. 255

### రేఫ యగుటకు

క. ఈ రాజున కివముగ నొక
తీరునఁ గావించి సేదఁ దీర్పమి దగునా
(యోరుచునా మై సెగలకుఁ
జేరఁగరా దనుచు నెడము సేయందగునే.) 256

యయాతి చరిత్ర (5–95)

### అకార మగుటకు,

ఆ. సందియంబు వడ విచారంబునకుఁ జొర
వ్రాఱు వల్క నొండు తీఱు సేయ
వెఱుగు గాఁగఁ బిడుగు వ్రేసిన యట్లైన
వ్రాటి కియ్యకొనుచు బోటిపలుకు. 257

ఉత్తర రామాయణము (9–20)

తేఱుటకు

ఉ. మీఱిన కోఱలున్ మిగుల మింటికిఁ బర్విన పల్క వెంట్రుకల్
తీఱిన మిట్టగ్రుడ్లు నతితిగ్మతరంబగు నట్టి సాహసం
బాఱనితేజమున్ దిశల నంటిన చేతులు లోకరాజిలో
నేఱిన మేటి రూపరుల నెంతయు నేర్చిరి రాక్షసుల్ వడిన్. 258

భాస్కర రామాయణము

తేఱుటకు

క. తేఱుదురు రిపులు నక్కఱ
మీఱుదురును నిపుడు మూర్ఛ మెయి నిట్టూర్పా
బాఱని తేజంబులతో
నీఱుపయిం గవిసియున్న నిప్పులు వోలెన్. 259

భాస్కర రామాయణము (యుద్ధ. 592)

తేఱిచూచుటకు

క. మీఱిన భయమున రామునిఁ
దేఱి కనుంగొనఁగ నోడి ధృతిమాలి కడున్
వేఱొకని తేఱిప్పెఁ బడి
బాఱి యతఁడు లంక సొచ్చెఁ బౌరులు బెదరన్. 260

భాస్కరరామాయణము (యుద్ధ. 854)

వ. మూఱుట అకార మగుటకు ఉదాహరణములు మునుపే బహుళముగా చెప్పినాము. 261

గీ. నాఱు విడుచు టుల్లినాఱు సొన్నాఱియు
నీఱు నిప్పులందు నెఱయు బూది
నూఱు సంఖ్య పసపు నూఱుటయును బెద్ద
బాఱు, జాతరూప శైలచాప. 262

నారువోయుట అకార మగుటకు

క. కాఱు మొఱుగతను నారుల్
నాఱుల్ వోసిన విలోకనమ్ముల నారుల్

నూఱాలు నగలఁ బెట్టిన
యూఱుంగాయలు ఘటించి రొండొరు లెడలన్. 263

హంసవింశతి చరిత్ర (4-36)

క. తేఱుదురు రిపులు నక్కఱ
మీఱుదురును నిపుడు మూర్ఛమెయి నిట్టున్నా
ఱౌఱని తేజంబులతో
నీఱుపయిం గవిసియున్న నిప్పులు వోలెన్. 264

భాస్కర రామాయణము (యుద్ధ. 592)

నూఱు సంఖ్యాపరమైనప్పుడు గురురేఫ యగుటకు

ఆ. నూఱుగతుల నీవు వాఱు దే నన్నియు
నెఱుఁగఁ బుఱుఁగులెల్ల నెట్లు వాఱు
నడరి యాకసమున నిడుబాట నట్లు పా
ఱుదము రమ్ము జలధి చదల ననిన. 265

కర్ణపర్వము (2-63)

చ. అనుటయు భీతి వేడికొని యావులు వేయును నెడ్లు నూఱు, నూ
నుఱు రథముల్ శతంబును మెఱుంగుల మొత్తము వోని యంగనా
జనశతకంబు దంతిశతసప్తకముం గొని శాంతి బొందనే
యనినను మాన్పఁ డయ్యె వసుధామరు కోపము తీవ్ర రూపమై. 266

కర్ణపర్వము (2-91)

క. పాఱుఁడు నది వాఱుటయును
బాఱుట మేనెల్ల గగుఱు పాఱుట (పడుటయు) యింకన్
బాఱుట పేఱుట పెనుఁగుట
పోఱడు నా శకటరేఫములు వృషభాంకా! 267

పాఱుఁడు-పాఱుట శకటరేఫ లగుటకు

గీ. అరుగుదెంచితి ననియు ధనార్థి ననియు
నిట్లు వినిపించుటయు రాక్షసేశ్వరుండు

(బదబాహాకటివిమధ్యవక్షము లసంభావ్యత్వరాచిత్రితో
న్మదనానాగతరేఖలన్ మెఱయు భీమాత్వత్సుతుల్ దీప్తులై) 274

శల్యపర్వము (2–259)

మాఱుకొనుటకు

గీ. పాండవుల సైన్యమును సముద్దండలీల
మాఱుకొని నంతకును మూర్ఛ దేఱి నకులు
తమ్ముఁ డమ్మామపైఁ బడిఁ యమ్ము లొక్క
పెట్టఁగుచ్చి యాతని విలు బెట్టు ద్రుంచె. 275

శల్యపర్వము (1–385)

పెక్కుమాఱు లనుటకు

గీ. ఓరి దుష్టాత్మ నే నిప్పు పోరఁ బెక్కు
మాఱు లెగునంగ సిగ్గఱి పాఱుచుండు
దట్టి నీయున్న యునికిన (యిట్లలముగ
నిట్టి బీర మెక్కడినుండి పుట్టెఁ, జెపుమ). 276

ఆరణ్యపర్వము (6–375)

మాఱాడుటకు

క. వేఱొక తెరఁగున నోరులకు
మాఱాడక యునికి లెస్స మనుజేంద్రుకడన్
దీఱమి గలచోట్లం దా
మీఱి కడఁగి వచ్చి పెంపు మేకొన వలయున్. 277

విరాటపర్వము (1–128)

వేమాఱు ననుటకు

క. మీఱిన మౌనుల కినుకను
మాఱులుగక యున్న మీ సమగ్రక్షమ వే
మాఱుఁ గొనియాడఁగాఁ దగు
గీఱునె సాత్త్వికుల బుద్ధి కిల్బిషచయముల్. 278

నృసింహపురాణము (1–95)

ఉ. కోఱలు నుగ్గునుగ్గయిన క్రూరఫణీంద్రు గతిన్ దరంగముల్
మూఱిన భూరివారిధిక్రమంబున రాహుకరాళవక్త్రయున్
దూఱిన తీవ్రభానుక్రియ దోర్బలసైన్యతఁ బుత్రహీనతన్
గీఱె పరాభవాది గతి గీడ్పడి భూపతి నెమ్మనంబునన్. 279

ఎఱ్ఱాప్రగడ రామాయణము

వ. మూరిమసగుట అకార మగుటకు చింత్యము. 280

రేఫ యగుటకు

ఆ. అనిన నతఁడు పాండవాగ్రజుఁ గవలను
దాఁకి విపులబాహుదర్ప మొప్ప
నారసములఁ బొదవి మూరిమసంగిన
ట్లాయినఁ జూచి నరుఁడు ననిలసుతుఁడు. 281

భీష్మపర్వము (3-242)

మీఱుటకు

ద్విపద : మీఱె యింద్రాది సమితి గిట్టి నూఱు
మాఱులు గెలిచిన మగటిమివాఁడు 282

రంగనాథ రామాయణము

చ. చనుగవ వ్రేగునన్ మిగుల సన్నపుఁగౌఁ నసియాడఁ గెంపు మీ
ఱిన నును బట్టు చేల కటి ఱింగులు వాఱఁగఁ గట్టి భూమి భృ
త్తనయ ప్రసూనగుచ్ఛములు దాలిచి తేఁజిగురు ల్ధరించి వ
చ్చిన నడతీఁగ వోలె నిలిచెం దరుణేందుకిరీటసన్నిధిన్. 283

హరవిలాసము (3-69)

అ. ఱాచుటయును ఱాయి ఱాఁగ ప్రేవేచుట
ఱెప్ప ఱేవు ఱేసి ఱేక ఱేఁడు
ఱేల ఱేచుకుక్క ఱేగు ఱోయుట ఱోత
ఱోలుటయును బండిఱోల శర ! 284

వ. ఇందులో రాచుట అకారమగుటకు చింత్యము. 285

రేఫయగుటకు

ఉ. రాహును గాను నిన్నరయ రాచిన శూలినిఁ గాను సీతను
ద్రోహము చేసినట్టి యల రోహిణితండ్రిని గాను తజ్జగ
న్మోహిని నీలకచ ముద్దుల చక్కెరబొమ్మఁ గూర్పక
య్యో, హరిణాంక తావక మయూఖ ముఖంబుల నేచనేటికిన్. 286

రాజశేఖరచరిత్ర (3–150)

వ. మఱియు నుదాహరణములు రేఫ లగుటకు బహుళముగా గలవు. 287

ఆ. రాయి యనెడు చోటఁ బాయక రేఫయం
చార్యులై ప్రసిద్ధులైన కవులు
గృతుల నిలిపిఁ, రమలమతి తిక్కవిభు గరు
రేఫ గాఁగ నిలిపెఁ గృతి నుమేశ! 288

రాయి రేఫ యగుటకు

గీ. మరుని యమ్ములనఁదగు తేఁటి సిరుల వఱలు
తెఱవ కుఱులకు సరిగామిఁదివిరిరాక
కడిమిఁ దమ పెంపువోఁ బూరిఁ గఱవనేల
రహి యలర వేలుపుల రాచరాలకెల్ల. 289

యయాతిచరిత్ర (4–34)

క. నీలంపు మేని సూత్రపు
రాల కసుంగవయు పుష్యరాగపు మెన్నున్
గ్రాలెడు చొక్కపు తుమ్మెద
తాళీ యొక లేమ పేరె దన్నెలకొల్పన్. 290

చంద్రభానుచరిత్ర (5–156)

సీ. రాయైన తబిసి పేరంటాలిఁ గమ్మర
గలిగించు నడుగుచే వెలసినాఁడు 291

శృంగారషష్ఠము

ఉ. జాయను జూపవేమి యనుజా! యను, నవ్విధి యెంత చేసె నౌ
రా యను, నాదుగుండె బలురా యను, (నాత్మపరాక్రమోన్నతుల్
వోయను గాననాంతరము రోయును దుష్టకురంగచేష్ట సు
వర్మ యను జానకీ! దనుజమాయను గ్రుంకితె, పల్కవా! యనున్). 292

రామాభ్యుదయము (5-225)

## శకట రేఫ యగుటకు

క. నాయుల్లు మరయ నిను మో
హాయెో కాకిట్లు రూపఱక విన నోర్చెన్
సాయక సముదయ ఖర భవ
దీయవచనచయము గపియెుఁ దేట్రం దిరమై. 293

భీష్మపర్వము (3-419)

క. పోక నడు కొట్టితేనియు
తాకింతుఁ జవిూ మొగంబు తాచట్టుపయిన్
గ్రికాశిక నిందించిన
నీ కింతట నేల పోవు నీచచరిత్రా! 294

భీమఖండము (2-154)

ఆ. బిజ్జలాడి యూగి తొవడి సభలోన
(తేసి పోరిలోన టిచ్చఁ బొఱసి
తెన్నమడుగు పుడమితేండ్రడ నేల నుతింప
మనకు విశ్వనాథుఁ డౌనరియుండ). 295

పెద్దిరాజు అలంకారము (7-45)

## తాఁగ శకట రేఫ యగుటకు

ఉ. అంతులు విూటి మిక్కిలిగ తొఁగతసంబున దొమ్మి చేసి దు
ర్దాంతపరాక్రమోన్నతులు దానవదైత్యులు (వేల్పువెజ్జు ధ
న్వంతరి చేతి దుగ్ధమయవార్ధి సుధారసపూర్ణకుంభమున్
సంతన కట్టి పుచ్చుకొని చయ్యన నేగిరి నిర్విశంకతన్). 296

భీమఖండము (4-96)

### తెప్ప, తేపు అకారమగుటకు

ఉ. అప్పుడు ముద్దరాలిఁ జెలు లక్కునఁ జేర్చి ముఖాబ్జ మెత్తి కన్
దెప్పల బాష్పముల్ దుడిచి తేపె నృపాలుఁడు గారవింప (నీ
వొప్పులకుప్ప వై సిరుల నొందెద, వేటికిఁ గుందెదమ్మ! మా
యప్పువుగాఁ మదిం దలఁపకమ్మ, వినూతనసాహసంబులన్). 297

వసుచరిత్ర (4–53)

### తేసి, తేవు అకారమగుటకు

ద్విపద : తేసి చూడఁగరాని తేవు చక్కటికి
డాసిన పాదలలో డాగి యే నుండ. 298

రంగనాథరామాయణము

చ. అనఘ యపంకమై విమలమై పరిపూర్తియు లోఁతు దియ్యమున్
ఘనతయుఁ గల్గి సజ్జనమనస్పృశస్థితిఁ జాల నొప్పు మీ
జనయుది యన్నదీజలము తేవును మరచిది. 299

ఎఱ్ఱాప్రగడరామాయణము

### తేఁడు, తేసి అకారమగుటకు

క. దానిఁ గని వచ్చి పైఁబడు
దానిని బల్లెములఁ గొంగవాలుల నురెలన్
మేనులు వ్రాలిచి పెంపున
తేనికి సంతసము చేసి తేసిరి కడఁకన్. 300

యయాతిచరిత్ర (2–14)

ఉ. వీఁడె నలుండు విశ్వపృథివీవలయైకవిభుండు వచ్చుచు
న్నాఁ డని భీమభూమిపతినందన నూరడిలంగఁ బల్కు పూ
బోఁడుల మాట నేర్చుకొని ప్రోది శుకాంగన యట్లు పల్కినన్
తేఁ డిది నన్ను నేక్రియ నెఱింగె నాకో యనుచుండె నాత్మలోన్. 301

శృంగార నైషధము (3–104)

## ఱేకసుట అకార మగుటకు

సీ. కబరికాభరముపైఁ గన్నె గేదంగి పూ
ఱేకులతోఁగూడ ఱేనిఁ జెరివి. 302

ఉ. ఱెక్కలు చించి కంఠమున ఱేకులు వాపి శిరంబు వ్రచ్చి పే
రుక్కున గ్రొంచ చందమగు నొడ్డణముం గటాఁ గంగ భీష్ముఁడే
(దిక్కునఁ దానయ్యె దిశలు దీటుకొనన్ శరకోటి నింపఁ గెం
పెక్కిన కంటి క్రేవ చెలు వెక్కుడు సేయఁగ గ్రిడి కృష్ణుతోన్). 303

భీష్మపర్వము (2-30)

## ఱేల అకార మగుటకు

ఉత్సాహ: చాలుఁజాలు నెంతకైనఁ జాలునన్న గన్నెరుఁల్
ఱేలపూల కేలగోల ఱేనియందు లోనఁ బో
ఱేల తాళు మన్న నన్ను నెట్టి తిట్టె దక్కటా
మేలు మేలు ముద్దరాల మెచ్చు వచ్చె నామదిన్. 304

యయాతిచరిత్ర (4-21)

## ఱేఁగు అకార మగుటకు

ఆ. మహితకమలమధురమధురసాస్వాదన
పరవశాత్మ యైన భ్రమరకాంత
ఱిచ్చ బుద్ధి నకట ఱేఁగు బువ్వుల రస
మాను నెట్లు బేల నైతి గాక. 305

ఆరణ్యపర్వము (6-341)

వ. రోయుట అకార మగుటకు చింత్యము. 306

## రేఫ యగుటకు

క. పులికి బలుసు వాటిన క్రియ
నలవుఁ జలము సిగ్గు విడిచి యట్టొక్కని కో

ల్లుల కోర్వక విరిగిన పు
త్త్రుల నేమని విందు నేను రోయక యుంకన్. 307

ద్రోణపర్వము(4-80)

ఉ. క్రూరత కోర్చి యుంచుకయు రోయక పైకొని యెల్ల భంగులన్
వైరులఁ జంపి భూప్రజకు వర్ధనముం గలిగించి పాడివ్రేఁ
గోరరిగొంచు సద్వ్యయము గోరి యొనర్చుట రాజధర్మవి
స్తారముగా బలారికి వచస్పతి సెప్పుట యప్రసిద్ధమే. 308

భీష్మపర్వము(3-309)

**ఱోలుట అకారమగుటకు**

ఉ. కాలన కేలనుం జదిపి గంధకరిం దెగటార్చు సింహమున్
బోలుచుఁ బేర్చి యాద్రుపదభూపసుతున్ సమయించి వేదనల్
ఱోలఁగ ఱోఁజగాఁ బలుమఱున్ బొరలంబడ (లాల క్రక్కన
వ్రాలుమగండు వాక్పరిభవంబుఁ దలంచుచు గౌర్యధుర్యుఁడై). 309

సౌప్తికపర్వము (1-158)

క. వేఱువడుట వీఱడియున్
వేఱొకటియు బండిఱోలు వెఱవొప్పఁగఁ బ
ల్మాఱు నిది యెఱుఁగకుండెడు
వీఱడి రచియించు కవిత వృథగద శర్వా! 310

**వీఱడి గురురేఫ యగుటకు**

క. వీఱడితనంబు వెట్టుచుఁ
దూఱం బని లేదు నిన్నుఁ దొల్లిఁటి చెయ్వుల్
దీఱ నది యనుభవింపక
వేఱుండునె పూర్వజనితవివిధకృతంబుల్. 311

భాస్కర రామాయణము (యు. 2238)

**వేఱు అకారమగుటకు**

క వేఱొకవిలుఁ గొని యమ్ముల
గీఱ మెఱఁగు నారసములు గిఱి కొల్పిన నో

టాఱి మెయిన్ గ్రొన్నెత్తురు
వాఱ నతఁడు తేరిమీఁదఁ బడి మూర్ఛిల్లెన్. 312

ద్రోణపర్వము (5–138)

గీ. అరయ గురురేఫ హల్లుతోఁ బెరసి నపుడు
ప్రాసముల విశ్రమముల రేఫములతోడఁ
గలసియుండును సుకవిపుంగవుల కృతుల
జగదవన సూత్ర! గిరితనూజాకళత్ర! 313

ఉ. నూఱ్వురు నొక్కచందము మనోగతి స్వైరణ చేసి నన్ను నా
సర్వకులంబు నుత్తమయశమ్మున నుంచితి రమ్మలార మీ
కుర్విని సాటియే యబల లొండొరు దేవతలున్ బటుక్షమా
నిర్వహణం బొనర్పుటకు నేరరు మర్త్యులఁ జెప్ప నేటికిన్. 314

ఏకశిలానగర రామాయణము

క. కాఱ్చిచ్చు గవిసి మృగముల
నేర్చు కరణి నేఁడు భీష్ముఁ డేచిన కడిమిన్
బేర్చి మన భీముఁ బొదివె శి
రార్చుల నవ్వీరుఁ గన్నులారం గంటే. 315

భీష్మపర్వము (3–278)

వ. మఱియు 316

సీ. హయమేధపర్యంత మైన శ్రౌతము బహు
స్మృతులు బుత్త్రునకు వేర్వేఱఁ దెలిపె. 317

భీష్మపర్వము

క. చెలఁగి పటుసింహనాదం
బులు అంకెలు గాఁగ వారు వొలిచిరి వృషభఁ
బుల క్రియ నొండొరులకు మా
ఱ్మలయుచు దాఁకుచు నుదాత్తరభసోజ్జ్వలులై. 318

వ. ఇది అకార ప్రకరణము. (ఇఁక) 319

క. అలసాని పెద్దకవి పిం
గళి సూరన రామభద్ర కవివర్యుఁడు పి
ల్లలమఱ్ఱి వీరభద్రుఁడు
కలిపిరిగద కృతుల ఱాలుఁగడు రేఫములన్. 320

వ. పెద్దన్న రేఫ అకారములఁ గలుపుటకు 321

శా. శ్రేణుల్గట్టి నభోంతరాళమునఁ బాఱెన్ బక్షు లుష్ణాంశు పా
షాణవ్రాతము కోష్ణమయ్యె, (మృగతృష్ణావార్ధు లింకెన్, జపా
శోణం బయ్యెఁ బతంగబింబము, దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె, సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గడున్). 322
మనుచరిత్ర (3–12)

మ. ఇలకున్ వ్రేఁగుగఁ బండుఁ దీరనన పుండ్రేక్షుచ్ఛటల్ దీపు ల
గ్గలమై వ్రాల నురుస్వనంబు లెసఁగంగాఁ ద్రిప్ప రాట్నంపు గుం
డ్రలు నాదేనెకొలంకులం బొరలి పాఱన్ విచ్చు పంకేరుహం
బుల నాడెం దొలుసంజఁ దేఁటి వలయుంబుల్ తార ఝుంకారముల్. 323
ఆముక్తమాల్యద (4–152)

వ. మఱియు. 324

వ. పునుగుం దావి నవౌదనంబు మిరియంపుం బొళ్లతోఁ జట్టి చు
య్యన నాదారని కూరగుంపు ముకు మందై పేర్చు నావన్ జిగు
ర్కొను పచ్చళ్లను బాయసాన్నములు నూఱుంగాయలున్ (జేసుఱు
క్కను నేయుం జిఱుపాలు వెల్లువగ నాహారం బిడున్ సీతునన్). 325
ఆముక్తమాల్యద (1–82)

చ. ముదిమదిఁ దప్పి తోటు మునిముఖ్య భవత్తనయన్ గృహంబునన్
బదిలము జేసి వచ్చి మరి బట్టబయల్ వెడదూరు దూరె దా
సదన మిఁక కొక్కమా టరసి చంచలలోచనఁ గానకున్న దూ
ఱెదు మది కాని బుద్ధి విపరీతతఁ బొందక పోయిచూడుమా? 326

ఆది ఱకారమునకు

శా. జేవుల్ మావు మతంగజంబును మణిశ్రీఖండముక్తాళియున్
రా వాణిజ్యముఁ బెంచి యేలఁగ నగున్. 327

సీ. కానలోఁ 'దారు' మృగంబుకై వడిఁ
గైకొని యసమాస్త్రకర్మకలన. 328

*రాఘవపాండవీయము*

వ. ఇందులోఁ, గానలోఁ, దారు, తమరు అను అర్థమునందు లఘురేఫయు తారులు, అడుగుట అను అర్థమునందు గురురేఫయు అగును. అందుకు వెల్లంకి తాతంభట్లు నిడుపుల మీఁద బండిఱా లేదని వ్రాసినాఁడు. తారుట రేఫమే అని రాఘవపాండవీయమునకు టీక వ్రాయుచున్న ముద్దరాజు రామన్న సమ్మతి వ్రాసినారు. అది కాదు. తాఱుట అకారమే సిద్ధము. 329

సీ. రేఖలై మీఁదటి జేవులై యొప్ప ప
న్నాగంపుఁగడవళ్ల బాగునెఱప. 330

*కళాపూర్ణోదయము* (7–147)

క. గ్రక్కునఁ జని వ్రాలుదునో
ఱెక్కలు గట్టుకొని దివిజరిపుమేడలపై
నక్కొమ్మఁ జూచు టెపుడెపు
డొక్కో యనునంత తమక మున్నది మదిలోన్. 331

*ప్రభావతీ ప్రద్యుమ్నము*(4 86)

ఉ సైరిభవారిభద్విరదశాసనఖడ్గ ఖరాధిరూఢులై
దారలుబారగొమ్ములును తప్పెటలున్ బటుహంబులున్ బదుల్
నూఱులు వేలు మ్రోయ గమను ల్వడి వెల్వడి హత్తి యుత్తర
ద్వారమువంక దార కిరువంకల పౌఁజులు దీర్చి రయ్యెడన్. 332

*రామాభ్యుదయము* (8–69)

వ. మఱియును. 333

ఉ. (రంగన వద్యమై సుధ తెఱంగన శోభిలి విన్గలంకు చే
రంగన దిండుదీప్తి నెదురం గనకోదరుకంబుక. తీదూ
ఱంగ ననంగు జాతి పగఱం గనలం గమికించి) తీవి మా
ఱంగ నటించు గౌబ్బురిపురప్రభురంగన కీర్తి రంజిలున్. 334

రామాభ్యుదయము (పీఠిక. 104)

ఉ. తూఱుపు తెల్లవాఱుటయుఁ దోడన మంగళపాఠకస్తుతుల్
మీఱఁ దదీయరాగముల మేల్కని కాల్యసమంచితక్రియల్
దీఱిచి పాండుపుత్త్ర వసుదేవసుతుల్ ప్రమదంబు మోములం
దేఱఁగ వేడ్కతో నరుగు దెంచి సభాస్థలి నిల్చి రయ్యెడన్. 335

జైమినిభారతము (1–137)

గీ. వనధి సర్వంకషం బయ్యె వలయు వనికి
తేపు లన కాని చొఱరాని రీతిఁ దనరి
విశ్వరూపకుఁ డయ్యె శ్రీవిభుఁడు కూర్మ
రూపముల సేవ్యుఁడగు నారురుక్షులకును. 336

కవికర్ణరసాయనము (5–77)

వ. "సూ. వాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం, రయోస్తు నిత్యం స్యాత్"
అని ఆంధ్ర వ్యాకరణ సూత్రమునకు టీక వ్రాసి రేఫ అకారము
లనుపరా దని చెప్పిన బాలసరస్వతి చంద్రికా పరిణయమునందు. 337

ఉ. అక్కమలేక్షణన్ సవినయంబునఁ గాచుము నాదు మాఱుగా
మ్రొక్కను సేమమా భువనమోహిని నీకని పల్కు మార్తి చేఁ
జిక్కితి వేగఁ బ్రోవు మని చెప్పుము పొమ్మికఁ దేటిరాయ! నీ
తెక్కలమాటు నన్నను చరించి లభింపుము కీర్తిపుణ్యముల్. 338

చంద్రికాపరిణయము

వ. ఇటువలెనే మహాకవులకు రేఫఱకారముల పట్ల పరిశీలన లేకపోయినది. 339

ఆ. కాకునూరి యప్పకవి యహోబలపతి
ముద్దరాజు రామముఖ్యు లెల్ల

పోతరాజు కబ్బమున ఱొాలు రేఫలు
గదిసె నంచుఁ బలికి రది హుళక్కి. 340

ఉ. "బమ్మెఱ పోతరాజకృత భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదువ యెంతయు నారసిచూడ నందు రే
ఫమ్ములు ఱొలునుం గదిసి ప్రాసము లైన కతంబునంగదా!
యిమ్మగ నాదిలాక్షణికు లెల్లను మాని రుదాహరింపఁగన్."
అని రామన్న చెప్పినాఁడు. 341

క. పురసతులవిలోకనములు
సరసాలాపములు నర్మసంభోగంబుల్
మఱిగి హరి మనల నొల్లఁడు
నరవరు లోయమ్మ! నూతనప్రియులుగదే! (భాగ. పూ.భా.1216)

అని పోతరాజు చెప్పినాఁడని అహోబలపతి వ్రాసినాడు. మఱియు కొందఱు లాక్షణికులును ఆలాగే యన్నారు గాని పోతరాజు లాక్షణికుం డగుటను కాకుండుటను పరిశీలనము లెస్సగా జేసినవారు కారు. 342

సీ. అఖిలవేదాంతవిద్యారహస్యవిదుండు
సహజపాండిత్యవిశారదుండు
పటుతరకవితావిభాసితప్రతిభుండు
సకలాంధ్రలక్షణచక్రవర్తి
రఘుకులేశనిదేశరచితమహాభాగ
వతపురాణుఁడు పుణ్యవర్తనుండు...............

బుధజనహితుండు బమ్మెర పోతసుకవి
యెన్న రేఫ ఱకారంబు లెన్నఁ డసుచు
నజ్ఞులొక కొంద ఱొడుదు రమ్మహాత్ము
కవిత కెందును లోపమ్ము గలుగ దభవ! 343

సీ. ఘనుఁడు పోతనమంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించు నెడల

సర్వజ్ఞ సింగయ క్ష్మావరుం డది దన
కిమ్మని వేడిన నిడకయున్న

నలిగి యా పుస్తకం బవనిఁ బాతించిన
జివికి యందొక కొంత శిథిలమయ్యెఁ
గమ్మర నది వెలిగందల నారప
రాజును మఱి బొప్పరాజు గంగ

రాజు మొదలగు కవివరుల్ దేజ మెసఁగ
జెప్పి, రా గ్రంథములయందె తప్పు లేదనెఁ
గాని పోతకవీంద్రుని కవితయందు
లక్షణం బెందుఁ దప్పదు దక్షహరణ! 344

వ. పోతరాజు చెప్పినవి ప్రథమ స్కంధమును, ద్వితీయ స్కంధమునఁ గొంతయు షష్ఠ సప్త మాష్టమ నవమస్కంధములును దశమ స్కంధము పూర్వ భాగము కొంతయున్నది. అందులో రేఫఱకార సాంకర్యము లేకుండుటకు వ్రాయుచున్నాము. 345

### దీర్ఘము మీఁది ఱకారము.

ఉ. మాఱుపడంగలేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం
దేఱని పిన్నపాపల నతిత్వరితంబునఁ ద్రుంచెఁ గ్రూరుఁడై
పాఱుఁడు గాఁడు పాతకుఁడు ప్రాణభయంబున వెచ్చనూర్పుచుం
బాఱెడు వీనిఁ గావుము కృపామతి నర్జున! పాపవర్జనా! 346
ప్రథమస్కంధము (158)

### కుఱుచల మీఁది ఱకారములకు

చ. వెఱచిన వారి దైన్యమున వేదురు నొందిన వారి నిద్రమై
మఱచిన వారి సౌఖ్యమున మద్యము ద్రావిన వారి మగ్నులై
పఱచిన వారి సాధుజన భావము వారినిఁ గావుమంచు వా
చఱచిన వారి గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా! 347
ప్రథమస్కంధము (159)

## నిడుదల మీఁది జాలకు

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు బాహుల నొడ్డఁడు బంధురాజిలోఁ
దూఱఁడు ఘోరకృత్య మని దూఱఁడు తండ్రిని మిత్రపర్గమున్
జీఱఁడు మాతృసంఘము వసించు సువర్ణగృహంబులోనికిన్
ద్రాఱఁడు గావరే యనఁడు తాపము నొందఁడు కంటగింపఁడున్. 348
సప్తమస్కంధము (194)

## కుఱుచల మీఁది అకారములకు

చ. ఎఱిఁగెఁడు జీవనౌషధము లెవ్వరు భర్తలు లేరు బాధలన్
దఱలఁడు నైజతేజమున తథ్యము జాడ్యము లేదు మిక్కిలిన్
మెఱయుచు నున్నవాఁ డొకనిమేషము దైన్యము నొందఁ డింక నే
తెఱఁగునఁ ద్రుంతు వేసరితి దివ్యము వీని ప్రభావ మెట్టిదో! 349
సప్తమస్కంధము (202)

చ. ఉఱుకుం గుంభయుగంబుపై హరిక్రియన్ హుమ్మంచుఁ బాదమ్ములన్
దిఱుగుం గండము వెన్ను దన్ను నెగయున్ హేలాగతిన్ వాలమున్
జఱచు న్నుగ్గుగఁ దాఁకు ముంచు మునుఁగున్ శల్యంబులుం దంతముల్
విఱుగన్ వ్రేయుచుఁ బొంచి పొంచి కదియున్ వేదండయూథోత్తమున్. 350
అష్టమస్కంధము (62)

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు
నఱిముఱి గుబురులకు జనుచు హరిహరి యనుచున్
మఱుచుచు నులుకుచుఁ దిఱుఁగుచు
కుఱు మట్టపు పడుచు వడుగు కొంత నటించెన్. 351
అష్టమస్కంధము (538)

క. బఱపగు నుఱుమును బిఱుదును
నెఱిఁ దోఁకయు ముఖము సిరియు నిర్మల ఖురముల్
కుఱుచచెవు లెత్తిలి గన్నులు
తఱచగు కంఠంబు చూడఁ దగు నా హరికిన్. 352

చ. ఎఱిఁగితి మద్దిరయ్య పడనేటికి గుఱ్ఱపు గొంగఁ బట్టుఁడీ
జఱభినిఁ బట్టి చంపుఁ డతిసాధుమునీంద్రుని పోలె నేత్రముల్
దెఱవక బొక్కినోరు మెదలింపక మాసిక వెట్టి యుంచు న
య్యఱవది వేవురుం జని కరాయుధముల్ ఝడిపించి డాయుచున్. 353
నవమస్కంధము (206)

**నిడుదల మీఁద ఱకారములకు**

క. పాఱుదురు గికురు పొడుచుచుఁ
దూఱుదురు భయంబు లేక తోఱపు దిఱముల్
జాఱుదురు ఘనశిలాతతి
మీఱుదు రెన్నంగరాని మెలకువల నృపా! 354
దశమస్కంధము పూ.భా. (4–69)

**కుఱుచల మీఁది ఱకారములకు**

క. తెఱవయొకతె నిద్రింపఁగ
నెఱిఁగట్టిన వలువ విడిచి నేఁ డొక తేలున్
గఱపింప నీకుమారుఁడు
వెఱచుచు నది పఱవ నగుట విహితమె సాధ్వీ. 355
దశమ:స్కంధము పూ.భా (323)

చ. వెఱవుఱలేనిమేటి బలువీరుఁడు కృష్ణకుమారుఁ డొక్క చేఁ
బఱచి ఖగేంద్రుచందవునఁ జక్కఁగ దొడలు వట్టి పన్నులం
జొఱ జొఱ దుర్విషానలము నుబ్బి వధింపక యెత్తి లీలతోఁ
జిఱ జిఱఁ ద్రిప్పివైచెఁ బరిశేషితదర్పముఁ గ్రూరసర్పమున్. 356
దశమస్కంధము పూ.భా. (660)

క. కఱచిన భుజగము రదములు
విఱుగఁగ వదనముల విషము వెడలఁగ శిరముల్
పఱియలుగ నడచె, గరుడుఁడు
తఱిమి కనకరుచుల గలుగు తనదొ ఱెక్కన్. 357
దశమస్కంధము పూ.భా. (703)

ఆదిఅకారమునకు

ఉ. తెక్కలు రావు పిల్లలకు తేపటనుండియు మేతఁ గానమిన్
బొక్కెడు గూటిలో నెగసి పోవఁగ నేరవు మున్ను దల్లి యా
దిక్కున నుండి వచ్చు నని త్రిప్పటి చూడ్కుల నిక్కి నిక్కి నల్
దిక్కులు చూచుచున్న దతి దీనత నెట్లు భరింతు నక్కటా! 358
సప్తమస్కంధము (63)

వ. ఇది పోతరాజు కవిత్వము. (ఇఁక) వెలిగందల నారపరాజు, బొప్పరాజు
గంగరాజు చెప్పిన కవిత్వములో రేఫఱకార సాంకర్యమునకు 359

చ. హరివచనంబు లాత్మకుఁ బ్రియం బొనరింపఁ బయోజగర్భుఁడో
పరమపదేశయోగిజనభావన యీ నిఖిలోర్వియందు నీ
వెఱుఁగని యట్టి యర్థ మొకటేనియు గల్గునెఁ యైన నామదిన్
బెరసిన కోర్కె నీకు వినుపింతు దయామతి చిత్తగింపవే! 360
ద్వితీయస్కంధము (247)

క ఎఱుఁగమి నైనను భూసుర
వరుల ధనం బపహరింప వలువదు పతికిన్
మఱుపున నసలము ముట్టిన
దరికొని వెసఁ గాల్పకున్నె తను వెఱియంగన్. 361
దశమస్కంధము ఉ.భా. (476)

సీ. కరుణాపయోనిధి మఱియొక యింటిలోఁ
జెలిఁ గూడి ముచ్చటల్ చెప్పచుండ. 362
దశమస్కంధము. ఉ.భా. (617)

క. హరిపదసేవకుఁ డరిభీ
కరుఁ డర్జునువలన మిగులఁ గార్ముకవిద్యల్
గఱచిన బలియుఁడు సాత్యకి
వఱలిన సుఖలీల నున్నవాఁడె ధరిత్రిన్. 363
తృతీయస్కంధము (54)

చ. మఱియు సరోజలోచనుని మంగళదివ్యకథానులాపని
ర్భరపరితోషబాష్పకణబంధురచారుకపోలగద్గద
స్వరపులకీకృతాంగు లగువారును నిస్పృహచిత్తులు స్పృహం
కరణవిదూరులు న్నగు సుకర్ములు నుండిరి పుణ్యవాసముల్. 364

ద్వితీయస్కంధము (507)

చ. సరసిజగర్భు యోగిజనసర్వసుపర్వమునీంద్రదహవ్యభు
క్పరమబుషిప్రజాపతులు భక్తిమెయిం జనుదెంచియుండు న
త్తఱిఁ దరుణార్కతేజుఁ డగు దక్షుఁడు వచ్చినఁ దత్సభాసదుల్
తరమిడి లేచి రప్పుడు పితామహభర్గులు దక్క నందఱున్. 365

చతుర్థస్కంధము (38)

క. హరి నాముఖమున నీకు
న్నెఱిఁగింపఁ దలంచి నాకు నెఱిఁగించెను సు
స్థిరమతి విను మంతయు
హరివాక్యముగాఁ దలంచి యవనీనాథా! 366

పంచమస్కంధము (1-9)

క. వలనుగ రేఫఱకారం
బుల తెలుఁగంతయును సుకవిపుంగవు లిందున్
దెలిసికొని కబ్బములలో
నిలుపందగు దేవదేవ నీలగ్రీవా! 367

గీ. శాలివాహన శకవర్ష సంఖ్య కర ర
సాంగ శశి సంజ్ఞ నలరు రౌద్ర్యబ్దమునను
భాద్రపద శుక్ల పంచమి వరకుఁ బూర్ణ
మయ్యె నీకృతి నీపేర నగసుతేశ! 368

క. కవివరులయిండ్ల నెప్పుడు
శివకరమై యనవు లీల చేలం గ్రాలియ
రవిశశితారక మగుచున్
భువిఁ బ్రబలుచు నుండుఁగాక భూతేశ! శివా! 369

చ. రతిపతిదర్పభంగ! మునిరాజమనస్సరసీజభృంగ! సం
తతకరుణాంతరంగ! నిజదాసజనావనచంగ! పద్మినీ
హితసితరుగ్రంధాంగ! నిలయీకృతపర్వతశృంగ! విస్ఫుర
త్కృతలశతాంగ! పీఠపురకుక్కుటలింగ! భుజంగమాంగదా! 370

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధ సరసకవితా సామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్య సగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర సకలసంస్కృతాంధ్రలక్షణకళా కౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమ ప్రణీతం బైన లక్షణసారసంగ్రహంబను కృతియందు రేఫ అకార ప్రకరణంబులను తృతీయాశ్వాసము సర్వము సంపూర్ణము.



# అనుబంధము - 1

## రేఫ శకటరేఫలు గలపదములు

(తిమ్మన ప్రకారము)

### హ్రస్వములపై రేఫలు

అరి=అప్పనము
అరి=సింజిని
అరదంబు
అరవాయి
అరిది
అరగన్ను
అరయుట
అరణంబు
అరువుట
అరిగె
ఇరవు=ఉనికిపట్టు
ఇరువది
ఇరుపుర
ఇరువన్నె
ఇరస
ఇరుగుడుప్రాను
ఉరులొడ్డుట
ఉరయాడుట
ఉరిలించుట
ఉరవడించుట
ఉరువరి
ఎరగలి

(చిత్తంబు) ఎరియుట
(మేక) ఎరువు
ఎర (మింగెను)
(సొమ్ము) ఎరవిడి
ఎరపరికెము
ఒరులు
ఒండొరులు
ఒరిమె
(సొమ్ములు) ఒరయుట
(ఉల్లము) ఒరయుట
ఒక్కొరుడు
ఒరగంటు (రాచుట)

కరివాడి
కరిసెము=కృషి
(పైడి) కరుగుట
కరణి
కరువలి
కరవాలు = ఖడ్గము
కరకలు
కరకరి
కరువునబోయుట

కనికరము
కరకరఁ గాలుట
కరమొప్పుట
(కూడు) కరడుగట్టు
కరవటంబు
కరిగోరుట
కురియుట
కెరలుట
కొరప్రాణము
గరిత=పతివ్రత
గరకరి
(మేను) గరుదాల్చుట
(పెండ్లి) గరగ
గరికి
గరువతనంబు
గరిడి
గరపచేలు
గిరగిరఁ వాయుట
గురుగుకూర
గురబోతు
(పవరపు) గురుజులు
గురువింద
గురువులు వారుట
గురువు=దొడ్డ
గురుగులు=పిడతలు
గోరవంక
గోరగోరనడచుట
గోరజ మోపు
చిరుగుట
చిత్తూరు బొమ్మలు
చెరువులు
చెచ్చెర
(కోక) చెరగులు
(చేటలో) చెరుగుట
చెరువుట
చొరవ
చొరకుండుట
తరచియాడుట
తరగలు
తరతర
తరములు=చుట్టములు
తరముగామి
తరచినమజ్జిగ
తరువాయి
(దేహంబు) తరలబారుట
తరబడి
తిరుగుట
తిరియుట
తిరుగ=క్రమ్మర
తెరతెర వచ్చుట
తెరువు=తోడు
తెరలు కట్టుట
(రెండు) తెరగులు—తెగలు
తెరలఁ కాగిన నెయ్యి
తొరలుట
తొరగుట
దరికొనుట
దరిఁ తొక్కుట
దరి
దరియుట

దురము
దురటిల్లుట
దురదుర
(ఏ) దురుట
దొరయు
దొర
దొరలుట
దొరకొలుపుట
దొరయుట
దొరకుట
నరములు
నురుములు
నెరపుట
నెరి
నెరసులు
నెరయుట
నెరసిన తల
పరువులు వెట్టుట
పంచను దెంచుట
పరపుట=నించుట
పరపు=నిడుపు
పరిపడి
పరువడి
పరిమార్చుట
(అమ్ములు) పరగించుట
పరుగుట
పరుసదనంబు
పురుపుర బొక్కుట
పురికొల్పుట
పురుగు
(తనకు) పురుడు (ఎవ్వడు ?)
పురిటాలు
పెరడాలు
పెరుగు
(మేను) పెరుగుట
పొరుగు
పొరిగొంట
పొరిపొరి
పొరలుట
పొర
పొరపొచ్చెము
పొరిగరుగుట
బరులు
బరిమేన
బరిగట్టె
బరడు
బరువు
బరువసంబు
బరుజులు
బిరుదు
బిరుసు
బురద
బురబుర
బొరగుట
బెరయుట
బెరుకు
బొరుసు
మరులు
మరియాద
మరలుట

మిరియములు
మురుసు
మురమురలాడుట
మురియుట
మురుగు
మురియలు
మెరమెర
మొరపనేల
మొరడు
మొరయుట
రచ్చ
రజ్జులాడి
రమ్మంటు
రంకెలు
రవణ
రవణి (?)
రంతు
రహి
రంగు
రిత్త
రెండు
రెప్పె వెట్టుట
రొద
వరపు
వరవులు
వరవుడులు
వరియు
వరగ
పరుస
విరవిరవోవుట
విరియుట
విరియజల్లుట
విరులు
విరివి
వెరవు
వెరసు
సరకులమ్ముట
సిరి
సరులు
సరకుగొనమి
సరగ
సరుదుట
సరస (దగ్గర)
సరవి
సరిగె
సిరి
సురటి
సురె
సురుగుట
సెరబడి
సొరిది

హరివాణము
హరువు
హురుమంజి
హొరంగ

---

# దీర్ఘములపై రేఫలు

ఆరుట=నిండుట
ఆరెకులు
ఆరాటము
ఆరగించు
ఆరటము
(ఎదలో) ఆరయుట
ఈరిక లెత్తుట
ఈరెలు
ఈరేడుజగంబులు
ఈర
ఈరసము=ఈర్ష్యము
(దానంబు) ఈరె
ఊరు=గ్రామము
ఊరార్చుట
ఊరకుంట
ఏరి
ఏరికి
ఏరా
ఓరసిక
ఓరసిల్లుట
ఓరెమిడుట
ఓరుచుకొనుట
ఓరి
కారులు=కల్లలు
కారుమెఱుంగులు
కారించుట
(ము)క్కారుపంట
కారాకులు
(పట్టు) కారు
కారాటము
క్రూరుకు=నిద్ర
(చే) కూరుట
కూరిమి=యెమ్మె
కూరసేయుట
(మన్ను) కూరుట
(తోట) కూర
(నెనరు) కూరిచియుండుట
కూరుట=పొగలుట
కేరుట
కోరడి
కోరిక
కోరు=పన్నువెట్టుట
కోరగిన్నె
(పంది) కోరాడుట
గారాము
గారవట్టుట
గారాబము
గారవంబు
గారెలు
గార=తరువిశేషము
గోరులు
చీరికిగొనకుంట
చీరలు=కోకలు
చీరుట=పిల్చుట, చించుట

చూర=పొడి
చూరీలు
చేరుట
చేర
చేరుచుకొంట
చేరిక
చేరువ=ప్రోగు, చెంత
(ముత్తెంపు) చేరు
తారసిల్లుట
తారు
తీరనికినుక
తూరుపు దెస
తేరు=అరదంబు
తేరకుతేర
(గంజి) తేరు
తేర+ఓరి=తేరోరి
(ఏ) తేర
తోరమైయొప్పె
(సందిట)తోరము
దారి
(పట్టు) దారము
దూరులు పల్కుట
దోరపండ్లు
(శిలలు)దోరవెట్టుట
దోరుట
దోరగల్లు
నారచీరలు
(సింగిణి) నారిపోర
నీరగుట=చచ్చుట

(తేట)నీరు
నేరుపు
(గంగ)నేరేడు
నోరు
పూరేడు
పూరిపెరుగుట
పేరెద
పేరెముఁలు
(పూస)పేరులు
పేరు
పోరచి
పోరు
పోరామి
పోరితము
బార
బారి
బారు
బీరము
బూరుగ
బూరటిల్లుట
భూర
బూరె
జేరము
జేరజము
బోరగిలుట
బోర
బోరుగొండ
మారిమసఁగుట
మారేడు

మారటు
(పరి)మారుతురు
(వే)మారు
మీారు
మూర
మేర
మోర
మోరతోపు
రాణి
రాణించుట
రాయిడి
రాయఁడు
రాచూలి
రాయంచ
రాపొడి
రాముల్క పండులు
రాము
రాగిల్లు
రారాపు
రాచుట
రావి(మాను
రాణువ
రాయుట
రాచుట
రాలుట
రామి
రాకొట్టుట
రాచబంటు

రీతి
రూపుట
రూక
రేయి
రేగుట
రోత
రోయుట=వెదకుట
రోవెలంది
రోలు
రోకలి
రోజుట
వారనికోపము
వారక
వారించుట
వారువంబు
వారకులు
(కూడు) వారుచుట
వారకము
వారు
వీరు
సారెలు
(పెండ్లి) సారె
(వే) సారుట
సారెలు
సూరెలు
సేరు
సైరణ
సొరణగండు

# హ్రస్వములపై శకటరేఫలు

అఱవఱలు
అఱగొఱలు
అఱిముఱి
అఱచుట
అఱముట
అఱచెయ్యి
అఱపుకొనుట
అఱకట వెట్టుట
అఱమఱ
అఱలేక
అఱవుడు=కుప్పసంబు
అఱుగులు
అఱిసె
అఱుగుట=తక్కువగుట
అఱవడి
అఱపొఱడు
అరమూఁతయిల్లు
అరళ్లు
అక్కఱపడి
అఱకమ్మట
అఱింటులు
అఱవళ్లు=ద్రావిళ్లు
అఱకమ్మ
(అన్నము) అఱుగకుంట
అఱుట=తఱుగుట
(రూపఱ
పొలుపఱ
(కచ్చఱ)

ఇఱియుట
ఇఱికిగొనుట
(కూడు)ఇఱిసిచనుట
ఇఱకటంబు
ఇఱులు=చీకట్లు
ఇఱుకు
(క్రిక్కిఱియుట)
(బండి) ఇఱుసు
ఉఱఁడు=కైకొనఁడు
ఉఱుకుట
ఉఱుములు
ఉఱక
ఉఱిది=బిగ్గఱ
ఉఱు=మిక్కిలి
ఉఱుపుకొంప
ఉఱియుట
ఉఱుకటి
ఉఱియ
ఉఱనితెగువ
ఉఱుతపిల్లలు
ఎఱకలు=ఱెక్కలు
ఎఱుఁగుట
ఎఱపఱి
ఎఱుకువాఁడు
ఎఱుపు
ఎఱుఁగుట
(పాము)ఎఱవిడుట
ఎఱచి=మాంసము

ఎఱికత

ఒఱకటంపు త్రోవ

ఒఱగాలు

ఒఱగు=వంక

(కత్తి)ఒఱ

ఒఱయుట

ఒఱగు బిళ్లలు

ఒఱపులి

ఒఱపదేహంబు

కఱపుట=నేర్పుట

కఱవు=దుర్భిక్షము

కఱతలు=పోకిళ్లు

కఱటి=మంకు

కఱదలు=బుద్ధులు

కఱకు=కాఠిన్యము

కఱి==కప్పు=నలుపు

(బెబ్బులి)కఱచుట

కిఱుపుట

కుఱుమాపు

కుఱుగంట

కుఱుగడ

కుఱుకొని

కుఱుకులు

కుఱువు

కుఱులు

కుఱుకుఱు

కుఱుగలి

కుఱుచ

కెఱయుట

(ఉక్కిఱి

పక్కిఱి)

కొఱత

కొఱకు

కొఱలుట

కొఱగామి

కొఱకు

కొఱవి

కొఱకుట

కొఱకొఱ

గఱికెనట్టులు

గఱగఱికలు

గఱుగుకాయలు

గఱిడి

(డగ్గఱి)

(మోట) గిఱక

గిఱుమెట్లు

గిఱుకొను

గిఱులు వ్రాయుట

గిఱుపుట

గిఱుకొని

గుఱుకు వెట్టుట

గుఱి గడచుట

గుఱు

గుఱిగుఱి

గుఱువెట్టు

గుఱి

గుఱుసులు

గుఱుతు

గొఱియ

గుఱుకు కట్టెలు
గొఱవంక
గొఱుగుట
(అఱచేత) చఱచుట
(గొడ్డలి) చఱచుట
(వా) చఱచుట
చఱులు
(చిచ్చుఱకుంట)
చిఱుతది
చిఱునవ్వు
చిఱు కొట్టుట
(ముచ్చిఱితనంబు)
చిఱవి
చుఱచుఱగాల్చుట
చుఱుకుపుట్టుట
చెఱిసగంబు
చెఱుకులు
చెఱసాల
చెఱుముట
చెఱుగులు
చెఱచుట
చెఱలాట
చెఱక
చెఱవు
చెఱుపుట
చెఱువు=తటాకము
జఱిజఱి
(పూజఱి)
జఱుపుట
జముఱుట

జఱజఱ
జిఱజిఱ
జుంజుఱు నెఱులు
జొఱజొఱ
తఱుగుట=కోయుట, తక్కువగుట
తఱుగఱి=బేహారి
తఱిగొలుపుట
తఱలుట
తఱకలు
తఱియుట
తఱుముట
తఱులు
తఱిపి
తఱచు=దట్టము
తఱి
తఱిగొని
తిఱుగుట
(త్రిమ్మఱి)
తిఱి
తుఱఁగలి
తుఱుము
(వా) తెఱ
(ఏ) డ్తెఱ
(కను) తెఱచుట
తెఱవలు
తెఱగొలుపుట
తెఱపి
తెఱలిన
తెఱకువ
తెఱఁగు

తెప్పఱి
తొఱలుట
తొఱఁగుట
అందఱు
కొందఱు
ఇందఱు
ముందఱ
పెద్దఱికము
ఇద్దఱు
అద్దఱి
గద్దఱి
పదఱుట
ఎదుఱుట
నఱుచు=కొంచెము
నఱుకుట
నిఱుపేద
నుఱుముసేయుట
(వడ్లు) నుఱుపుట
నెఱ
నెఱులు=వెంట్రుకలు
నెఱయుట=నిండుట
నెఱియు=మిగుల
నెఱి=బాగు
(నీటులు) నెఱపుట
నెఱవు
నెఱలేని మిత్రుడు
నెఱికకాసె
నెఱ=దొడ్డు
నెఱబంటు
నెఱజాణ

నెఱకటారి
పఱచుట=ప్రవహించుట
పరువిడుట, ఏయుట
పఱపఱచించుట
పఱుసదనము
పఱ
పఱియలు
పఱికెలు
పఱిగొను
పఱతెంచు
పఱపుట
పఱయు
(వెంపఱ)
పఱుపు
పఱిమార్చు
(తెంపఱ)
పఱవోపుట
పఱువైనపువ్వు
(చూపఱ)
పిఱుంద
పిఱుచుట
పిఱివోవుట
పిఱికితనము
పిఱుఁదు
(తెప్పఱి)

పుఱియ
(మేల్) పెఱుగుట
పెఱయు
పెఱసనిపోవు

పెఱుకుట
పెఱికెలు
బఱబఱనీడ్చుట
(దబ్బఱ)
బిఱబిఱ్రతిప్పుట
బిఱుసులు
బుఱుజులు వెట్టుట
మఱచుట
మఱునాఁడు
మఱఁదలు
మఱఁది
మఱుపాటు
(పలు)మఱు
మఱియు
మఱుఁగు
మఱవ=మృద్భాండము
మఱగట
(వే)మఱు
మఱుపడి
మఱలేక
మఱఁగు
మఱగాలు
మఱల
(త్రిమ్మఱుట)
(పడ)మఱ
మిఱిచూపులు
మిఱుమిట్లు
ముఱిముఱి చీఁకటి
ముఱిముఱిబడిబడి
ముఱి=మొండెము

మెఱుము
మెఱపు
మెఱయుట
మెఱుఁగు
(కన్)మొఱుగు
మొఱకతనము
మొఱుగుట
మొఱయు
మొఱమొఱలాడు
మొఱక=వెరితి
మొఱయుట
ఱట్టుపొందుట
ఱంపిల్లు
ఱంకు
ఱవఱవల్
ఱవళి
ఱవికె
ఱంతులు
(వ్రజపు)రవలు
ఱంపము
ఱికిరించుట
ఱిచ్చ
ఱిక్క
ఱివ్వన
ఱింగున
(శిలలు)ఱువ్వుట
(చిలుక) ఱెక్క
ఱెల్లుగడ్డి
ఱెప్పలు
(పూ)ఱెమ్మ

ఱొమ్ము
వఱత
వఱద
వఱలుట
వఱడు
వఱుగు

విఱుగు
విఱివోటు
విఱిగాలి
విఱివిడి
వెఱపు
(నివ్వెఱ)
వెఱబొమ్మ
వెఱచఱచుట
వెఱఁగు
సుఱసుఱ్ఱసుక్కుట
అసుఱుసుఱనుట

## దీర్ఘములపై శకటరేఫలు

ఆఱు=అడఁగుట
ఆఱు (సంఖ్యావాచకము)
ఆఱడి
ఆఱికపంట
(ఊటాఱు)
(తడి)ఆఱు
(పాపములు)ఆఱు
ఊఱడి=చాలించి
ఊఱుంగాయలు
(జలము) ఊజఱుట
(పండ్లు)ఏఱుట
ఏఱువ=సీమ
ఏఱు

కాఱడవి
కాఱుపోతు
కాఱుట
కాఱియవెట్టు
(పొంత) కాఱి
కోఱలు
(పండ్లు)గీఱుట
గీఱుట
చాఱు(త్రాపుట
చాఱలబెబ్బులి
చాఱపప్పు
చీఱుట—పిల్చుట
చూఱగొను
(ఉట్టి)చేఱు
చేఱెడు
చోఱవిూను
జాఱుట
(బజాఱు
హజాఱము=మొగసాల)
జాఱులు=ధనికులు
జోఱున
తాఱుట

త్రీఱుట

త్రీఱు

త్రీఱి

తూఱుట

తేఱుట

(గడి) తేఱుట

తేఱిచూచుట

(ధర్మంబు)తేఱుట

తేఱుదురు

నాఱువోయుట

(ఉల్లి) నాఱు

(సాన్నాఱి)

నీఱు

నెఱియు

నూఱు (సంఖ్యావాచకము)

నూఱుట

పాఱుఁడు

(నది) పాఱుట

(మేనెల్ల)పాఱుట

(గగుఱు) పాఱుట

(ఇంకన్) పాఱుట

పేఱుట

పోఱఁడు

బీఱువోవు

మాఱుమొగము

మాఱిమసఁగు

మాఱు

మాఱడగుట

మాఱువడు

(పే) మాఱు

మీఱు

ఴాచుట

ఴాయి

ఴాఁగ

(పే) ఴేచు

(ఴెప్ప?)

ఴేవ

ఴేసి

ఴేపు

ఴేఁడు

ఴేల

ఴేమకుక్క

ఴేగు

ఴోయు

ఴోత

ఴోలుట

వేఱుపడు

వీఱడి

వేఱొకటి

# రేఫాంతము లగు కొన్ని పదములు

చక్కెర
పక్కెర
ముక్కెర
ముప్పేరు
నలువురు
పలువురు
నగరు
తొగరు
జేగురు
తొలుకరి
చీపురు
బంగరు
మార్తురు
నెత్తురు
మదురు
కుదురు
తలవరి
జూదరి
తనరు
దేవర

కొబ్బరి
వెరవరి
అబ్బుర(ము)
క్రమ్మర
తామర
కనరు
ఎవ్వరు
ఇయ్యరు
వివర(ము)
మోహర(ము)
ఇవురు
సవురు
డెప్పర(ము)
పొగరు
చప్పర(ము)
వేగిర(ము)
ఓగిర(ము)
నెదురు
కుదురు
అదరు

# అనుబంధము 2

## శబ్దప్రకరణమున తిమ్మన చూపిన పదరూపములు

1 వూవు—వువు—వువ్వు—వూ
2 మావిడి—వూమిడి—మావి
3 డొవు—దవు—దవ్వు—దొ
4 కేళాకూళి—కేళాకుళి—
కేళకుళి—కెళాకుళి
5 మోసల—మొుగసాల—మోసాల
6 వేళము—వైళము
7 వేఁడి—ఏఁడి
8 మీనలు—మీలు
9 కొమ—కొమ్మ
10 బొమ—బొమ్మ
11 పొర—పర
12 సంపంగి—సంపెంగ
సంపఁగి—సంపెఁగ
13 గొజ్జంగ—గొజ్జంగి
గొజ్జఁగ—(గొజ్జఁగి)
14 ఈల్గుట—నీల్గుట—
ఇలుగుట
15 నెగయుట—ఎగయుట
16 నంటు—అంటు
17 నమ్మిక—నమ్మిగ
18 బదుకు—బతుకు
19 అలికములు—అలకలు
20 పులకములు—పులకలు
21 చొటు—చోటు
22 పొద—పద
23 ఒక్కొటి—ఒక్కటి
24 పొలఁతి—పొల్తి
25 చెనటి—చెన్నటి
26 దక్కు—డక్కు
27 దబ్బర—డబ్బర
28 దాసి—డాసి
29 దప్పి—డప్పి
30 దిగ్గి—డిగ్గి
31 దాగి—డాగి
32 దాపల—డాపల
33 దొప్ప—డొప్ప
34 అక్షతలు—అక్షతములు
35 లాజలు—లాజము
36 అబ్బురము—అబుబరము
అబ్రము—అబ్బరము
37 నీచు—నీచుఁడు
38 వృద్ధు—వృద్ధుఁడు
39 మూర్ఖు—మూర్ఖుఁడు
40 వేయి—వెయి—వెయ్యి—వే
41 కోయిల—కోవెల
42 నేయి—నెయి—నెయ్యి—నే
43 ఎగ్గు—నెగ్గు
44 ఏలిదము—ఎల్లిదము
45 చామరము—చామర
46 చెయివులు—చెయ్యివులు
47 తొడి—తొడిగి
48 తోడ్కొని—తొడుకొని
49 ఒవ్వుట—(నొవ్వుట)
50 బంగారు—బంగరు—
బంగారము
బంగరము
బంగరువు

# అనుబంధము - 3

## తిమ్మన ఉదాహరించిన గ్రంథముల పద్యముల సూచిక

| | ఆశ్వా. ప. |
|---|---|
| **అధర్వణ భారతము :—** | |
| క. పదిదినము లైద్దు ప్రొద్దులు | 2.30 |
| శా. తృష్ణాతంతునిబద్ధబుద్ధులగు | 2.224 |
| **అరుణాచల పురాణము :—** | |
| ఉ. తారకజిచ్ఛిఖండి శివతాండవ | 2.123 |
| **ఆంధ్రనామ సంగ్రహము :—** | |
| క. కవుల విచారింపగా నాఖ్యలు | |
| **ఆంధ్రభాషా భూషణము :—** | |
| క. ఒప్పులు కలిగిన మెచ్చడు | 1–423 |
| **ఆముక్త మాల్యద :—** | |
| గీ. మెండు మీాఱిన పగటి పేరెండ దాకి | 1.82 |
| సీ.గీ. నారికేళాసవపు దీపుటారుపు | 1.87 |
| ఉ. పూని ముకుందు నాజ్ఞ | 1.97 |
| సీ.గీ. తమ్మికే లుండ బెఱకేలదండ యిచ్చు | 1.110 |
| సీ.గీ. అనుచు దొలినుడి యభిలాష యొనయ మూగి | 1.144;1.152 |
| ఉ. అంజనమూనవాయుగణ | 1.201;1.209 |
| గీ. ఇంక రెణ్నాళ్ళు చూచి నీవంత దెగువ | 1.246 |
| శా. ఆకేశధ్వజు డంత నాస్పృపునిరాజ్యం బెల్ల | 1.298 |
| ఉ. చంచలనేత్ర దాల్పు జలజాతమృణాళ | 1.332 |

| | | |
|---|---|---|
| సీ. | తనదుమ్మైదీగెకు తావలంబుగఁ జేసి | 2.375 |
| చ. | చెలువుగ నాననాబ్జముల చేరువ | 2.389 |
| శా. | సింగంబుల్ మునిబాలికల్ దిరుగుచుం | 2.453 |
| చ. | అరవిరి గుత్తులం బొలిచి | 3.54 |
| క. | ఒరసుకొని పోవ నత్తటి | 3.147 |
| ఆ. | సందియంబువడ విచారంబునకుఁ జొఱ | 3.257 |

కన్నప్ప చరిత్ర :—

| | | |
|---|---|---|
| ఉ. | కారణమేమి రక్కసునఖంబుల వ్రచ్చితి | 1.406 |

కవికర్ణ రసాయనము :—

| | | |
|---|---|---|
| ఆ. | చెట్టు యొడిసి పట్టి సెజ్జకుఁదివియుచో | 1.51 |
| సీ.ఆ. | లంజెతల్లులనఁగ లక్షింపగా నిట్టి | 1.84 |
| ఉ. | కొంచెముగా నిజాంగకము గుంచి | 1.136 |
| సీ. | వటుమంత్రము కొందరు వటమేని యూడలు | 1.253 |
| క. | చిచ్చునకు గాడ్పు తోడై | 1.267 |
| గీ. | పసిడిరథ మెక్కి విపులవైభము మెఱయ | 1.347 |
| చ. | తలిరుల సెజ్జఁ గోసి కరతామరసద్యుతి | 1.352 |
| సీ. | నీతూపు కోర్వక నిటలాక్షుఁడును | 1.371 |
| మ. | హరిదశ్వాన్వయమందు దాశరథినై | 1.393 |
| చ. | ఉరుతరవజ్రకర్కశతయున్ | 1.432 |
| మ. | అనురాగాకృతి కంద కందళముగా | 2.170 |
| సీ.గీ. | అంబుధులు కేళకుశులు కులాచలములు | 2.328 |
| చ. | కొలకుల చేర వచ్చియును | 2.340 |
| సీ. | వదనచంద్రునిఁ జొచ్చి బదికెడు చీకట్లు | 2.368 |
| క. | వరముకుట రత్నకిరణ | 2.371;3.137 |
| ఉ. | చిప్పిలు చెక్కుటద్దములఁ జెమట | 2.364;2.377 |
| ఉ. | ప్రోడపుగాన నీవలుకు | 2.391 |
| గీ. | అహిమభానుడు చనుదేర నస్తశిఖరి | 2.417 |
| క. | ఎడపక కూలుగొడుగులుం | 2.448 |

| | | |
|---|---|---|
| చ. | ముడిగి ముసుంగుతో వెనుక | 2.461 |
| క. | గరివంక బొమలపై | 3.53 |
| సీ. | వందిమాగధుల కైవారంబు శుభతూర్య | 3.243 |
| గీ. | వనధి సర్వంకషంబయ్యె | 3.335 |
| చ. | తలిమము చేరుకున్న మది తత్తర మెత్త | 2.32 |

కవుల షష్ఠము :-

| | | |
|---|---|---|
| క. | మనుజుల లోపల కర్మం, బొనరుచు | 1.134 |
| చ. | అదలిచి నిల్వవారి గని యంతకు కింకరు | 1.137 |
| సీ. | చిగురాకు బోడిమై చెలమ పన్నీటిలో | 1.175 |
| శా. | చండాంశుప్రభ చిమ్మతిక్కయు | 1.210 |
| గా. | శ్రీఘం బేటికి వచ్చి సంసృతి భవశ్రీసౌఖ్య | 1.275 |
| మ. | తనతో నలిగినవాణిపాదముల మీఁదన్ | 1.297 |
| మ. | పదముల్ దొట్రిలు గౌనుదీవ వెలయింపం | 1.317 |
| క. | అనుటయుఁ గృష్ణద్వైపాయనతనయుం | 2.63 |
| సీ.గీ. | తల్లి దండ్రియు దైవంబుఁ దలఁప గురుడ | 2.241 |
| గీ. | ఇవ్విధంబున మఱియు ననేక గతుల | 2.244 |
| ఉ. | సంతత భక్తియుక్తిఁ గొనసాగక యుండిన | 2.271 |
| సీ.గీ. | వలువదు భయంబు వా రెంతవార లైన | 2.275 |
| ఉ. | హంసనమానగామికిని నట్టి వినూతన | 2.277 |
| సీ.గీ. | ఎసగఁ బ్రాతిక నోరగిం చిడకమున్నె | 2.294 |
| క. | ఇంటికి జనుటయు మానెన్ | 2.363 |
| చ. | పెరిగిన యీసునన్ నెమలి పింఛములన్ | 3.68; 3.165 |
| క. | నెరసె నెరసంజ చక్రకక, పరసీరుహ | 3.133 |
| మ. | గురుబంధుల్ దను జుట్టు రా దిగిచి | 3.160 |
| క. | అరిగి సమిత్ ప్రసవకు శాం, కుర | 3.177 |
| ఉ. | తెక్కలతో సరాగము నెఱిం | 3.192 |
| ఉ. | జారుటయుం దదూరుయుగ | 3.251 |
| సీ. | రాయైన తబిసిపేరంటాలి | 3.291 |

కళాపూర్ణోదయము :-


| | | |
|---|---|---|
| చ. | ఎఱుంగవుగాక క్రొమ్ముక్కు పుణకించుక | 1.306;3.138 |
| క. | పలుమారు దలయంటి తగన్ | 1.319 |
| సీ. | అరవిడు గొప్పల కుసుమ వాసనకు | 3.52 |
| క. | అలుపులు డిగిపోపోనీ, యలచేతం | 3.58 |
| సీ. | నిండుచందురు నవ్వు నెమ్మోముసిరితోడ | 3.69 |
| క. | నెఱియుగ ననహ్యమగున, మ్మొఱ | 3.149 |
| సీ. | రేఖలై మీఁదటి తేపులై యొప్పు | 3.329 |
| క. | పరమ సుమనోమనోజ్ఞత | 3.88 |
| ఉ. | క్రిందను మీదనుం బడియు | 3.248 |


కావ్యాలంకార చూడామణి :-


| | | |
|---|---|---|
| క. | తనయుడు తనయుని గదియుం | 1.366 |
| సీ. | కమనీయ రాజశిఖామణి కవిరాజ | 2.119 |
| ఆ. | అజ్జులాడి యాగి తొవడి సభలోన | 3.295 |
| క. | నీకరవాలనిహతు లై,నాకంబు | 2.239 |


కాశీ ఖండము :-


| | | |
|---|---|---|
| సీ. | పురుషునీగికి స్వల్పముననె సంతోషించు | 1.43 |
| సీ. | ఉండు నేవీట మార్కండేయ మునిరాజు | 1.55 |
| సీ. | ఏడఁ,బోయెనో గదా మేడలో మంజిష్ఠ | 1.75 |
| గీ. | చంద్రికాపాండు కౌశేయశాటి యైన | 1.86 |
| గీ. | సవతి కద్రువ శేష తక్షకుల మొదలు | 1.95 |
| సీ. | ఓర్పుమై నుప్పొండి నుపవాసముల నుండి | 1.116; 1.378 |
| సీ.గీ. | చంద్రమౌళి భరద్వాజ సంయములును | 1.131 |
| క. | గంగానది గంగానది, గంగానది యనుచు | 1.141 |
| గీ. | హరునితోడ విరోధించి యంధకుండు | 1.145 |
| ఉ. | తుమ్మినయప్పు డంబరము త్రోవ జరించి | 1.156 |
| గీ. | మోస మోకముశాసమ్మ ముద్దరాలు | 1.157 |
| గీ. | చెంచు నింటికిఁ బోయి చెంచితకుఁ బ్రియము | 1.177;1.301 |

శా. ఆత్మార్థంబు ధనంబు ధాన్యమును నాత్మార్థంబు 1.197
క. అవిముక్తం బవిముక్తంబ విముక్తం బనుచు 1.236
గీ. మత్పితామహు ప్రపితామహునిఁ దలతు 1.243
సీ. కాశికానగరోపకంఠదేశము డాసి 1.245
గీ. ప్రియము గల్గిన నంగీకరింప వలదు 1.248
సీ. గరళాంజనము కల్కి క్రాలుగన్నుల దీర్చి 1.269
సీ.గీ. రండు నను గూడి యోపరివ్రాట్టులార 1.281
సీ. మగడు దన్మొత్తుచో మార్మొత్తు నలివేణి 1.295
క. చాకున్న నీదుముక్తులు 1.299
గీ. విహగపతి నెక్కి వైష్ణ విగ్రహరి దిరుగు 1.350
సీ.గీ. బ్రహ్మరతులు దపస్యులు భవ్యతీర్థ 1.409
సీ. తరిజూచి యిచ్చె నిద్దాని బట్టికి తల్లి 1.411
గీ. ఎన్నికకు రోమకూపంబు లెన్నిగలవు 1.410;2.236
సీ. శ్రీకంఠ ధర్మధురీణశంభూ 1.420
సీ. జిలుగు సంధ్యారాగ చీనాంబరము గట్టి 2.6
సీ. కస్తూరితోఁ గూర్చి గంధసార మలంది 2.13
సీ. సంధ్యాభివందన శ్రద్ధయుజ్జన సేయు 2.25
శా. ఆకంపించె జగత్రయంబు 2.39
క. ఉద్భిజములు జరాయు, ప్రోద్భూతము 2.42
సీ. ఆవేశ చూర్ణంబు లఖిలేంద్రియములకు 2.47
క. త్రిణయణుని రాణివాసము 2.62
క. ప్రాణాపానవ్యానో, దాన 2.65
సీ. అవనిభారధురీణతాధరీకృతమహా 2.114
మ. దివిజాధీశు సుధర్మమున్ 2.46
గీ. ఈశ్వరద్రోహి గర్వాంధ ఋషివరేణ్య 2.115
గీ. రజకితోడనుదక్యతో శ్రమణితోడ 2.149
శా. శ్రీకాశీనగరాధిరాజ్యపదవీ 2.173
సీ.గీ. వీటి పెద్దతలారి నిశ్శాటి కలికి 2.175
మ. జయధాటీసమయంబులన్ విలయ 2.196
గీ. అప్పటికి నియ్యఁ గొంటి కా కబ్జవదన 2.203

గీ. ఎట్టియపరాధ మొనరించెనేని తల్లి 2.218
సీ. ఉరగవల్లీగాఢపరిరంభణంబుల 2.227
గీ. చిత్తగింపు మనాది సంసిద్ధ మైన 2.245
సీ. పసుపుకొమ్ముల కుసుమ పూవన్నియు 2.317
క. శివనింద సేయు పాతకు 2.322
సీ. కుక్కుటేశ్వరుకేళకూళి నుద్భవ మైన 2.329
సీ. మొగసాల నున్నారు జగతీ సుపర్వులు 2.332
సీ. లోలార్కు నగరి మోసాల వెదకి
శా. ఈక్షోణిన్ నినుబోలు సత్కవులు లేరీ 2.338
చ. బలబల వేగ రేపకడ 2.346
సీ. బొమలు కన్నులమీద బొదలి వ్రాలకమున్న 2.348
సీ. ఎడమ క్రిందుగఁ గాశిలో నీల్గునట్టి 2.357
గీ. తల్లఁబడి కొల్చి చెట్టించు నుల్లసంబు 2.401
సీ. డుంఠి విఘ్నేశు డుండు ప్రదేశ వీక్షించి 2.333
గీ. అభవు డిరీతి తాండవం బాడి డస్సి 2.404
సీ. డాకాలి గండపెండారంబు దాపున 2.411
గీ. చెప్పకుండినఁ గోపించి చిషిక యెత్తి 2.444
గీ. కలిగె బదియారు వన్నె బంగారమునకు 2.467
సీ.గీ. గురుతనూభవ నాకు బంగరువు తోడ 2.468
సీ. కనకమేఖల గ్రుచ్చి కట్టె నెవ్వడు లీల 3.97
చ. చలివడి తీవు గర్జణ వశంబున 3.111
ఉ. ఒక్కడు మాకులంబున సముద్గతి 3.194

కువలయాశ్వ చరిత్రము :-

ఉ. మీఁటిన భద్రరాగముల మీఁదికి 3.246

చంద్రభాను చరిత్ర :-

సీ. ఒకయింత యొఱిగిన సిక మీద ముడిపువ్వు 1.40;1.314
గీ. కనమె కార్యార్థినః కుతో భయ మనంగ 1.194
గీ. నోరమానిసితలలు వేనారి కడవు 1.400
క. ఊరములు గుబులుకొను నెడ 3.225

